# చీకటిలోకం

(Secrets of Ghosts, Souls, Voodoo)



శ్రీధరన్ కాండూరి

# చీకటిలోకం

రచన :
శ్రీధరన్ కాండూరి
సెల్ నెంబరు : 9550983755, 9603056555.
Email : Garudarekha.KS1972@gmail.com



చతుర్థ ముద్రణ-2015.

గ్రంథ ముద్రణ
చైతన్య ఆఫ్‌సెట్ ప్రింటర్స్
విజయవాడ.

ఈ పుస్తకము కాపీల కొరకు సంప్రదించవలసిన చిరునామా
**గొల్లపూడి వీరాస్వామిసన్**
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101.
ఫోన్ నెం: 08832-2465253.

# ఓ చిన్నమాట......

సర్వ శాస్త్రాలకు పుట్టినిల్లు అయిన భారతదేశంలో ప్రాచీనకాలంనుండే పారాసైకాలజీకి సంబంధించిన అనేక అంశాలను గురించి చర్చించటం జరుగుతున్నది. దివ్యదృష్టి, గాలిలో తేలుతూ ప్రయాణించటం (లెవియటేషన్) ప్రేతాత్మలు, స్వర్గం మరియు నరకం లాంటి అంశాలను గురించి ప్రాచీన భారతీయ మేధావులకు తెలుసు. ఒక మనిషి చనిపోవటంతో అతని చరిత్ర ముగిసిపోయిందని అతని చుట్టూ ఉండే బ్రతికిఉన్నవాళ్ళు భావిస్తారు. కానీ అది నిజంకాదు. మనిషి చనిపోయినా అతని ఆత్మ బ్రతికే ఉంటుంది. హైందవ ధర్మశాస్త్రాలు ఆత్మకు చావు లేదని ఏనాడో చెప్పాయి. హైందవ మతాన్ని వ్యతిరేకించిన బుద్ధుడు బౌద్ధమతాన్ని స్థాపించాడు. "దేవుడు లేడు" అని ప్రబోధించిన బుద్ధుడు, ఆత్మ ఉన్నది అని ఒక్కాణించటం విశేషం. ఒక మనిషి ఈ జన్మలో చేసిన మంచి మరియు చెడు పనులకు తగిన ఫలితాలను వచ్చే జన్మలో అనుభవించాల్సి ఉంటుంది అనే కర్మ సిద్ధాంతాన్ని బుద్ధుడుకూడా బలపరచటం జరిగింది.

ఈనాడు సాంకేతికంగా, సైనికపరంగా ఎంతో బలమైన దేశాలుగా గుర్తించబడ్డ ఆసియా దేశాలైన చైనా మరియు జపాన్ దేశాలలో బౌద్ధమతం ప్రధాన మతంగా ఉన్నది. ఆ కారణంగానే ఆ దేశాలలో మరణం తరువాత కూడా ఒక మనిషికి జీవితం ఉంటుంది అని నమ్మబడుతున్నది. అనేక ఆగ్నేయ ఆసియా దేశాలలో (థాయ్‌లాండ్, సింగపూర్, మలేషియా, వియత్నాం) ప్రేతాత్మలు నిజంగా ఉన్నాయి అని నమ్మ బడుతున్నది. ఇక క్రైస్తవమతం ప్రధాన మతంగా ఉన్న ఇంగ్లాండు, అమెరికా, జర్మనీ, కెనడా, ఇటలీ, ఫ్రాన్స్ లాంటి ప్రబలమైన పాశ్చాత్యదేశాలలో కూడా మనిషి ఆత్మకు చావు ఉండదు అని.బలంగా విశ్వసించబడుచున్నది.

ఈనాడు ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాలలో వందలాదిమంది పారాసైకాలజిస్టులు మానవుడు మరణించిన తరువాత ఎలాంటిరూపం ధరిస్తాడు. ఈ లోకంలో అతను ఎలాంటి ప్రభావాన్నిచూపిస్తాడు లాంటి నిగూఢమైన అంశాలను గురించి విస్తృతంగా పరిశోధన చేస్తున్నారు. చాలాదేశాలలో జరిగిన శాస్త్రీయమైన పరిశోధనలలో ఆత్మలు నిజంగా ఉంటాయని నిరూపణ అయ్యింది. ఈనాడు ప్రపంచవ్యాప్తంగా ఉన్న ప్రజలలో మూడు వంతులమంది మరణానంతర జీవితం గురించి తమకు విశ్వాసం ఉన్నది అని చెబుతున్నారు. కేవలము అతికొద్దిమంది

మాత్రమే మనిషి చనిపోవటంతోనే అతని చరిత్ర ముగిసిపోతుందని ఆత్మ అనేమాట కేవలము భ్రమ అని కొట్టిపారేస్తున్నారు. ప్రపంచంలో జరుగుతున్న అనేక మానవాతీత సంఘటనల కారణంగా వారి వాదనలు కేవలము వాచాలత్వమే అని ఎప్పటికప్పుడు ఋజువు అవుతూనే ఉన్నది. ఇంతవరకు మానవుని మరణానంతర జీవితం (Life after death) గురించి అనేక గ్రంథాలు వ్రాసిన నేను మరికొన్ని ఆసక్తి కరమైన మరియు నూతన విశేషాలతో నా ఈ నూతన గ్రంథం **"చీకటిలోకం"** అఖిలాంధ్ర పాఠకులకు సవినయంగా సమర్పిస్తున్నాను.

ఆగ్నేయ ఆసియాలోని కొన్నిదేశాలలో నేటికీ సంచరిస్తున్నాయి అని చెప్పబడు తున్న కొన్నిరకాల అమానుష శక్తుల గురించి మరియు ఇస్లాం మతంలో చెప్పబడ్డ జిన్నుల గురించి ఈ గ్రంథంలో ప్రత్యేకంగా వ్రాయటం జరిగింది. మన కళ్ళకు కనపడని చీకటిలోకంలో సంచరించే మానవాతీత శక్తులను గురించి వివరించే ప్రయత్నమే ఈ **"చీకటిలోకం"**.

మానవుల్ని ప్రేత మరియు పిశాచ బాధలనుండి రక్షించటానికి పాశ్చాత్యదేశాలలో మరియు ఆసియా దేశాలలో ఏవిధమైన ప్రక్రియలు జరుగుతున్నాయో తెలియ జేస్తున్నాను. ఈ గ్రంథాన్నికూడా నూతనత్వాన్ని ప్రోత్సహించే అఖిలాంధ్ర పాఠకులు ఆదరిస్తారని నా ప్రయత్నానికి మరింత ప్రోత్సాహం ఇస్తారని ఆశిస్తున్నాను.

ఇప్పటికి ఇంతే సంగతులు.

సెలవ్.

మీ

**Sreedharan Kanduri**

విజయవాడ

6-7-12.

# విషయసూచిక

## పార్టు-1

## పార్టు-2

1. హైందవ మతంలో శ్రార్ధకర్మల ప్రాధాన్యత ఏమిటి?
2. జన్మకుండలి ద్వారా పిశాచ పీడ వివరాలు తెలుస్తాయా?
3. దేవతగా మారిన కంజిరొట్టు యక్షి వివరాలు ఏమిటి?
4. సినీ నిర్మాణ సమయంలో ప్రేతాత్మలు?
5. లిఫ్ట్ అడిగే పిశాచ ప్రయాణీకులు నిజంగా ఉంటారా?
6. కొరివి దయ్యాలు నిజంగా ఉంటాయా?
7. మనిషి డమ్మీలా కనిపించే సూక్ష్మశరీరం డాపెల్‌గాంగర్ వివరాలు?
8. ఆత్మలతో మానవులు సంభాషించగలరా?
9. మరణం ఎలా ఉంటుంది?
10. ప్రేతాత్మలు సంచరించే రోడ్లు, పిశాచ వాహనాలు నిజంగా ఉంటాయా?
11. ప్రేతాత్మ ఆవహించిన 'ఓకికు' బొమ్మ వివరాలు ఏమిటి?
12. శత్రువుల్ని దెబ్బతియ్యటానికి ఉపయోగించే వుడూ ప్రయోగాల వివరాలు?
13. శీల రక్షణకోసం ప్రాణాలు కోల్పోయిన 'టాషికి' వివరాలు?
14. కోర్కెలు తీర్చే వుడూ మాంత్రికురాలి సమాధి వివరాలు?

## పార్టు-3

1. మా పనిమనిషి ఎవరు?
2. టీనేజ్ లవర్స్?
3. రాజమహల్‌లో ఒక రాత్రి?
4. బెంగుళూరు ఎయిర్‌పోర్ట్‌లో కనిపిస్తున్న ఆడ దయ్యం?
5. ఎవరా ఇద్దరు?

6. టన్నెల్ నెంబరు 103?

7. క్షోభించే పఠాన్ ప్రేతాత్మ?

8. లెవిరేట్ మ్యారేజ్ మర్మం ఏమిటి?

9. ఆత్మఘోషలతో నిండిన విభిన్న ప్రదేశాల వివరాలు?

10. ఈ పిశాచ కథలు, కవిత్వాలు విన్నవారు చదివిన వారు చనిపోతారా?

11. పోల్టర్‌గెస్ట్‌లు (గాలి దయ్యాలు) నిజంగా ఉంటాయా?

12. జపాన్ పిశాచ బాలిక హనకొ-సాన్ వివరాలు ఏమిటి?

13. నరకలోక శునకాలు మానవులకు ఎందుకు కనిపిస్తాయి?

14. నిషిద్ధ ప్రేమకథ - మలేషియా?

15. అతీంద్రియ శక్తులు ఉన్నాయి అని నిరూపించే యదార్థ సంఘటనలు?

16. భారతదేశంలో ప్రేతాత్మలకు సంబంధించిన విశ్వాసాలు ఎలా ఉంటాయి?

17. ప్రేమకోసం తన కుటుంబాన్నే బలిచేసిన సీలేరోజ్ వివరాలు?



# పార్టు-1

# 1. బౌద్ధమతం ప్రచారంలో ఉన్న దేశాలలో ప్రేతాత్మలపై విశ్వాసాలు ఎలా ఉన్నాయి?

## ఎ) జపాన్ :

జపాన్‌దేశంలో బౌద్ధమతం మరియు షింటోమతం అనే రెండు ప్రధాన మతాలు ఉన్నాయి. క్రీ.శ.5వ శతాబ్దంలో ప్రాంతంలో కొరియాకు చెందిన కొందరు పండితులు బౌద్ధమతాన్ని చైనా నుండి జపాన్‌కు తీసుకువచ్చారు. అయితే షింటోమతం మాత్రం జపాన్‌లోనే పుట్టింది. ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే ప్రస్తుతం జపాన్‌లోని అధిక సంఖ్యాకులు అటు షింటోమతాన్ని, ఇటు బౌద్ధమతాన్ని సందర్భాన్నిబట్టి పాటించటం జరుగుతున్నది. వివాహ కార్యక్రమాలు షింటో మత విధానంలో జరుపుకొని, అంత్యక్రియలు ప్రేత ఆరాధన లాంటి కార్యక్రమాలను బౌద్ధమత విధానంలో జరుపుకోవటం జపనీయుల ప్రత్యేకతగా గుర్తించాలి.

జపాన్ జానపద గాధలలో కనిపించే "యురేయ్" అనే ప్రేతాత్మలు భారతీయ శాస్త్రాలలో కనపడే పిశాచాలు ఒకటే రకానికి చెందినవని గ్రహించాలి. యురేయ్ అనగా జపాన్ భాషలో మసక, మసకగా కనిపించే ఆత్మ అని అర్థం. జపాన్‌దేశ సాంప్రదాయాల ప్రకారం ప్రతి మనిషిలోను ఒక ఆత్మ (రేయ్‌కాన్) ఉంటుందని మనిషి చనిపోయిన తరువాత ఆ ఆత్మకు ప్రేతాత్మ రూపం వస్తుందని, ఆ సమయంలో మరణించిన వ్యక్తియొక్క శరీరానికి మతపరంగా చెయ్యవలసిన కర్మకాండలను చెయ్యాలని, అలా చేయకుండా మృతదేహాన్ని కేవలం సమాధిచేసి వదిలేస్తే ఆ ప్రేతాత్మ యురేయ్ అనే (ఉగ్ర ఆత్మ) రూపంలోకి మారుతుందని ఆ తరువాత తనకు సరైన విధంగా అంత్యక్రియలు జరపని తనవారిపై లేదా స్నేహితులపై పగపట్టి వారిని అంతం చేస్తుందని తెలుస్తున్నది. ముఖ్యంగా ఆకస్మికంగా మృతిచెందినవారు,

ఆత్మహత్యలు చేసుకుని మరణించినవారు, ఇతరులచేత హత్యచేయబడినవారు తప్పనిసరిగా ప్రేతాత్మలుగా మారుతారని అలాంటివారి ఆత్మలవల్ల ఇతర మానవులకు హాని కలగకుండా ఉండటంకోసం ఆ ప్రేతాత్మల శాంతికోసం తప్పనిసరిగి మతపరమైన పరిహారాలను చెయ్యాల్సి ఉంటుందని జపాన్ మతసాంప్రదాయం ప్రబోధిస్తున్నది.

మానవుల మనస్సుని తీవ్రంగా ప్రభావితంచేసే అంశాలలో ముఖ్యమైనవి పగ, ప్రేమ, అసూయ, ద్వేషం మరియు బాధ. ఏ మనిషి అయినా ఈ అంశాల కారణంగా మరణించినట్లయితే ఆ వ్యక్తియొక్క ఆత్మ తప్పనిసరిగా యురేయ్‌గామారి తనకు క్షోభ కలిగించిన వారిని బలితీసుకుంటుందని జపాన్ ప్రజలు విశ్వసిస్తారు. ముఖ్యంగా యురేయ్ అనే ప్రేతాత్మ తన లక్ష్యం నెరవేరి తనకు శాంతి కలిగే వరకు ఈ భూమిని వదిలి నరకలోకానికి వెళ్ళదని జపాన్‌దేశానికి చెందిన బౌద్ధమత పండితులు తెలియజేస్తున్నారు. ఈ ప్రేతాత్మలు కొన్ని ప్రదేశాలలో నిరంతరమూ సంచరిస్తూ ఉండటమే కాకుండా అటువైపుగా వచ్చిన మానవులను ఆవహించి వారి ద్వారా తమ లక్ష్యాలను నెరవేర్చుకోవటం జరుగుతుంది.

జపాన్ సమాజంలో ప్రేతాత్మల ఉనికిమీద ఎంతటి విశ్వాసం ఉన్నదో అర్థం చేసుకోవటానికి ఆ దేశంలో ప్రతి నిత్యమూ ప్రదర్శించబడే రంగస్థల నాటకాలు మరియు చలనచిత్రాలు సరిపోతాయి. సాధారణంగా జపాన్‌దేశంలోని ప్రజల విశ్వాసం ప్రకారం యురేయ్ అనే ప్రేతాత్మ తెల్లటి దుస్తులతో ఉంటుందని తెలుస్తున్నది. మెడ నుండి పాదాలవరకు ఉండే నైటీ లాంటి వస్త్రాలను (దీనినే జపాన్ భాషలో కిమోనో అని పిలుస్తారు) యురేయ్‌లు ధరించి మానవులకు కనిపిస్తాయని తెలుస్తున్నది. జపాన్‌దేశంలో బౌద్ధమతం తరువాత ప్రధాన మతమైన షింటో మతంలో గౌరవనీయులైన పురోహితులకు మరియు మృతదేహాలకు మాత్రమే తెల్లటి వస్త్రాలు ధరించటానికి అధికారం ఉన్నది. ఒక విచిత్రం ఏమంటే ఈ యురేయ్‌లు సాధారణంగా ఆడ పిశాచాలే అయి ఉండటం జరుగుతుంది. ఈ ఆడ పిశాచాలు నడుము వరకు వేలాడే పొడవైన నల్లని చిందరవందరగా ఉండే శిరోజాలను కలిగి ఉంటాయి. సాధారణంగా జపాన్ స్త్రీలు పొడవైన శిరోజాలను కలిగి ఉండి, వాటిని ఎల్లప్పుడూ ఒక ముడిలాగా చుట్టుకుని ఆ ముడి ఊడకుండా పిన్నులు పెట్టుకుంటారు. అయితే ఆ స్త్రీల తాలూకు వ్యక్తి చని పోయినపుడు ఆ వ్యక్తి ఆత్మశాంతికోసం అంత్యక్రియలు నిర్వహించే సమయంలో ఆ స్త్రీలు తమ జుట్టును ఆరబోసుకోవటం జరుగుతుంది. ఆ కారణంగానే యురేయ్‌లు విరబోసుకున్న కురులతో కనిపిస్తాయని అక్కడ ప్రజలు నమ్ముతారు. అంతకన్నా విచిత్రం ఏమంటే ఈ యురేయ్ అనే పిశాచాలయొక్క చేతులు వాటి

మణికట్టు ప్రాంతం నుండి వ్రేలాడుతూ కనిపిస్తాయి. వీటికి కాళ్ళుకాని, పాదాలుకాని ఉండవు ఆ కారణంగా ఇవి గాలిలో ఎగిరిపోతూ కనిపిస్తాయి.

ఈ యురేయ్ అనే ప్రేతాత్మలు మానవులకు కనిపించే సమయంలో వీటి ప్రక్కన రెండు జ్వాలలు కనిపిస్తాయి. అలా జ్వాలలతో కనిపించే యురేయ్‌లను జపాన్లు కొరివిదయ్యాలు అని పిలవటం జరుగుతుంది. ఈ జ్వాలలు చూడటానికి చాలా విచిత్రంగా ఉంటాయి. ఈ జ్వాల నీలం, ఆకుపచ్చ లేదా వంగపండు రంగులలో నిజానికి ఈ జ్వాల యురేయ్ యొక్క శరీరంలోని అంతర్భాగాలుగా గుర్తించాల్సి ఉంటుంది.

ఈ యురేయ్ అనే పిశాచి తన మరణం ఎక్కడ సంభవించిందో ఆ ప్రదేశంలో కాని తన మృతదేహం ఎక్కడ సమాధిచేయబడిందో అక్కడకాని సంచరిస్తూ ఉంటుంది. సాధారణంగా ఇవి తెల్లవారుఝామున రెండు మరియు మూడు గంటల మధ్యలో కనిపిస్తుందని చెబుతారు. ఆ సమయంలో ఆత్మల లోకానికి మరియు మానవ లోకానికి మధ్య ఉండే ఒక అదృశ్యతెర పలచనైపోతుందని ఆ పరిస్థితిలో యురేయ్ అనే ఆత్మలుకూడా మానవ లోకంలోకి వచ్చేస్తాయని జపాన్‌దేశానికి చెందిన తాంత్రికులు తెలియజేస్తున్నారు.


యురేయ్

యురేయ్ ప్రేతాత్మలు ఆ సమయంలో విశృంఖలంగా సంచరిస్తూ తమ కంటబడ్డ మానవుల్ని బలితీసుకుంటాయి.

జపాన్‌దేశంలోని హిమేజి కోటలోను మరియు ఫ్యూజి పర్వత పాద ప్రాంతంలో ఉన్న అరణ్యంలో ప్రేతాత్మలు (యురేయ్‌లు) విపరీతంగా సంచరిస్తూ ఉంటాయని అనేక మంది జపనీయులు ప్రపంచానికి తెలియజేయటం జరిగింది. సాధారణంగా, పగతో రగిలిపోయే యురేయ్‌లను శాంతిపరచటంకోసం ఆ యురేయ్‌లకు చెందిన కుటుంబ సభ్యులు ఆ యురేయ్‌లకు ఏ మానవులమీద అయితే పగ ఉంటుందో ఆ మానవుల్ని చంపినట్టుగా నాటకం ఆడటం జరుగుతుంది. ఆ నాటకాన్ని నిజం అని నమ్మిన యురేయ్‌ల ఆత్మశాంతిస్తుంది.

ఫలితంగా ఆ ఆత్మలు స్వర్గానికి వెళ్ళిపోతాయి. (రెండు దశాబ్దాల క్రితం మళయాళ భాషలో తీయబడిన "మణిచిత్ర తాజు" అనే చిత్రంలో ఒక రాజుచేత చంపబడి ప్రేతాత్మగా మారిన చంద్రముఖి అనే నాట్యగత్తెయొక్క ఆత్మకు శాంతి కలగటంకోసం ఒక సైకియాట్రిస్టు, ఒకవ్యక్తికి చంద్రముఖిని చంపిన రాజుయొక్క వేషాన్ని ధరింపచేసి ఆపై ఆ వ్యక్తిని చంపినట్టుగా నాటకం ఆడతాడు. ఆ నాటకాన్ని నిజమని భ్రమించిన చంద్రముఖి ఆత్మ తాను అప్పటివరకు పీడిస్తున్న గంగ అనే యువతి శరీరాన్ని వదలి పై లోకాలకు వెళ్ళిపోతుంది. ఈ మళయాళ చిత్రం జపాన్‌దేశంలోని యురేయ్ అనే ప్రేతాత్మలకు చేసే పరిహారాల ఆధారంగా నిర్మించబడింది అనటంలో అతిశయోక్తి ఎంతమాత్రంలేదు.)

అయితే ఈ యురేయ్‌ల్లో కూడా అనేక రకాలు ఉన్నట్టుగా తెలుస్తున్నది. మానవులు అనేక రకాలుగా మరణించటం జరుగుతుంది. వారు మరణించిన విధానాన్నిబట్టి వారి ఆత్మలకు వచ్చే రూపం పేరు మారిపోతూ ఉంటుంది.

వాటిలో ముఖ్యమైనవి ఇలా ఉన్నాయి.

**1. ఆన్‌రియో :** ఒక వ్యక్తి (స్త్రీ లేదా పురుషుడు) దారుణంగా చంపబడిన తరువాత ఆ వ్యక్తియొక్క ఆత్మ ముందుగా పాతాళలోకంలో ఉండే నరకానికివెళ్ళి కొద్ది రోజుల తరువాత భయంకరమైన ఉగ్రరూపం ధరించి తనను చంపినవాళ్ళపై పగతీర్చుకోవటానికి తిరిగివస్తుంది. ఇలా పగతో నరకంనుండి తిరిగివచ్చే ప్రేతాత్మలను ఆన్‌రియోలు అని పిలుస్తారు.

**2. యుబ్యూమ్ :** బిడ్డను ప్రసవిస్తున్న సమయంలో కలిగే ప్రసవవేదనను తట్టుకోలేక మరణించిన స్త్రీయొక్క ఆత్మ మొదట నరకానికివెళ్ళి కొద్దిరోజుల తరువాత తన బిడ్డను చూసుకోవటంకోసం తిరిగి వస్తుంది. ఇలా తిరిగివచ్చే తల్లియొక్క ప్రేతాత్మను యుబ్యూమ్ అని పిలుస్తారు.

**3. గోరియో :** తన కుటుంబంకోసం ప్రాణత్యాగంచేసి ఆపై నరకానికి వెళ్ళిన ఆత్మలు గోరియో అనేపేరుగల ప్రేతాత్మలుగా తిరిగివచ్చి తమ కుటుంబాన్ని అనుక్షణం వెంటాడుతూ ఉంటాయి.

**4. ఫనాయురేయ్ :** ముఖ్యంగా సముద్రంలో మునిగి చనిపోయినవారియొక్క ఆత్మలు ఈరకమైన పిశాచాలుగా మారతాయి. ఈ రకమైన ప్రేతాత్మలు సగం చేప, సగం మనిషి రూపంలో కనిపిస్తూ పౌర్ణమి రాత్రులలో ఓడలపై సముద్రాలలో పయనించే నావికులపై లేదా ప్రయాణీకులపై దాడిచేస్తాయని తెలుస్తున్నది.

**5. జిష్కి-వరాషి :** అకాల మృత్యువు పాలయిన చిన్నపిల్లలు ఈ రకమైన ప్రేతాత్మలుగా మారుతారు. వీరి వల్ల మానవులకు ప్రమాదం లేకపోయినప్పటికీ వీరు మానవులను అనేక రకాలుగా విసిగించి ఇబ్బంది పెట్టటం జరుగుతుంది. (ఈ రకం ప్రేతాత్మలను పాశ్చాత్యులు పోల్టర్‌గెస్ట్ యాక్టివిటీస్‌గా పిలవటం జరుగుతుంది. కేరళలో ఇలాంటి ప్రేతాత్మలను కుట్టిచేతన్ అని పిలుస్తారు.)

**6. కామ పిశాచి :** తన శృంగార కోరిక తీరకుండా చనిపోయిన స్త్రీ లేదా పురుషుడు ప్రేతాత్మగామారి తాము కోరుకుంటున్న స్త్రీని లేదా పురుషుడిని శృంగారపరంగా అనుభవించటానికి ప్రయత్నిస్తాయి. మానసికంగా బలహీనులైన స్త్రీలు లేదా పురుషులు ఈరకమైన ప్రేతాత్మలచేత అనుభవించబడినట్లుగా అనేకమంది జపాన్‌దేశ పారాసైకాలజిస్టులు ధృవీకరిస్తున్నారు.

**7. టేకెటేకె :** ఈ యదార్థ సంఘటనలో టేకెటేకె అనే ఒక అమ్మాయి రైలుకట్టమీద నడుస్తూ ఎదుకుండా వేగంగా వస్తున్న రైలుకిందపడి రెండుముక్కలై చనిపోతుంది. ఆ తరువాత ఆ అమ్మాయి ఆత్మ ప్రేతాత్మగామారి సంచరిస్తూ ఉంటుంది. తాను అకాలమృత్యువు పాలు అయ్యింది కనుక ఇతరులుకూడా అలాగే చావాలి అన్న కసితో టేకెటేకె ఆత్మ సంచరిస్తూ ఉంటుంది. ఈ ఆత్మచేతిలో ఒక కొడవలి ఉంటుందట. ఈమె రాత్రి సమయాలలో ఒంటరిగా కనిపించినవారిని ముక్కలుగా నరికి చంపుతుందట. ఈ టేకెటేకె ఆత్మ నడుం వరకు ఉన్న అర్ధశరీరభాగంతో మాత్రమే కనిపిస్తుందట. కారణం ఆమె బ్రతికి ఉన్నపుడు రైలుకిందపడి రెండు ముక్కలుగా మారింది.

## బి) చైనా :

చైనా మతవిశ్వాసాల ప్రకారం చూసినట్లయితే ఈ విశ్వంలో మూడు రకాల లోకాలు ఉంటాయని తెలుస్తున్నది. స్వర్గం మరియు మానవలోకం మరియు ప్రేతాత్మలయొక్క లోకం ఒకదాని ప్రక్కన ఒకటి ఏర్పడి ఉంటాయని చైనీయులు నమ్ముతారు. స్వర్గంలో ఋషులు లేదా శాంతించిన పితృదేవతల ఆత్మలు ఉంటాయని, ప్రేతాత్మలోకంలో అనగా నరకంలో, పాపాలుచేసి చనిపోయినవారి ఆత్మలు శిక్షలు పొందుతూ ఉంటాయని చైనామతం ప్రభోదిస్తుంది. ఇక మానవలోకంలో మానవులు ఉంటారని వేరే చెప్పవలసిన పనిలేదు.

చైనా మత సాంప్రదాయంలో ఉన్న విశ్వాసాల ప్రకారం చూస్తే చనిపోయిన ప్రతి మానవుడు ప్రేతాత్మగా మారతాడు. అయితే ఆ ప్రేతాత్మ ఎల్లకాలం జీవించి

ఉండలేదు. కాలక్రమంలో దానియొక్క శక్తి క్షీణించిపోతూ ఉంటుంది. చివరికి అదికూడా మళ్ళీ మరణించటం జరుగుతుంది. అంటే దాని ఉనికి సంపూర్తిగా పంచభూతాలలో లీనమైపోతుంది అన్నమాట. ఏ చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలకు శాంతి కలిగించటంకోసం ఆ వ్యక్తుల తాలూకు వారసులు పరిహార ప్రక్రియలు నిర్వహించకుండా ఉంటారో ఆ ఆత్మలు, ఆకలి పిశాచాలు (Hungry ghosts)గా మారతాయి. అటు బౌద్ధమతము ఇటు టావోయిజము కూడా ఆకలి పిశాచాలు నిజంగా ఉంటాయని ప్రబోధించటం జరిగింది. చైనా దేశ సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే ఆత్మలుకూడా ఆరు రకాల జన్మలను ఎత్తటం జరుగుతుందని తెలుస్తున్నది. అత్యధిక స్థాయిలో పాపాలుచేసిన వ్యక్తియొక్క ఆత్మ నరకంలో జన్మించి దీర్ఘకాలంపాటు అక్కడ శిక్షలు అనుభవించవలసి ఉంటుంది. తక్కువస్థాయిలో పాపం చేసిన వ్యక్తియొక్క ఆత్మ మానవ లోకంలో జంతువుగా జన్మించవలసి ఉంటుంది.

అత్యంత తక్కువపాపంచేసిన వ్యక్తియొక్క ఆత్మ **ఆకలిపిశాచి**గా జన్మిస్తుంది. వ్యామోహం, దురాశ, ఆగ్రహం మరియు అజ్ఞానం కారణంగా ఒక ఆత్మ ఆకలి పిశాచిగా జన్మిస్తుంది. చైనావారు పాటించే చంద్రమాన పంచాంగంలోని 7వ నెలలో వచ్చే పౌర్ణమి రోజును ఆకలి పిశాచాల పండుగ (Hungry ghosts Festival)గా జరుపబడుతుంది. ఆ రోజున నరకలోకపు ద్వారాలు తెరువబడతాయనీ, ఆ సమయంలో అనేక ఆకలిపిశాచాలు తమకు ఆకలి తీరే ప్రదేశాలకు వెళ్ళటం జరుగుతుందని చైనీయులు భావిస్తారు. చనిపోయిన తమయొక్క పూర్వీకుల ఆత్మలే ఆకలి పిశాచాలుగామారి ఈ భూమిమీదకు వస్తూ ఉంటాయని చైనీయులు విశ్వసిస్తారు. ఈ ఆకలి పిశాచాలు సూదిబెజ్జం అంత లావు ఉండే గొంతును పెద్దబానలాంటి పొట్టను కలిగి ఉంటాయి. సూదిబెజ్జం అంత సన్నగా ఉన్న వాటి కంఠాలనుంచి పొట్టలోకి వెళ్ళే అత్యంత స్వల్ప ఆహారంవల్ల వాటి బానలాంటి పొట్టలు ఎప్పటికీ నిండవు. ఫలితంగా అవి ఎల్లప్పుడూ ఆకలితో అలమటిస్తాయి. ఆవిధంగా అవి తమ కర్మ ఫలాన్ని అనుభవిస్తాయి. ఈ ఆత్మలకు వారి వారసులు క్రమం తప్పకుండా పరిహార ప్రక్రియలు చెయ్యక పోవటంవల్ల మెడలు పొడవుగా సాగిపోయి ఉంటాయి. ఆ సమయంలో చైనీయులు తమ పూర్వీకుల ఆత్మలకు శాంతి కలగటంకోసం కాగితాలతో తయారుచేసిన ఇళ్ళను, వాహనాలను, టెలివిజన్‌లను తగులబెట్టటం జరుగుతుంది. కేవలము తమ పూర్వీకుల ఆత్మలకే కాకుండా అనాధలుగా మరణించిన అనేక ఇతర ఆత్మలకు కూడా ఆత్మ శాంతి కలగటంకోసం కొన్ని పరిహార ప్రక్రియలను చైనీయులు చేస్తారు.

అనాధలుగా మరణించినవారి ఆత్మలు పరిహార ప్రక్రియలులేక అశాంతితో అలమటిస్తూ తమకు ఎదురయిన మానవుల్ని అనేక రకాలుగా పీడించటం జరుగుతుంది.

ఆకలి పిశాచాల పండుగ దినంనాడు చైనాలోని వివిధ పట్టణాలలో, గ్రామాలలో ఉండే ప్రజలు ఎవరికి తోచిన ఆహారాన్ని వారు తెచ్చి ఒకచోట ఉంచుతారు. ఆ తరువాత వాటిని ఆకలి పిశాచాలుగా మారిన పూర్వీకుల ఆత్మలకు ఆరగింపుచేస్తారు. ఇంకొక విశేషం ఏమంటే పూర్వీకుల ఆత్మలకు ఆనందం కలిగించటంకోసం నిర్వహించే వినోద కార్యక్రమాలు జరిగే హాలులోని ముందువరుస సీట్లను ఖాళీగా వదలివేస్తారు. ఆ సీట్లలలో పూర్వీకుల ఆత్మలు కూర్చుంటాయని చైనీయులు భావిస్తారు.


హంగ్రీఘోస్ట్

ఆకలిపిశాచాలు భూమి మీద సంచరించే ఏడవ నెలలో చిన్నపిల్లల్ని చీకటి పడిన తరువాత బయటకు తిరగవద్దని చైనీయులు హెచ్చరిస్తారు. అంతేకాకుండా ఆ సమయంలో చైనీయులు నీళ్ళలో ఈతకొట్టటంకూడా మానివేస్తారు. కారణం ఆకలి పిశాచాలు ఈతకొడుతున్న మానవుల్ని నీళ్ళలోముంచి చంపివేస్తాయని చైనీయులు భావిస్తారు:

చైనా సాంప్రదాయంలో పిశాచాలకు వివాహం చెయ్యటంకూడా ఉంటుంది. కేవలం చైనాలో మాత్రమే కాకుండా సూడాన్ నుండి భారతదేశం వరకు ప్రేతాత్మలకు వివాహంచేసే సాంప్రదాయం ఉన్నది. పిశాచాలకు వివాహం చెయ్యటానికి కారణం ఏమిటో ఇప్పటికీ సరిగ్గా తెలియటంలేదు. సాధారణంగా చనిపోయినవ్యక్తులయొక్క ఆత్మలు తమ వారసులకు కనిపించి పైలోకంలో తమకు తోడుగా ఉండటానికి భార్యలు కావాలి అని అడగటంవల్ల ఆ ఆత్మలకు వారి వారసులు వివాహాలు చెయ్యటం జరుగుతుందని తెలుస్తున్నది. సింగపూర్‌దేశంలో యదార్థంగా జరిగిన ఈ సంఘటన గురించి తెలుసుకుందాం.....

కొన్ని సంవత్సరాలక్రితం సింగపూర్‌లో నివసిస్తున్న ఒక 14 సంవత్సరాల చైనా బాలుడు ప్రమాదవశాత్తు మరణించాడు. ఆ తరువాత కొన్నాళ్ళకు ఆ బాలుడి ఆత్మ అతడి తల్లికి కలలో కనిపించి కొద్ది రోజుల క్రితం సింగపూర్‌లోని పేరక్ అనే ప్రాంతంలో మరణించిన ఒక అమ్మాయి ఆత్మతో తనకు వివాహం చెయ్యమని చెప్పటం

జరిగింది. అయితే ఆ బాలుడి ఆత్మ చనిపోయిన అమ్మాయి పేరును చెప్పలేదు. తరువాత ఆ బాలుడి తల్లి ఒక చైనా మంత్రగత్తెవద్దకువెళ్ళి తన కుమారుడి ఆత్మ వివాహం చేసుకోవాలి అని కోరుకుంటున్న అమ్మాయియొక్క వివరాలు చెప్పమని అడిగింది. ఆ మంత్రగత్తె తన తాంత్రికశక్తితో చనిపోయిన అమ్మాయియొక్క పేరు, ఊరు, వయస్సు స్పష్టంగా తెలియజేసింది. ఆ ఆధారాలతో ఆ బాలుడితల్లి, చనిపోయిన అమ్మాయియొక్క పెద్దవారిని కలుసుకుని వారికి విషయంచెప్పి వారి సహకారంతో ఆ అమ్మాయి ఆత్మకు తన కుమారుడి ఆత్మకు చైనా సాంప్రదాయం ప్రకారం వివాహం చేసింది. అయితే ఈ పిశాచ వివాహం ఎలా చేస్తారు? అన్న విషయం మీరు తెలుసుకోవాల్సి ఉంటుంది. కాగితాలతో మరియు వెదురుతో పెళ్ళికూతురు మరియు పెళ్ళికొడుకుల బొమ్మలు తయారుచేసి వాటికి వివాహం జరిపిస్తారు. అంతేకాకుండా ఆ బొమ్మల జంటకు కాగితాలతో తయారుచేసిన రిఫ్రిజిరేటర్లను, వాహనాలను, కరెన్సీని, ఇళ్ళను బహుమతిగా ఇవ్వటంకూడా జరుగుతుంది. ఈ వివాహ తంతు ముగిసిన తరువాత బహుమతులుగా ఇవ్వబడిన కాగితపు వస్తువులను అగ్నిలో కాల్చివెయ్యటం జరుగుతుంది. అలా కాల్చివేయబడిన వస్తువులు నరకలోకంలో ఉన్న ఆ ఆత్మల జంటకు చేరుతాయని చైనీయులు విశ్వసిస్తారు.

ఆకలిపిశాచాల పండుగదినంనాడు ప్రతి చైనీయుడి గృహంముందు సువాసనలు వచ్చే ధూపాలు వెలిగించటం జరుగుతుంది. సువాసనవచ్చే ఈ ధూపంవల్ల ప్రేతాత్మలు సంతోషించి తమను ఆశీర్వదిస్తాయని చైనీయులు నమ్ముతారు. ఆరోజున చైనాలోని చిన్న చిన్న పట్టణాలలో ఉండే దుకాణాలన్నీ మూసివేయబడతాయి. కారణం దుకాణాలు మూసివేయబడటంవల్ల బజారులు అన్నీ ఖాళీ అయిపోతాయి. జన సంచారం ఉండదు. అలాంటి బజారులలో పూర్వీకుల ఆత్మలు ఆ రోజుకి స్వేచ్ఛగా విహరిస్తాయి.

చైనీయుల వేదాంతం ప్రకారం ప్రతి ఆత్మలోను **ఇన్ మరియు యాంగ్** (Yin and Yang) అనే రెండు విభాగాలు ఉంటాయి. అందులో **ఇన్** అనే భాగాన్ని పిశాచ భాగము (Kui) అని, **యాంగ్** భాగాన్ని ఆత్మభాగమని (Shen) పిలుస్తారు. ఒక మనిషి చనిపోయినపుడు ఆవ్యక్తియొక్క ఆత్మలోని ప్రేతాత్మభాగం భూమిమీదకి రాగా ఆత్మభాగం సమాధిలోకిగాని లేదా ఆ కుటుంబానికి చెందిన ఆలయంలోకిగాని ప్రవేశిస్తుంది. భూమిమీదకు వచ్చిన ప్రేతాత్మ భాగానికి శాంతి కలిగే ప్రక్రియలు జరపనట్లయితే ఆ భాగం పిశాచిగా మారుతుంది. ఇక పూర్వీకుల ఆత్మల భాగాలు (Shen) ఆకాశంలో నిలబడి ఉంటాయి. తమ వారసులు చేసే శాంతిప్రక్రియలవల్ల తృప్తిచెందిన ఆ పూర్వీకుల ఆత్మలు తమ వారసులకు అదృష్టం కలిగేలా దీవిస్తాయి. ఆకలి పిశాచాలలో మూడు రకాలు ఉంటాయని తెలుస్తున్నది. వాటి ఆకారాలనుబట్టి ఈ విభజన జరిగినట్టుగా తెలుస్తున్నది.

1. సూదుల్లాంటి దుర్వాసన కొడుతున్న రోమాల్ని కలిగి ఉండే ఆకలిపిశాచాలు ఒక రకానికి చెంది ఉంటాయి. ఈ పిశాచాలు తాము తీసుకోవాలనుకునే ఆహారాన్ని చీము మరియు నెత్తురు రూపంలోకి మార్చుకుని ఆపై వాటిని ఆరగిస్తాయి. వాటిలో కొన్ని నేలమీదపడ్డ మల మూత్రాలను, ఉమ్మిని, వీర్యాన్ని ఆహారంగా తీసుకుంటాయి. ఆకలి పిశాచాలు నిరంతరం ఆకలి మరియు దాహంతో తపించిపోతూ ఉంటాయి.

**మానవ రక్తంతాగే గాంగ్‌షి రక్తపిశాచాలు :**

భూమిలో సమాధిచేయబడిన మృతదేహాలకు ఎవరైనా తాంత్రికుడు ప్రాణంపోసి వాటిని సమాధిలో నుండి బయటకు రప్పించినట్లయితే అవి తమ శరీర పోషణకు కావల్సిన ప్రాణశక్తికోసం ఇతర మానవుల రక్తాన్నితాగుతాయి. ఇలాంటి ప్రాణం ఉన్న మృత దేహాలను ''రక్తపిశాచులు'' (వాంపైర్స్) అని పిలుస్తారు. చైనాలోకూడా అప్పుడప్పుడూ ఇలాంటి రక్తపిశాచులు కనిపిస్తూ ఉంటాయని అక్కడవారు తెలియ జేస్తున్నారు. ఇలాంటి క్షుద్రశక్తుల్ని చైనావారు గాంగ్‌షి అని పిలుస్తారు. కేవలము చైనాలోనే కాకుండా కొరియా మరియు జపాన్‌దేశాల లోకూడా గాంగ్‌షిలు సంచరిస్తు న్నట్టుగా తెలుస్తున్నది.



గాంగ్‌షి రక్తపిశాచి

ఈ గాంగ్‌షిలు పగటి సమయంలో సమాధులలోకాని, చీకటిప్రదేశాలలోకాని దాక్కుని రాత్రికాగానే బయటకువచ్చి, సంచరిస్తూ తమకు ఎదురైన మానవుల్ని చంపి, వారిలోని 'చి' (qi) అనే ప్రాణశక్తిని జుర్రుకుంటాయి. చైనాదేశాన్ని ప్రాచీనకాలంలో పరిపాలించిన క్వింగ్ రాజుల ఆస్థాన పండితుడిగా ఉన్న జిజియాలాన్ తాను వ్రాసిన ఒక తాంత్రిక గ్రంథంలో ఒక మృతదేహానికి ప్రాణం ఎలా వస్తుందో తెలియజేయటమే కాకుండా, అలాంటి మృతదేహాలద్వారా తయారయిన గాంగ్‌షిలు రెండు రకాలుగా ఉంటాయని వ్రాసాడు. ఆయన ఇచ్చిన సమాచారం ప్రకారం చూస్తే కొంతకాలం క్రితం చనిపోయి మరల బ్రతికిన మనిషి మరియు భూమిలో ఎక్కువకాలంపాటు

పాతిపెట్టబడి ఉన్నప్పటికినీ ఏమాత్రం పాడుకాని మృతదేహం గాంగ్‌షిగా మారే అవకాశం ఉంటుంది.

ఇందుకు గల కారణాలను ఆయన ఇలా తెలియజేసాడు...

1. ఒక మృతదేహాన్ని పాతిపెట్టిన శ్మశాన భూమిలో బాక్టీరియా నివసించటానికి అనుకూలంగా ఉండదు. బాక్టీరియా ఉంటేకాని భూమిలో పాతిపెట్టబడ్డ మృతదేహం కుళ్ళిపోవటానికి వీలుకాదు. ఎప్పుడైతే ఒక శ్మశాన భూమిలో బాక్టీరియా జీవించటానికి అవకాశం ఉండదో అప్పుడు ఆ శ్మశాన భూమిలోని సమాధులలో ఉన్న శవాలు చెడిపోకుండా ఉంటాయి. అంతేకాకుండా అలాంటి శవాల వంటిపై ఉండే గోళ్ళు మరియు వెంట్రుకలు పెరుగుతాయి. ఎప్పుడైనా ఏ శ్మశానంలో అయినా అలా శవాలపై ఉండే గోళ్ళు వెంట్రుకలు పెరుగుతున్నట్లయితే తాంత్రిక విధానాలను ఉపయోగించి ఆ శవాలను నాశనంచెయ్యాలి. అలా కాకున్నట్లయితే అవి ఏ దుష్ట మంత్రవాది కారణంగానో ప్రాణంపోసుకుని గాంగ్‌షిలుగా మారి మానవుల ప్రాణాలు తీస్తాయి.

2. తాంత్రికులు తమ మంత్రశక్తిని ఉపయోగించి మృతదేహాలకు ప్రాణాలు పొయ్యటంవల్లకూడా గాంగ్‌షిలు జన్మిస్తాయి.

3. కొన్నిసార్లు ప్రేతాత్మలు, సమాధులలో ఉన్న శవాలను ఆవహించినపుడుకూడా గాంగ్‌షిలు తయారవుతాయి.

4. కొన్నిసార్లు మృతదేహం, యాంగ్ అనబడేచిని తగినంతగా పీల్చుకున్నట్లయితే అది జీవం పుంజుకుని గాంగ్‌షిగా నిద్రలేస్తుంది. (చైనా తత్త్వశాస్త్ర సిద్ధాంతాల ప్రకారం ప్రపంచంలో ప్రతి వస్తువులోను ఇన్ మరియు యాంగ్ అనే స్త్రీ పురుష శక్తులు ఉంటాయని గుర్తించాలి. అందులో ఇన్ వెలుగుకి లేదా తెలుపుకి ప్రతీక కాగా యాంగ్ నలుపుకి లేదా చీకటికి ప్రతీక అవుతుంది. మనిషిని నడిపే 'చి' అనే ప్రాణ శక్తిలోకూడా ఇన్ మరియు యాంగ్ అనే విభాలు ఉంటాయి. కేవలము యాంగ్ అనే 'చి' మాత్రము మృతదేహాలకు లభిస్తే చీకటిశక్తి అయిన యాంగ్‌వల్ల మృతదేహాలు క్రూరమైన గాంగ్‌షిలుగా అవతరిస్తాయి).

5. **హన్ను** అనే పేరుగల మూడు శక్తులు మరియు **పో** అనేపేరుగల ఐదు శక్తులు కలిసి ఒక మనిషి ప్రాణంతో ఉండేలా చేస్తాయి. అయితే మనిషిలో ఉండే హన్ను మంచి స్వభావాన్ని కలిగి ఉంటుంది. పో దుష్టస్వభాన్ని కలిగి ఉంటుంది. హన్ను తెలివిగలది కాగా, పో బుద్ధిహీనురాలై ఉంటుంది. మనిషి చనిపోయిన **తరువాత అతని** శరీరంలో ఉండే **హన్నులు** బయటకి వెళ్ళిపోతాయి. కానీ **పో**

మాత్రం మృతదేహంలో ఉండి పోయి ఆ దేహంపై తన ఆధిపత్యాన్ని ఏర్పాటుచేసుకుంటుంది. అలాంటి పరిస్థితిలో ఆ మృతదేహంపో అనే శక్తి కారణంగా గాంగ్షిగా మారిపోతుంది.

6. ఒక మనిషి చనిపోయిన తరువాత అతని శరీరానికి తగిన అంత్యక్రియలు (చైనాలో అంత్యక్రియలు అంటే చనిపోయిన మనిషియొక్క ఆత్మకు శాంతి కలగటం కోసం చదివే మంత్రాలు మరియు ఇచ్చే ఆహారం అని గుర్తించాలి) జరిగిన తరువాత అతడి మృతదేహాన్ని సమాధి చెయ్యనట్లయితే కొన్ని ప్రమాదాలు జరుగుతాయి. కడుపుతో ఉన్న ఒక నల్లపిల్లి ఆ శవం ఉన్న పెట్టెను దాటినా లేక ఆ సమయంలో శవపేటిక దగ్గరలో పిడుగుపడ్డా శవపేటికలోని మృతదేహం మరల ప్రాణంపోసుకుని ఆ శవ పేటికలోంచి లేచి బయటకు వస్తుంది. అపుడు దానిపేరు గాంగ్షి.

7. కొన్నిసార్లు ఆత్మహత్య లేదా హత్య వల్ల మనిషి చనిపోయినప్పటికీ అతని ఆత్మకు మాత్రం ఆ శరీరాన్ని వదలి బయటకు పోదు. ఫలితంగా ఆ మనిషి తిరిగి మనిషిగా మారకపోయినప్పటికినీ భయంకరమైన రక్తపిశాచిగా మారటంమాత్రం జరుగుతుంది. అనగా గాంగ్షిగా మారుతుంది.

8. కొన్నిసార్లు ఒక మనిషి ప్రాణం పూర్తిగాపోకముందే అతడి దేహాన్ని భూమిలో పాతిపెట్టటం జరుగుతుంది. కొన ఊపిరితో పాతిపెట్టబడిన ఆ మనిషి కొద్ది సెకన్ల పాటు నరకయాతన అనుభవించి చనిపోతాడు. అపుడు బయటకు వచ్చిన అతని ఆత్మ మరల ఆ శరీరంలోనే ప్రవేశించి గాంగ్షిగా సమాధి నుండి బయటకు వస్తుంది.

అతి భయంకరమైన ఈ గాంగ్షిలను ఎదుర్కోవటానికి చైనా తాంత్రికులు కొన్ని విధానాలను తెలియజేసారు. వాటి వివరాలు ఇలా ఉన్నాయి.

**1. అద్దం :** ఒక ప్రాచీన చైనా వైద్యశాస్త్ర గ్రంథం ఇలా తెలియజేసింది. "ద్రవ రూపంలో ఉన్న లోహముయొక్క సారమే అద్దం (మిర్రర్)". అద్దం బహిర్గతంగా చీకటిగా ఉంటుంది. లోపల కాంతివంతంగా ఉంటుంది. గాంగ్షిలు అద్దంలో తమ ప్రతిబింబాలను చూసుకున్నట్లయితే విపరీతమైన భయానికి గురై అక్కడనుండి పారి పోతాయి.

**2. పీచ్ చెట్టు :** పీచ్‌చెట్టు కొమ్మ లేదా ఆ కొమ్మతోచేసిన కర్ర ఖడ్గం తాకితే గాంగ్షిలు భయభ్రాంతులకు గురై పారిపోతాయి. పీచ్‌చెట్టులో పంచభూతాలయొక్క శక్తి దాగి ఉంటుంది. అది భూత ప్రేతాల చుట్టూ ఉండే 'అరా'(Aura)లను నాశనం చేస్తుంది.

**3. నల్లగాడిద కాలిగిట్ట :** నల్లగాడిద కాలిగిట్ట తగిలితే గాంగ్‌షిలు ఆమడదూరం పారిపోతాయి.

**4. కోడిపుంజుకూత :** కోడిపుంజుకూత వినపడితేచాలు గాంగ్‌షిలు అదృశ్యం అయిపోతాయి.

**5. అగ్ని :** అగ్నిని చూసినా, చిటపటలాడే అగ్నిజ్వాలల శబ్దం వినపడ్డా గాంగ్‌షిలు దూరంగా పారిపోతాయి.

(నోట్ : భారతదేశంలోకూడా భేతాళుడు అనే ఒక క్షుద్రశక్తి అర్ధరాత్రి సమయాలలో మృతదేహాలను ఆవహిస్తుందని, ఫలితంగా ఆ మృతదేహాలు ప్రాణంవచ్చి భూమిపై సంచరిస్తాయని తాంత్రిక గ్రంథాల ద్వారా తెలుస్తున్నది. భారతదేశంలోని మహారాష్ట్రలో ఉన్న పూనే నగర పొలిమేరలలో 2600 అడుగుల ఎత్తులో భేతాళపర్వతం అనే కొండ ఉన్నది. దానిమీద భేతాళ ఆలయం ఉన్నది. ఈ ఆలయంలో పూజలందుకునే భేతాళుడిని దర్శించినవారికి క్షుద్రశక్తులపీడ ఉండదని పండితులు తెలియజేస్తున్నారు.)



# 2. ఆత్మల ఉనికి ఎలా తెలుస్తుంది?

ఆత్మ ఒకవిధమైన శక్తిరూపం. ఇది మానవ నేత్రాలకు కనిపించదు. అయితే ఈ ఆత్మలకు ఒకపేరుకాని, ఉనికికాని తప్పకుండా ఉంటుంది. ఈ ఆత్మలకు ఒక కార్యక్రమం, ఒక ఉద్దేశ్యం ఉంటాయి. కొన్నిసార్లు ఆత్మలు, గాలిలో తేలుతున్న మంచుముద్దలులాగా కనిపించటం జరుగుతుంది. కొన్నిసార్లు వెలుగుతూ ఆరుతున్న బల్బులులాగా కనిపిస్తాయి. కొన్నిసార్లు ఆత్మలు, వెలుగుతున్న గోళాల రూపంలో కనిపిస్తాయి. కాంతి గోళాలరూపంలో కనిపించే ఆత్మలను**అర్బులు** (Obs) అంటారు. ఈ అర్బులు కొన్నిసార్లు గుంపులు గుంపులుగా సంచరిస్తూ దర్శనమిస్తాయి. కొన్ని ఆత్మలు పొగమంచు రూపంలోకాని, మేఘాలరూపంలోకాని, జ్వాలలరూపంలో కాని కనిపిస్తాయని కొందరు పారాసైకాలజిస్టులు తెలియజేస్తున్నారు.

మనిషియొక్క శరీరం నాశనం అయిపోయినప్పటికీ అతని ఆత్మ నశించదు. మనిషిలో ఉండే జ్ఞాపకాలు మరియు జెనిటిక్‌కోడ్ అతని ఆత్మలోకూడా ఉంటాయి.

ఆ జెనిటిక్ కోడ్ ఆధారంగానే ఒకవ్యక్తి మరణించినపుడు ఏవిధమైన రూపాన్ని కలిగి ఉన్నాడో అదే రూపాన్ని ఆ ఆత్మకుకూడా సృష్టికర్త ఏర్పాటుచేయటం జరుగుతుంది. కొన్నిసార్లు ఆత్మలు జంతువులనుకూడా ఆవహిస్తాయని చరిత్రద్వారా తెలుస్తున్నది.

ప్రతి మనిషి చనిపోయిన తరువాత అతని ఈ జన్మ అనుభవాలు, జ్ఞాపకాలు వచ్చే జన్మలోకికూడా బదిలీచేయబడతాయి. అనగా ప్రతివ్యక్తి ప్రస్తుత జన్మలోని మనస్సులో అంతర్గతంగా గతజన్మ జ్ఞాపకాలు దాగి ఉంటాయి. ఒక మనిషి చనిపోయిన తరువాత అతని ఆత్మ తిరిగి ఇంకొకసారి మనిషిగా జన్మించటానికి చాలాకాలం విరామం తీసుకుంటున్నట్టుగా కొందరు జ్ఞానుల పరిశీలనలో తెలుస్తున్నది. ఒక మనిషియొక్క ఆత్మ శరీరాన్ని వదలి అనగా ఈ జన్మను చాలించి ఇంకొక జన్మ ఎత్తటానికి తీసుకునే కాలవ్యవధి ఆ ఆత్మ ఎక్కడ ఉంటున్నది? అన్న విషయం చాలామంది ఆధ్యాత్మిక వాదుల్ని ఆలోచనలో పడవేస్తున్నది.

ఒక మనిషి చనిపోయినప్పుడు అతని దేహం జీవించటం మానివేస్తుంది. అయితే అతని ఆత్మ జీవించే ఉంటుంది. శరీరం లేకుండా ఉండే ఆత్మను లింగదేహము అని పిలుస్తారు. ఈ లింగదేహములో మానసిక, బౌద్ధిక, అదిభౌద్ధిక దేహములు భాగములుగా ఉంటాయి. లింగదేహం భూమికి పైన ఉండే సూక్ష్మలోకాలలో ఏదో ఒక లోకానికి చేరుకుంటుంది. ఈ విశ్వంలో ఏడు ఋణాత్మక లోకములు, ఏడు ధనాత్మకలోకములు ఉన్నాయి. వాటిలో భూమి కూడా ఒకటిగా ఉన్నది. ఋణాత్మక లోకములు అని చెప్పబడే వాటి అన్నింటిని కలిపి పాతాళలోకము లేదా నరకము అని పిలుస్తారు. ఇంకొక విశేషం ఏమంటే ప్రతి లోకంలోను అనంతమైన సంఖ్యలో ఉప లోకాలుకూడా ఉంటాయి. ఇక ధనాత్మక లోకములుగా చెప్పబడే వాటిలో ఒకటైన భూమిపై సజీవులైన మానవులు, ఇతర లోకాలలో మంచి పనులనుచేసిన సూక్ష్మ దేహధారులు ఉంటారు. మొత్తం 14 లోకాలలో భూమి మొదటిదిగా చెప్పబడుతున్నది. ఈ భూమిమీద నివసించే మానవులు చనిపోయినపుడు ధనాత్మక లోకములు అని చెప్పబడే ఊర్ధ్వలోకాలకుకాని, ఋణాత్మక లోకము అని చెప్పబడే పాతాళలోకమునకుకాని వెళ్ళటం జరుగుతుంది.

భూమికి కిందభాగంలో ఉంటాయి అని చెప్పబడే ఏడు పాతాళ లోకములలోను ఒక్కొక్క నరకం ఉపలోకంగా ఉంటుందని తెలుస్తున్నది. ఋణాత్మక లోకాలలో మొదటి లోకంలో ఉండే నరకంలో భూతాలు, పిశాచాలు, నెగటివ్ ఎనర్జీలు ఉంటాయి. ఈ లోకంలో ఉండే ఈ క్షుద్రశక్తులు విపరీతమైన శిక్షలను, బాధలను అనుభవిస్తాయి. భూమి అనే లోకం భౌతిక నేత్రాలకు కనిపిస్తుందికాని, మిగిలిన లోకాలు కంటికి కనపడవు. అయితే ఈ భూమిపై నివసించే కొందరు మహానుభావులు

తమ మనో నేత్రాలతో ఈ లోకాలను సందర్శించగలరు. ఒక్కొక్కసారి సామాన్య మానవులుకూడా విచిత్రమైన పరిస్థితులలో ఈ లోకాలను దర్శించగలిగే పరిస్థితి వస్తుంది.

ఒక మనిషి చనిపోయిన తరువాత అతని శరీరాన్ని అంతకాలం నడిపిన ప్రాణశక్తి శరీరం నుండి బయటకువచ్చి విశ్వశక్తిలో లీనం అవుతుంది. మనిషి ఏ గుణంతో జీవిస్తాడో (రజ, తమో, సత్వ గుణములు) ఆ గుణానికి ఉండే బలాన్నిబట్టి అతని లింగదేహం, పైన లేదా కింద ఉండే ఏ లోకానికి చేరాలో నిర్ణయించబడుతుంది. తమోగుణ ప్రధానులు (సమస్త దుర్గుణాలతో బ్రతికినవారు) చనిపోయినపుడు బయటకు వచ్చే లింగదేహం ఎక్కువదూరం వెళ్ళలేకపోవటం వల్ల లింగదేహం భూమికిదగ్గరగా ఉన్న లోకానికి చేరుకుంటుంది. ఇక రజోగుణ ప్రధానుల (మంచి మరియు చెడు కలిసిన స్వభావం కలవారు) యొక్క లింగదేహములు మరికొంత దూరంలో ఉన్న లోకంలోకి చేరగలవు. కేవలము సత్వగుణ ప్రధానుల (ధర్మం, న్యాయం ప్రాణంగా బ్రతికినవారు) యొక్క లింగదేహాలు మాత్రమే చాలా ఎత్తులో ఉండే లోకాలకు చేరగలవు. అనగా ధర్మాత్ములు మాత్రమే మంచి లోకాలకు చేరగలరు అన్నమాట.

లింగదేహాలు భూమిపైన ఉండే స్వర్గంలోకాని, భూమికింద ఉండే నరకంలోకాని ఒక నిర్ణీతకాలంలో జీవించిన తరువాతే (ఆయా ఆత్మల కర్మఫలాన్నిబట్టి) ఆపై మరల భూమిపైకి వచ్చి మానవ జన్మ ఎత్తటం జరుగుతుంది.

ఒకసారి ఏసుక్రీస్తు ఒక మనిషి నుండి ప్రేతాత్మలను తరిమివేసినపుడు అవి అక్కడ దగ్గరలో ఉన్న కొన్ని పందులను ఆవహించాయి. ఆ ఆత్మల ప్రభావంవల్ల ఆ పందులు పిచ్చి పిచ్చిగా ప్రవర్తిస్తూ పరుగెత్తుకుంటూ ఒక కొండ శిఖరంమీదకు వెళ్ళి అక్కడ నుండి కిందకుదూకి చనిపోయాయి. ఆర్బ్‌లు విభిన్నమైన ఫ్రీక్వెన్సీలలో ఉంటాయి. రేడియో వేవ్స్ ఏవిధంగా అనేక ఫ్రీక్వెన్సీలలో ప్రయాణిస్తాయో అలాగే ఆత్మలుకూడా ప్రయాణిస్తూ ఉంటాయి. ఒకవ్యక్తి దగ్గర A.M. రేడియో ఉన్నది అనుకుందాం. అతడు దానిమీద A.M. ఫ్రీక్వెన్సీలో వచ్చే ప్రసారాలను వినగలడు. అయితే F.M. ఫ్రీక్వెన్సీలో వచ్చే ప్రసారాలను తన రేడియోలో వినలేని ఆ వ్యక్తి తనచుట్టూ F.M. ఫ్రీక్వెన్సీ లేదని చెప్పటం ఎంతవరకు సబబు?. అంటే F.M. రేడియో సిగ్నల్స్‌ని స్వీకరించి ప్రసారంచేయగల రేడియో ఉంటేనే F.M. సిగ్నల్స్ గురించి తెలుసుకోవటానికి వీలవుతుంది.

కొన్నిసార్లు ఆత్మలు తనకు కావల్సిన వారి దృష్టిలో పడటంకోసం వారు తీసుకునే ఫోటోల బ్యాగ్రౌండ్‌లో నీడలలాగా పడటం జరుగుతుంది.

దయ్యాలు సంచరిస్తున్న ప్రదేశంలో నిద్రిస్తున్నపుడు ఎలాంటి అనుభవాలు కలుగుతాయో నేను స్వయంగా పరిశోధించి తెలుసుకోవటం జరిగింది. గుంటూరులో ఒక పేటలో ఉన్న విశాలమైన స్థలంలో రెండు పెద్ద పెద్ద మేడలు ఉన్నాయి. ఆ ఇంటి యజమానులు ముందువైపు ఉండే మేడలో కాపురం ఉంటూ ఉంటారు. వెనకవైపు ఉన్న మేడలోని గదులను ఇతరులకు అద్దెకు ఇస్తూ ఉంటారు. నాకు తెలిసిన కొందరు పైన చెప్పిన మేడలమీద ప్రేతాత్మలు సంచరిస్తున్నాయని నాకు చెప్పటం జరిగింది. ఆ విషయం తెలుసుకోవటంకోసం నేను కొంతమంది పరిచయస్తుల సహకారంతో వెనకవైపు ఉన్న మేడలోని రెండు గదుల్ని నెల రోజులకి అద్దెకు తీసుకోవటం జరిగింది. మీ ఇంట్లో దయ్యాలు తిరుగుతున్నాయి. వాటిని పరిశోధించటానికి నేను వచ్చాను అని చెబితే ఆ ఇంటివాళ్లు పొరపాటునకూడా ఇల్లు అద్దెకు ఇచ్చిఉండేవాళ్ళుకాదు. ఆ ఇంటి యజమాని మరియు ఆయన పెద్దకొడుకు అప్పటికి మూడు సంవత్సరాల క్రితం ఒక ప్రమాదంలో ఆకస్మికంగా చనిపోవటం జరిగింది. ఇప్పటికీ వాళ్ళిద్దరి ఆత్మలు ఆ ఇంటి పరిసరాలలో సంచరిస్తూ ఉంటాయని ఆ ఇంటి గురించి తెలిసిన వాళ్ళు గుస గుసలాడుకోవటం జరుగుతూ ఉంటుంది.

నేను మొత్తం ఏడు రాత్రులు ఆ మేడమీద నిద్రపోవటం జరిగింది. మొదటిరోజు పౌర్ణమి. ఆ రోజు సాయంత్రం 6 గంటల నుండి 9 గంటల వరకు ఆ ఇంటి యజమానురాలి కొడుకులు, మనుమలు ఆ మేడలమీదే కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేశారు. ఆ తరువాత వాళ్ళందరూ ఏదో పనిఉన్నట్టుగా హడావుడిగా కిందకుదిగి వెళ్ళిపోయారు. నేను నా భోజనం ముగించుకుని రాత్రి 10.30కి పైకి వచ్చి పడుకున్నాను. నేను ప్రస్తుతం వెనకవైపుమేడమీద పడుకున్నాను. ముందుమేడ వెనుకమే దాదాపుగా ఆనుకుని ఉంటాయి. ముందుమేడ మీదకి ఒక పెద్దవేపచెట్టు కొమ్మలు వ్యాపించి ఉన్నాయి. అది చలికాలం కావటంవల్ల గాలి బాగా చల్లగా వీస్తున్నది. నేను ఒక చాపను నేలపై పరిచి దానిమీద ఒక దిండువేసి ఆ తరువాత నా మెడలో ఉన్న శ్రీచక్రాన్ని ఒకసారి కళ్ళకు అద్దుకుని గుండెలమీద చేతులుపెట్టుకుని వెల్లికిలా పడుకున్నాను. ఆ తరువాత నా దృష్టిని ఆకాశంలో మిలమిలమెరిసిపోతూ కనిపిస్తున్న చంద్రుడివైపు నిలిపి, నేను పడుకుని ఉన్న ప్రదేశంలో అదృశ్యరూపంలో ఉన్న శక్తులు ఏమైనా ఉంటే అవి నాకు కనిపించాలి అని పదేపదే అనుకున్నాను.

అనుకోకుండానే పదినిమిషాలలో నిద్రలోకి జారుకున్నాను. అప్పటినుండి మొదలయ్యింది అసలు కథ. ఒక చిన్నచప్పుడు క్రమక్రమంగాపెరిగి పెద్దదిఅవుతూ నా చెవుల్ని బద్దలుచేస్తున్నట్లుగా వినిపించటం ప్రారంభం అయ్యింది. ఆ శబ్ద తీవ్రత ఎంత దారుణంగా ఉందంటే నిద్రలోకూడా నాకు చెవుడు వస్తుందేమో అన్న

అనుమానం కలిగింది. ఆ శబ్దం వినలేక ఎలాగైనా మెలుకువ తెచ్చుకుందామని నా సర్వశక్తులు ఒడ్డి ప్రయత్నిస్తున్నాను. కానీ నా చేతులు, కాళ్ళు కదలటంలేదు. అతి కష్టంమీద నా మనోశక్తిని కేంద్రీకరించి రెండు మూడు దశల్లో మెలుకువలోకి వచ్చేశాను. కళ్ళు తెరచిచూసేసరికి నా చుట్టుప్రక్కల ఎవరూలేరు. లేచికూర్చుని ప్రక్కనే ఉన్న బాటిల్‌లోని మంచినీళ్ళు కాసినితాగి లేచి నుంచుని రెండు మేడల పైన కాసేపు అటు ఇటు పచార్లుచేసాను. ఆ తరువాత ఒక ప్రక్కకు వచ్చి చూస్తే కనిపించే రోడ్డుమీద అప్పుడప్పుడు వెళుతున్న ద్విచక్రవాహనాలు మాత్రమే కనిపిస్తున్నాయి. వాచీ చూసుకుంటే అప్పుడు టైం 12.30 నిమిషాలు అయ్యిందని అర్థమయ్యింది.

బహుశా ఈ దగ్గరరలో ఎవరైనా పెద్దగా బాండ్ మ్రోగించటంకాని లేదా ఎవరైనా దగ్గరలోని ఫౌండ్రీవాళ్లు ఇనుపకడ్డీల్ని బలంగా సుత్తులతో కొట్టటంవల్లకాని కలలో నాకు ఆశబ్దం వినిపించిందిఏమో అన్న అనుమానంతో కంటికి కనిపించినంతమేర ఆ మేడల చుట్టుప్రక్కల పరిశీలించాను. ఎక్కడా ఆ శబ్దంచేస్తున్న వాళ్ళు నాకు కనపడలేదు. సరే ఏమైతే అది అవుతుందని మళ్ళీ చాపమీద పడుకుని కళ్ళుమూసుకున్నాను. ఈసారి నేను పూర్తిగా నిద్రలోకి జారుకోకముందే మళ్ళీ భయంకరమైన శబ్దాలు అంతకంతకూ పిచ్‌ని పెంచుకుంటూ నా మెదడును ఛిన్నాభిన్నం చెయ్యటానికి ప్రయత్నించసాగాయి. ఎందుకు ఇలా జరుగుతుందో నాకు అర్థంకాలేదు. సాధారణంగా ప్రేతాత్మలు తాము ఏ మానవుడితో అయినా మాట్లాడాలి అనుకుంటే స్వప్నాలద్వారా మాట్లాడటం జరుగుతుంది. అయితే ఆ మేడమీద ఉన్న ప్రేతాత్మలు నాతో మాట్లాడాలని ప్రయత్నించకుండా ఈవిధమైన శబ్దాలు ఎందుకుచేస్తున్నాయి అన్న ప్రశ్న ఆ క్షణంలోనే నా మనసులో ఉదయించింది. నేను ఎక్కడ పడుకున్నానో? నేను పడుకుని ఎంతసేపు అయ్యిందో నాకు స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది. అయినా నాకు మాత్రమే వినిపిస్తున్న ఈ భీకర శబ్దాలు నా భ్రమా? లేక నిజమా? అన్న విషయం అర్థంకావటంలేదు.

కొంతసేపు గడిచినాక ఆ శబ్దాలు ఆగిపోయాయి. ఈసారి కళ్ళని పూర్తిగా కప్పివేసే అతి ప్రకాశవంతమైన వెలుగులు నాచుట్టూ తిరుగుతున్నాయి. నేను సంపూర్తిగా స్పృహలోనే ఉన్నాను. కానీ కదలలేను. అప్రయత్నంగా నా కుడిచేయి నా మెడలో ఉన్న శ్రీచక్రాన్ని తాకింది. సరిగ్గా అదే సమయంలో నా ముందు ఇద్దరు పురుషులు ప్రత్యక్షం అయ్యారు. వాళ్ళిద్దరూ చాలాభయంకరంగా కుష్టిరోగం వచ్చినవాళ్లులాగా వికారంగా కనిపిస్తున్నారు. వాళ్ళు నాతో ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నారని నాకు అనిపించింది. ఇంతలో ఆ రెండు ఆకారాలలో ఒక ఆకారం నోరు తెరచి "ఇదిగో అబ్బాయ్! నువ్వు మాకు ఒక ఉపకారం చెయ్యాలి" అన్నది వికృతమైన స్వరంతో. ఆ

స్వరం ఎంతోవిచిత్రంగా ఉన్నది. ఒక ఆడ మరియు మగ స్వరాలు కలిస్తే ఎలాంటి స్వరం ఏర్పడుతుందో అలాఉంది ఆ స్వరం. నేను ఆ స్వప్నంలాంటి స్థితిలోనే ఎలాగో గొంతు పెకలించుకుని మీ బాధ ఏమిటో చెప్పండి అన్నాను.

అందులో రెండోవ్యక్తి ఇలా చెప్పాడు. "ఈ ప్రదేశం ఒకప్పుడు సమాధులతో నిండిపోయి ఉండేది. 50ఏళ్ళ క్రితం నేను ఈ స్థలాన్ని కబ్జాచేసి ఇక్కడ రెండు మేడల్ని కట్టాను. ఆ తరువాత నా పలుకుబడి ఉపయోగించి ఈ స్థలానికి పట్టా తెచ్చాను. ఈ స్థలం బలికోరుతుంది. ఈ స్థలంలో ఉండేవాళ్ళు ఎవరైనా అనేక దౌర్భాగ్యాలు అనుభవించాల్సి వస్తుంది. మా కుటుంబంలో చాలామంది ఈ స్థలప్రభావంవల్లే అనేక తప్పుడు పనులుచేసి జనంలో చులకన అయిపోయారు. నా కొడుకు అతిదారుణమైన విద్యుత్‌షాక్‌తో మాడిపోయి చనిపోయాడు. ప్రస్తుతం నేను, నాకొడుకు ప్రేతాత్మలమై ఇక్కడ సంచరిస్తున్నాం. నీవు ఎలాగైనా మావాళ్ళని, ఈ ప్రదేశం శాశ్వతంగావదలి వేరేచోటకి వెళ్ళమనిచెప్పు". నాకు హఠాత్తుగా అప్రయత్నంగా మెళుకువ వచ్చేసింది. నాకుఅర్థమయ్యింది ఇక్కడ ఖచ్చితంగా ప్రేతాత్మలు ఉన్నాయని, నేను ఆ తరువాత ఆ నెలలో నాలుగుసార్లు ఆ మేడమీద నిద్రపోవటం మళ్ళీ ఆవేశబ్దాలు వినిపించటం ఆపై వికృతమైన ఆ ప్రేతాత్మలు కనపడి నాతో మాట్లాడటం జరిగింది. ఈ ప్రదేశం వదలివేసి వెళ్ళిపొమ్మని ఆ మేడల యజమానురాలితో చెప్పటం నాకు సాధ్యంకాలేదు. ఎందుకంటే ఆమె తనకు ఆర్థికంగా నష్టం కలిగించే సలహా ఎవరుచెప్పినా వాళ్ళని అనేక రకాలుగా శాపనార్థాలుపెట్టే స్వభావాన్ని కలిగి ఉన్నది అని నా మిత్రుడు నాకు ముందుగానే చెప్పటం జరిగింది. చేసేదిలేక నేను ఇల్లు ఖాళీ చేస్తున్నాని ఆ ఇంటి యజమానురాలితోచెప్పి అక్కడ నుండి మౌనంగా బయలు దేరాను. "మీకు తెలిసినవాళ్ళు ఎవరైనా ఉంటేచెప్పండి. మీరు ఉండివెళుతున్న మేడలో గదుల్ని వాళ్ళకి అద్దెకు ఇస్తాను" అని బిగ్గరగా ఆ మేడల యజమానురాలు నా వెనకనుండి చెబుతూ ఉన్నది. నేను వెనక్కి తిరిగి చూడకుండా రోడ్డుమీదకు వచ్చేశాను.

వాస్తవానికి దయ్యాలు తమ ఉనికినిచాటే ఏ గుర్తులనూ మానవలోకంలో వదిలిపెట్టవు. ఇవి ఏవిధమైన భౌతిక రూపమూ లేకుండా ఒకచోట నుండి ఒకచోటకు ప్రయాణిస్తూ ఉంటాయి. వీటికి ఏవిధమైన వాసనా ఉండదు. కొంతమంది అభిప్రాయం ప్రకారం దయ్యాలు మనిషి భౌతిక నేత్రాలకు కనపడవని, మనో నేత్రాలకు కనిపిస్తాయని తెలుస్తున్నది. కానీ శాస్త్రజ్ఞులు అలాంటి స్థితిని మానసిక భ్రమలు (హాలూసినేషన్స్) అని కొట్టిపారేస్తారు. దయ్యాలు తమ ఉనికిని తెలియజేయటంకోసం కొన్నిసార్లు గాలి తెమ్మెరలను మానవులపైకి వీచటం జరుగుతుంది. సాధారణంగా అందరు మానవులు దయ్యాల ఉనికిని తెలుసుకోగలిగే శక్తిని కలిగి ఉండరు. అందువలననే

దయ్యాలను గుర్తించగల ప్రత్యేకశక్తిని కలిగి ఉన్న మానవులకు అవి కనిపించటం జరుగుతుంది. కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం ఒక మనిషి జీవించి ఉన్నపుడు ఏదోఒకశబ్దాన్ని అనేకసార్లు చెయ్యటం జరుగుతుంది. అంటే ఆ శబ్దం ఆ వ్యక్తికి మాత్రమే పరిమితమైన ప్రత్యేక గుర్తుగా భావించాలి. కొంతమందికి కొన్ని వస్తువుల పట్ల ప్రత్యేక ఇష్టం ఉంటుంది. వారు చనిపోయిన తరువాత తమయొక్క ఉనికిని తమవారికి తెలియజేయటంకోసం తాము ఇష్టపడే ప్రత్యేక వస్తువులను కదిలించటం ద్వారా లేదా ఒకచోట నుండి ఇంకోచోటకి తరచుగా మార్చటం జరుగుతుంది.

ముఖ్యంగా ఒక గృహంలో చిన్నపిల్లలు అకాలమృత్యువు పాలయినపుడు ఆ పిల్లల ఆత్మలు దయ్యాలుగామారి తమ గృహంలో ఉండే తాము ఆడుకున్న బొమ్మలను ఆవహించటం జరుగుతుంది. ఫలితంగా ఎవరూ కదిలించకుండానే ఆ బొమ్మలు కదలటం లేదా వాటిని ఒకచోటపెడితే ఇంకొచోట ఉండటం లాంటి విచిత్ర సంఘటనలు జరుగుతాయి. కొన్నిసార్లు ప్రేతాత్మలు తమ ఉనికిని తెలియజేయటంకోసం విచిత్రమైన శబ్దాలను చెయ్యటం జరుగుతుంది. ఒక మనిషి తనకు ఏ ప్రదేశంలో ప్రేతాత్మలకు సంబంధించిన అనుభవం ఎదురయ్యిందో ఖచ్చితంగా చెప్పలేడు. కొన్నిసార్లు స్వప్న రూపంలో ప్రేతాలు మానవులకు కనిపిస్తాయి. ప్రేతాత్మలు ఎలాంటి ఘనపదార్థాల నుండి అయినా నిరాటంకంగా ప్రయాణించగలవు. పిశాచాలను నిరోధించాలంటే మంత్రాలను, యంత్రాలను కొన్నిరకాల తాంత్రిక చిహ్నాలను మరియు మూలికలను ఉపయోగించాల్సి ఉంటుంది.



# 3. ప్రేతాత్మలు మానవులతో శృంగారం జరుపగలవా?

పాశ్చాత్యదేశాలకు చెందిన చర్చి ఫాదర్ల అభిప్రాయం ప్రకారం కామపిశాచిగా చెప్పబడుతున్న ఇన్‌క్యుబస్ ఒకప్పుడు దేవతగా ఉండేదని, దైవం సన్నిధిలో ఉండేదని అయితే ఆ దేవతకు స్త్రీలపట్ల ఉన్న విపరీతమైన కామవాంఛ కారణంగా దైవం ఆ దేవతను స్వర్గం నుండి బయటకు నెట్టివేశాడని తెలుస్తున్నది. అప్పటివరకు దేవతగా ఉన్న ఇన్‌క్యుబస్ దయ్యంగా మారినతరువాత మరింతగా పెరిగిన కామవాంఛలతో

మానవ స్త్రీలపైపడి తన కామవికారాలను తీర్చుకోవటం జరుగుతున్నది. మానసికంగా బలహీనంగా ఉన్న మరియు ఒంటరిగా జీవిస్తున్న స్త్రీలను బలాత్కారంగా అనుభవించటం ఇన్‌క్యుబస్‌కు ఒక అలవాటు.

యూదు-క్రైస్తవ పురాణాలు ఇచ్చిన సమాచారం ప్రకారంచూస్తే ఇన్‌క్యుబస్ అనే ఒక పురుష దయ్యం ఆడపిల్లలయొక్క ఆత్మలను అపహరించి నరకానికి తీసుకు వస్తుంది. ఇన్‌క్యుబస్ స్వప్నావస్థలో ఉన్న మానవ స్త్రీలను అనుభవిస్తున్నపుడు ఆ స్త్రీలకు విపరీతమైన శారీరకబాధ కలుగుతూ ఉంటుంది. అయినప్పటికీ వాళ్ళు ఇన్‌క్యుబస్‌యొక్క వశీకరణశక్తికి లొంగిపోయి ఆ దయ్యాన్ని పక్కకు నెట్టలేకపోవటం జరుగుతుంది. ఇన్‌క్యుబస్ అంటే శరీరంపైన ఉండి నొక్కివేసేది అని లేదా నలిపివేసేది అని అర్థం. ఇన్‌క్యుబస్ ఒక స్త్రీపై ఉన్నపుడు ఆ స్త్రీలో విపరీతమైన భయం, తనపైన విపరీతమైన బరువు ఉన్నట్టుగా అనిపించటం మరియు ఊపిరి అందకుండా పోవటం జరుగుతుంది. ఒకరకంగా చెప్పాలంటే ఆ పరిస్థితి తాత్కాలికంగా వచ్చే ఒకరకమైన పక్షవాతం అని చెప్పవచ్చు. గ్రీకుల అభిప్రాయం ప్రకారం ఏ స్త్రీలు అయితే విపరీతంగా తినటం లేదా తాగటం చేస్తారో, ఏ స్త్రీలు అయితే మూర్ఛలాంటి నరముల వ్యాధులతో బాధపడుతూ ఉంటారో వారిపై ఇన్‌క్యుబస్ దాడులు జరుగుతాయని తెలుస్తున్నది.

స్త్రీలను ఇన్‌క్యుబస్ అనే ఒక పురుష పిశాచి ఏవిధంగా అనుభవిస్తుందో సక్కుబస్ అనే ఆడపిశాచి పురుషుల్ని ఆవిధంగా అనుభవిస్తుంది. ప్రఖ్యాత ఆంగ్ల రచయిత అయిన గైడేమపాసంట్ తన **లేహోర్ల** అనే హారర్ నవలలో సక్కుబస్ వలన తాను ఎన్ని బాధలుపడ్డాడో వివరించటం జరిగింది. ఒక రచయిత తనకు ఎదురయిన యదార్థ అనుభవాలు ఆధారంగా ఒక గ్రంథాన్ని రచించినపుడు దానిని సంపూర్తిగా విశ్వసించ వలసిన అవసరం ఎంతైనా ఉంటుంది.

తీరని కోర్కెలతో చనిపోయిన స్త్రీ, పురుషులు ప్రేతాత్మలుగా మారతారు. ముఖ్యంగా కామ సంబంధమైన కోర్కెలు తీరకుండా చనిపోయిన స్త్రీ, పురుషుల ఆత్మలు మానవులని అనుభవించటం జరుగుతుంది. కొన్నిసార్లు ఈ అనుభవంవల్ల మానవ స్త్రీలకు సంతానం కలిగిన సంఘటనలు పాశ్చాత్యదేశాలలో నమోదు అయినాయి. భారతదేశంలోకూడా అక్కడక్కడా ఇలాంటి సంఘటనలు జరిగినట్టుగా తెలుస్తున్నది. ("వాడు మనిషికి పుట్టలేదు దయ్యానికి పుట్టాడు" అనే నిందా వాక్యాన్ని తరచుగా భారతీయులు తమ శత్రువుని నిందించటానికి ఉపయోగిస్తుంటారు. వాస్తవాలే తిట్లలలోకూడా కనిపిస్తాయి. కనుక ప్రేతాత్మలు మానవ స్త్రీలకు సంతానాన్ని కలిగించే శక్తి ఉన్నట్టుగా అర్థంచేసుకోవచ్చు). అనేకమంది హేతువాదులు మరియు విద్యాధికులు దయ్యాలు మానవులతో సంభోగిస్తాయి అన్న విషయాన్ని తీవ్రంగా కొట్టిపారేస్తారు. అది కేవలం

రచయితలపైత్యం అని వారి అభిప్రాయం. కానీ అలా జరిగిన మరియు జరుగుతున్న సందర్భాలు ప్రపంచంలో ఎన్నో ఉన్నాయి.

ముఖ్యంగా ప్రేతాత్మలు సంచరించే అనేక ప్రాంతాలలో మానవుల్ని అనుభవించిన ప్రేతాత్మలకు సంబంధించిన సంఘటనలు జరుగుతూ ఉంటాయి. అనేకమంది పారా నార్మల్ ఇన్‌వెస్టిగేటర్స్ (అతీంద్రియ శక్తుల ఉనికి గురించి పరిశోధించే వారు) అనేక అనేక హెూటళ్ళు, శ్మశానాలు మరియు తరచుగా హత్యలు లేదా ఆత్మహత్యలు జరిగే ప్రదేశాలలో పరిశోధన జరిగినపుడు మిగిలిన చోట్లకన్నా ఈ ప్రదేశాలలో తరచుగా పురుషులు లేదా స్త్రీలు ప్రేతాత్మలచేత అనుభవించబడినట్టుగా తేలింది. గెట్టీస్‌బర్గ్, శాన్‌ఫ్రాన్‌సెస్‌కో, న్యూఆర్లెన్స్, రోమ్, పారీస్ లాంటి ప్రేతాత్మలు సంచరించే నగరాలలో మానవుల్ని అనుభవించే ప్రేతాత్మల సంచారం అధికంగా ఉన్నట్టుగా పరిశోధకులు కనుగొన్నారు. కొన్నిసార్లు ప్రేతాత్మలు మానవుల్ని అసహజ విధానాలలో అనుభవించటం జరుగుతుంది. ఈనాడు అనేక పాశ్చాత్యదేశాల టెలివిజన్ ఛానళ్ళలో దయ్యాలతో శృంగారాన్ని పంచుకున్న స్త్రీ, పురుషులయొక్క అనుభవాలు తరచుగా ప్రసారం చేయబడుతున్నాయి. కొందరు పరిశోధకులకి ప్రేతాత్మలచేత అనుభవించబడిన స్త్రీ, పురుషుల వివరాలు తెలిసినప్పటికీ వారియొక్క పరువుప్రతిష్టలు కాపాడటానికోసం ఆ విషయాలను రహస్యంగా ఉంచటం జరుగుతుంది.

న్యూయార్క్‌కి చెందిన ఒక వృద్ధురాలు గతంలో తాను యువతిగా ఉన్నపుడు ఒక ప్రేతాత్మచేత శృంగారపరంగా వేధించబడ్డట్టుగా తెలియజేసింది. ఆమె అనుభవాలను ఆమె మాటల్లోనే తెలుసుకుందాం.....

అది 1967వ సంవత్సరం. అపుడు నావయస్సు 20 సంవత్సరాలు ఉంటాయి. నేను ఒక రైల్వేస్టేషన్‌లో జనసమూహానికి దూరంగా ఒక ప్రక్కగా నిల్చుని ఉన్నాను. ఆ సమయంలో అకస్మాత్తుగా ఎవరో ఒక అదృశ్యవ్యక్తి తన వేళ్ళతో నా వక్షోజమొనలను (Nipples) సున్నితంగా నలుపుతున్నట్టుగా అనుభూతి కలిగింది. నాకు ఆశ్చర్యము, భయము కలిగాయి. నాకేంజరుగుతున్నదో అర్థంకావటంలేదు. అది ఎలా జరిగిందో నాకు అపుడు అర్థంకాలేదు. 1978వ సంవత్సరం వచ్చేసరికి నన్ను ఎవరో ఒక అదృశ్యవ్యక్తి నీడలా వెంటాడుతున్నాడని అర్థంచేసుకున్నాను. నేను ఎన్నో రాత్రులు ఎవరో అదృశ్యవ్యక్తిచేత అనుభవించబడినట్టుగా కలలు కన్నాను. నిజానికి అవి కలలుకాదు. యదార్థాలు అని ఆ తరువాత నాకు అర్థమయ్యింది.

ప్రేతాత్మలచేత అనుభవించబడిన కొందరు స్త్రీ, పురుషులమీద పరిశోధనలు సాగించిన ఒక పరిశోధకుడు అందించిన వివరాలు ఇలా ఉన్నాయి.....

1983లో జరిగిన సంఘటన ఇది. U.S.A. లోని వెబ్‌స్టర్ పారిష్ అనే ప్రాంతంలో ఉన్న షాంగలు అనే గ్రామంలోని మార్గరేట్ అనే ఒక యువతిని ఒక ప్రేతాత్మ అనేకసార్లు అనుభవించటం జరిగింది. ఆమె బహిరంగ ప్రదేశాలలోఉన్నా ఒంటరిగా ఉన్నా ఆ ప్రేతాత్మ ఆమెను వెంటాడుతూనే ఉండేది. ఈ విషయాన్ని ఆమె సోదరుడైన బడ్డీహార్ఫ్ పరిశోధకులకు తెలియజేసాడు. కొన్నిసార్లు స్త్రీ ప్రేతాత్మలు తమకు నచ్చిన పురుషుల్ని ఎప్పుడుపడితే అప్పుడు, ఎక్కడపడితే అక్కడ శృంగారపరంగా ప్రేరేపించి అనుభవించటం జరుగుతుంది. పరిశోధకులు మార్గరేట్‌ని కలుసుకున్నప్పుడు ఆమె తన అనుభవాల్ని కళ్ళకట్టినట్టుగా తెలియజేసింది. తనకి 17 సంవత్సరాల వయస్సు ఉన్నపుడు తొలిసారిగా ఒక అదృశ్యశక్తిచేత అనుభవించబడ్డట్టుగా మార్గరేట్ తెలియజేసింది. ఆ ప్రాంతంలో నివసిస్తున్న అనేకమంది స్త్రీ, పురుషులు తాముకూడా జీవితంలో ఎప్పుడోఒకసారి ప్రేతాత్మలచేత అనుభవించబడ్డట్టుగా తెలియజేసారు.

ఆమె తొలిసారిగా ప్రేతాత్మలచేత అనుభవించబడ్డప్పటినుండి అనేక సంవత్సరాల పాటు ఆమె సజీవ నరకాన్ని అనుభవించవలసి వచ్చింది. మార్గరేట్‌కి ఒక తమ్ముడు ఉన్నాడు. అతడితో శృంగారం జరపమని ఒక ప్రేతాత్మ మార్గరేట్‌ని బెదిరించింది. అందుకు మార్గరేట్ అంగీకరించలేదు. ప్రేతాత్మలు మానవుల ఒంటిపై వస్త్రాలు ఉన్నా లేకున్నా వారిని అనుభవించగలవు. ప్రేతాత్మలు మానవ స్త్రీలను అనేక రకాలుగా అనుభవించగలవని తెలుస్తున్నది. స్త్రీ శరీరంలోని ఏ భాగం ద్వారా అయినాసరే ప్రేతాత్మలు సంభోగాన్ని జరుపగలవు. పిరుదులు, స్తనములు, పొత్తికడుపు, తొడలు, పాదాలు, చేతులు, కాళ్ళు మరియు శృంగార అవయవాలద్వారా సంభోగం జరపటం ప్రేతాత్మలకు సాధ్యపడుతుంది.

కాలిఫోర్నియాకు చెందిన ఒక స్త్రీ ఇటీవల కాలంలో ఒక పరిశోధకుడికి తన అనుభవం గురించి తెలియజేసింది. అది ఏమిటంటే ఎవరో ఒక చనిపోయినవ్యక్తి ఆమెకు ఫోన్‌చేసి ఆమెతో అసభ్యంగా మాట్లాడటం ప్రారంభించాడట. (నిజ జీవితంలో కూడా కొందరు పురుషులు తమ అవయవాన్ని ఇతర స్త్రీలకు ప్రదర్శిస్తూ కామోద్రేకాన్ని మరియు కామ తృప్తిని పొందటం జరుగుతుంది. దీన్ని ఎగ్జిబిషనిజం అని (ప్రదర్శన చేసే స్వభావం) పిలవటం జరుగుతుంది.) కొందరు మనుషులు చనిపోయి ప్రేతాత్మలుగా మారిన తరువాతకూడా ఈవిధమైన స్వభావాన్ని వదులుకోలేక తమకు పరిచయం ఉన్న స్త్రీలకు ఫోన్‌చేసి అసభ్యంగా తమ అవయవం గురించి మాట్లాడటం జరుగుతుంది.

మేరీజన్సెన్‌క్రాస్ అనే ఒక మధ్యవయస్సు స్త్రీ తనకు ఎవరో అపరిచితులు అనేకసార్లు ఫోన్‌చేసి తనను శృంగారపరంగా రెచ్చగొట్టటానికి ప్రయత్నించినట్టుగా

తెలియజేసింది. ఆమె పోలీసుల సహకారంతో ఆ ఫోన్లుచేసింది ఎవరో తెలుసుకోవాలని ప్రయత్నంచెయ్యగా ఆ ఫోన్లు ఏ నంబర్‌నుండి ఆమెకు వచ్చాయో ఆ నంబర్లు అప్పటి వరకు ఎవరికీ ఇవ్వబడలేదు అని తెలిసింది. అంటే సొంతంగా ఏర్పరచుకున్న ఫోన్ నెంబర్ల సహకారంతో ప్రేతాత్మలు మేరీతో మాట్లాడాయని మనం గ్రహించాల్సి ఉంటుంది. మేరీని గతంలో ఒకవ్యక్తి ఎన్నోసార్లు ఫోన్‌చేసి శృంగారపరమైన తిట్లతో పలకరించేవాడు. మేరీ అతనిమీద దాదాపు 6సార్లు కేసులుపెట్టించి పోలీసులచేత అరెస్టు చేయించింది. ఆ తరువాత కొంతకాలానికి అతడు చనిపోయాడు. ఇక అతడి నుండి తనకు అసభ్యకరమైన ఫోన్లు రావని ఆమె భావించింది. కానీ ఆమె ఆశ అడియాశే అయ్యింది. అతడు ప్రేతాత్మగా మారిన తరువాతకూడా ఆమెకు ఫోన్లు చెయ్యటం మానలేదు. ఒక విచిత్రం ఏమంటే ఆ ఫోన్లను నివారించటంకోసం మేరీ దాదాపు సంవత్సరంలో డజనుసార్లు తన ఫోన్ నెంబర్లు మార్చుకున్నప్పటికీ ఆమెకు వచ్చే ప్రేతాత్మ ఫోన్లు ఆగలేదు. ఇటువంటి కాల్స్ ఎక్కడ నుండి వస్తున్నాయో తెలుసుకోవాలని సర్వీసు ప్రొవైడర్ కంపెనీలు ఎంతగా ప్రయత్నించినా వీలుకాలేదు.

న్యూమెక్సికోకి చెందిన ఒక యువతికి ఒక యువకుడు తరచుగా బూతుమాటలతో కూడిన మెసేజ్‌లు పంపిస్తూ ఉండేవాడు. ఇలా చాలాకాలం సాగింది. ఆ తరువాత ఆ వ్యక్తి ఒక కారు ప్రమాదంలో చనిపోయాడు. ఆ ప్రమాద సమయంలో అతని దగ్గర ఉన్న సెల్‌ఫోన్ అతనికి దగ్గరలో ఉన్న ఒక పాడుపడ్డ బావిలో పడిపోయింది. అతడు చనిపోయాడనే వార్త తెలుసుకున్న ఆ యువతి తేలిగ్గా నిట్టూర్చింది. అయితే ఆమె సంతోషం తాత్కాలికమే అయ్యింది. ఆమెకు మళ్ళీ అసభ్యకరమైన మెసేజ్‌లు పాతనంబరు నుండి రావటం మొదలయ్యింది. చనిపోయిన వ్యక్తియొక్క ఫోన్‌నెంబర్ నుండి ఆ మెసేజ్‌లు ఎలా వస్తున్నాయో? తెలుసుకోవాలని కొందరు పరిశోధకులు ప్రయత్నించినపుడు పాడుబట్ట బావిలో పడిఉన్న సెల్‌ఫోన్ నుండి ఆ మెసేజ్‌లు వస్తున్నాయని తెలిసింది. అయితే ఎక్కడో బావి అడుగున పడిఉన్న ఆ సెల్‌ఫోన్ నుండి మెసేజ్‌లు పంపిస్తున్నది ఎవరు? (అంతకుముందు మేసేజ్‌లు పంపిన వ్యక్తి యొక్క ప్రేతాత్మే ఈ మేసేజ్‌లుకూడా పంపిస్తున్నట్టుగా ఆ తరువాత తేలింది.)

తాను గత 16 సంవత్సరాలుగా రాత్రి సమయాలలో ఒక స్త్రీ పిశాచిచేత అనుభవించబడుతున్నాని చైనాకి చెందిన ఒక యువకుడు చైనా మీడియాకు తెలియ జేసాడు. రెండు సంవత్సరాలక్రితం ఈ వార్త చైనా న్యూస్‌పేపర్‌లో ప్రకటించబడింది. కౌలాలంపూర్‌కి చెందిన కెల్విన్ అనే 34 సంవత్సరాల యువకుడు ఒక స్త్రీ పిశాచి చేత కొంతకాలంగా బాధించబడుతున్నాడు. పొడవాటి జుట్టుతో ఉన్న ఆ ఆడదయ్యం రాత్రి సమయాలలో అనేక రకాల రూపాలతో కనిపిస్తూ కెల్విన్‌తో శృంగారం

జరుపుతుంది. ఆ ఆడ దయ్యం కెల్విన్ నిద్రపోతున్నపుడు కలలోకికూడా వచ్చి పీడిస్తు ఉంటుంది.

పురుషుడికి స్వప్నాలలో కనిపించి అతడిని అనుభవిస్తున్న సక్కుబస్ అనే ఆడ పిశాచిని ఈ ఫోటోలో చూడవచ్చు.



ఐదుగురు గాళ్‌ఫ్రెండ్స్ ఉన్న కెల్విన్ ఆ ఆడపిశాచి కారణంగా వివాహం చేసుకోకుండా ఉండిపోవల్సి వచ్చింది. కెల్విన్‌కి 18 సంవత్సరాలు వయస్సు ఉన్నపుడు ఆ ఆడపిశాచి అతడిని ఆశించటం ప్రారంభించింది. ఆ తరువాత కెల్విన్ కౌలా లంపూర్‌లోని ఒక మంత్రగాడిని కలిసి తనను ఆ స్త్రీ పిశాచి బారినుండి రక్షించమని ప్రాధేయపడ్డాడు. కెల్విన్‌ని పీడిస్తున్నది 30 సంవత్సరాల క్రితం ఒక ప్రేమ వ్యవహారంలో పరాజయంపొంది ఆత్మహత్య చేసుకున్న ఒక యువతి ఆత్మ అని ఆ మంత్రగాడు తెలుసుకున్నాడు. ఆ తరువాత కెల్విన్‌కి ఆమె పీడను తొలగించటంకోసం కాగితాలతో తయారుచేసి ఒక ఆడ మరియు మగ బొమ్మలకు పెళ్ళి జరిపించి ఆపై ఆ బొమ్మల్ని తగులబెట్టాడు. అందులో మగ బొమ్మపేరు కెల్విన్. ఆ బొమ్మల పెళ్ళిని కెల్విన్‌తో తనకు జరిగిన యదార్ధవివాహంగా భ్రమపడిన ఆ స్త్రీ ప్రేతాత్మ కెల్విన్‌ని వదలి ప్రేతాత్మల లోకానికి వెళ్ళిపోయింది.

అన్నానికోలే అనే ప్రఖ్యాత హాలివుడ్ శృంగారతార తాను ఎన్నోసార్లు పురుష ప్రేతాత్మలతో శృంగారంలో పాల్గొన్నట్టుగా ప్రకటించి సంచలనం సృష్టించింది.

జింజిబార్ ఐలాండ్స్‌లోని కొందరు ప్రజలు కొంతకాలం క్రితం ప్రేతాత్మలు నిద్రపోతున్న తమపై దాడిచేసి తమను లైంగికంగా వేధించినట్టుగా తెలియజేసారు.

పోపోబావా అనే పేరుగల ఒక పురుషపిశాచి అటు స్త్రీలను, ఇటు పురుషుల్ని కూడా అనుభవిస్తున్నట్టుగా అక్కడ ప్రజలు తెలియజేశారు. ఆ పిశాచి సెంట్రల్‌పెంబ మరియు ఉత్తరజింజిబార్ ఐలాండ్ ప్రాంతంలో సంచరిస్తున్నట్టుగా ఒక పుకారు

రేగింది. ఆ పిశాచి ఉన్న గృహంలో కుళ్ళు వాసన వస్తూ ఉంటుందని, పొగ రింగులు రింగులుగా కనిపిస్తుందని కొందరు తెలియజేయటం జరిగింది.

ప్రసవ సమయంలో చనిపోయిన స్త్రీలు భూతాలుగా మారతారని తాంత్రిక శాస్త్రంలో చెప్పబడి ఉన్నది. ఇలాంటి భూతాలను ఉత్తరభారతదేశంలో **ఛురాలి** అని నేపాల్ మరియు తూర్పు భారతదేశ ప్రాంతాలలో **ఢాకినీ** అని పిలుస్తారు. ఈ పిశాచాలు చాలావరకు మానవ స్త్రీలలాగా కనిపిస్తాయి. భూమి పవిత్రమైనది మరియు అయస్కాంతశక్తిని కలిగిఉన్నది అవటంవల్ల ఈ పిశాచాలు నేలపై నుంచోటానికి ఇష్టపడవు. వీటి పాదాలు వెనక్కి తిరిగి ఉంటాయని తెలుస్తున్నది. ఇవి తాము కోరుకున్న రూపాన్ని ధరించగలవు. ఒక మానవ పురుషుడిని ఈ **ఛురాలి** ఆశించి నట్లయితే ఆ పురుషుడు తన జీవశక్తిని కోల్పోయి మరణిస్తాడు. కొంతమంది అభిప్రాయం ప్రకారం ఈ పిశాచాలకు నీడ పడదు. అంతేకాకుండా ఇవి ముక్కుతో మాట్లాడినట్లుగా మాట్లాడతాయని తెలుస్తున్నది. ఈ పిశాచాలు నీరు మరియు ఇనుములకు భయపడి వాటికి దూరంగా ఉంటాయి. అదేవిధంగా పసుపును కాలిస్తే వచ్చేపొగకు ఈ పిశాచాలు చాలా దూరంగా ఉంటాయి.

ఇన్‌క్యుబస్ (Incubus) అనే పురుషపిశాచి నిద్రపోతున్న స్త్రీలపై అత్యాచారం (Rape) జరుపుతుందని కొన్ని శతాబ్దాలుగా పాశ్చాత్యదేశాలలో విశ్వసిస్తున్నారు. మధ్యయుగ ఐరోప్పాదేశాల జానపదగాథలలో ఇన్‌క్యుబస్ గురించిన అనేక వివరాలు తెలుపబడ్డాయి. సాధారణంగా ఇన్‌క్యుబస్ నిద్రపోతున్న ఒక స్త్రీపై వ్రాలినపుడు ఆమెకు ఇన్‌క్యుబస్‌యొక్క స్పర్శ తెలుస్తున్నప్పటికీ ఆమెకు నిద్రలోంచి మేలుకోవటానికి వీలుకాదు. ఇన్‌క్యుబస్ ఆమెతో అమానుషంగా సంభోగం జరుపుతుంది. నిద్రపోతున్న స్త్రీకి తనకు పీడకల వస్తున్నది అని భ్రమపడుతుంది. ఏ మానవ స్త్రీతో అయినా ఇన్‌క్యుబస్ సంభోగం జరిపినట్లయితే ఆ మానవ స్త్రీకి గర్భం రావటానికి అవకాశాలు అధికంగా ఉన్నాయి. అలా ఇన్‌క్యుబస్‌ద్వారా పుట్టినబిడ్డ మామూలు బిడ్డలాగానే పెరిగి పెద్దదవుతుంది. అయితే అలా పుట్టిన కొంతమంది బిడ్డలు అసాధారణమైన శక్తిసామర్థ్యాలు కలిగిఉండి కాలక్రమంలో మహాదుర్మార్గులుగాను లేదా తాంత్రికులుగాను మారే అవకాశం ఉంటుంది.

క్రైస్తవ మత గ్రంథాలలో చెప్పబడిన మెర్లిన్ అనే మంత్రగత్తె, ఒక క్రైస్తవ సన్యాసి(నన్)ని ఇన్‌క్యుబస్ అనుభవించటం వలన పుట్టినదని తెలుస్తున్నది. క్రైస్తవ సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే ఇన్‌క్యుబస్ అనే పురుషపిశాచి, సక్కుబస్ అనే స్త్రీపిశాచి ఒకప్పుడు దేవతలుగా దేవుని సన్నిధిలో ఉండేవని, ఆ తరువాత కాలంలో ఆ ఇద్దరు దేవతలూ సాతాన్‌తో చేతులుకలిపి దైవాన్ని ధిక్కరించాయని ఫలితంగా

సాతాన్‌తోపాటు సక్కుబస్ మరియు ఇన్‌క్యుబస్‌లు స్వర్గం నుండి గెంటివేయబడ్డాయ్ని తెలుస్తున్నది.

ఇనుక్యుబస్ అనే పురుష పిశాచి నిరంతరం కామంతో వేగిపోతూ ఉంటుంది. అది, కోర్కెలు తీరక బాధపడుతున్న వయస్సులో ఉన్న స్త్రీలకు స్వప్నాలలో కనిపించి వారిలో కామవాంఛను గిలించి ఆపై వారిని పైశాచికంగా అనుభవిస్తుంది. గ్రీకు పురాణాలలోకూడా ఇన్ క్యుబస్, నిద్ర



పోతున్న స్త్రీలను అనుభవిస్తుందని వ్రాయబడి ఉన్నది. ఈ ఇన్‌క్యుబస్ స్త్రీలను లైంగికంగా అనుభవిస్తుందని గ్రీకు తత్వవేత్తలు పేర్కొన్నారు. 1876వ సంవత్సరంలో జన్మించిన డోరథీ విలియమ్‌సన్ అనే స్త్రీ, ఇన్‌క్యుబస్ మరియు ఒక మానవ స్త్రీకి మధ్య ఏర్పడిన శారీరక సంబంధం వల్ల జన్మించినట్టుగా తెలుస్తుంది. ఈమె స్టాఫర్డ్‌షైర్ ప్రాంతంలో ఉన్న లాంగ్‌టన్ అనే ప్రదేశంలో నివసించింది. ఈమెకూడా ఒక బిడ్డనుకంటూ మరణించినట్టుగా రికార్డులో నమోదుచేయబడి ఉన్నది.

21వ శతాబ్దానికి చెందిన ప్రధమస్థాయి ప్రేతమాధ్యమంగా (ఘోస్ట్‌మీడియం) పేరుపొందిన లిసా రే హార్ప్ కొన్ని దశాబ్దాలుగా మానవాతీతశక్తుల ఉనికిని బలపరచే అనేక అంశాలపై విస్తృతమైన పరిశోధనలు చేస్తున్నది. చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలను తనవద్దకు ఆహ్వానించి వారితో మాట్లాడటంలో లిసా అనితరసాధ్యమైన అనుభవాన్ని గడించింది. ఆమె కేవలము ప్రేతాత్మలతోనేకాకుండా స్వర్గం మరియు నరకలోకాలలో ఉంటున్న ఆత్మలతోకూడా మాట్లాడగలదు. ఈమె అమెరికాలోని టెక్సాస్ రాష్ట్రంలో ఉన్న హూస్టన్ నగరంలో ఒక మాంత్రికుల సమాఖ్యను స్థాపించింది. ఈమె ప్రఖ్యాత వుడూ మంత్రగత్తె అయిన బియన్‌కావద్ద వుడూ తాంత్రిక విధానాలు నేర్చుకున్నది. బియన్‌కావద్ద ఈమె దాదాపు మూడు సంవత్సరాలపాటు అనేకరకాల

తాంత్రిక మంత్రాలను, ప్రేతాత్మలను ఆహ్వానించే విధానాల గురించి నేర్చుకున్నది. ఈమె జ్యోతిషశాస్త్రంలోకూడా అపారమైన జ్ఞానాన్ని కలిగి ఉన్నది.

ఎవరైనా వ్యక్తులు తమయొక్క మరణించిన బంధువుల ప్రేతాత్మలతో మాట్లాడాలి అనుకుంటే లిసాను కలుస్తారు. ఆమె తన మంత్రశక్తితో తనవద్దకు వచ్చిన వారికి సంబంధించిన ఆత్మలను ఆహ్వానించి ఆ ఆత్మలతో మాట్లాడుతుంది. కొన్నిసార్లు ప్రేతాత్మలయొక్క స్వరం ఆమెవద్దకు వచ్చినవారికి వినిపించటం జరుగుతుంది. ఏ ప్రేతాత్మ అయినా తనవద్దకు రావటానికి ఇష్టపడనట్లయితే ఆ ఆత్మను రప్పించటం తనకు సాధ్యంకాదని లిసా పేర్కొంటున్నది.

లిసాకు నాలుగు సంవత్సరాలు వయస్సు ఉన్నపుడు ఒకరోజు సాయంత్రం తమ ఇంటి పెరటిలో ఆడుకుంటూ ఉన్నది. ఆ సమయంలో లిసా ప్రక్కన ఉన్న పెంపుడుకుక్క లిసా ప్రక్కన ఎవరో ఉన్నట్టుగా భౌ, భౌ మని భయంతో మొరగటం జరిగింది. కుక్క మొరగటం విన్న లిసా తల్లి ఇంట్లోనుంచి పెరట్లోకివచ్చి చూడగా అక్కడ ఎవరో అదృశ్యవ్యక్తితో మాట్లాడుతూ ఉన్న లిసా కనిపించింది. ఆమె లిసావద్దకు వెళ్ళి "అక్కడ ఎవరూలేరు మరి నీవు ఎవరితో మాట్లాడుతున్నావు?" అన్నది. "నేను సారా అనే మన ప్రక్కింటి అమ్మాయితో మాట్లాడుతున్నాను" అన్నది లిసా. "నువ్వు పుట్టకముందే చనిపోయిన సారా ఇపుడు నీతో ఎలా మాట్లాడగలదు?" అన్నది ఆమె కూతురితో. సారా ప్రేతాత్మగామారి లిసాకిమాత్రమే కనిపిస్తున్నదని లిసా తల్లికి ఆ తరువాతకాలంలో అర్ధమయ్యింది. ఆవిధంగా లిసాకి చిన్నతనంనుండే ప్రేతాత్మలను చూడగలశక్తి అబ్బినట్టుగా గుర్తించాలి.

లిసా వద్దకు ఒక స్త్రీ వచ్చి తన అనుభవాన్ని ఇలా తెలియజేసింది. "మాకు వివాహం అయి ఏడు సంవత్సరాలు కావొస్తుంది. కానీ నా భర్త ఎన్నడూ నన్ను శృంగారపరంగా అంతగా తృప్తిపరచలేదు. అయితే ఈ నెలలో వరుసనే ఏడు రాత్రుల పాటు ఆయన నాకు స్వర్గం చూపించాడు. ఈ ఏడు రాత్రులు ఆయన్ని ఎవరో పురుషుడి ఆత్మ ఆవహించింది అని నేను గ్రహించాను. అయితే ఆ విషయం నా భర్తకి చెప్పలేదు".

ఎవరైనా స్త్రీలు ఇన్‌క్యుబస్ దాడులకు పదే పదే గురి అవుతున్నట్టుగా భావిస్తే వారు మొదటగా ఒక సైకియాట్రిస్టును సంప్రదించాల్సి ఉంటుంది. ఎందుకంటే మానసిక బలంలేని స్త్రీలపై ఇన్‌క్యుబస్‌యొక్క ప్రభావం అధికంగా ఉంటుంది. మానసిక వైద్యులు ఇచ్చే సూచనలు మరియు ఔషధాలు క్రమం తప్పకుండావాడి ఇన్‌క్యుబస్‌ను నిరోధించవచ్చు. అయితే కొన్నిసార్లు ఇన్‌క్యుబస్‌యొక్క ప్రభావం అధికమయినపుడు సైకియాట్రిస్టుల వలన సమస్య తీరదు. అలాంటపుడు తంత్రశాస్త్రంలో మంచి

అనుభవం ఉన్న పండితులను కలవాలి. ఎవరి మెడలో అయితే బ్లాక్ హాకీక్ రత్నం పొదిగిన లాకెట్ ఉంటుందో వారిపై స్వప్న పిశాచి (ఇన్‌క్యుబస్) దాడులు జరగవు అని నా పరిశోధనలో ఋజువు అయ్యింది. ఇంకొంతమందికి నిరంతరమూ పీడ కలలు వస్తూ ఉంటాయి. ఆ కలలు ఎంత దారుణంగా ఉంటాయంటే కొద్ది రోజులపాటు ఆ కలలు మనుషుల్ని పగటిపూటకూడా భయపెడుతూ ఉంటాయి.

ఇలాంటి పీడకలలు రావటానికి కొన్ని కారణాలు ఉన్నాయి. అవి ఏమిటంటే ఒక్కొక్కసారి మనకు కొందరు ఒక శవాన్ని ఊరేగింపుగా మోసుకుని శ్మశానానికి తీసుకువెళ్ళటం ఎదురవుతుంది. నిజానికి శవంగా వెళుతున్న వ్యక్తియొక్క ఆత్మ ఆ శవంచుట్టూ సంచరిస్తూ ఉంటుంది. అలాంటి సమయంలో ఎవరైనా మనిషి ఆ శవంకేసి అదేపనిగా చూసినట్లయితే శరీరంకోల్పోయి విలపిస్తున్న ఆ ఆత్మ తనని ఏకాగ్రతగా పరిశీలిస్తున్న మనిషిని ఆవహిస్తుంది. అయితే ఆ ఆత్మ మనిషిని పూర్తిగా ఆవహించని కారణంగా ఆవ్యక్తికి తరచుగా భయానకమైన పీడ కలలు రావటం జరుగుతుంది. ఒక దశ దాటిన తరువాత ఆ ఆత్మ పూర్తిగా ఆ మనిషిని తన స్వాధీనంలోకి తెచ్చుకోవటం జరుగుతుంది. ఆపై ఆ వ్యక్తి ప్రాణశక్తిని కోల్పోయి రోగగ్రస్తుడు కావటం ఆపై మరణించటం జరుగుతుంది.



# 4. ముస్లిం మతంలో అతీంద్రియ శక్తులు?

జిన్నులు తరచుగా జంతువుల రూపాలనుకూడా ధరించి మానవుల్ని భయపెట్టటం లేదా తప్పుదోవపట్టించటం జరుగుతూ ఉంటుంది. కొన్నిసార్లు జిన్నులు తామే స్వయంగా ఇతర జంతువులను ఆవహించి వాటిద్వారా విచిత్రమైన కార్యాలు చెయ్యటం జరుగుతుంది. అప్పుడప్పుడూ పందులు, కుక్కలు, కోతులు గుళ్ళచుట్టూ తిరిగి ప్రదక్షణాలు చెయ్యటం జరుగుతున్నట్టుగా మీడియాద్వారా తెలుస్తున్నది. జిన్నుల చేత ఆవహించబడిన జంతువులే అలా విచిత్రంగా ప్రవర్తిస్తాయని కొందరు ముస్లిం తాంత్రిక పండితులు తెలియజేస్తున్నారు. ప్రపంచ పిశాచ చరిత్రలో అతిభయంకరమైన జంతు పిశాచిగా పేరుపొందిన కాలశునకం (బ్లాక్‌డాక్) కూడా ఒక జిన్నే అని గ్రహించాలి. ఇలా జిన్నులచేత ఆవహించబడిన సర్పాలు, జంతువులు వాటి ప్రవర్తనకు

విభిన్నంగా ప్రవర్తించటంవల్ల అవి మహిమలు గలవి అని కొందరు మానవులు భావించి వాటికి పూజలు చెయ్యటం జరుగుతుంది. జంతువులకు, జిన్నులకు మధ్య భౌతికంగా కొన్ని పోలికలు ఉన్నాయి. ఆ కారణంగా జిన్నులను మనుషులు చూడలేరు కాని జంతువులు చూడగలవు. మహమ్మద్‌ప్రవక్త ఇచ్చిన సమాచారం ప్రకారం జిన్నులు మూడు రకాలుగా ఉంటాయి. కొన్ని రకాల జిన్నులు రెక్కలను కలిగిఉండి గాలిలో ఎగిరి పోగలవు. రెండవ రకం జిన్నులు సర్పాలు మరియు కుక్కల రూపంలో ఉంటాయి. మూడవరకం జిన్నులు కొంతసేపు విశ్రాంతికోసం ఆగి ఆపై పైలోకాలకు తమ ప్రయాణాన్ని కొనసాగిస్తాయి.


జిన్ను

రెక్కలుగల జిన్నులు, కొంగలు మరియు గ్రద్దల రూపంలో సంచరిస్తూ ఉంటాయి. ఇక సర్పములు మరియు కుక్కలరూపంలో ఉండే జిన్నులు నాలుగు కాళ్ళు గల జంతువుల రూపాలు ధరించి సంచరిస్తూ ఉంటాయి. ఇక కొందరు ప్రముఖ వ్యక్తులు చనిపోయిన తరువాత పైన చెప్పబడిన మూడవ రకం జిన్నులుగా మారి భూమిపై జరిగే అనేక సంఘటలకు కారకులు అవుతాయి. స్విట్జర్లాండ్‌లో క్రీస్తుపూర్వం 5వ శతాబ్దంలో దురాత్మలను తరిమివెయ్యటంకోసం ఆ దేశానికి చెందిన మత ప్రజలు కొన్ని విచిత్రమైన పద్ధతులను పాటించేవారు. ఒక తాంత్రిక పండితుడు ఎలుబంటి చర్మాన్ని ధరించగా ఆయన వెంట 12మంది శిష్యులు 12 రకాల జంతువుల చర్మాలను ధరించి భల్లూకనృత్యం (Bear dance) చేసేవారు. ఆ నృత్య ఫలితంగా క్షుద్రశక్తులు పారిపోతాయని వాళు భావించేవారు. ఆ తరువాతకాలంలో చైనా దేశానికి ఈ ఆచారం పాకింది. ఫలితంగా నేటి ఆధునిక చైనాలోకూడా చైనావారి నూతన సంవత్సరం రోజున చైనీయులు డ్రాగాన్‌లు మరియు సింహముల రూపములను ధరించి నృత్యాలు చెయ్యటం జరుగుతున్నది. ఇలా చెయ్యటంవల్ల ప్రేతాత్మలు దూరంగా పారిపోతాయని చైనీయులు భావిస్తారు.

మానవులు నగ్నంగా మరియు బోర్లా పడుకోకూడదని అలాచేస్తే సాతాన్ వారితో సంభోగం జరిపి వారికి వ్యాధులువచ్చేలా చేస్తాడని మహమ్మద్‌ప్రవక్త చెప్పారు. ఎవరి శరీరంలో అయినా జిన్నులు అనే ప్రేతాత్మ ప్రవేశించినపుడు వారిలో కొన్ని విచిత్రమైన మార్పులు వస్తాయి. ఆ మార్పులు ఎలా ఉంటాయి అంటే.....

1. శరీరం బలహీనం అయిపోతుంది. ఏవిధమైన కోర్కెలు మరియు ఉత్సాహం ఉండవు.

2. ఎప్పుడూ ఊహాలోకాల్లో ఉండటం, అకారణంగా నవ్వటం, తనలోతాను మాట్లాడుకోవటం జరుగుతుంది. అంతేకాక అకారణంగా అరవటంకాని, ఏడవటం కాని జరుగుతుంది.

3. దైవ సంబంధమైన వస్తువులను, ఆలయాలను, మసీదులను, చర్చిలను చూసినపుడు నాడి బలహీనంగా కొట్టుకోవటం, ఊపిరి సరిగా అందకపోవటం, ఒళ్లంతా హఠాత్తుగా చల్లబడటం లేదా వేడెక్కటం జరుగుతుంది.

4. నిద్రపోవటంలో సమస్యలు ఏర్పడటంకాని, విపరీతంగా నిద్రపోవటంకాని జరుగుతుంది. నిద్రపోతున్నపుడు అసభ్యకరమైన పదాలను ఉచ్ఛరించటం జరుగుతుంది. తరచుగా పీడకలలు రావటం జరుగుతుంది. ముఖ్యంగా ఎత్తైన ప్రదేశాల నుండి కిందపడిపోతున్నట్టుగా కలలు వస్తాయి.

5. కుక్కలు, పిల్లులు, సింహాలు, తోడేళ్ళు, సర్పాలు లాంటి జంతువులు తమ మీదకు దాడిచేస్తున్నట్టుగా కలలు వస్తాయి.

దయ్యం పట్టటం లేదా జిన్ను ఆవహించటం వల్ల మనిషికి తన మేధస్సుపైన నియంత్రణపోతుంది. ఫలితంగా ఆ మనిషి తనను ఆవహించిన శక్తియొక్క ఆజ్ఞకు అనుగుణంగా ప్రవర్తించటం జరుగుతుంది.

జిన్నులు మానవుల్ని స్పష్టంగా చూడలేవు. వాటికళ్ళకు మానవులు మసకమసకగా కనిపిస్తారు. మనిషియొక్క కర్బన ఆధారిత దేహంలో ఉండే మెదడు కోట్లకొద్దీ సంఖ్యలో ఉన్న న్యూరాన్లతో తయారయ్యింది. ఇక జిన్నులయొక్క ప్లాస్మా ఆధారిత శరీరాలలో ప్లాస్మా లిక్విడ్ క్రిస్టల్‌తో తయారయిన హోలోగ్రాఫిక్ మెమరీసిస్టమ్‌లు కూడిన మెదడులు ఉంటాయని భావించవచ్చు.

జిన్నులు తమకు అపకారం చేసిన మానవులపై పగబట్టే స్వభావాన్ని కలిగి ఉంటాయి. తెలిసికాని, తెలియకకాని జిన్నులకి అపకారం చేసినా, జిన్నులు

చనిపోవటానికి కారణమైనా అందుకు కారణమైనవారికి అనేక అశుభ సంఘటనలు ఎదురవుతాయి. ఎవరి ఇంట్లో అయినా ఒక నల్లత్రాచుపాము కనిపించినట్లయితే ఆ ఇంటివారు మూడు రోజులపాటు ఆ పామును కొట్టకుండా వేచి ఉండాలని మహమ్మద్ ప్రవక్త చెప్పటం జరిగింది. ఆయన అభిప్రాయం ప్రకారం ఒక నల్లత్రాచు ఒక ఇంట్లో మూడు రోజులపాటు మాత్రమే ఉంటే అది మారురూపంలో ఉన్న జిన్ను అని గుర్తించాలని, మూడు రోజులకు మించి ఇంట్లో ఉంటే అది మామూలు త్రాచుపాము అని గుర్తించి దానిని చంపివేయవచ్చని తెలుస్తున్నది.

జిన్నులు కూడా మానవులు లాగే ఏదో ఒకరోజున మరణిస్తాయి. అయితే అవి కొన్ని వందల సంవత్సరాల ఆయుర్దాయాన్ని కలిగి ఉంటాయి. ఖురాన్‌లో చెప్పబడిన సమాచారం ప్రకారం జిన్నులు, మాంసాన్ని, ఎముకలను మరియు జంతువుల యొక్క పేడను ఆహారంగా తీసుకుంటాయని తెలుస్తున్నది. జిన్నులు సాధారణంగా ఏ ప్రదేశంలో అయినా ఉండటానికి అవకాశం ఉన్నప్పటికీ అవి నిర్మానుష్యంగా ఉండే ఎడారులలో, భవన శిధిలాలలో, కొండ గుహలలో మరియు సొరంగాలలో ఉండటానికి ఎక్కువగా ఇష్టపడతాయి. అంతేకాకుండా శ్మశానాలలోను, పెంటపోగులమీద, మరుగు దొడ్లలోను, ఒంటెలు గడ్డిమేసే ప్రదేశాలలోను జిన్నులు ఉంటాయని చెబుతూ ఉంటారు. ముస్లిం సాంప్రదాయం ప్రకారం మార్కెట్లలలోకూడా జిన్నులు ఉంటాయి. అందువలన ఎవరు మార్కెట్లో ముందుగా ప్రవేశించకూడదని, అందరికన్నా చివరగా బయటకు రాకూడదని గ్రహించాలి.

జిన్నులను ఇతరులపైకి ప్రయోగించేవారు కొన్ని వివరాలను తీసుకుంటారు. ఎవరిపైకి అయితే జిన్నుని పంపించాలో ఆ వ్యక్తియొక్క గోళ్ళు లేదా వెంట్రుకలు లేదా ఆ వ్యక్తి నడిచిన నేలలోని మట్టి లేదా అతని ఫోటో లేదా అతని చెమటతో తడిసిన వస్త్రాన్ని తీసుకుని వాటిని తాంత్రిక పూజలో ఉంచి ఆపై జిన్నుకి వాటిని చూపించి ఆపై ఆ వస్తువు తాలీకు మనిషిని పీడించమని పంపించటం జరుగుతుంది. ఒక వ్యక్తిపై చేతబడి ద్వారా జిన్నుని ప్రయోగించినపుడు అది కొన్ని గంటలపాటు లేదా రోజులపాటు అతన్ని వెంటాడి ఒక అనుకూల సమయంలో అనగా ఆ వ్యక్తి అపవిత్రంగా ఉన్న సమయంలో (విపరీతమైన కోపంతోకాని/భయంతోకాని లేదా విపరీతమైన కామోద్రేకంతో ఒక స్త్రీతో సంభోగం జరుగుతున్నపుడుకాని) అతనిని ఆవహిస్తుంది. ఆ తరువాత అతడిని అనేక రకాలుగా పీడించి చంపివేస్తుంది.

జిన్నులను ఉపయోగించి ఇతరులపై చేతబడులుచేసేవారు కొన్నిసార్లు గుడ్లగూబను చంపి దాని రక్తాన్ని ఉపయోగించి శత్రువులకి పిచ్చిపట్టేటట్టు తాంత్రిక ప్రక్రియ జరుపుతారు. ఒక విషయం ఏమంటే అపవిత్రమైన జంతువుగా చెప్పబడే

గుడ్లగూబను సైతాన్‌కి ప్రతీకగా భావిస్తారు. అందువలన చేతబడులలో గుడ్లగూబ ఎముకలు మరియు కళ్ళుకూడా ఉపయోగించి శత్రువుకి వివిధ రకాలుగా హాని చెయ్యటం జరుగుతుంది. శత్రువుయొక్క లాలాజలాన్ని మరియు వీర్యాన్ని ఉపయోగించి శత్రువుపై ప్రయోగంచేస్తే అతడు నపుంసకుడిగామారి భార్యకుదూరంగా ఉండిపోవాల్సి వస్తుంది. ఒక తాంత్రిక విధానంలో ఒక స్త్రీ తన బహిష్టు రక్తాన్ని కొన్నిచుక్కలు సేకరించి దానిని ఏదైనా ఎరుపురంగు జ్యూస్‌లోకాని, మద్యంలోకాని కలిపి ఒక పురుషుడికి తాగిస్తే అతడు ఎల్లకాలమూ ఆమెకు విధేయుడిగా ఉండిపోతాడు. జిన్నులను ఉపయోగించే తాంత్రికులు ఇలాంటి వశీకరణ విధానాలను తమ ఖాతాదారులకు బోధిస్తారని తెలుస్తున్నది.

ఒక ముస్లిం తాంత్రికుడు ఆడ జిన్నుల్ని ఆహ్వానించటానికి ఒక విధానం ఉన్నదని తెలియజేసాడు. అది ఎలాగంటే

మొదట ఒక నల్లకోడిపెట్టయొక్క నరికిన తలను, పచ్చిబఠాణీలను గోలీకాయ సైజులో ఉండే బెల్లంపాకం ఉండలను సిద్ధం చేసుకోవాలి. ఆ తరువాత మధ్యాహ్నం 12 గంటల ప్రాంతంలో ఒక బావి వద్దకువెళ్ళి కోడిపెట్ట తలను ఎడంచేత్తో పట్టుకుని నోటికి దగ్గరగా పెట్టుకుని ఈ క్రింద మంత్రాన్ని 200 సార్లు జపించాలి.

"ఏ అమల్ లాయే గౌల్ బాష్"

ఆ తరువాత అదేరాత్రి 11 గంటల సమయంలో ఆ నల్లకోడిపెట్టయొక్క తలను బావిలోకి విసరివెయ్యాలి. ఆ తరువాత కొన్ని బెల్లంపాకం ఉండల్ని తీసుకోవాలి. ఆ తరువాత ఒక్కొక్క బెల్లం ఉండని ముఖానికి దగ్గరలో పెట్టుకుని ఈ క్రింద మంత్రాన్ని 21సార్లు చదవాలి.

"ఆతే నొమాందే గౌల్ పోష్ హెు"

ఈ మంత్రాన్ని చదువుతూ 21 బెల్లపు ఉండల్ని బావిలోకి విసరాలి. ఆ తరువాత 360సార్లు ఆ మంత్రాన్ని ప్రతిరాత్రి చదవాలి. (మొదటి రోజు మాత్రమే కోడి తలను పూజలో ఉపయోగించాలి. ఆ తరువాత మధ్యాహ్న పూజలు అవసరంలేదు. రాత్రి పూజలు మాత్రమే చేయవలసి ఉంటుంది) ఈ ప్రక్రియను 40 రోజులు చేసినట్లయితే 41వ రోజున ఆ బావి నుండి జిన్ పిశాచి బయటకువచ్చి కోరిన కోర్కెలు తీరుస్తుంది.



# 5. మలేషియాలో మంత్రగాళ్ళు మరియు ప్రేతాత్మలు?

బౌద్ధమతం మరియు ఇస్లాం మతం ప్రముఖంగా కనిపించే దేశమే మలేషియా. మలేషియాదేశ మత విశ్వాసాలలో మంత్ర, తంత్రాలకు మరియు భూత ప్రేతాలకు ప్రముఖమైన స్థానం ఉన్నది. చనిపోయిన తరువాత మనిషియొక్క ఆత్మ ప్రేతాత్మగా మారి మానవుల్ని హింసిస్తుందని మలేషియా దేశస్తులు నమ్ముతారు. మలేషియన్ భాషలో **హంటూ** అంటే ప్రేతాత్మ లేదా క్షుద్రశక్తి అనిఅర్థం. ఆదేశంలో ప్రేతాత్మలు ఎన్నిరకాలుగా ఉంటాయో క్లుప్తంగా తెలుసుకుందాం.

**1. సెప్‌లోస్ :** ఈరకమైన పిశాచి చిన్నవయస్సుది అయి ఉంటుంది. ఇది తన యజమానిని చేతబడినుండి, పిశాచాలబారి నుండి కాపాడుతూ ఉంటుందని అక్కడ ప్రజలు నమ్ముతారు. ఒకవిధమైన తాంత్రిక ప్రక్రియద్వారా ఈవిధమైన పిశాచాలను తమ రక్షణకోసం అక్కడవారు ఏర్పాటుచేసుకుంటారు.

**2. హంటూఎయిర్ :** నీటి భూతం అని పిలువబడే ఈ హంటూఎయిర్‌ని సముద్రపిశాచి అనికూడా పిలుస్తారు. నదులలో, సరస్సులలో, సముద్రాలలో ఇవి నివసిస్తూ ఉంటాయి. కొన్నిసార్లు నీటిలో మునిగి చనిపోయిన మానవులు నీటి భూతాలుగా మారటం జరుగుతుంది. కొన్నిసార్లు నీటిభూతాలు స్వయంగా ఆవిర్భ విస్తాయి. ఈ భూతాలు సముద్రజలాలపై లేదా నదీజలాలపై కొయ్యదుంగల రూపాలలో తేలుతూ కనిపిస్తాయి. అతి ప్రమాదకరమైన ఈ భూతాలు నీటిలోకి వచ్చిన మానవుల్ని ముంచటంకాని లేదా చంపి తినివేయటంకాని జరుగుతుంది.

**3. పొకాంగ్ :** ఒక నిలువెత్తు ముసుగులో దాగిఉండే ఈ పిశాచి పసిపిల్లలయొక్క రక్తాన్ని తాగి జీవిస్తుందని భావిస్తారు.

**4. హంటూగలాహ్ :** సన్నగా, పొడవుగా కనిపించే ఈ పిశాచాన్ని హంటూ గలాహ్ (స్తంభాకార పిశాచి) అని పిలుస్తారు. దట్టమైన చెట్లలోను, వెదురుచెట్లలోను ఈ పిశాచాలు నివసిస్తూ ఉంటాయి. సాధారణంగా ఈ పిశాచాలు ఆడపిశాచాలు అయి ఉంటాయి. ఈ పిశాచం ఎవరిముందైనా ప్రత్యక్షం అయినట్లయితే వారు తమ

చేతిలోకి ఒక పుల్లనుకాని, కొమ్మనుకాని తీసుకుని రెండుగా విరిచినట్లయితే ఈ పిశాచం భయపడి అక్కడనుండి అదృశ్యం అయిపోతుంది.

**5. హారిమౌఅక్కువునా :** సగం మనిషి, సగం పులిరూపంలో ఉండే పిశాచి ఇది. సాధారణంగా ఇది మగపిశాచి అయి ఉంటుంది.

**6. జంగ్‌లాట్ :** మలేషియా మరియు ఇండోనేషియా అడవులలో సంచరించే ఒక ఆటబొమ్మ సైజులో ఉండే ఒకరకం రక్తపిశాచిని జంగ్‌లాట్ అని పిలుస్తారు. ఇవి జంతువులా లేక పిశాచాలా అన్న విషయం ఇప్పటివరకు తేలలేదు. ఎందుకంటే కొందరు తమకు అడవిలో దొరికాయి అనిచెప్పి చనిపోయిన జంగ్‌లాట్స్‌ని అమ్మకానికి పెడతారు. కానీ అవి నకిలీవి అని అనుభవజ్ఞులకు తెలుస్తుంది. ఈ పిశాచాలు స్త్రీ జాతికి చెంది ఉంటాయి.

**7. వరాంగ్‌బునియన్ :** ఈ మాటకు అర్థం ఈలలువేసే జనాలు అని. ఈ పిశాచాలు అడవులలో ప్రయాణిస్తున్న మానవుల్ని తప్పుదోవపట్టించి ఏడిపిస్తాయి. కొన్నిసార్లు ఇవి మానవులకి సహకారాన్నికూడా అందిస్తాయి. వీటిలో స్త్రీ పిశాచాలు కొన్నిసార్లు మానవ పురుషుల్ని వివాహం చేసుకున్నట్టుగా తెలుస్తున్నది. ఈ పిశాచాలను వివాహం చేసుకున్న మానవ పురుషులుకూడా ఇతర మానవుల కళ్ళకు కనపడకుండా అదృశ్యం అయిపోతారని మలేషియన్ ప్రజలు చెబుతూ ఉంటారు.

**8. ఒరాంగ్‌మిన్‌యక్ :** ఒరాంగ్‌మిన్‌యక్ అంటే "ఒళ్ళంతా నూనె పూసుకున్నవాడు" అని అర్థం. మానవాతీత శక్తులు ఉండే పిశాచంలాంటి ఈ మానవుడు జనావాసాలపై దాడిచేసి తన కంటికి కనిపించిన కన్యలను బలవంతంగా అనుభవిస్తాడు. ఈ ఒరాంగ్‌మిన్‌యక్ అనే పిశాచి చేసిన దుర్మార్గాల ఆధారంగా మలేషియా మరియు ఇండోనేషియా దేశాలలో అనేక చలన చిత్రాలు నిర్మించబడ్డాయి.

పైన పేర్కొన్న 8 రకాల పిశాచాలే కాకుండా మలేషియా మరియు ఇండోనేషియా దేశాలలో మూడు ప్రముఖమైన పిశాచాలుకూడా ఉన్నట్టుగా తెలుస్తున్నది. వాటి వివరాలు ఇలా ఉన్నాయి.

**1. పోంటియానక్ :** మలేషియాదేశంలో రక్తంతాగే ఆడపిశాచిని పోంటియానక్ అని పిలుస్తారు. సాధారణంగా గర్భవతిగా ఉన్న లేదా ప్రసవిస్తున్న స్త్రీ మరణించి నట్లయితే అతి ప్రమాదకరమైన స్వభావంగల పోంటియానక్‌గా మారుతుందని

తెలుస్తున్నది. కొన్నిసార్లు తాము ప్రేమించినవారిచేతకాని, తమభర్తలచేతకాని కొందరు స్త్రీలు హత్యచేయబడతారు. అలాంటి స్త్రీలయొక్క ఆత్మలుకూడా పోంటియానక్‌లుగా మారతాయి. సాధారణంగా ఈ పిశాచులు నిర్మానుష్యమైన రోడ్ల ప్రక్కనకాని, చెట్ల క్రిందకాని నిలబడి కనిపిస్తాయి. కొన్నిసార్లు తమతోపాటుగా ఒకచిన్న బిడ్డను ప్రక్కన ఉంచుకుని కనిపిస్తాయి. నిరంతరం పగ, ప్రతీకారాలతో దహించుకుపోయే ఈ రక్త పిశాచి అందమైన యువతిరూపం ధరించి పురుషుల్ని ఆకర్షించి జన సంచారంలేని చోటుకు తీసుకుపోయి అక్కడ వారినిచంపి వాళ్ళ నెత్తురు తాగివేస్తుంది. కొన్నిసార్లు ఈ రక్తపిశాచులు అందమైన యువతుల రూపంలో కనిపించినపుడు పురుషులు వారి వద్దకు వెళ్ళటం జరుగుతుంది.



పోంటియానక్

వారు తమవద్దకు రాగానే ఆ యువతలు వికృతమైన వృద్ధ స్త్రీలుగా మారిపోతారు. ఆ తరువాత తమ నోటిలోని పొడవైన మరియు పదునైన దంతాలతో తమవద్దకు వచ్చిన పురుషుల్ని చీల్చి చంపేస్తారు. ఈరకమైన పిశాచాల్ని సంహరించాలంటే ఈ పిశాచాల గొంతులో ఒక పొడవాటి ఇనుపమేకును పూర్తిగా దింపాల్సి ఉంటుంది. అయితే ఎప్పుడైనా, ఎవరైనా, పొరపాటున ఆ చనిపోయిన రక్తపిశాచి గొంతులోనుండి ఇనుపమేకును బయటకు లాగివేసినట్లయితే అది మరల ప్రాణంపోసుకుని మానవులపై దాడిచెయ్యటం ప్రారంభిస్తుంది. ఈ రక్తపిశాచి, రక్తం మరకలతో కూడిన తెల్లటి దుస్తుల్ని ధరించి ఉంటుందని, దీనికి పొడవైన జుట్టు, కోరలు మరియు గోళ్ళు

ఉంటాయని మలేషియన్ తంత్రగాళ్ళు తెలియజేస్తున్నారు. ఈ పిశాచి మానవుని దగ్గరకు వచ్చినపుడు ఘాటైన పువ్వుల వాసన వస్తుంది.

మలేషియా, ఇండోనేషియా దేశాలలో తరచుగా కనపడుతుంది అని చెప్పబడే పోంటియానక్ అనే రక్తపిశాచి అర్ధరాత్రి సమయాలలో అందమైన యువతిరూపాన్ని ధరించి రహదారిమీద నిలబడి అటువైపు వాహనాలపై వచ్చే పురుషుల్ని ఆపి వారిని ఒక పొదచాటుకి తీసుకువెళ్ళిచంపి నెత్తురుతాగుతుంది. ప్రసవ సమయంలో కలిగే బాధను భరించలేక మరణించిన స్త్రీలు పోంటియానక్‌గా మారుతారని మలేషియన్లు భావిస్తారు. సాధారణంగా పోంటియానక్, పురుషులనే తమ లక్ష్యంగా చేసుకుంటాయి. అయితే కొన్నిసార్లు ఇవి గర్భవతులుగా ఉన్న స్త్రీలను మరియు ప్రసవిస్తున్న స్త్రీలను బాధించాలన్న లక్ష్యంతో వాళ్ళ గర్భస్థశిశువులను చంపి తినివేయటం జరుగుతుంది. కొంతమంది అభిప్రాయం ప్రకారం ప్రసవ సమయంలో మరణించిన స్త్రీలయొక్క ఆత్మలు, ఇతర స్త్రీలకుకూడా పిల్లలులేకుండా చెయ్యాలన్నా అసూయతో వాళ్ళకు పుట్టబోయే బిడ్డల్ని పొంటియానక్‌లు చంపుతూ ఉంటాయని తెలుస్తున్నది. సాధారణంగా ఎవరైనా పురుషుని వద్దకు ఈ పొంటియానక్ అనే రక్తపిశాచి స్త్రీరూపంలో వచ్చినపుడు ఆ స్త్రీ దగ్గర నుండి మత్తెక్కించే పూల వాసన వస్తుందని కొందరు చెబుతున్నారు.

సాధారణంగా పోంటియానక్ మనుషులకు దూరంగా ఉన్నపుడు దాని ఏడుపు బిగ్గరగా వినిపిస్తుంది. దగ్గరవుతున్నపుడు దాని ఏడుపు సన్నగా ఉంటుంది. పోంటియానక్ దగ్గరగా వస్తున్న సమయంలో మానవుల ప్రక్కన ఉండే కుక్కలు భీకర స్వరంతో రోదించటం జరుగుతుంది. మానవ స్త్రీరూపంలో ఉండే పోంటియానక్‌ని మనుషులు గుర్తించలేరుకాని, కుక్కలు గుర్తిస్తాయి. మెడనుండి పాదాలవరకు ఒక తెల్లటి గౌను ధరించినట్టుగా కనిపించే పోంటియాన్‌లకి పాదాలు ఉండవు. అవి ఎల్లప్పుడూ గాలిలో తేలుతూ ఉంటాయి. కొంతమంది అభిప్రాయం ప్రకారం పోంటియానక్‌లు ఇళ్ళ బయట దండాలపై ఆరవేసిన బట్టల్ని వాసనచూసి ఆపై తాము ఎన్నుకున్న బట్టలను ధరించే పురుషుడిని లేదా స్త్రీని చంపటం జరుగుతుంది. కనుక మలేషియాలోని ప్రజలు రాత్రి సమయాలలో తమ వస్త్రాలను ఇంటి బయట ఆరవేయటానికి పొరపాటున కూడా ఇష్టపడరు. పగటి సమయాలలో ఈ రక్తపిశాచాలు అరటిచెట్లలలో దాగి ఉంటాయని తెలుస్తున్నది. కొన్నిసార్లు పోంటియానక్‌లు ఒక స్త్రీరూపం ధరించి తమతోపాటుగా ఒక చిన్నపిల్లని ఉంచుకుని మార్గమధ్యంలో అర్ధరాత్రి సమయంలో మానవులకు కనిపిస్తాయని మలేషియన్ ప్రజలు

తెలియజేస్తున్నారు. ఈ ఫోటోలో మార్గమధ్యంలో కారు చెడిపోవటంతో కారుముందు రోడ్డుమీద కూర్చుండిపోయిన వ్యక్తికి ఎదురుగా కొంచెం దూరంలో ఒక పిల్లను ప్రక్కన పెట్టుకుని నుంచుని ఉన్న పోంటియానక్‌ను చూడవచ్చు. దాదాపు 30 సంవత్సరాల క్రితం తీయబడిన యదార్థమైన ఫోటో ఇది.



పోంటియానక్

ప్రపంచంలో ముస్లింలు అధికంగా ఉన్న దేశం ఇండోనేషియా. ఈ దేశంలో ఉండే రక్త పిశాచిని కుంటిలానక్ అని పిలుస్తారు. (మలేషియా మరియు ఇండోనేషియాలో దాదాపు ఒకేరకమైన లక్షణాలు లేదా పేర్లుగల పిశాచాలు ఉన్నాయి.) ఈ కుంటిలానక్ అనే స్త్రీ పిశాచి ఒక పక్షిరూపం ధరించి కన్యలయొక్క మరియు స్త్రీలయొక్క రక్తాన్ని పీల్చివేస్తుంది.

ఈ కుంటిలానక్, స్త్రీ రూపంలో ఉన్నపుడు ఎవరైనా పురుషుడు ఆమెవద్దకు వెళ్ళినట్లయితే ఆమె హఠాత్తుగా తన వీపును ఆ పురుషుడికి చూపిస్తూ అటువైపుకి తిరిగిపోతుంది. డొల్లగా ఉండే ఆమె వీపునుచూసిన ఆ పురుషుడు భయంతో గుండె ఆగిచావటం ఖాయం. ఈ పిశాచి పక్షిరూపంలో ఉన్నపుడు కి-కి-కి అని అరుస్తూ గాలిలో ఎగురుతూ ఉంటుంది. కొంతమంది మంత్రగాళ్ళు చేతబడి ద్వారా ఈ కుంటిలానక్‌ను స్త్రీలపై ప్రయోగిస్తారు. ఫలితంగా ఆ స్త్రీలకు ఎడతెరపిలేకుండా యోనిద్వారా రక్తస్రావం జరుగుతూ ఉంటుంది.

**2. పెనాన్‌గ్గలన్ :** ఈ ఆడపిశాచి కొత్తగాపుట్టిన బిడ్డలయొక్క రక్తాన్ని ఇష్టపడుతుంది. తల నుండి వేలాడుతున్న పేగులతో ఈ పిశాచి మానవులకు కనిపిస్తుంది. ఈ పిశాచి ఎలాపుట్టింది అన్న అంశానికి సంబంధించి అనేక కథనాలు మలేషియాలో ప్రచారంలో ఉన్నాయి. అందులో ఒక కథనం ప్రకారం ఒకప్పుడు ఒక స్త్రీ అడవిలో కూర్చుని తపస్సు చేస్తూ ఉండేది. ఆమె అప్పుడప్పుడూ ఒక చెక్క గిన్నెలో వెనిగార్‌ని తయారుచేస్తూ ఉండేది. ఒకసారి ఆమె వెనిగార్‌ని తయారు చేస్తున్నపుడు ఉలిక్కిపడింది. ఫలితంగా ఆమెతల శరీరంనుండి వేరై శరీరంలోని పేగులను తనతోపాటు తీసుకుని గాలిలో ఎగిరింది. ఇంకొక కథనం ప్రకారం చూస్తే ఒక స్త్రీ రాత్రి సమయంలో నిద్రిస్తున్నపుడు ఆమె తల మరియు పేగులు ఆమె శరీరాన్ని వదలి బయటకు వెళ్ళిపోయేవి. ఆ తరువాత ఆమె తన మరణానంతరము పెనాన్‌గ్గలన్‌గా మారింది.



మలేషియాలో ఎవరైనా గృహస్తులు తమ ఇంట్లో ఒకబిడ్డ అతి త్వరలో పుట్ట బోతున్నట్లయితే తమ ఇంటి తలుపులకి లేదా కిటికీలకి ముళ్ళకొమ్మలు వేలాడదీస్తారు. అందుకు కారణం ఏమంటే బిడ్డలు పుట్టిన తరువాత వాళ్ళ నెత్తురు తాగాలని ఆ ఇంట్లోకి ప్రవేశించాలని ప్రయత్నించే పెనాన్‌గ్గలన్‌యొక్క పేగులు ఆ ముళ్ళలో చిక్కుకుని పోయి ఆ పిశాచి ఇంటిలోకి ప్రవేశించలేదు. ఇంకొక ఆగ్నేయ ఆసియాదేశమైన ఫిలిప్పైన్స్‌లో మనాన్‌గ్గలన్ అనే రక్తపిశాచికూడా మలేషియా రక్తపిశాచి అయిన పెనాన్‌గ్గలన్ లాంటి రూపురేఖలను మరియు లక్షణాలను కలిగి ఉండటం విశేషం. అయితే ఈ మనాన్‌గ్గలన్ రక్తపిశాచి తన శరీరం పైభాగాన్ని మరియు కిందభాగాన్ని రెండు భాగాలుగా విడదీసి రాత్రి సమయాలలో గబ్బిలంలాగా రెక్కలనుపొంది గాలిలో ఎగురుతూవెళ్ళి జంతువులయొక్క మరియు మానవులయొక్క రక్తం పీలుస్తుంది.

ముఖ్యంగా గర్భిణీ స్త్రీలు ఉన్న గృహాలపై దాడిచేసి వారి రక్తాన్ని పొడవుగా బయటకు వేలాడే తన నాలుకతో పీల్చివేస్తుంది. థాయ్‌లాండ్‌లోకూడా ఈరకమైన రక్తపిశాచి ఉన్నట్లుగా తెలుస్తున్నది. థాయ్‌భాషలో దీనిని క్రాస్‌యు అని పిలుస్తారు.

**3. హంటూబజాంగ్ :** ఈ క్షుద్రశక్తి రాత్రి సమయాలలో నక్క లేదా జంగుపిల్లి రూపం ధరించి గర్భిణీ స్త్రీల గర్భాలలో ఉన్న పిండాల(Fetuses)ను తినివేస్తుంది మరియు బిడ్డలకు పాలిస్తున్న తల్లులయొక్క చనుబాలను త్రాగివేస్తుంది. ఈ పిశాచాన్ని **హంటూకోపెక్** (Nipple gost) అనేపేరుతోకూడా పిలవటం జరుగుతుంది. ఈ పిశాచి వదులుగా ఉండి వ్రేలాడుతున్న స్థలములుగల వృద్ధ స్త్రీ రూపం ధరించి మానవులకు కనిపిస్తుంది.

పసిబిడ్డలు ఇళ్ళలో ఉన్నవాళ్ళు ఆ బిడ్డల ప్రక్కన కత్తెర, కత్తి లాంటి పదునైన వస్తువులను ఉంచినట్లయితే ఈ బజాంగ్ అనే స్త్రీ పిశాచి బారినుండి రక్షణ కలుగుతుందని మలేషియా ప్రజలు విశ్వసిస్తున్నారు.

**మలేషియాదేశంలో మంత్రగాళ్ళు :**మలేషియాదేశంలో అనేక తాంత్రిక విద్యలను తెలిసి ఉన్న వందలకొద్ది మంత్రగాళ్ళు ఉన్నారు. మలేషియన్ భాషలో చేతబడులు చేసే వ్యక్తిని **బామో** అని పిలుస్తారు. వీళ్ళు అపారమైన తాంత్రిక సాధనచేసి కొన్నిరకాల పిశాచాలను తమ ఆధీనంలో ఉంచుకుని ఆ తరువాత అవసరమైనపుడు చేతబడి ద్వారా ఈ పిశాచాలను ఇతరులపై ప్రయోగించి వారికి అనేక రకాల కష్టనష్టాలను కలిగిస్తారు. ఇక్కడ మలేషియాదేశంలో ఉండే మంత్రగాడిని మనం చూడవచ్చు.



ఈ మంత్రగాళ్ళు కేవలం చేతబళ్ళు చేయటమే కాకుండా చేతబడులను తిరగ్గొట్టటం మరియు పిశాచాల బారినుండి రక్షణ పొందటంకోసం రకరకాల తావీదులను ఇవ్వటం చేస్తూ ఉంటారు. ఈ మలేషియన్ మంత్రగాళ్ళు నాలుగురకాలైన

పిశాచాలను తమ ఆధీనంలో ఉంచుకుని వాటిని శత్రువులపైకి ప్రయోగిస్తూ ఉంటారు. వాటి వివరాలు ఇలా ఉన్నాయి.

**1. పొలాంగ్ :** అత్యంత ప్రమాదకరమైన క్షుద్రశక్తిగా భావించబడే ఈ క్షుద్రశక్తిని నిద్రలేపటానికి మంత్రగాళ్ళు, హత్యచేయబడిన వ్యక్తి శరీరం నుండి సేకరించిన రక్తాన్ని తీసుకువచ్చి ఒక సీసాలోపోసి వారం లేదా రెండు వారాలపాటు నిలువ ఉంచుతారు. ఆ తరువాత వివిధ రకాల మంత్రాలతో ఆ రక్తాన్ని ఉపయోగించి పొలాంగ్ అనే భయంకర పిశాచిని ఆవాహనచేసుకుని దానిని శత్రువులపైకి ప్రయోగిస్తారు. ఈ పిశాచిని అదుపులో ఉంచుకున్న మాంత్రికుడు ప్రతిరోజూ రాత్రిసమయంలో తన బొటన వ్రేలినుండి రక్తాన్ని తీసి పొలాంగ్‌కి ఆహారంగా ఇవ్వాల్సి ఉంటుంది.

**2. పెలేసిట్ :** పుట్టిట్లోనే మరణించిన పసిబిడ్డ నోటిలోని నాలుకను కత్తిరించి దానిని ఒక సీసాలో కొద్దిరోజులపాటు నిల్వ ఉంచి ఆ తరువాత ఈ పెలేసిట్ అనే క్షుద్రపిశాచిని ఆ నాలుక సహాయంతో అనేక క్షుద్ర మంత్రాలను ఉపయోగించి నిద్ర లేపుతారు. ఈ పిశాచి ఈగ లేదా కీచురాయి రూపంలో క్షుద్రప్రయోగం చేయబడిన వారి ఇళ్ళలో ప్రవేశిస్తుంది. ఇది ఎవరి ఇంట్లో ప్రవేశిస్తుందో వారి ఇంట్లో అనూహ్యమైన చెడు సంఘటనలు జరుగుతాయి. సాధారణంగా పొలాంగ్ అనే పిశాచిని శత్రువులపైకి ప్రయోగించటానికి ముందు పెలేసిట్‌ని ప్రయోగించటం జరుగుతుంది. ఈ పెలేసిట్ మానవుల శరీరంమీద ఉండే గాయాలలోని రక్తాన్ని తాగుతుంది. కొన్నిసార్లు ఈ రెండు రకాల పిశాచాల్ని తిరగ్గొట్టాలి అనుకున్నప్పుడు కొన్ని మంత్రాలను ఉపయోగించి ఈ రెండు పిశాచాలను ప్రయోగించింది ఎవరు? అన్న విషయాన్ని ఆ పిశాచాల ద్వారానే మంత్రగాళ్ళు తెలుసుకోవటం జరుగుతుంది.

**3. టోయల్ :** ఒక స్త్రీ గర్భంలో చనిపోయిన పిండాన్ని కొన్నిరకాల తాంత్రిక ప్రక్రియలు ఉపయోగించి టోయల్ అనే పిశాచిగా మారుస్తారు. ఈ పిశాచాలను ఎవరైతే తమ ఆధీనంలోకి తెచ్చుకుంటారో వాళ్ళవెంట ఈ పిశాచాలు నడుస్తూ వెళతాయి. రెండు సంవత్సరాల పిల్లవాడు ఎంత పరిమాణంలో ఉంటాడో అంత పరిమాణంలో ఉండే ఈ టోయల్ పిశాచాలు పెద్ద తలతో, చిన్న చేతులతో మసక మసకగా కనపడే కళ్ళతో నగ్నంగా ఉంటాయి. ఎలాంటి మంత్రాల సహాయం లేకుండానే కొన్నిసార్లు ఈ టోయల్ పిశాచాలు ఇతర మానవులకు కనిపించటం జరుగుతుంది. ఈ పిశాచాలను తమ ఆధీనంలో ఉంచుకున్నవారు వీటికి రోజూ కోడిపుంజుయొక్క రక్తాన్ని మరియు యజమానియొక్క బొటనవేలునుండి తీసిన రక్తాన్ని ఆహారంగా ఇవ్వాలని తాంత్రికులు తెలియజేస్తున్నారు.

కొంతమంది అభిప్రాయం ప్రకారం మాంత్రికుడి నుండి అంటే బామో నుండి కొందరు వ్యక్తులు ఈ టోయల్ పిశాచాలను కొని ఇతరులను హింసించటానికి ఉపయోగించుకుంటారని తెలుస్తున్నది. చిన్నపిల్లల పరిమాణంలో ఉండే ఈ పిశాచాలు చిన్నపిల్లల మనస్తత్వాన్ని కలిగి ఉంటాయని, వాటి బారినుండి తప్పించుకోవటానికి నేలపైన బఠానీలనుకాని, చాక్లెట్లనుకాని విసిరినట్లయితే అవి వాటిని ఏరుకోవటంలో తమ దృష్టిని కేంద్రీకరించి మానవుల్ని పీడించటం మాని వేస్తాయి. కొన్నిసార్లు కొందరుపట్టుదలగల పేదవాళ్ళు ఈ టోయల్ పిశాచాలను తమ స్వాధీనంలోకి తెచ్చుకుని వాటిద్వారా విపరీతమైన సంపన్నులు కావటం జరుగుతుంది. అదృష్టాన్ని తెచ్చిపెట్టే ఈ టోయల్ పిశాచులు తేడావస్తే తన యజమానికి అనారోగ్యాన్ని, దురదృష్టాన్ని అందించటమే కాకుండా వారి కుటుంబ సభ్యులను కూడా నిర్మూలించటం జరుగుతుంది. ఈ టోయల్ అనే పిల్లపిశాచాలు కోళ్ళలాగా కొక్కొక్కొ అని అరుస్తాయి. ఎల్లప్పుడూ నగ్నంగా సంచరించే ఈ టోయల్ పిశాచాలు ఇతరుల నుండి విలువైన వస్తువులను దొంగిలించి తమ యజమానులకు ఇస్తాయని చెప్పుకుంటారు. ఆగ్నేయ ఆసియా దేశాలైన థాయ్‌లాండ్, మలేషియా మరియు సింగపూర్‌లలో ఈ టోయల్ అనే పిశాచాలు ఎక్కువగా ఉంటాయి. కొంతమంది అభిప్రాయం ప్రకారం ఈ టోయల్ పిశాచి మొదట సౌదీ అరేబియాలో పుట్టినట్టుగా తెలుస్తున్నది. అరేబియాలో ఇస్లాం మతం ప్రవేశించటానికిముందు అరబ్బులు క్షుద్రశక్తుల్ని ఉపాసిస్తూ ఉండేవాళ్ళు. సౌదీ అరేబియాలోని మక్కా నగరంలో ఉన్న కాబా చుట్టుప్రక్కల ప్రదేశాలలో ఆనాటి అరబ్బులు తమ శిశువుల మృతదేహాలను పాతిపెట్టటం జరిగేది. వాటిని కొందరు మంత్రగాళ్ళు త్రవ్వి బయటకుతీసి వాటికి ప్రాణాలుపోసి టోయల్ పిశాచాలు తయారుచేయటం జరిగింది. చైనాభాషలో టోయల్‌ను గుజాయ్ అని పిలుస్తారు. ఈ మాటకు అర్థం పిల్లపిశాచి అని.



మలేషియా రాజ్యాంగంలో ఇలా వ్రాయబడి ఉన్నది. "ఒకవ్యక్తి మలేషియా పౌరుడు కావాలి అంటే అతడు తప్పకుండా ముస్లిం అయి ఉండాలి మరియు క్షుద్ర శక్తులు ఉన్నాయని నమ్మితీరాలి".

**4. హంటూరయ :** మలయా పిశాచాలలో అత్యంత శక్తివంతమైనదిగా చెప్ప బడుతున్న ఈ పిశాచాల్ని స్వాధీనం చేసుకున్నవారు గొప్ప ధనవంతులు అవటమే కాకుండా వీటిని ప్రయోగించి తమ శత్రువులకు హాని కలిగించటంకాని లేదా శత్రువుల్ని చంవటంకాని జరుగుతుంది. ఒక విచిత్రం ఏమంటే ఈ పిశాచి ఎవరి ఆధీనంలో అయితే ఉంటుందో అతని రూపం ధరించి అతని భార్యతో వీలున్నపుడు సంభోగం జరుపుతుంది. ఈ పిశాచి తన నివాసాన్నిదాటి ఎక్కువదూరం వెళ్ళలేదు.



**వరాంగ్‌మినియాక్ :** థాయ్‌లాండ్, ఇండోనేషియా మరియు మలేషియా దేశాలలో వరాంగ్‌మినియాక్ అనే ఒక పురుష క్షుద్రశక్తి సంచరిస్తూ ఉంటుందని నమ్మబడుతున్నది. ఈ శక్తి నగ్నంగా ఉంటుందని, దీనికి బట్టతల ఉంటుందని, దీని ఒళ్ళంతా నల్లటి గ్రీజులాంటి పదార్థం పూయబడి ఉంటుందని దీనిని స్వయంగా చూసిన అనేకమంది చెప్పటం జరిగింది. ఈ క్షుద్రశక్తి రాత్రి సమయాలలో వివాహాలపై దాడిచేసి ఆ గృహాలలో ఉన్న కన్యలను రాక్షసంగా అనుభవిం చటం జరుగుతుంది.



ఒరాంగ్‌మినియాక్

ఎర్రటి కనుగుడ్లతో ఉండే ఈ క్షుద్రశక్తి ఏ కన్యని అయినా అనుభవిస్తే ఆమె కోమాలోకి వెళ్ళిపోతుంది. ఆ తరువాత ఆమెను రక్షించటం ఏ వైద్యుడివల్లాకాదని తాంత్రికులు తెలియజేస్తున్నారు. ఇటీవలకాలంలో మలేషియాలోని ఒక గ్రామ ప్రాంతంలో వరాంగ్ దాడులు జరిగినట్టుగా తెలుస్తున్నది. ఈ క్షుద్రశక్తిని నూనె మనిషి (ఆయిలీమాన్) అనికూడా పిలుస్తారు. కొన్నివందల ఏళ్ళనుండి అప్పుడప్పుడూ ఈ క్షుద్రశక్తి మానవ కన్యలపై దాడులుచేస్తున్నట్టుగా తెలుస్తున్నది. సాతాన్‌తో ఒక తాంత్రికుడు ఒప్పందం చేసుకున్నాడని ఆ తరువాత సాతాన్ సహకారంతో ఆ తాంత్రికుడు ఒరాంగ్‌మినియాక్‌గా మారిపోయాడని మలేషియాలో కథలు కథలుగా చెప్పుకుంటారు. ఈ క్షుద్రశక్తి ఒక్కరాత్రిలో 21 మంది కన్యలను అనుభవిస్తేకానీ తృప్తి చెందదు. ఈ క్షుద్రశక్తి భూమిపై నడవదని కొన్ని అడుగుల దూరాన్ని ఒక్క గెంతులో చేరుకుంటుందని చెబుతారు. ఒక తంత్రగాడు ప్రాచీనకాలానికి చెందిన ఒక తాంత్రిక ప్రయోగం చేస్తున్నపుడు అది బెడిసికొట్టిందని ఫలితంగా ఆ తాంత్రికుడు అటు మనిషి ఇటు దయ్యముకాని ఒక క్షుద్రశక్తిగా మారిపోయాడని థాయ్‌లాండ్‌లోని ప్రజలు చెబుతున్నారు. మరికొందరి అభిప్రాయం ప్రకారం ఆయిలీమాన్ సాతాన్‌తో ఒక ఒప్పందం కుదుర్చుకున్నారనీ ఆ ఒప్పందం ప్రకారం అతడు ఒక్కరాత్రికి 99మంది కన్యలను మానభంగం చేసినట్లయితే అతడు కోరిన కోర్కెలను సాతాను తీరుస్తాడనీ తెలుస్తున్నది. అందువల్లే ఆయిలీమాన్ వీలైనంత ఎక్కువమంది కన్యలను ఒక్కరాత్రిలో అనుభవించాలని ప్రయత్నిస్తాడట. ఈ క్షుద్రశక్తి గోడలమీదకూడా నడవగలడని అవసరమైనపుడు అదృశ్యం అయిపోగలడని తెలుస్తున్నది.

ఇతర దేశాలవారికి ఆయిలీమాన్ కథ నమ్మశక్యంగా ఉండకపోయినప్పటికీ మలేషియా దేశంలో ఆయిలీమాన్ పేరుచెబితే ప్రజలు గడగడలాడిపోతారు. ఆ క్షుద్ర శక్తియొక్క ప్రభావాన్ని నిజంగా చూసిన మలేషియన్ ప్రజలకు ఆయిలీమాన్ యొక్క శక్తి సామర్థ్యాలు ఏమిటో స్పష్టంగా తెలుసు. ముఖ్యంగా మలేషియాలోని సెలాంగర్ అనే ప్రాంతంలోని ఒక కుటుంబంపై ఒరాంగ్‌మినియక్ (ఆయిలీమేన్) అనేకసార్లు దాడులు చెయ్యటం జరిగింది. ఆ దాడులు తట్టుకోలేని ఆ కుటుంబ సభ్యులు తమ సొంత ఇల్లు వదలిపెట్టి పలాయనం చిత్తగించారు. మలేషియా పోలీసులు ఆయిలీమాన్ దాడిచేసాడు అని చెప్పబడుతున్న ఇంటిని నిశితంగా పరిశీలించగా నేలపై, గోడలపై నల్లటి రంగులోని పాదముద్రలు కనిపించాయి. మలేషియాలో ఏదోఒక ప్రాంతంలో ఆయిలీమాన్ దాడులు జరుగుతున్నప్పటికీ పోలీసులు ఆ క్షుద్రశక్తిని బంధించలేకపోయారు.

పోలీసుఅధికారుల వల్ల తమకు రక్షణ కలగదని నిర్ధారించుకున్న మలేషియన్ ప్రజలు తాంత్రిక విధానాలను మరియు శారీరక బలాన్ని ఉపయోగించి ఆయిలీమాన్

బారినుండి తమను తాము రక్షించుకోవాలని నిర్ణయించుకున్నారు. 2011 డిసెంబర్ నెల మొదటి వారంలో ఈ ఆయిలీమాన్ మలేషియాలోని అనేక ప్రాంతాలలో అనేకమంది అమ్మాయిలపై దాడులు జరిపి వారిని కిరాతకంగా అనుభవించటం జరిగింది. ఆ క్షుద్రశక్తిబారినుండి తప్పించుకోవటానికి ఆ ప్రాంతం ప్రజలు బలమైన కర్రల్ని మరియు ఫ్లాష్ లైట్‌లను చేతిలో ధరించి అనేక బృందాలుగా ఏర్పడి ఆ ప్రాంతంలో రాత్రి సమయాలలో గస్తీ తిరగటం ప్రారంభించారు. ఆ తరువాత మలేషియాలోని బటు గుహల ప్రాంతంలో ఈ ఆయిలీమాన్‌కోసం అన్వేషించటం జరిగింది.

కొంతమంది అభిప్రాయం ప్రకారం ఒరాంగ్‌మినియాక్ అనేవ్యక్తి గతంలో కొంతకాలం క్రితం ఏదో క్షుద్రశక్తిని ఉపాసనచేసాడని అందులో ఏదో పొరపాటు జరిగే సరికి అది బెడిసికొట్టి ఆ క్షుద్రశక్తి అతడిని పీడించటం ప్రారంభించిందని ఆ పీడను తప్పించుకోవటంకోసం అతడు 40 మంది కన్యలను బలవంతంగా అనుభవించాలని అతను తెలుసుకోవటంతో అతను అమ్మాయిలను వెంటాడటం ప్రారంభించాడని తెలుస్తున్నది. అయితే వరాంగ్‌మినియాక్ చాలావరకు క్షుద్రశక్తులను ఉపాసించటంలో విజయం పొందిన కారణంగా అతడికి గోడలలోంచి వెళ్ళిపోగల శక్తి అదృశ్యం అయిపోగల శక్తి లభించిందని తెలుస్తున్నది. అత్యంత బలవంతుడైన ఈ వరాంగ్‌మినియాక్ తన బలాన్ని పెంచుకోవటంకోసం అరటిపువ్వులోని నీటిని అప్పుడప్పుడూ తాగుతూ ఉంటాడని మలేషియన్ ప్రజలు చెబుతూ ఉంటారు.

ఒక అమ్మాయిని చూడగానే ఆమె కన్య అవునోకాదో తెలుసుకోగల శక్తి ఒరాంగ్ మినియాక్‌కి ఉన్నది. అందువల్ల అతడు కేవలం కన్యలను మాత్రమే మానభంగం చేస్తాడని తెలుస్తున్నది.

మలేషియాదేశంలో స్థిరపడ్డ పి.మోహన్ అనే 45 సంవత్సరాల మళయాళీ తన ఇంటికి ఎదురుగా ఉన్న ఫ్లాట్‌లో అర్ధరాత్రి 12.30 ప్రాంతంలో ఒరాంగ్‌మినియాక్ కనిపించాడని చెప్పాడు. నల్లగా, నగ్నంగా ఒళ్ళంతా నూనెపూసుకున్నట్టు ఉన్న ఒక వ్యక్తి అపార్టుమెంట్ బయట గోడల మీద పాకుతూ పైకివెళ్ళటం మోహన్‌కి కనిపించింది ఆ తరువాత అలా అపార్ట్‌మెంట్ పైదాకా వెళ్ళిన ఆ వ్యక్తి హఠాత్తుగా అదృశ్యం అయిపోయాడు. ఆ దృశ్యం చూసిన మోహన్ చేతిమీద ఉండే వెంట్రుకలు భయంతో నిక్కపొడుచు కున్నాయి. ఆ అపార్టుమెంటులోని చాలా ఫ్లాట్లలో ఆడపిల్లలు ఉన్నారు. ఒరాంగ్‌మినియాక్ వల్ల వారికి హాని కలుగుతుందని మోహన్ భయపడ్డాడు.

మలేషియాలోని ఒక ప్రాంతంలో ఉంటున్న కంపంగ్ లక్ష్మణ అనే వ్యక్తి తాను ఒరాంగ్‌మినియాక్‌ని చూసానని, ఒరాంగ్‌మినియాక్ తెల్లవారుఝామున 2 గంటల

ప్రాంతంలో లక్ష్మణ ఇంటిపైన ఉన్న వాటర్‌టాంక్ వెనకాల నక్కి ఉన్నాడని అతడు ఒక ఆవులాగా పెద్దగా శ్వాసను పీలుస్తున్నాడని లక్ష్మణ చెప్పాడు.

మలేషియన్ మతవిశ్వాసాల ప్రకారం మనిషి జీవించి ఉన్నంతకాలమూ అతని ఆత్మ అతను నిద్రపోతున్న సమయంలో తాత్కాలికంగా బయటకి వెళ్ళిపోతుంది. అతను చనిపోయినపుడు శాశ్వతంగా వెళ్ళిపోతుంది. ఒక మనిషి చనిపోయిన తరువాత అతని ఆత్మ ఏడు రోజులపాటు తన సమాధిచుట్టు తిరిగి ఎనిమిదవ రోజున పాతాళ లోకానికి అంటే నరకానికి వెళ్ళిపోతుందని మలేషియా దేశస్తులు భావిస్తారు. ప్రేతాత్మలు రాత్రి సమయాలలో ముఖ్యంగా పౌర్ణమి రాత్రులలో విజృంభిస్తాయని ఈ ప్రేతాత్మలు మానవులకు అనేక రకాలుగా హానిచేస్తాయని మలేషియన్లు భావిస్తారు.

2009వ సంవత్సరంలో కౌలాలంపూర్‌లోని సన్‌గై ప్రాంతంలోని నివసిస్తున్న 300 కుటుంబాలు వరాంగ్ మినియాక్ దాడులకు భయపడి అక్కడనుండి వెళ్ళిపోయారు. కారణం వాళ్ళందరి కుటుంబాలలోను వయస్సు వచ్చిన ఆడపిల్లలు ఉన్నారు.

మలేషియాలో జీవించే ఫాతిమా అనే 42 సంవత్సరాల స్త్రీ ఒకరోజు తెల్లవారుఝామున 5 గంటలకు ప్రక్క గదిలో పడుకుని ఉన్న తన ఇద్దరు టీనేజ్ కూతుళ్ళు బిగ్గరగా ఏడవటంతో కంగారుగా అక్కడకు వెళ్ళిచూసింది. అక్కడ రెండు వేర్వేరు మంచాలమీద చెదిరిన దుస్తులతో వెల్లికిలా పడుకుని రోదిస్తున్న ఆమె ఇద్దరు కూతుళ్ళు కనిపించారు. ఆమె ఆ ఇద్దరు కూతుళ్ళను దగ్గరకు తీసుకుని ఏం జరిగింది అని లాలనగా అడిగింది. ఎవరో ఒక అదృశ్యవ్యక్తి తమను దారుణంగా అనుభవించాడని ఆ అమ్మాయిలు ఫాతిమాతో చెప్పారు.

ఆ తరువాత అనేకసార్లు ఆ ఇద్దరు 14 మరియు 15 సంవత్సరాల అమ్మాయిలను అదృశ్యరూపంలో సంచరించే ఒరాంగ్ బాత్‌రూమ్‌లలోను, కిచెన్‌లోను, డ్రాయింగ్ రూంలోను మానభంగం చేసినట్టుగా ఫాతిమా మీడియాకి తెలియజేసింది. ఫాతిమా అభిప్రాయం ప్రకారం ఒరాంగ్‌మినియాక్ ఏ కన్యనైనా బలాత్కరిస్తున్నపుడు ఒక మంత్రాన్ని ఆమె నోటిపై ప్రయోగిస్తాడని ఫలితంగా ఆమె ఎంత బిగ్గరగా అరిచినా ఆమె గొంతు ఆమెకు కొంచెం దూరంలో ఉన్నవాళ్ళకుకూడా వినపడదు. కనుక వరాంగ్ ఎవరో వస్తారు అన్న భయంలేకుండా తన క్రూర కార్యక్రమాన్ని కొనసాగిస్తాడు.



# 6. ప్రఖ్యాత కేరళ మంత్రవాది కడమత్తత్తు కథానార్ వివరాలు?

కేరళ రాష్ట్రంలోని పథనమిత్తా జిల్లాలో ఉన్న తిరువళ్ళ అనే పట్టణంలో ఒక ప్రాచీనకాలానికి చెందిన చర్చి ఉన్నది. ఆ పట్టణానికి దగ్గరలో కోచ్చి ఎయిర్‌పోర్ట్ ఉన్నది. క్రీ.శ. 53వ సంవత్సరంలో క్రైస్తవ మతప్రచారకుడైన సెయింట్‌థామస్ ఈ తిరువళ్ళను సందర్శించాడు. ఆ తరువాత ఆయన ఇక్కడ ఒక చర్చిని నిర్మించాడు. ఆనాటి నుండి తిరువళ్ళ ప్రముఖ క్రైస్తవ క్షేత్రంగా మారిపోయింది. తిరువళ్ళాకు దగ్గరగా ఉన్న చెంగన్‌చెర్రి మరియు కొట్టాయం పట్టణాలుకూడా క్రైస్తవ మతానికి బలమైన ప్రాంతాలుగా పేరుపొందాయి.

ఈనాటికీ తిరువళ్ళలో హిందువులు అధికంగా ఉన్నారు. ఆ తరువాత మెజారిటీ సంఖ్య క్రైస్తవులదే కావటం విశేషం. హిందువులలో సాంఘిక వ్యవస్థ కులంపై ఆధారపడి నడుస్తుంది. ఈ కులవ్యవస్థ మతపరమైన శాసనాలతో నడపబడుతుంది. ఫలితంగా హిందూమతంలోని బడుగు వర్గాలవారు అనగా తక్కువ కులంవారు అగ్రకులాల ఆధిపత్యాన్ని సహించలేక క్రైస్తవ మతంలోకి మారిపోయారు. క్రైస్తవ మిషనరీలు ఎంతగా ప్రయత్నించినా కేరళలోని మెజారిటీ హిందువుల్ని క్రైస్తవులుగా మార్చటానికి వీలుకాలేదు. అందుకు కారణం కేరళలోని స్థానిక హిందూ దైవాల ప్రభావమే. ఆ దైవాలకు ఉండే మహత్తు కథలు కథలుగా ఆ ప్రాంత హిందువులలో ప్రచారంలో ఉండటం వల్ల వాళ్ళు క్రైస్తవమతంవైపు మొగ్గు చూపలేదు. ఫలితంగా క్రైస్తవ మిషనరీవారు క్రీస్తుకి మరియు మేరీమాతకు మహిమలున్నాయి అని నిరూపించటంకోసం ఆ ప్రాంతంలో జరిగిన కొన్ని యదార్థ సంఘటనలకు హిందూ ప్రజలలో ప్రచారం చేసారు.

భారతదేశంలోని అతిప్రాచీనమైన చర్చిలలో ప్రముఖమైనది కడమత్తు చర్చి కేరళరాష్ట్రంలోని కొచ్చిన్ నగరానికి దగ్గరలో ఉన్న కోలెన్‌చెర్రి పట్టణంలో ఈ చర్చి ఉన్నది. సిరియన్ క్రైస్తవ మతానికి సంబంధించిన ఈ చర్చిని క్రీ.శ. 9వ శతాబ్దంలో నిర్మించినట్టుగా తెలుస్తున్నది. కోచ్చి-మధురైల మధ్య నడిచే 49వ నంబర్ జాతీయ రహదారిపై ఉన్న కోలిన్‌చెర్రీ మరియు మువ్వత్తుపూజ పట్టణాలమధ్య ఈ చర్చి ఉన్నది. కోలన్‌చెర్రి పట్టణం ఎర్నాకులం జిల్లాలో ఉన్నది. కోలన్‌చెర్రి పట్టణానికి 2 కి.మీ. దూరంలో కడమత్తుం చర్చి ఉన్నది.

రెవరెండ్ కడమత్తం అనే క్రైస్తవ ప్రీస్టు కడమత్తం చర్చికి అధిపతిగా ఉండేవాడు. ఆయన్ని స్థానిక ప్రజలు "కడమత్తత్తుకధానార్" అని పిలిచేవారు. కేరళలో తొలి రోజుల్లో నిర్మించబడ్డ చర్చిలలో కడమత్తం చర్చికూడా ఒకటి అతిప్రాచీన ఈ చర్చి ఎర్నాకులం నుండి 30 కి.మీ. దూరంలో ఉన్న ఒక కొండమీద ఉన్నది.



ఈ చర్చియొక్క పుట్టు పూర్వోత్తరాల గురించి కాగితాలపై నమోదుచెయ్యనప్పటికినీ ప్రజలనాలుకలపై ఎప్పటికీ నిలిచే ఉంటుంది. కేరళలోని అనేక ప్రాంతాలకు చెందిన ప్రజలు ఈ చర్చికి వచ్చి కధానార్‌చేత పిశాచ బాధను తొలగింపచేసుకునేవాళ్ళు.

ఉత్తర ట్రావెన్‌కూర్‌లోని కడమత్తత్తు అనే చిన్న గ్రామంలో నివసించే ఒక సిరియన్ క్రిస్టియన్ కుటుంబంలో జన్మించిన పౌలోజ్ అనే బాలుడే కాలక్రమంలో కడమత్తత్తు కధానార్‌గా పేరుపొందాడు. అతడు చిన్నపిల్లవాడిగా ఉండగానే అతని తల్లిదండ్రులు మరణించారు. అంతేకాదు అతనికి అక్కాచెల్లెళ్ళు, అన్నదమ్ములులేరు. ఆ తరువాత ఆ బాలుడు ఒక పారిష్ ప్రీస్టు సహాయంతో ఒక చిన్న ఇంట్లో ఒంటరిగా నివసించటం ప్రారంభించాడు. ఒంటరితనంతో విసిగిపోయన ఆ బాలుడు కొన్నాళ్ళ తర్వాత అక్కడ ఉండలేక ఒకరోజు అక్కడకు దగ్గరలో ఉన్న ఒక చర్చి ప్రధానద్వారంముందు కూర్చుని వెక్కి వెక్కి ఏడవటం ప్రారంభించాడు. అది చూసిన ఆ చర్చి ఫాదర్ జాలిపడి ఆ బాలుడిని దగ్గరకుతీసుకుని ధైర్యంచెప్పి ఆపై ఆ బాలుడిని తన కొడుకుగా భావించుకుని పెంచి పెద్దచేసాడు. ఆ బాలుడు కారణజన్ముడని, తెలివిగలవాడని, సమర్ధుడని గుర్తించిన ఆ చర్చిఫాదర్ అతడిని ఒక ప్రముఖ టీచర్‌వద్ద మంచి విద్య నేర్చుకోవటానికి చేర్పించాడు.

కాలక్రమంలో ఆ బాలుడు (పౌలోజ్) క్రైస్తవ మతంలోని అన్ని అంశాలను క్షుణ్ణంగా నేర్చుకుని ఒక చిన్న చర్చికి ప్రీస్టుగా నియమించబడ్డాడు. ఈ ప్రీస్టుపౌలోజ్‌కి

ఒకపెద్ద పశువుల మంద ఉండేది. ఒక కుర్రాడు ఆ పశువుల్ని వెంటపెట్టుకుని దగ్గరలో ఉన్న ఒక కొండమీదకు మేపటానికి తీసుకువెళ్ళేవాడు. ఒకరోజు మధ్యాహ్నం ఒకపెద్దపులి ఆ పశువుల మందమీద దాడిచేసి ఒక బర్రెను చంపి ఎత్తుకుపోయింది. పులినిచూసి హడలిపోయిన పశువులు తలా ఒక దిక్కుకి పారిపోయాయి. పులినిచూసి భయపడిన ఆ పశువుల కాపరి అక్కడనుండి పారిపోయి ప్రీస్టుపౌలోజ్‌కి ఆ విషయం చెప్పాడు. ఆ జనాలు తలా ఒక దిక్కుకి బయలుదేరారు. వెంటనే ఫౌలోజ్ ఆ ప్రాంతంలో ఉన్న ప్రజలందరినీ అక్కడకు పిలిపించి కొండమీద తప్పిపోయిన తన పశువుల్ని వెతకమని చెప్పాడు. అయితే సూర్యాస్తమయం అయ్యే సరికి పులి ఎత్తుకుపోయిన గేదె తప్ప మిగిలినవన్నీ ఇంటికి తిరిగివచ్చేసాయి. ఈ విషయం గుర్తించిన ఫౌలోజ్ తప్పిపోయిన గేదెను వెతుకుతూ రాత్రి సమయంలో కొండమీదకు చేరుకున్నాడు. ఆ తరువాత ఆయన తిరిగిరాలేదు. ఆయన్ని పులి చంపి ఎత్తుకుపోయి ఉంటుందని ఆ ప్రాంత ప్రజలు భావించారు. అయితే ఆయనను పెంచి పెద్దచేసిన చర్చి ఫాదర్ మాత్రం ఆయన ఎక్కడో అడవిలో సజీవంగా ఉండి ఉంటాడని భావించాడు.

నిజానిక జరిగిందేమంటే కొండమీద ఉన్న దట్టమైన అడవిలో, తప్పిపోయిన తన పశువుకోసం వెతుకుతున్న ఫౌలోజ్ దారితప్పి ఎటుపడితే నడుస్తూ చివరికి అడవి మధ్యభాగంలో ఉన్న ఒక పురాతన కాలానికి చెందిన ఆటవికుల గూడానికి చేరుకున్నాడు. నరమాంస భక్షకులు అని పేరుపడిన ఆ ఆటవికులు ఏ కారణంగానో ఫౌలోజ్‌కు ఏ హాని చెయ్యకపోగా తమకు తెలిసిన అనేక తాంత్రిక విద్యలను ఆయనకు నేర్పారు. ఆ తరువాత కొన్నిఏళ్ళపాటు ఫౌలోజ్ ఆ అడవిలో ఆ కొండజాతివారితో కలిసి కాలం గడిపాడు. ఆ తరువాత ఆయన అక్కడ నుండి తప్పించుకుని బయటకు వచ్చేసాడు. అయితే ఏ కారణంగానో ఆయనపై అభిమానాన్ని పెంచుకున్న ఆ ఆటవికులు ఆయన్ని వెతుక్కుంటూ బయటకువచ్చి ఆయన ఉండే చర్చి దగ్గరకు వచ్చారు. ఆ తరువాత తమ మంత్రశక్తితో ఒక భయంకరమైన తుఫాను సృష్టించి ఆ చర్చిని నాశనంచేసి ఆయన్ను బయటకు రప్పించాలని ప్రయత్నించారు. వారు ఎంతగా ప్రయత్నించినా ఆ చర్చి గోడలపై తుఫాను వలన గీతలు పడ్డాయేకాని చర్చికి ఏమీకాలేదు. చర్చిలో ఉన్న ప్రీస్టు ఫౌలోజ్‌కి ఏమీకాలేదు.

ఆ తరువాత వాళ్ళు అపజయంతో తల వంచుకుని తమ అడవిలోకి వెళ్ళిపోయారు. ఆ ప్రీస్టు ఫౌలోజ్ కాలక్రమంలో కడమత్తు కథానార్‌గా పేరుపొందాడు. ఆయన తన జీవిత కాలంలో తాంత్రికశాస్త్రంపై అనేక గ్రంథాలను వ్రాసాడు. ఆయన చేతివ్రాత సరిగా ఉండదు. అందువలన బాగా చదువుకున్నవాళ్ళు తప్ప సామాన్యులకు ఆయన చేతి వ్రాత అర్థంకాదు. ఆయన పుట్టినతేదీ మరియు చనిపోయినతేదీ ఎవరికీ

సరిగా తెలియదు. ఆయన చనిపోయిన తరువాత ఆయన పార్థివ దేహాన్ని కడమత్తు చర్చిలో సమాధిచేసారు.

కథానార్‌ను అభిమానించే భక్తులు ముఖ్యంగా క్రైస్తవేతర భక్తులు జనవరి-ఫిబ్రవరి నెలలలో జరిగే కడమత్తం విందు సమయంలో కథానార్‌కు తమ కృతజ్ఞతలు తెలియజేస్తూ అక్కడ ఉన్న ఒక బావిలో కోడిమాంసాన్ని, డబ్బుని, మద్యం సీసాలను విసిరివేస్తారు. కడమతత్తుకథానార్ వర్ధంతిరోజును కడమొత్తం విందురోజుగా అక్కడవారు జరుపుకుంటారు. కథానార్ అంటే మళయాళంలో పూజారి లేదా ప్రీస్టు అనిఅర్థం.

మహాక్రైస్తవభక్తుడిగా, ఎన్నో దయ్యాలను వదలించిన తాంత్రికుడిగా పేరుపొందిన కథానార్ తన జీవితకాలంలో ఎన్నో అద్భుతమైన కార్యాలనుచేసాడు. అందులో ముఖ్యమైనవి.

1. రక్తాన్ని తాగే ఒక యక్షిని మన్నార్ ఆలయం వద్ద ఉన్న ఒక తాడిచెట్టుకి మేకుతో గుచ్చివేసాడు.

2. కుట్టిచేతన్ అనేపేరుగల క్షుద్ర దేవతల్ని పూజించేవారిపై పోరాటం జరిపి వారిచేత ఆ పూజలు ఆపించాడు.

3. జెరూసలేం నుండి కేరళకు వచ్చిన ఒక బిషప్‌ను (క్రైస్తవ మతాధిపతి) ఆనంద పరచటంకోసం ఎక్కడో ఐరోపా ఖండంలో పండే ఫలాలను గాలిలోనుంచి సృష్టించి వాటిని ఆ బిషప్‌కి ఇచ్చాడు.

4. ఒకసారి ఒక బియ్యపుగింజను ఒక కుండలోవేసి తన మంత్రశక్తితో కుండ నిండా బియ్యం ఉండేలా చేసాడు.

5. కొచ్చిన్ పరిపాలించే మహారాజు తన శత్రువులపైకి యుద్ధానికి వెళుతున్నపుడు ఆయనకు మంత్రించిన ఒక బాణాన్ని ఇచ్చి శత్రువులపైకి ప్రయోగించమన్నాడు.

కడమత్తత్తు కథానార్ తాంత్రిక విద్యలో నిష్ణాతుడు. మనుషుల్ని పీడించే ప్రేతాత్మల్ని వెళ్ళగొట్టటంలో నాటి కేరళ రాష్ట్రంలో ఆయనను మించినవాడు లేడు. ముఖ్యంగా కేరళ ప్రాంతంలో రక్తపిశాచిగా చెప్పబడే యక్షిని బంధించటంలో ఈయనకి ఎదురు లేదు. ఈయన కేరళలోని కొండ ప్రాంతాల్లో నివసించే ఆటవికులవద్ద అనేక తాంత్రిక మంత్రాలను నేర్చుకుని ఆ మంత్రాల సహాయంతో ఏదోఒక యక్షిని తన ఆధీనంలోకి తెచ్చుకుని దాని సహకారంతో భూమి అడుగున దాచబడ్డ గుప్త నిధుల ఉనికిని తెలుసుకునేవాడు.

ఇక అసలు కథలోకి వద్దాం. కేరళలోని తిరువనంతపురం–పద్మనాభపురం రహదారిమార్గంలో అనేకమంది పాదచారులు నడిచివెళుతూ ఉండేవారు. ఈమార్గం దట్టమైన అడవులగుండా వంకరటింకరగా కొనసాగుతూ ఉండేది. సాధారణంగా ఈ మార్గంలో ఎక్కువమంది ప్రజలు ప్రయాణిస్తూ ఉండేవాళ్ళుకాదు. ఇలాంటి పరిస్థితుల్లో ఒక యక్షి ఆ మార్గంలో సంచరించటం ప్రారంభించింది. ఈ యక్షి అనే రక్తపిశాచి ఆ మార్గంలో ఒంటరిగా ప్రయాణిస్తున్న బాటసారుల్ని పట్టుకుని చంపి వాళ్ళరక్తం తాగేది. కాలక్రమంలో యక్షిని గురించిన వార్త అందరికీ తెలిసిపోయింది. దాంతో అత్యవసరమైతే తప్ప ఎవరూకూడా ఆ మార్గంగుండా ప్రయాణం మానేసారు. ఒకవేళ అటువైపుగా ప్రయాణించవలసి వచ్చినా డజనుమందికి తగ్గకుండా ప్రయాణించేవారు. ఫలితంగా అటువైపువచ్చే మానవులు కరువైపోయారు. యక్షికి ఆకలితీరే మార్గం కనపడలేదు. ఆ సమయంలో ఆ ప్రాంతంలో ఉన్న ఒక చర్చిలో ...స్టుగా పనిచేస్తున్న కడమత్తత్తు కథానార్ ఆ యక్షిని పట్టి బంధించాలని నిర్ణయించు ...న్నాడు. ఆయన అప్పటికే ఎన్నో రక్త పిశాచాలను, ప్రేతాత్మలను బంధించాడు.

ఆ తరువాత ఆయన ఆ మార్గంలో అనేక రోజులపాటు సంచరించి చివరికి ఒకరోజున యక్షిని కనుగొన్నాడు. యక్షి ఒక అందమైన స్త్రీరూపం ధరించి కథానార్‌ని వంచించి ఒక మూలకు తీసుకువెళ్ళి చంపాలని నిర్ణయించుకుని, ఆ ప్రకారంగానే ఒక అందాలరాశిగామారి ఆ మార్గంలో నడిచివెళుతున్న కథానార్ దగ్గరకువెళ్ళి ఆయనతో మాటలు కలపటంకోసం తాంబూలంలోకి కొద్దిగా సున్నం ఇమ్మని అడిగింది. యక్షి, అమ్మాయిరూపంలో తన వద్దకు వస్తుందని, సున్నం అడుగుతుందని ముందుగానే ఊహించిన కథానార్ తన డబ్బీలోని తడి సున్నాన్ని ఒక ఇనుప మేకుకు అద్ది దాన్ని యక్షికి ఇవ్వబోయాడు. ఇనుము అంటే యక్షికి మహాభయం అందువలన ఆమె సున్నం అంటించిన మేకును తీసుకోలేదు. అయితే కథానార్ మాత్రం సున్నం తీసుకో, తీసుకో అని యక్షిని బలవంతం చేసాడు. ఇనుప మేకును చూసి భయపడిన యక్షి నాలుగు అడుగులు వెనక్కివేసింది. అయినా కథానార్ ఏమాత్రం లెక్కచెయ్యకుండా ఆ మేకుని ఒక మంత్రంతో అభిమంత్రించి వేగంగా యక్షి దగ్గరకువెళ్ళి కన్నుమూసి తెరిచేలోగా ఆ మేకుని ఆమె తలలో చివరిదాకా దిగ్గొట్టాడు. మంత్రపూరితమైన ఆ మేకు తలలో దిగేసరికి ఆ యక్షికి ఉండే మహిమలన్నీ తాత్కాలికంగా పోయాయి. ఇపుడు ఆమె ఒక సాధారణ అమ్మాయి. ఇక తనకు బ్రతికే మార్గం ఏది? అని ఆ యక్షి దుఃఖించసాగింది. (ఆ యక్షికి మహిమలు ఉంటేనే మనుషుల రక్తంతాగి బ్రతకగలదు. తలలో మేకు దిగటం వలన ఆ మహిమలు పోయాయి కనుక ఇకపై రక్తాన్ని ఆహారంగా తీసుకో లేదు. అనగా ఇకపై ఆమెకు ఆహారం ఉండదు). అపుడు

ఆ యక్షిని చూసి జాలిపడిన కథానార్ ఆమెతో "ఓసీ! నిన్ను ఒక ముసలమ్మ దగ్గర పనికి పెడతాను. ఆమెకు సేవలు చేస్తూ నీ పొట్ట గడుపుకో" అన్నాడు. ఎలాగో అలాగ బ్రతకాలికనుక యక్షి కథానార్ చెప్పినట్టుగా చెయ్యటానికి అంగీకరించింది. ఆ తరువాత కథానార్ తన బంధువైన ఒక వృద్ధురాలివద్దకు యక్షిని తీసుకువెళ్ళి అప్పగించాడు. ఇన్నాళ్ళు ఒంటరిగా బ్రతుకున్న ఆ వృద్ధురాలు తనకి పనిచెయ్యటానికి మరియు తోడుగా ఉండటానికి వచ్చిన అందమైన అమ్మాయినిచూసి ఎంతో సంతోషించింది.

ఆ తరువాత ఆ వృద్ధురాలు రుచికరమైన వంటలుచేసి కథానార్‌కి మరియు యక్షికి వడ్డించింది. ఆ తరువాత ఆ వృద్ధురాలుకూడా భోజనంచేసింది. అప్పటికి కొన్నిరోజులుగా నిద్రాహారాలు లేకుండా యక్షికోసం అన్వేషిస్తూ ఉండిన కథానార్‌కి చాలాకాలం తరువాత మంచి భోజనం లభించటంతో నిద్ర ముంచుకువచ్చింది. దాంతో కథానార్ ఆ ఇంటి అరుగుమీద మధ్యాహ్న నిద్రకు ఉపక్రమించాడు. ఆ తరువాత ఆ వృద్ధురాలు అమ్మాయిరూపంలో ఉన్న యక్షికి తల దువ్వాలని ప్రయత్నించింది. ఆ ప్రయత్నంలో భాగంగా ఆ వృద్ధురాలు యక్షి జుట్టుకి పాపడి తియ్యాలని ప్రయత్నించినపుడు జుట్టుకింద తలమధ్యలో దిగిఉన్న మేకు కనిపించింది.

వృద్ధురాలికి అసలు విషయం తెలియదు కనుక ఆరె!ఆరె! ఈ అమ్మాయి తలలో మేకు ఉన్నదే అని నొచ్చుకుని తన చేత్తో ఆ మేకును పీకి అవతలపారేసింది. ఎప్పుడైతే మేకు పోయిందో ఆ క్షణమే యక్షికి మహిమలు తిరిగి వచ్చేసాయి. తక్షణమే ఆ యక్షి అక్కడనుండి మాయం అయింది. సాయంత్రానికి నిద్రలేచిన కథానార్‌కి జరిగిన విషయాన్ని గజగజా వణుకుతూ ఆ వృద్ధురాలు చెప్పింది. యక్షి తప్పించుకున్నది అన్న మాట వినగానే కథానార్‌కి నోట మాట రాలేదు. ఒకసారి తన చేతిలో దెబ్బ తిన్న యక్షి ఇకపై మానవుల్ని ఎంత దారుణంగా వేటాడుతుందో అని కథానార్ భయపడ్డాడు. ఎలాగైనా ఆ యక్షిని


కదమత్తత్తుకథానార్

తిరిగి బంధించాలి అన్న ఉద్దేశంతో కథానార్ ఆమెకోసం బయలుదేరాడు. సహజంగా ఎన్నో తాంత్రిక శక్తుల్ని కలిగి ఉన్న కథానార్ కొద్దిసేపటిలోనే అడవిలోకి పరుగెడుతున్న యక్షిని చూసాడు. తనకు దగ్గరగా వచ్చేస్తున్న కథానార్ బారినుండి తప్పించుకోవటంకోసం యక్షి అక్కడికి దగ్గరలో పంపానది వద్దకు చేరుకుని అక్కడ గట్టున ఉన్న పడవ ఎక్కింది.

కథానార్ ఎంత వేగంగా వచ్చిన యక్షిని పడవ ఎక్కకుండా ఆపలేకపోయాడు. యక్షి పడవమీద అవతల ఒడ్డుకి చేరుకున్నది. అప్పుడు కథానార్ తనకి అవతల ఒడ్డుకి వెళ్ళటానికి పడవ లేనికారణంగా ఆ గట్టుమీద ఉన్న యక్షిని తన మంత్రాలతో ఇవతల గట్టు నుండి కదలకుండాచేసాడు. ఆ తరువాత ఆయన ఒక అరిటాకుని మంత్రించి నదిలో వేసి దానిమీద నుంచుని అవతల గట్టుకి చేరుకున్నాడు. తన ఆట కట్టింది అని గ్రహించిన యక్షి తనను క్షమించమని కథానార్‌ని బతిమాలుకుంది. దయకు మారు రూపంగా ఉండే కథానార్, యక్షి వేదనను గుర్తించి ఆమెతో "ఇకపై నీవు ఏ మనిషిని చంపకుండా ఉన్నట్లయితే నిన్ను నాశనం చెయ్యకుండా వదిలేస్తాను" అన్నాడు. ఆమె అందుకు అంగీకరించింది. ఆ యక్షి ఆ అడవులలో ఈనాటికీ అదృశ్యరూపంలో సంచరిస్తూ ఉన్నది. అయితే అప్పుడప్పుడూ కొందరికి కనిపించినప్పటికీ ఆమె ఎవరికీ హానిచేసి నట్లుగా తెలియదు.



# 7. ప్రేతాత్మలు మానవుల్ని ఆవహిస్తే ఎలా గుర్తించాలి?

చాలామందికి తెలియని విషయం ఏమంటే మానవుల్ని ఆవహించిన ప్రేతాత్మలు తాము కోరుకున్నపుడు మాత్రమే తమ ఉనికిని (తాము ఒక మనిషిని ఆవహించిన విషయాన్ని) ఇతర మానవులకు సూచిస్తాయి. సాధ్యమైనంతవరకు ప్రేతాత్మలు తమ ఉనికి బయటపడకుండా చూసుకుంటాయి. కారణం ఏ మనిషికైనా దయ్యం పట్టింది అని తెలిస్తే ఆ మనిషిని ఏ మసీదుకో, చర్చికో, దర్గాకో పంపించికాని లేదా అనుభవజ్ఞుడైన హైందవ మంత్రవాదిచేతకాని దయ్యంపట్టిన మనిషికి ఆ దయ్యం

వదలిపోయేలా చెయ్యటం జరుగుతుంది. కొన్నిసార్లు ప్రేతాత్మలు తాము ఆవహించిన వ్యక్తిచేత అమానుషమైన పనులుచేయించి తద్వారా తమ ఉనికిని ఇతరులకు తెలియ జేస్తాయి. కొన్నిసార్లు దయ్యంపట్టినవ్యక్తి పవిత్రమైన ప్రదేశాలకు వెళ్ళినపుడుకాని, మంత్ర సిద్ధిపొందిన పెద్దవారివద్దకు వెళ్ళినపుడుకాని అతని ఆవహించి ఉన్న దురాత్మ తన ఉనికిని బయటపెట్టటం జరుగుతుంది. కారణం పవిత్ర ప్రదేశాలలోను, పవిత్ర వ్యక్తులయొక్క సన్నిధిలోను ప్రేతాత్మలు నిలబడలేవు. కొన్నిసార్లు ఒక దురాత్మ ఒక మనిషిని ఎంతకాలం ఆవహించి ఉండాలని విధి లిఖిస్తుందో అంతకాలం మాత్రమే ఆ మనిషిని ఆవహించి ఉండగలదు.

దయ్యంపట్టిన వ్యక్తికి పవిత్రమైన వస్తువులు తాకితే ఆవ్యక్తి తన ఒళ్ళంతా మండిపోతున్నట్టుగా పెద్దగా అరిచి కేకలు వెయ్యటం జరుగుతుంది. నిజానికి పవిత్ర వస్తువుల వలన బాధకు గురి అయ్యింది ఆ వ్యక్తికాదని, ఆవ్యక్తిని ఆవహించి ఉన్న దురాత్మ (ఈవిల్ స్పిరిట్) అని గుర్తించాలి. సాధారణంగా దయ్యంపట్టిన వ్యక్తులు ప్రత్యేకమైన ప్రవర్తనను ప్రదర్శించటం జరగదు. కాకుంటే వారికి గతంలో ఉండే అలవాట్లు అధికం అయిపోతాయి. పరిమితంగా మద్యంసేవించే వ్యక్తి హఠాత్తుగా విపరీతమైన తాగుడుకి అలవాటు పడటం జరుగుతుంది. దానినిచూసిన ఇతరులు అతడు ప్రేతాత్మ ఆవహించటం వలన అధికమైన తాగుడుకి అలవాటు పడ్డాడని గ్రహించలేదు. విపరీతంగా తాగాలని కోరిక ఉన్న ఆ దురాత్మ ఒక మనిషిని ఆవహించి అతడిచేత విపరీతంగా తాగించి తన ఆత్మశాంతిని పొందుతుంది.



దురాత్మలు (ఈవిల్‌స్పిరిట్స్) మానవుల పంచేంద్రియాలకు అందవు. అయితే కొన్నిసార్లు ఆత్మలు మానవుల్ని ఆవహించినపుడు ఆ మానవులకు అనేకరకాల ఆకస్మిక సమస్యలు ఏర్పడటం జరుగుతుంది. విచిత్రమైన శారీరక అనారోగ్యాలు, కుటుంబ సమస్యలు, వ్యాపార సమస్యలు, వృత్తిపర సమస్యలు ఏర్పడి తద్వారా ఆ మానవులు మానసికంగా మరియు శారీరకంగా కృశించిపోవటం జరుగుతుంది. ప్రేతాత్మలు

తమకు అనుకూలంగా ఉండే రజోగుణం మరియు తమోగుణంగల వ్యక్తులను ఆవహించినపుడు ఆ విషయాన్ని ఇతరులు ఎవరూ గుర్తించలేరు. ఇలాంటి గుణాలు గల వ్యక్తుల్ని ఆవహించిన ప్రేతాత్మలు వారిద్వారా సమాజాన్ని నాశనంచెయ్యటానికి ప్రయత్నిస్తాయి. విశృంఖలమైన శృంగార ప్రవృత్తిగలవారు ఉన్నచోట, కాంతితక్కువగా పడుతున్నచోట (క్లబ్బులు, బార్‌లు, పబ్‌లు) మాదకద్రవ్యాలు వాడేచోట ప్రేతాత్మలు సంచరించటానికి ఇష్టపడతాయి. అలాంటి ప్రదేశాలలో ఉన్న వ్యక్తులయొక్క ప్రవర్తన చాలా అసాధారణంగా మరియు వికృతంగా ఉంటుందని పరిశీలించినవారికి తెలుస్తుంది. కొన్నిసార్లు అత్యంతశక్తివంతమైన ప్రేతాత్మలు కొందరు శక్తివంతులైన మానవుల్ని ఆవహించి వారిద్వారా జన నాశనాన్ని చేయిస్తాయని కొందరు మంత్ర వాదులు తెలియజేస్తున్నారు.

చీకటిశక్తులు (ప్రేతాత్మలు) మానవుల్ని నిద్రపోకుండా చేస్తుంటాయి. మానవుడు నిద్రపోవటంవల్ల బలమైన ఆత్మనిగ్రహాన్ని మరియు ధైర్యాన్ని కలిగి ఉంటాడు. అందువలన అటువంటి మానవుడు ప్రేతాత్మలను తేలికగా ఎదుర్కొనగలుగుతాడు. కనుక తాము పీడించాలి అనుకున్న వ్యక్తికి నిద్రలేకుండాచేసి ఆ వ్యక్తిని మానసికంగా బలహీనపరచటానికి ప్రేతాత్మలు ప్రయత్నిస్తాయి. సాధారణంగా ప్రేతాత్మలు, మొదట ఒక జంతువుయొక్క ప్రేతాత్మను ఒకవ్యక్తిముందు సాక్షాత్కరింపచేసి ఆవ్యక్తితో మానసిక సంబంధాన్ని ఏర్పాటుచేసుకుని ఆ తరువాత తామే ఆ మానవుడిముందు ప్రత్యక్షం కావటం జరుగుతుంది.

అనాదికాలంనుండి దేవతలు మరియు దయ్యాలు మానవులతో టెలీపతి విధానంలో మాట్లాడటం జరుగుతూ ఉన్నది. ఒక్కొక్కసారి తమ ఆలోచనలతో సంబంధం లేకుండా విచిత్రమైన మాటలు కొందరికి వినిపిస్తూ ఉంటాయి. నిజానికి అవి టెలీపతి విధానంలో వారికి వినిపించాయని వారికి తెలియదు. తమ ఆలోచనలతో సంబంధంలేని విభిన్న విషయాలకు సంబంధించిన మాటలు ఎవరి మనసులో అయినా మెదిలితే తప్పనిసరిగా వారి పరిసరాలలో ఏదోఒక మానవాతీతశక్తి సంచరిస్తున్నట్టుగా గుర్తించాలి.

2008, ఫిబ్రవరి నెలలో విడుదలయిన న్యూఆక్స్‌ఫర్డ్ రివ్యూలో ప్రేతాత్మ పూనకానికి సంబంధించిన ఒక ఉదంతం ప్రచురించబడింది. జూలియా (ఈమె అసలుపేరు వేరే ఉన్నది) అనే ఒక యువతి గతంలో సాతాన్ ఆరాధకురాలిగా ఉండేది. ఈమెకు అనేక అతీంద్రియ శక్తులు ఉన్నట్టుగా ఆ పత్రికలో వ్రాయబడింది.

ఆమె తన జీవిత చరిత్రను ప్రచురించటానికి అంగీకరించింది. అయితే తన అసలు పేరు, వివరాలు గోప్యంగా ఉంచమని కోరింది. జూలియా ఒక దురాత్మచేత (ఈవిల్ స్పిరిట్) కొంతకాలంగా పీడించబడుతూ ఉన్నది. ఆ సమస్య పరిష్కారంకోసం ఆమె ఒక సైకియాట్రిస్టును సంప్రదించింది. కానీ అందువలన ప్రయోజనం లేకపోవటంతో ఆమె ఒక కాథలిక్ చర్చిని సంప్రదించింది. కాథలిక్ ప్రీస్టులు తమ విధానాలను ఉపయోగించి ఆమెకు పట్టిన దురాత్మను వదిలించారు.

ఆమెను అనేకసార్లు పరిశీలించిన ప్రముఖ సైకియాట్రిస్టు రిచర్డ్ ఆ తరువాత మీడియాతో ఇలా చెప్పాడు. "జూలియా చాలా తెలివిగలది మరియు సంస్కార వంతురాలు". ఆమెకు పట్టిన ప్రేతాత్మను వదిలించటంకోసం కాథలిక్ ప్రీస్టులు పరిహారాలు చేస్తున్నపుడు నేను అక్కడే ఉన్నాను. వాళ్ళు బైబిల్‌లోని కొన్ని-వాక్యాలను చదవటం ప్రారంభించిన కొంతసేపటికి జూలియా మైకం (ట్రాన్స్)లోకి వెళ్ళిపోయింది. ఆ తరువాత ఆమెను ప్రీస్టులు ప్రశ్నించటం ప్రారంభించారు. మొదట్లో మెత్తగా స్త్రీ స్వరంతో మాట్లాడిన జూలియా క్రమక్రమంగా మొగగొంతును పోలిన గరగరలాడే స్వరంతో మాట్లాడటం మొదలుపెట్టింది. అంతేకాకుండా దాదాపు ఐదారు రకాల కంఠస్వరాలతో ఆమె అసభ్యకరమైన పదాలను, బెదిరింపులను పలికింది. అంతేకాకుండా ఒకసారి "ఓరి నికృష్ట పురోహితుడా(ప్రీస్ట్)! ఈ స్త్రీ నాది. దీనినుండి నన్ను వేరుచేయటం నీవల్లకాదు" అని బొంగురు గొంతుతో అన్నది. ఆ తరువాత ప్రీస్టులు తమ పరిహార ప్రక్రియలను కొనసాగించారు. దురాత్మ వదిలిపోయింది. కొన్ని గంటల తరువాత జూలియా స్పృహలోకి వచ్చింది. అప్పటి వరకు తాను ఏమి మాట్లాడిందో ఆమెకు గుర్తులేకపోవటం విశేషం.

క్రైస్తవమతంలో రెండు శాఖలు ఉన్నాయి. అవి...1. కాథలిక్‌లు 2 పొటెస్టెంటులు. క్రీస్తును నమ్మినవారికి దయ్యాలు పట్టవని ప్రొటెస్టెంటులు వాదిస్తారు. ప్రభువుని నమ్మినవారినికూడా దురాత్మలు పీడిస్తాయని కాథలిక్ మతంవారు చెబుతారు. న్యూటెస్ట్‌మెంట్‌లోని రివలేషన్ అధ్యాయంలోని 12:9లో ఇలా వ్రాయబడి ఉన్నది. "సమస్త ప్రపంచాన్ని మోసగించిన భయంకర డ్రాగాన్ మరియు వృద్ధసర్పము అని పిలువబడే దయ్యాన్ని మరియు సాతాన్‌ని మరియు సాతాన్ అనుచరులని దేవుడు స్వర్గం నుండి భూమిమీదకి నెట్టివేసాడు. అనగా భూమిపై తిరిగే దురాత్మలు సైతాన్‌కి సంబంధించినవి అని, దురాత్మలు నిజంగా ఉన్నాయని బైబిల్‌లోని న్యూటెస్ట్‌మెంట్ బలపరుస్తున్నది అన్నమాట. కాథలిక్ మతానికి చెందిన మదర్‌థెరిస్సా చనిపోవటానికి

ముందు కొంతకాలం విపరీతమైన శారీరక మరియు మానసిక వేదనకు గురి అయ్యింది. అందుకు కారణం ఆమెను ఒక దురాత్మ లేదా ప్రేతాత్మ ఆవహించటమే అని కలకత్తా అర్చ్‌బిషప్ పేర్కొన్నాడు. తానే స్వయంగా మదర్‌థెరిస్సాకు పట్టిన దురాత్మను వదిలించాను అనికూడా ఆయన పేర్కొన్నాడు.

సెయింట్ ఫ్రాన్సిస్ అనే ఒక క్రైస్తవ పీఠాధిపతిని కొన్నేళ్ళక్రితం కొన్ని ప్రేతాత్మలు పీడిస్తూ ఉండేవి. ఆయన గదిలోని సీసాలు మరియు ఇతర వస్తువులు గాలిలోకి ఎగిరిపోయి ఆయనకు ఢీకొడుతూ ఉండేవని ఆయనతోపాటు ఆ క్రైస్తవమఠంలో ఉన్న ఇతర క్రైస్తవ సన్యాసులు పేర్కొనటం జరిగింది.



# 8. ప్రేతాత్మలతో సంభాషించటానికి ఉపయోగించే సైకోమెట్రీ మరియు సైకోగ్రఫీ వివరాలు?

సైకోమెట్రీ అనే పదాన్ని తొలిసారిగా 1842వ సంవత్సరంలో జోసెఫ్‌రోడ్స్ బచ్‌నన్ అనే రచయిత ఉపయోగించటం జరిగింది. సైకోమెట్రీ అంటే ఆత్మలద్వారా లేదా ఒకవ్యక్తికి చెందిన వస్తువుల్ని తాకటంద్వారా ఏదోఒక నిగూఢ సమాచారాన్ని తెలుసుకోవటం అని గ్రహించాలి. కొన్నిసార్లు ఒక వ్యక్తి ఎక్కడో హత్యచేయబడతాడు. అతని మృతదేహంకూడా దొరకదు. అలాంటి సమయాల్లో పారాసైకాలజిస్టులు లేదా మంత్రగాళ్ళు తమకు తెలిసిన ఏదోఒక ఆత్మను ఆహ్వానించి దానిద్వారా చనిపోయినవ్యక్తియొక్క వివరాలను తెలుసుకోవటం జరుగుతుంది. ప్రస్తుతం పాశ్చాత్యదేశాలలో సైకోమెట్రికి సంబంధించిన అనేక అంశాలపై విస్తృతంగా పరిశోధనలు జరుగుతున్నాయి. కొన్నిసార్లు కొందరు తమకు చెందిన పూర్వీకుల ఆత్మలతోకూడా ఈ సైకోమెట్రీ విధానంలో సంభాషించటం జరుగుతుంది.

ఒక వ్యక్తికి సంబంధించిన వస్తువును కళ్ళుమూసుకుని చేతితోతాకి ఆ వస్తువుకు సంబంధించిన వ్యక్తియొక్క భూత, భవిష్యత్ వర్తమానాలను తెలియజేసే అతీంద్రియ శక్తిని సైకోమెట్రీ అని పిలుస్తారు. కొన్నిసార్లు ఒకవ్యక్తియొక్క నుదిటిని లేదా చేతుల్ని తాకి ఆ వ్యక్తియొక్క వివరాలను లేదా భవిష్యత్తును తెలియజేయటంకూడా సైకోమెట్రీలో

భాగంగా ఉంటుంది. మామూలు కళ్ళకు కనపడనివి అతీంద్రియ శక్తులు ఉన్న వ్యక్తులకు కనిపిస్తాయి.

థర్మామీటరు కెలోరిక్‌ని కొలుస్తుంది. (కెలోరిక్ అన్నా, థర్మో అన్నా, ఉష్ణోగ్రత అన్నా ఒకటే)

బారోమీటరు వాతావరణం యొక్క బారోని కొలుస్తుంది. (బారో అంటే బరువు అని అర్థం)

ఎలక్ట్రోమీటరు విద్యుత్ పరిస్థితులను కొలుస్తుంది.

సైకోమీటరు ఆత్మను కొలుస్తుంది. అయితే సైకోమీటరు విషయానికి వస్తే ఈ ఆత్మను కొలిచే విధానం ఒక కొత్తరూపం సంతరించుకుంటుంది. అది ఏమిటంటే ఈ విధానంలో కొలిచేది మరియు కొలవబడేది ఒకే జాతికి చెందినది అయి ఉంటుంది. (జాతి అనగా ఇక్కడ ఆత్మ అని అర్థంచేసుకోవాలి).

**సైకోగ్రఫి :** శరీరం కోల్పోయిన ఆత్మల నుండి లిఖితపూర్వక సందేశాలను పొందటంకోసం ఉపయోగించే ఒక విధానాన్ని సైకోగ్రఫి అని పిలుస్తారు. ఈ సైకోగ్రఫి విధానాన్ని మానవులు నేర్చుకోవచ్చు. కొంతమంది పుట్టుకతోనే ఇటువంటి సామర్థ్యాన్ని కలిగి ఉండటం జరుగుతుంది. ఈ సైకోగ్రఫి విధానంలో అనేక రకాలు ఉన్నాయి. వాటిలో కొన్ని ప్రత్యక్షమైనవికాగా మరికొన్ని పరోక్షమైనవిగా ఉన్నాయి.


అలెన్‌కార్డెక్

పరోక్షంగా జరిగే సైకోగ్రఫి ఈవిధానంలో ఒకరు లేదా ఒకరుకన్నా అధిక వ్యక్తులు ప్రేతాత్మల నుండి సమాచారాన్ని సేకరించటం కోసం వూజాబోర్డులను ఉపయో గించటం జరుగుతుంది. అయితే ఈవిధానం బాగా శ్రమతో కూడుకుని ఉన్నది. అంతేకాక ఒకటికన్నా ఎక్కువమంది ఆత్మలతో సంభాషించాలి అనుకున్నపుడు వూజాబోర్డు విధానం పనికిరాదు. ప్రఖ్యాత పారాసైకాలజిస్టు మరియు రచయిత అయిన అలెన్‌కార్డెక్ సైకోగ్రఫీ గురించి ఒక విస్తృతమైన గ్రంథాన్ని వ్రాసాడు. ఆ గ్రంథంలో సైకోగ్రఫికి

సంబంధించిన సమస్త విషయాలు పొందుపరచబడి ఉన్నాయి. అలెన్‌కార్డెక్ అభిప్రాయం ప్రకారం సైకోగ్రఫీ రెండు రకాలుగా ఉంటుందని తెలుస్తున్నది. అవి 1. ప్రత్యక్ష సైకోగ్రఫీ 2. పరోక్ష సైకోగ్రఫీ.

ప్రత్యక్ష సైకోగ్రఫీ : ఈవిధానంలో ఒకవ్యక్తి (మీడియం లేదా మాధ్యమం) ఒక ప్రేతాత్మనుండి టెలీపతి విధానంలో సమాచారాన్ని పొందుతూ కాగితంపై ఆ సమాచారాన్ని లిఖిస్తాడు. సందేశాల్ని ఇస్తున్న ఆత్మ మరియు ఆ సందేశాల్ని అందుకుని వ్రాస్తున్న మాధ్యమాల మధ్య ప్రత్యక్ష సంబంధం ఉన్న కారణంగా ఈ విధానంలో లభించే సమాచారం విశ్వసనీయ మైనదిగా ఉంటుందని అనేకమంది పారాసైకాల జిస్టులు భావిస్తున్నారు. ఈ ప్రత్యక్ష సైకోగ్రఫీలో నాలుగు విధానాలు ఉన్నాయి. అవి ఏమిటంటే....



**1. యాంత్రిక సైకోగ్రఫీ :** ఈ విధానంలో ఆత్మ తనతో సంభాషించటానికి సిద్ధపడ్డ వ్యక్తియొక్క చేతిపై తన ప్రభావాన్ని చూపిస్తూ ఆవ్యక్తి (మాధ్యమం) ఆలోచనతో సంబంధంలేకుండా తాను చెప్పాలనుకున్న సమాచారాన్ని ఆ చెయ్యిద్వారా వ్రాయిస్తుంది. ఈ విధానంలో వచ్చే సమాచారం అత్యంత ఖచ్చితమైనది అని భావిస్తారు. ఈవిధానంలో మాధ్యమంగా ప్రవర్తించే వ్యక్తియొక్క ఆలోచనలతో సంబంధం లేకపోవటంవల్ల ప్రేతాత్మ స్వయంగా అందించిన సమాచారమే కాగితంపై వ్రాయబడుతుంది.

**2. అర్ధ యాంత్రిక సైకోగ్రఫీ :** ఈవిధానంలో ప్రేతాత్మ, మాధ్యమంగా ఉన్న వ్యక్తియొక్క చేతిపైన కొంతవరకు ప్రభావాన్ని చూపిస్తుంది. అందువల్ల ఈవిధానంలో ప్రేతాత్మ తనచేత ఏమి వ్రాయిస్తున్నది అన్నవిషయం మాధ్యమానికి అర్ధమవుతుంది. చికోజేవియర్ అనే పరిశోధకుడి అభిప్రాయం ప్రకారం ఈ అర్ధయాంత్రిక సైకోగ్రఫీలో వచ్చే సమాచారం పూర్తిగా యదార్ధంగా ఉంటుందని తెలుస్తున్నది.

**3. అచేతన/అంతరాత్మ సైకోగ్రఫి :** ఈవిధానంలో ఆత్మ తనకు మాధ్యమంగా పనిచేస్తున్న వ్యక్తియొక్క అంతఃచేతనం (సబ్‌కాన్షస్)తో సంభాషిస్తుంది. ఫలితంగా మాధ్యమంగా ఉన్నవ్యక్తి తన అంతరాత్మ చెబుతున్న విషయాలను కాగితంపై వ్రాస్తాడు. కొన్నిసార్లు పెద్దగా విద్యలేని మనుషులయొక్క ఆత్మలు ఈవిధానంలో మాధ్యమాలతో సంభాషిస్తున్నపుడు సరైన పదాలను ఉపయోగించలేకపోవటం జరుగుతుంది. కానీ విద్యాధికులైన మాధ్యమాలు చక్కటి పదజాలాన్ని ఉపయోగించి ఆత్మ తనకు అందించే సమాచాన్ని కాగితంపై వ్రాయటం జరుగుతుంది. అయితే ఈవిధానంలో మాధ్యమంగా ప్రవర్తించే వ్యక్తియొక్క చేతనంకూడా (కాన్షస్‌మైండ్) ఆత్మ అందించే సమాచారాన్ని గమనించే అవకాశం ఉంటుంది కనుక మాధ్యమం, ఆత్మ తనకు అందించే సమాచారాన్ని వేరేవిధంగా కాగితంపైవ్రాసే అవకాశం ఉంటుంది. అనగా అతడు తన ఆలోచనావిధానం ప్రకారం ఆత్మ అందించే సమాచారాన్ని మార్చివ్రాసే అవకాశం ఉంటుంది.

**4.ప్రేరణద్వారా సైకోగ్రఫి :**కొన్నిసార్లు ఆత్మల ద్వారా కొంతమంది మాధ్యమాలకు అస్పష్టంగా సమాచారం అందుతూ ఉంటుంది. ఆ సమాచారం ఆధారంగా ఆ మాధ్యమాలు తమకు తోచిన మార్పులుచేసి సమాచారాన్ని కాగితంపై వ్రాయటం జరుగుతుంది. ఈవిధా నంలో ఒక లోపం ఉన్నది. అది ఏమిటంటే సాహిత్యం పై బాగాపట్టు ఉన్న వ్యక్తి మాధ్యమంగా వ్యవహరిం చినపుడు ఒక ఆత్మ తన మనస్సుకు అందించిన అస్పష్ట సమాచారాన్ని తన పాండిత్యంతో ఆకర్షణీ యంగా మార్చివేయటం జరుగుతుంది. అందువలన ఆత్మ అందించిన అసలు సమాచారం మరుగునపడిపోయి మాధ్యమం యొక్క పాండిత్యం మాత్రమే లిఖితసమాచారంలో కనిపిస్తుంది.



సియన్స్

పై ఫోటోలో గుండ్రంగాకూర్చుని టేబుల్‌పై తమ చేతులను ఒకరివి ఒకరికి

తగిలేలా చేస్తూ ఆత్మలను ఆహ్వానిస్తున్న పరిశోధకులను గమనించవచ్చు. ఈ పరిశోధనలో ఒక ఆత్మవచ్చి వారితో మాట్లాడటం జరిగింది. కొన్నిసార్లు ఆత్మ ఒక వ్యక్తిని (మాధ్యమము) ఆవహించి ఆ వ్యక్తి నోరు మరియు చెవులు ద్వారా ఒక దట్టమైన పొగరూపంలో బయటకు వస్తుంది. దీనినే ఎక్టోప్లాజమ్ అని పిలుస్తారు. ఈ పొగను ఎవరైనా చేత్తో తాకితే చేతికి జెల్లీలాంటి జిగట పదార్థం తగిలినట్టుగా అనిపిస్తుంది. ఒక మాధ్యమం ద్వారా ఎక్టోప్లాజమ్ రూపంలో బయటకు వస్తున్న ఒక ఆత్మయొక్క ఫోటోను మీరు చూడవచ్చు.



ఎక్టోప్లాజమ్



# 9. మృత్యువు రాకను తెలిపే బన్షీ పిశాచి వివరాలు?

ఐరిష్ దేశానికి చెందిన జానపద గాథలలో బన్షీ (Banshee) అనే ఒక భూతం లేదా పిశాచి గురించి విస్తారంగా వ్రాయబడి ఉన్నది. ఐరిష్ భాషలోని బీన్‌సిద్ధే అనే పదం నుండి బన్షీ అనేపదం పుట్టింది. బన్షీ ఒక స్త్రీ ప్రేతాత్మ అని ప్రపంచవ్యాప్తంగా చెప్పబడుతున్నది. మానవులకు చావురాబోయేముందు ఆ విషయాన్ని బన్షీ ద్వారా పైలోకాల అధిపతులు మానవులకు ముందుగా తెలియజేస్తారని భావించబడుతున్నది. ఎవరికైనా ఈ బన్షీ అనే ఆడపిశాచి కనిపిస్తే వారికి త్వరలో మృత్యువు వస్తుందని నమ్ముతారు. కొంతమంది అభిప్రాయం ప్రకారం హత్యచేయబడిన స్త్రీయొక్క లేదా బిడ్డను ప్రసవిస్తూ చనిపోయిన స్త్రీయొక్క ఆత్మ బన్షీగా మారుతుందని తెలుస్తున్నది.

బన్షీ ప్రపంచంలోని అనేకదేశాలలో వివిధ పేర్లతో పిలువబడుతున్నప్పటికినీ ఆ ప్రేతాత్మ ఎల్లప్పుడూ ఒంటరిగా కనిపిస్తుంది. ఐరిష్ ప్రజల మతవిశ్వాసాల ప్రకారంచూస్తే భూమిపై మరల మానవజన్మ ఎత్తటానికి అవకాశం లేని ఆత్మలు ఈ భూమిపైనే అపరిమితమైన మానసిక వేదన అనుభవిస్తూ సంచరిస్తూ ఉంటాయి. పాపాలుచేసి చనిపోయిన వ్యక్తులయొక్క ప్రేతాత్మలు తాము ఎక్కడైతే పాపాలుచేసారో ఆ ప్రదేశాలలో ప్రేతాత్మలుగా సంచరించాల్సి ఉంటుంది. కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం కొన్ని కుటుంబాలకు చెందిన వ్యక్తులు చనిపోయి బన్షీలుగా మారి ఎల్లప్పుడూ తమ కుటుంబాన్ని అంటిపెట్టుకుని ఉంటాయని అవి తమ కుటుంబాలకు మంచి లేదా చెడును చేస్తూ ఉంటాయి. ఈ బన్షీలు తమ వంశంలోని ఆఖరి వారసుడుకూడా చనిపోయినప్పుడు మాత్రమే ఈ భూమిని వదిలి పైలోకాలకు వెళతాయి. అయితే తమ కుటుంబీకులు సముద్రాలుదాటి విదేశాలకు వెళ్ళినపుడు ఈ బన్షీలు వారిని అనుసరించవు. ఒక కుటుంబంలో ఎవరికైనా బన్షీ అనే స్త్రీ పిశాచియొక్క పాట వినిపించినట్లయితే వారికి కొద్ది రోజులలో మరణం సంభవిస్తుందని భావించాలి.





# 10. టిబెట్ మరియు భూటాన్ దేశాలలో అతీంద్రియ శక్తులపై విశ్వాసాలు ఎలా ఉంటాయి?

17వ శతాబ్దంలో దోర్జేషగ్దెన్ అనే ఒక శక్తివంతుడైన బౌద్ధ సన్యాసి టిబెట్‌లోని తన భవనంలో హత్య చేయబడ్డాడు. బలన్మరణం పొందిన ఆ సన్యాసి ప్రేతాత్మగా మారాడు. అయితే ఆయన శిష్యులు ఆ ప్రేతాత్మను దేవతగా భావించి పూజించటం ప్రారంభించారు. 1970లో దలైలామా, ఈ ప్రేతాత్మ, టిబెట్‌కి వ్యతిరేకంగా చైనావారికి సహకరిస్తున్నది అని గుర్తించాడు. ఫలితంగా దలైలామాకు దోర్జేని పూజించే వర్గానికి మధ్య అభిప్రాయ బేధాలు వచ్చాయి.

భారతదేశానికి ఉత్తరంగా హిమాలయ పర్వతాలలో ఒదిగి ఉన్న టిబెట్‌దేశంలో బౌద్ధమతం ప్రచారంలో ఉన్నది. భారతదేశానికి బాగా దగ్గరగా ఉన్న కారణంగా టిబెట్‌దేశంలోకూడా భారతదేశ తాంత్రిక విధానాలే వేర్వేరుపేర్లతో పాటించ బడుతున్నాయి. అయితే టిబెట్‌దేశంలో ప్రేతాత్మలగురించి ఉన్న విశ్వాసాలు చైనా దేశ విశ్వాసాలతో పోలి ఉంటాయి. టిబెట్‌దేశ మతవిశ్వాసాల ప్రకారం పరిశీలించినట్లయితే ఒక మనిషి చనిపోయిన కొంతకాలానికి ఆ మనిషియొక్క ఆత్మ భూతంగా మారుతుంది. అయితే ఒక మనిషి చనిపోయిన ఎంతకాలం తరువాత అతని ఆత్మ, ప్రేతాత్మగా మారుతుంది అన్న విషయం మానవుల అంచనాకి అందదు. ప్రేతాత్మలు ఆకలి పిశాచాలు (హంగ్రీ ఘోస్ట్స్)గా మారతాయని, వీటికి సన్నగాఉండే గొంతు, పెద్దబానలాఉండే పొట్ట ఉంటాయని ఆ సన్నటి గొంతు (ఒక సూదిలో దారం ఎక్కించే రంధ్రం ఎంత సన్నగా ఉంటుందో అంతసన్నని గొంతు)ద్వారా బానలాంటి పొట్ట నిండటానికి సరిపడా ఆహారం ఎప్పటికీ చేరదని అందువలన అవి ఎల్లప్పుడూ ఆకలి పిశాచాలుగా ఉండి అసంతృప్తితో సంచరిస్తూ ఉంటాయని టిబెటన్ దేశీయులు భావిస్తారు. ఈ ఆకలి పిశాచాలు మానవులకు ఎన్నోరకాలుగా హాని కలిగిస్తాయి. వీటిని మంత్రపూరితమైన ఖడ్గంతో సంహరించాలి. లేదా మంత్రాలతో ఒక తాంత్రిక మండలాన్ని భూమిపైన చిత్రించి ఆ మండలంలోకి ప్రేతాత్మలను రప్పించి వాటిని దహనంచేసి నశింపచేయాలి. ఆవిధంగా ప్రేతాత్మ రూపాన్ని కోల్పోయిన ఆత్మలు మరల మానవ జన్మను పొందటానికి అర్హతను సంపాదిస్తాయి.

టిబెట్‌దేశంలో సంవత్సరానికి ఒకసారి డిసెంబరు 29వ తేదీన మానవులను ఆవహించి పీడిస్తున్న ప్రేతాత్మలను వదలగొట్టటానికి ఒక ప్రత్యేక ఉత్సవం జరుగుతుంది.

టిబెట్‌దేశానికి చెందిన తాంత్రికులు తమ మానసిక శక్తితో తుల్ప అనే పేరుగల పిశాచాలను సృష్టించి తమ శత్రువులపై ప్రయోగించగలరు.

ప్రేతాత్మలు కూడా ఆకలిబాధకు గురి అవుతాయి. అంతేకాకుండా వాటికికూడా ఎండ మరియు చలి బాధలుకూడా ఉంటాయని తెలుస్తున్నది. ఒక విచిత్రం ఏమంటే ఎండాకాలంలో చంద్రుడినుండి వచ్చే కిరణాలకు ప్రేతాత్మలు విపరీతమైన వేడికి గురిఅవుతాయి. చలికాలంలో సూర్యునినుండి వచ్చే కిరణాలు గడ్డకట్టుకుపోతాయి. ఇంచుమించుగా ఇలాంటి బాధల్నే నరకంలో ఉండే ప్రేతాత్మలుకూడా అనుభవిస్తాయి. అయితే ఇక్కడ ఒక ముఖ్యమైన తేడాను గమనించాల్సి ఉంటుంది. అది ఏమిటంటే నరకం ఒక పరిమితమైన ప్రాంతమై ఉంటుంది అందులో బాధలుపడే ప్రేతాత్మలు తప్పించుకునే అవకాశం ఉండదు. అయితే భూమిపై సంచరించే ప్రేతాత్మలకు తాము ఎటు ఎళ్ళాలంటే అటు వెళ్ళగలిగే స్వేచ్ఛ ఉంటుంది. ప్రేతాత్మలు ప్రాణశక్తికోసం మానవుల రక్తాన్ని స్వీకరించాలని ప్రయత్నిస్తాయి.

చాలాకాలం క్రితం ఒక వ్యక్తి ఒంటరిగా ఒక కాలిబాటమీద నడుచుకుంటూ వెళుతున్నాడు. మధ్యమార్గంలో ఉన్న ఒకచెట్టుమీద ఎంతకాలంగానో జీవిస్తున్న ఒక దయ్యం కాలిబాటమీదగా వెళుతున్న బాటసారినిచూసి చెట్టుమీదనుండి కిందకుదూకి అతనితోపాటు నడవటం మొదలుపెట్టింది. తన ప్రక్కనే నడుస్తున్న దయ్యానిచూసిన బాటసారికి భయంతో పై ప్రాణాలుపైనే పోయాయి. అయినా ఆ విషయం బయట పడకుండా తనుకూడా దయ్యాన్నే అని తన ప్రక్కన నడుస్తున్న దయ్యానికి చెప్పాడు. వాళ్ళిద్దరూ అలా ముందుకు వెళుతూ ఉండగా వాళ్ళకి ఒక పట్టణం ఎదురయ్యింది. ఆ పట్టణం పొలిమేరల్లో ఉన్న ఒక చెట్టుక్రింద ఆ వ్యక్తి కాసేపు విశ్రమించాడు. ఈ లోగా అతని వెంటవచ్చిన దయ్యం పట్టణంలోకివెళ్ళి అక్కడ రాజభవనంలో నిద్రపోతున్న రాజుగారి కుమారుడియొక్క ప్రాణాన్ని తీసుకుని దాన్ని యాక్‌బర్రె బొచ్చుతో తయారుచేసిన ఒక గోతాంలో పెట్టుకుని వెనక్కి తిరిగివచ్చింది. అది తిరిగి వచ్చి చూసేసరికి బాటసారి నిద్రలేచి కూర్చునిఉన్నాడు. ఆ దయ్యం తనుతెచ్చిన గోతాన్ని ఆ వ్యక్తికి ఇచ్చి "నేను కాసేపు అడవిలోకి వెళ్ళివస్తాను ఈ సంచికి కాపలాగా ఉండు, ఈ సంచిలో ఈ రాజ్యానికి చెందిన రాజకుమారుడి ప్రాణం ఉన్నది జాగ్రత్త" అని చెప్పి వెళ్ళిపోయింది.

ఆ దయ్యం అటువెళ్ళగానే బాటసారి గోతాన్ని భుజానవేసుకుని రాజుగారి దగ్గరకు వెళ్ళాడు. అతడు అక్కడకు వెళ్ళేసరికి చనిపోయిన కొడుకు శవాన్ని ముందుపెట్టుకుని

రాజుగారు, రాణులు దుఃఖిస్తున్నారు. అపుడా బాటసారి రాజుగారిని ఓదార్చుతూ "రాజా! నేను కొన్ని తాంత్రిక ప్రక్రియలను నిర్వహిస్తాను. అపుడు ని కొడుకు బ్రతుకుతాడు" అన్నాడు. బాటసారి చెప్పిన మాటలు విన్న రాజుగారు ఏడుపుమానేసి బాటసారికి దణ్ణంపెడుతూ నిజంగా "నువ్వు నా కొడుకుని బ్రతికిస్తే నీకు అర్ధరాజ్యం ఇస్తా" అన్నాడు. అపుడు ఆ బాటసారి ఏవేవో వచ్చీరాని మంత్రాలు చదువుతూ నిప్పులమీద ధూపంవేస్తూ ఎవరూ చూడకుండా చాలా నేర్పుగా తన దగ్గర ఉన్న గోతాం మూతిని ఊడదీశాడు. అప్పటి వరకు గోతాంతో బంధించబడి ఉన్న రాజుగారి కొడుకు ఆత్మ ఝుంమని బయటకు వచ్చి తన శరీరంలో దూరిపోయింది. ఫలితంగా రాజుగారి కొడుకు బ్రతికాడు. రాజుగారు తన కొడుకుని ప్రేమతో హత్తుకుని ఆ తరువాత బాటసారికి అప్పటికప్పుడే సగం రాజ్యం బహుమతిగా ఇస్తున్నట్టుగా ప్రకటించాడు.

భూటాన్‌కి చెందిన ఈ జానపదగాధ ఆదేశంలో దయ్యాలకు ఎంత ప్రాముఖ్యం ఉన్నదో నిరూపిస్తుంది.



# 11. వుడూ (బ్లాక్ మేజిక్) తాంత్రిక విధానం ప్రత్యేకత ఏమిటి?

వుడూ పశ్చిమ ఆఫ్రికా ప్రాంతానికి చెందిన ఓడం (Vodum) అనే పదం నుండి వుడూ అన్నపదం (Voodoo) పుట్టింది. వుడూ అంటే ప్రేతాత్మ అనిఅర్థం. ప్రపంచంలోని ప్రతి వస్తువుకు ఇంకొక వస్తువుతో సంబంధం ఉంటుంది అని వుడూ సిద్ధాంతం తెలియజేస్తుంది. ఈ ప్రపంచంలో ఆకస్మిక సంఘటనలు నిజంగా జరగవనీ ప్రతి విషయమూ ఏదోఒక కారణంవల్లే జరుగుతుందని వుడూ సిద్ధాంతం చెబుతుంది. వుడూ తాంత్రిక ప్రక్రియలలో ప్రార్ధనలు, నృత్యాలు, పూజలు, బలులు ఇవ్వటం లాంటివి జరుగుతాయి. వుడూ విధానంలో సర్పం ప్రధాన పాత్ర పోషిస్తుంది. వుడూ విధానంలోని అతిపెద్ద పూజారికి లేదా పూజారిణికి సర్పదేవత కనిపిస్తుందని వుడూ విధానాన్ని పాటించేవారు నమ్ముతారు. వుడూ తాంత్రిక విధానంలో నృత్యాలు ఎందుకు ఉంటాయి? అంటే నృత్యాల వలన ప్రేతాలతోను, ప్రేతాత్మల లోకంతోను మానవులకు సంబంధం ఏర్పడతాయి అని గ్రహించాలి.

లాటిన్ అమెరికా ప్రాంతాలకు చెందిన స్థానిక ఆటవిక తెగలవారు అతిప్రాచీన కాలంలో అత్యంత ప్రసిద్ధ నాగరికతగా పేరుపడ్డ అట్లాంటిక్ నాగరికత జాతికి చెందినవారి వారసులు అని పరిశోధకులు పేర్కొంటున్నారు. ఒకనాడు యదార్థంగా ఉన్నది అని పేర్కొనబడిన అట్లాంటిక్ నాగరికత ఏదో ఒక అంతుతెలియని పెను ప్రమాదం కారణంగా సాగర గర్భంలో మునిగిపోయింది. ఆ నాగరికతకు చెందిన వారు క్షుద్ర ప్రయోగాలు చెయ్యటంలో అపారమైన సామర్థ్యాన్ని కలిగి ఉండేవారు. ఆ నాగరికతకు చెందినవారి వారసులైన లాటిన్ అమెరికా ఆటవికులు మానవాతీతమైన శక్తుల్ని కలిగి ఉన్నట్టుగా తెలుస్తున్నది. లాటిన్ అమెరికా


వుడూ దేవత

దేశాల్లోని కొందరు తమ శత్రువుల బొమ్మను మైనంతో తయారుచేసి ఆ బొమ్మ వివిధ భాగాలలో గుండు సూదులను గుచ్చిఆపై భూమిలో పాతిపెట్టటం జరుగుతుంది ఫలితంగా వారి శత్రువులు సర్వనాశనం అయిపోవటం జరుగుతుంది. తమయొక్క ఏకాగ్రతను, మనోబలాన్ని శత్రువుయొక్క బొమ్మపై కేంద్రీకరించి శత్రువుకి హాని కలగాలని కోరుకోవటం వలన శత్రువు తప్పనిసరిగా దెబ్బతినిపోవటం జరుగుతుంది.

మానవుని మనోబలానికి ఉన్న ఎన్నో శక్తులలో బ్లాక్‌మాజిక్‌కూడా ఒకటి. దక్షిణఅమెరికా ఖండంలోని కొలంబియా దేశంలో ఉన్న అర్‌హాకో అనేపేరుగల ఆటవిక జాతివారు ఒకసారి తమ క్షుద్రప్రయోగాల శక్తితో అగ్నిని సృష్టించి ఆ అగ్నితో దిబియా అనేపేరుగల తమ శత్రువుల నగరం మొత్తాన్ని దహించివేసినట్టుగా తెలుస్తున్నది. ఇటీవలకాలంలో ఒక పరిశోధకుడు కొలంబియాదేశంలోని మెరిడా రాష్ట్రంలో ఉన్న శాంతాక్రజ్‌డీమోరా అనే చిన్న పట్టణానికి వెళ్ళినపుడు అతనికి ఆ ప్రాంతానికి చెందిన ఒక వృద్ధ ఆటవికురాలు కనిపించింది. ఆమె వయస్సులో ఉన్నపుడు ఒక ఇండియన్ ఆటవికుడిని (దక్షిణ అమెరికాకు చెందిన ఆటవికుల్ని

కూడా ఇండియన్లు అని పిలుస్తారు) పెళ్ళిచేసుకున్నది. ఆ ఆటవికుడు ఆమెనుతీసుకుని అడవి మధ్యలో ఉన్న తన జాతివారి దగ్గరకు వెళ్ళాడు. అక్కడ ఆమెకు విచిత్రమైన అంశాలు కనిపించాయి. ఆ జాతివారు రాత్రి సమయాలలో జంతువుల రూపాలు ధరించి అడవిలో సంచరిస్తూ ఉండేవారని తమ గుడిసెలు దగ్గరకు వచ్చినపుడు మానవ రూపాలు ధరించేవారని ఆమె చెప్పింది.

ఒకరోజు ఆమెభర్త ఆమె చేతికి ఒక తావీదును ఇచ్చి ఆ తావీదు సహాయంతో ఆమె ఏది కోరుకుంటే అది పొందవచ్చునిచెప్పి ఆపై ఆమెను అక్కడే వదిలిపెట్టి అడవిలోకి వెళ్ళి చనిపోయాడు. ఆ తరువాత ఆమె ఆ తావీదును ఉపయోగించి తాను ఏది చెయ్యాలనుకుంటే అది చేసింది. కొంతమంది, దొంగల వలన తమ వస్తువులను నష్టపోయినపుడు వాళ్ళు ఆమెవద్దకువచ్చి సహాయం చెయ్యమని కోరేవాళ్ళు , ఆమె తన తావీదును పూజించి దొంగలు తీసుకుపోయిన వస్తువులు తిరిగిరావాలని కోరుకునేది. ఫలితంగా ఏవో అదృశ్యహస్తాలు పోయిన వస్తువులు తీసుకువచ్చి ఆమె ముందు ఉంచేవి. ఆమె, ఒక క్రైస్తవ ఫాదర్‌కి తనవద్ద ఉన్న తావీదు గురించి చెప్పింది. ఆ తరువాత ఆ క్రైస్తవఫాదర్ ఆమెకు తెలియకుండా ఆ తావీదును తీసుకుని పలాయనం చిత్తగించాడు. ప్రకృతిశక్తుల్ని అదుపులో పెట్టుకున్న వారికి అద్భుతాలు చెయ్యటం అసాధ్యంకాదని తాంత్రికులు తెలియజేస్తున్నారు.

పశ్చిమ ఆఫ్రికాలో ఉన్న అతిచిన్నదేశం బెనిన్. వుడూ మతానికి మూలస్థానం ఈ దేశమే అయిఉన్నది. దాదాపు 76 లక్షలమంది ప్రజలు ఉన్న ఈ దేశంలో దాదాపు 50 లక్షలమంది వుడూమతాన్ని పాటిస్తారు. ఆ దేశంయొక్క అధికారమతంగా వుడూ ప్రకటించబడింది. వుడూ మతంలో అనేక రకాల దేవతలు మరియు ఆత్మలు పూజలు అందుకుంటాయి. క్షుద్రప్రయోగాలుచేసి ఇతరులకు హానిచెయ్యటం వుడూలో ఒక భాగం మాత్రమే అని గ్రహించాలి. వుడూని మంచికి మరియు చెడుకి కూడా ఉపయోగించవచ్చు. దాదాపు పదివేల సంవత్సరాలనుండి ఈ దేశంలో వుడూమతం కొనసాగుతున్నది. వుడూ సాంప్రదాయాలు, సిద్ధాంతాలు ఒకరినుండి ఒకరికి మౌఖికంగా (ఓరల్) అందుతాయి. ఆ ప్రజల్లో ఎంతో విశ్వాసం మరియు అభిమానం ఉంటేకాని ఇలాంటి అలిఖిత మతసిద్ధాంతాలు ఇన్నివేల ఏళ్ళపాటు కొనసాగవు. వుడూ పూజారులు ప్రతి సంవత్సరమూ వేలాదిమంది పిల్లల్ని ఎన్నికచేసుకుని వారికి వుడూ మత సిద్ధాంతాలను, తాంత్రిక విధానాలను బోధించటం జరుగుతుంది. అయితే ఈ కార్యక్రమాలకు అయ్యే ఖర్చులు విపరీతంగా ఉంటాయి. ఫలితంగా

అక్కడి ప్రజలు తమ పిల్లల్ని అమ్ముకుని వుడూవిద్యకోసం చేసిన ఋణాలు తీర్చవలసి ఉంటుంది.



వుడూ ప్రయోగం

థామస్ అజ్‌నాయ్ అనే ఒక రిపోర్టర్ ఈదేశంలో పర్యటించి వుడూ విద్యను బోధిస్తున్న అనేక పీఠాలను పరిశీలించటం జరిగింది. ఈ సందర్భంలో అనేక విచిత్రమైన అంశాలను థామస్ బయటపెట్టాడు. అందులో ఒకటి ఏమంటే ఒకపుడు పీఠం వాళ్ళు డోపాటోహిజన్లీ అనే 12 సంవత్సరాల అమ్మాయిని వుడూ విద్య నేర్పటంకోసం ఎన్నుకుని ఆమెకు ఇతర పిల్లలతో కలిసి విద్యను నేర్పుతున్నారు. రెండు సంవత్సరాల తరువాత ఆ అమ్మాయి విధివశాత్తు మరణించింది. అయితే వుడూ విద్య ప్రభావంవల్ల ఆమె చనిపోయినా ఆమె ఆత్మ తిరిగివచ్చి ఇతర మానవ పిల్లలతోకలిసి వుడూ విద్యను నేర్చుకోవటం కొనసాగించింది. వుడూ విద్యను నేర్చుకుంటున్న తమ పిల్లల్ని కలుసు కోవటానికి వాళ్ళ పెద్దల్ని వుడూమత పూజారులు అంగీకరించరు.

ఈ సందర్భంలో ఇంకొక విచిత్రమైన విషయంకూడా థామస్‌కి తెలిసింది. అది ఏమిటంటే పామెగన్ అనే ఒక స్త్రీకి దాదాపు ఐదుసార్లు గర్భస్రావాలు అయ్యాయి. దాంతో ఆమె ఒక వుడూ పూజారిని కలుసుకుని తనకు గర్భం నిలిచి బిడ్డకలిగేలా చెయ్యమని వేడుకున్నది. ఆమెకు మగబిడ్డపుడితే ఆ బిడ్డను వుడూ మతంలో చేర్చాలని వుడూ పూజారి షరతుపెట్టాడు. ఆపై ఆ పూజారి ఉచితంగా పామిగన్‌కి బిడ్డ కలగటం కోసం కొన్నిరకాల వుడూ పూజలు నిర్వహించాడు. అతని మంత్ర ప్రభావంవల్ల ఆమె గర్భం నిలిచి ఆమెకు బిడ్డపుట్టాడు. అయితే ఆ తరువాత ఆమె తన బిడ్డను వుడూ

పీఠానికి ఇవ్వటానికి అంగీకరించలేదు. అందువలన వుడూ పీఠానికి చెందినవారు ఆ బిడ్డను బలవంతం లాక్కుని పీఠానికి తీసుకువెళ్ళిపోయారు.

వుడూ (Vodou) అన్నపదాన్ని ఇంగ్లీషులో పెద్ద అక్షరాలలో వ్రాసినపుడు VODOU వుడూ మతం అని అర్థం. చిన్న అక్షరాలలో (లోయర్‌కేస్) ఈ పదాన్ని వ్రాసినట్లయితే Vodou వుడూ మతానికి చెందిన క్షుద్రదేవతల్ని సూచిస్తుందని గుర్తించాలి.

ఆఫ్రికాఖండంలో పుట్టిన వుడూ అనే తాంత్రికవిద్య కాలక్రమంలో ప్రపంచంలో అన్ని ప్రాంతాలలో వ్యాపించింది. ప్రపంచంలోని తాంత్రిక విద్యలన్నింటిలోను వుడూ అత్యంత ప్రమాదకరమైనదిగా భావిస్తారు. ఒకవ్యక్తికి వుడూ ప్రయోగంద్వారా హాని చెయ్యటంకోసం ఆవ్యక్తిని పోలిన ఒక బొమ్మను తయారుచెయ్యటంకోసం ఆవ్యక్తియొక్క వస్త్రాలనుకాని, జుట్టునుకాని, గోళ్ళనుకాని ఉపయోగిస్తారు. ఒకవేళ అవి లభ్యంకానట్లయితే ఆ వ్యక్తియొక్క ఫోటోను వుడూ బొమ్మకు ప్రతీకగా ఉపయోగించటం జరుగుతుంది. శత్రువుయొక్క బొమ్మను తయారుచేసి దానియొక్క గుండెభాగాన్ని తెరచి ఉంచటం జరుగుతుంది. వుడూ తాంత్రిక ప్రక్రియ జరుగుతున్న సమయంలో ఒక జీవించి ఉన్న జంతువుయొక్క దేహాన్నిచీల్చి అందులోనుండి దానిగుండెను బయటకుతీసి దాని గుండెను వుడూ బొమ్మకు గుండె ఉన్నచోట ఏర్పాటుచేసిన గుంటలో పెట్టటం జరుగుతుంది. అప్పటికికూడా ప్రాణంతో కొట్టుకునే ఆ జంతువు గుండెయొక్క ప్రభావంవల్ల మరియు మాంత్రికుడు చదివే మంత్రాలవల్ల ఆ వుడూ బొమ్మకు ప్రాణం వస్తుంది.

అంతేకాకుండా ఆ బొమ్మనుండి బయలుదేరిన ఒక అదృశ్యదారం ఆ బొమ్మతాలూకు వ్యక్తికి అనగా ప్రయోగానికి గురిఅవబోయే వ్యక్తికి తాకుతుంది. ఈ అదృశ్యదారం ఏమాత్రం ఆటంకంలేకుండా వుడూ బొమ్మకు మరియు ప్రయోగానికి గురిఅవుతున్న వ్యక్తి మధ్యఉన్న భౌతిక బంధాన్ని కొనసాగిస్తూ ఉంటుంది. ఆ తరువాత 3 అంగుళాల పొడవు ఉండే సూదులు తీసుకుని (మనిషి శరీరంలో ప్రాణశక్తి ప్రవహించే నాడులలోని ప్రత్యేక ప్రాంతాలలో) బొమ్మ యొక్క వివిధ ప్రాంతాలలో గుచ్చటం జరుగుతుంది. అనగా బొమ్మలో ప్రవహించే ప్రాణశక్తి, ప్రయోగానికి గురి అవబోతున్న వ్యక్తిలోని ప్రాణశక్తి ఒకేవిధానంలో ప్రవహిస్తుంది అన్నమాట. అందువలన బొమ్మలో ఉన్న వివిధ ప్రాంతాలలో సూదులు గుచ్చినట్లయితే ఆ ప్రభావం ప్రయోగానికి గురిఅయిన వ్యక్తిపై కనిపిస్తుంది. అనగా సజీవమైన మనిషిలోని ప్రాణశక్తి ప్రవహించే మార్గంలో

ఉండే నాడులలో బలంగా సూదులు దింపితే ఆ మనిషి ఎలా బాధపడతాడో అతని ప్రతీక అయిన అతని బొమ్మలో సూదులు దింపినా అతను అలానే బాధపడతాడు.

వుడూ ప్రయోగాన్నిచేసే వ్యక్తికి కొన్నివేల మైళ్ళదూరంలో ఉన్న ఇంకొక వ్యక్తిమీద వుడూ ప్రయోగాన్ని చెయ్యటం ఎంతమాత్రం కష్టంకాదు. ఇక్కడ ఒకవ్యక్తియొక్క బొమ్మమీద ప్రయోగం జరిగిన కొద్ది నిమిషాలకే ఎక్కడో సుదూర తీరంలో ఉన్న ఆ బొమ్మతాలూకు వ్యక్తిపై తీవ్రమైన ప్రభావం కనపడుతుంది. శత్రువుయొక్క రోగనిరోధక వ్యవస్థను దెబ్బతీసి తద్వారా శత్రువు చనిపోయేలా చెయ్యటమే వుడూ తంత్ర ముఖ్యవిధానంగా ఉంటుంది. మానవ దేహాలను శ్మశానాలలో దహనం చేసినపుడు వచ్చే బూడిదను వుడూ మంత్రాలతో మంత్రించి దానిని ఒకవ్యక్తిచేత తాగించినట్లయితే ఆ వ్యక్తి తనచేత బూడిద తాగించినవ్యక్తికి బానిసగా మారిపోతాడు. వుడూ ప్రయోగంవలన పురుషునియొక్క శిరస్సు, నెమలి కణతలు, బొటనవేళ్ళు అనారోగ్యానికి గురి అవుతాయి. అదే స్త్రీల విషయానికివస్తే వుడూ ప్రయోగం వలన వారియొక్క వక్షోజములు, మర్మాయవములు హానికి గురి అవుతాయి. సాధారణంగా ఎవరిమీదనైనా వుడూ ప్రయోగం జరిగితే కనీసం 28 రోజులలోగా ఆ వ్యక్తి చనిపోవటం జరుగుతుంది. కొన్నిసార్లు క్షుద్రప్రయోగానికి గురి అయిన వ్యక్తి ధైర్య వంతుడు మరియు దైవభక్తుడు అయినట్లయితే ఆవ్యక్తిని చంపటానికి వుడూ మంత్రగాడికి చాలాకాలం పడుతుంది. కొన్నిసార్లు ఆ ప్రయోగం ఫలించేలోగా ప్రయోగంచేసిన మంత్రగాడో లేదా ఎవరిమీదనైతే ప్రయోగం జరపబడిందో ఆవ్యక్తికాని కాలధర్మం జరగటం జరుగుతుంది. అనగా వాళ్ళకి చనిపోయే సమయం సహజంగానే ఆసన్నమయి చనిపోతారు.

కొంతమంది వుడూ తాంత్రికులు ఇచ్చిన సమాచారం ప్రకారం ఎవరిమీదనైనా వుడూ ప్రయోగం జరిగితే వారికి కొన్ని ప్రత్యేక అనుభవాలు ఎదురవుతాయి. వాటి వివరాలు ఇలా ఉన్నాయి.

రాత్రిపూట నిద్రకు ఇలా జారటం అలా ఎవరో బలంగా ఊపినట్టుగా ఉలిక్కిపడి మెలుకువలోకి రావటం జరుగుతుంది.

నిద్రనుండి మేల్కొని కళ్ళుతెరచి చూసినపుడు ఎదురుగుండా నలుపు లేదా బూడిదరంగు పొగ కనిపిస్తుంది.

క్షుద్రప్రయోగం ఎవరిపైన జరుగుతుందో ఆవ్యక్తియొక్క ఒంటిఛాయ కాలక్రమంలో నల్లగామారిపోతుంది.

శరీరంలోని వివిధ భాగాలలో సూదులుపెట్టి పొడిచినట్టుగా బాధకలుగుతుంది. నాలుకలో విపరీతమైన పోట్లురావటం మరియు నాలుకపై బొబ్బలురావటం జరుగుతుంది.

నిప్పుమీద అరిచేతులుపెడితే ఆ చేతులు ఎలా మండిపోతాయో అదేవిధంగా అకారణంగా అరిచేతులు మండిపోతాయి.

పెదవులు మరియు ఇతర శరీరభాగాలు అకారణంగా వాచిపోతాయి. తరచుగా అలసటకు గురికావటం బలహీనంగా ఉండటం జరుగుతుంది.

శరీరంమీద చీమలుపాకుతున్నట్టుగా అనిపిస్తుంది.

ఒకవ్యక్తిపై వుడూ ప్రయోగం జరిగినట్లయితే అమావాస్యరాత్రి లేదా పౌర్ణమి రాత్రికి సరిగ్గా 72 గంటలముందు వుడూ చేతబడికి సంబంధించిన ప్రేతాత్మ మనిషిపై దాడులుచెయ్యటం ప్రారంభిస్తుంది.

**ప్రేతాత్మగామారిన వుడూ మంత్రగత్తె అన్నేపాల్మర్ :**

ప్రపంచవ్యాప్తంగా ఎన్నోదేశాలలో ప్రేతాత్మలకు సంబంధించిన పురాణాలు జానపద గాథలు ప్రచారంలో ఉన్నాయి. కొందరు నమ్మినా నమ్మకపోయినా ప్రేతాత్మలు ఉన్నమాటవాస్తవం. అనేక పాశ్చాత్యదేశాల్లోని కోటలు, భవనాలు, చర్చిలు కాలక్రమంలో ప్రేతాత్మలకు నిలయాలుగా మారాయని పరిశీలకులు తెలియజేస్తున్నారు. ఉదాహరణకు జమైకాదేశానికి చెందిన రోజ్‌హాల్ అనే పెద్ద భవనంలో జరిగే విచిత్రమైన సంఘటన గురించి చెప్పవచ్చు. కొన్ని దశాబ్దాలక్రితం అన్నీపాల్మర్ అనే ఫ్రెంచి అమ్మాయి, అనేక ఎకరాల భూమికి మరియు జమైకా సముద్రతీరంలో ఉన్న రోజ్‌హాల్ అనే పెద్ద భవనానికి అధిపతిగా ఉండే ఒక ధనికుడిని వివాహం ఆడింది. ఈ ధనికుడికింద డజన్లకొద్దీ బానిసలు పనిచేస్తూ ఉండేవాళ్ళు. ధనికుడిని పెళ్ళాడిన అన్నీ విపరీతమైన క్రూరస్వభావాన్ని కలిగి ఉండేది. ఆమె చెప్పినట్లు చెయ్యకపోతే ఏ బానిసని అయినా కొరడాతో చావకొట్టేది. ఆమె తన వద్దపనిచేసే మగ బానిసలలో బలంగా, అందంగా ఉన్న యువకులను ఎన్నుకుని వాళ్ళని తన పడక గదికి రప్పించి వాళ్ళతో శృంగార సుఖాలను పొందుతూ ఉండేది. కొన్నాళ్ళు వాళ్ళని అనుభవించిన తరువాత ఆమెకి వాళ్ళపై మోజుతీరిపోయేది. అపుడు ఆమె ఆ యువ బానిసల్ని క్రూరంగా చంపించి గోతిలో పాతిపెట్టించేది. ఆమె తన భర్తనుకూడా చంపింది అన్న పుకార్లు అప్పట్లో ప్రచారంలోకి వచ్చాయి. ఆమె కనీసం ఇద్దరు

ముగ్గురు భర్తల్నిమార్చినట్టుగా తెలుస్తున్నది. ఈమె వుడూ అనే తాంత్రికవిద్యలో అఖండమైన పాండిత్యాన్ని కలిగి ఉండేది. ఈమె తన తాంత్రికశక్తితో బానిసల్ని వశీకరణచేసుకుని వాళ్ళని తన ఇష్టం వచ్చినట్టుగా ఉపయోగించుకునేది. కాలక్రమంలో అనీపాల్‌మర్ రోజ్‌హాల్ భవనంయొక్క మంత్రగత్తెగా పేరుపొందింది.

ఒకసారి ఆమె ఒక వుడూ మాంత్రికుడి మేనకోడలి ప్రేమికుడిని చంపేసింది. ఫలితంగా ఆ మాంత్రికుడు తన క్షుద్రశక్తితో అనీపాల్‌మర్‌ను చంపేసాడు. ఈనాటికీ రోజ్‌హాల్ భవనంలో అనీపాల్మర్‌యొక్క ప్రేతాత్మ సంచరిస్తూ కనిపిస్తున్నదని అనేకమంది పరిశోధకులు తెలియజేస్తున్నారు.



## 12. జెర్సీడెవిల్ మిస్టరీ ఏమిటి?

ఈ గ్రంథంలో ప్రపంచవ్యాప్తంగా ఉన్న అనేక దేశాలలో కనిపిస్తాయి అని చెప్పబడే అనేక రకాల క్షుద్రశక్తుల గురించి వివరించటం జరిగింది. కొంతమంది ఆధునికులకు ఈ క్షుద్రశక్తులయొక్క రూపురేఖల గురించి వివరిస్తే ఏమాత్రం వాటిని నమ్మకుండా అవన్నీ ఆయా దేశాలలోని ప్రజల మూఢవిశ్వాసాలని కొట్టిపారేస్తారు. కానీ ఈ సృష్టిలో మనకి తెలియని జీవులు మరియు రూపాలు ఎన్నో ఉన్నాయి. భూమిమీద ఎన్ని రూపాలలో ఎన్నిరకాల జీవులు ఉన్నాయో ఇంచుమించుగా సముద్రంలో అలాంటి రూపాలలో ఉండే జీవులు ఉన్నాయని పరిశోధకులు ఏనాడో నిరూపించారు. చైనా, జపాన్, ఫిలిప్పైన్స్, సింగపూర్, మలేషియా, థాయ్‌లాండ్, ఇండోనేషియా లాంటి కొన్ని ఆసియాదేశాలలోని కొన్ని ప్రాంతాలలో మనిషి మరియు జంతువు కలిస్తే ఎలా ఉంటుందో అలాంటి రూపాలలో సంచరించే క్షుద్రశక్తులు ఉన్నాయి అని కొందరు అతీంద్రియశక్తులపై పరిశోధనలుచేసేవారు బలంగా విశ్వసించటం జరుగుతున్నది. ఎక్కడాకో ఎందుకు ఎవరైనా మంచి వర్షాకాలంలో బాగా పల్లెటూరు అయి చెట్లతో నిండిన ఒక గ్రామానికివెళ్ళి రాత్రి సమయంలో ఏదైనా ఇంట్లో ఉన్నట్లయితే (ముఖ్యంగా ఆ రాత్రి సమయంలో బయట వర్షం పడుతూ ఉండాలి ఇంట్లో కరెంటు దీపాలు వెలుగుతూ ఉండాలి) వారికి జీవితంలో

అప్పటివరకు ఎన్నడూ చూడని విచిత్రమైన కీటకాలు ఆ ఇంట్లో విద్యుద్దీపాల వెలుగుల్లో దర్శనమిస్తాయి.

మూడు అడుగుల పొడవు ఉండి జానెడు ఎత్తుఉండే అతిసన్నటి మిడతలు రంగురంగుల్లో మెరిసిపోయే మూడు అంగుళాల పొడవు ఉండే సాలీడులాంటి జీవులు ఇంకా రకరకాల విచిత్ర కీటకాలు ఆ లైట్ల వెలుగులో ఆ ఇంట్లో కనిపిస్తాయి. అంత వరకు అలాంటి జీవులు ఉంటాయని తెలియనివారు వాటినిచూసి ఆశ్చర్యానికి లోను కావటం జరుగుతుంది. నిజానికి వాళ్ళకి ఆ జీవుల గురించి తెలియకపోయినప్పటికీ ఆ జీవులు అనాదినుండి ఉంటూనే ఉన్నాయి. వాటిని ప్రత్యక్షంగా అక్కడకువెళ్ళి చూసినపుడు మాత్రమే అలాంటివి ఉంటాయని వాళ్ళకి అర్ధమవుతుంది. అదేవిధంగా ఏ ప్రాంతంలో ఏవిధమైన రూపాలలో క్షుద్రశక్తులు సంచరిస్తున్నాయో యదార్థంగా తెలుసుకోవటానికి ఆ ప్రాంతానికి వెళ్ళితీరాలి. అలాంటి ప్రయత్నం ఏమీ చెయ్యకుండా, అలాంటివి నిజంగా లేవు అని వాదించటం బుద్ధిమంతులు చెయ్యవలసిన పనికాదని నా భావన.

అమెరికాదేశంలోని న్యూజెర్సీ ప్రాంతంలో ఉన్న అరణ్యాలలో కొన్ని శతాబ్దాల నుండి అప్పుడప్పుడూ ఒక జంతువు లాంటి క్షుద్రశక్తి కనిపిస్తూ ఉంటుందని, ఆ ప్రాంత ప్రజలు చెప్పుకుంటూ ఉంటారు. గుర్రంలాంటి శరీరాన్ని, గబ్బిలానికి ఉండే పెద్ద పెద్ద రెక్కలను, ఒక తోకను కలిగిఉండే ఈ క్షుద్రశక్తి న్యూజెర్సీ అడవులలో అనేకసార్లు కనిపించినందువల్ల దీనిని జెర్సీ డెవిల్ అని పిలుస్తున్నారు. అమెరికాలోని అనేక వార్తాపత్రికలలో దీనికి సంబంధించిన వార్తలు అప్పుడప్పుడూ కనిపిస్తూ ఉంటాయి. అమెరికాలో అత్యంత విశ్వసనీయమైన పత్రికగా పేరుపొందిన రీడర్స్ డైజెస్ట్‌లో కూడా జెర్సీడెవిల్‌కి సంబంధించిన సమాచారం ప్రచురించబడింది. ఇటీవలకాలంలో అనగా 2007వ సంవత్సరంలో ఈ జెర్సీడెవిల్ కొంతమందికి కనిపించినట్టుగా తెలుస్తున్నది.

అసలు ఈ జెర్సీడెవిల్ ఎలా ఏర్పడింది? అన్న విషయం గురించి విభిన్నమైన వృత్తాంతాలు వినిపిస్తున్నాయి. వాటిలో అతిముఖ్యమైనది ఇలా ఉన్నది. క్రీ.శ1735వ సంవత్సరంలో న్యూజెర్సీ బ్రిటీషువారి వలస ప్రాంతంగా ఉండేది. విశాలమైన అడవులతోకూడిన న్యూజెర్సీ ప్రాంతంలో ఒకచోట ఇసుక నేలలు, ఒకచోట బురద నేలలు ఉంటాయి.

ఆ రోజుల్లో ఆ ప్రాంతంలో మిస్ జేన్‌లీడ్స్ అనే స్త్రీ గర్భవతిగా ఉన్నది. అత్యంత పేద కుటుంబానికి చెందిన ఆమె జెర్సీ ప్రాంతంలోని తోటలలో పనిచేస్తూ

పొట్టపోసుకుంటూ ఉండేది. ఆమె అప్పటికే 12మంది పిల్లల్ని కనిఉన్నది. ఆమె తన 13వ బిడ్డని కొద్ది రోజులలో కనటానికి సిద్ధంగా ఉన్నది. ఆమె అప్పుడప్పుడూ తన స్నేహితులతో ఇలా అంటూ ఉండేది. "ఎందుకనో నాకు పుట్టబోయే 13వ బిడ్డ సైతాన్‌కి వారసుడు అవుతాడు". ఆమె స్నేహితులు ఆమె మాటల్ని పెద్దగా పట్టించుకోలేదు. 12మంది బిడ్డల్ని కన్న జేన్ 13వ బిడ్డని పెద్ద శ్రమలేకుండానే ప్రసవిస్తుందని ఆమె తాలూకు బంధువులు భావించారు.

అయితే ఆమెకు ప్రసవం కష్టమయిపోయింది. ఆ సమయంలో ఆమె శరీరం ఎక్కడకక్కడ బిగదీసుకుపోవటం ప్రారంభించింది. ఆమె హఠాత్తుగా వికృతంగా ఇలా అరవటం ఆరంభించింది. "అది నన్ను విపరీతంగా బాధపెడుతున్నది. అది నా శరీరంలోంచి బయటకు రావటానికి నా మర్మస్థానాన్ని భయంకరంగా గాయ పరుస్తున్నది". ఆమె తన నుండి బయటకు రావటానికి ప్రయత్నిస్తున్న బిడ్డ తనని హింసిస్తున్నట్టుగా గ్రహించి భయంతో అరవటం ప్రారంభించింది. ఆ బిడ్డ అంతకంతకి ఆమెను హింసిస్తూ ఆమె నుండి బయటకు వస్తుండటంతో ఆమె భయంకరమైన స్వరంతో "నానుండి బయటకు వస్తున్నది మనిషికాదు, అది పిశాచి అని అరిచింది".


జెర్సీడెవిల్

నిజానికి ఆమె ప్రసవిస్తున్నది మామూలు బిడ్డనే అయినప్పటికీ ప్రసవవేదన తట్టుకోలేక ఆమె తన పుట్టబోయే బిడ్డను పిశాచి అని తిడుతూ రోదించటంతో ఒక విచిత్రం జరిగింది. ఆమె శాపాలు పుట్టబోతున్నబిడ్డకు తగిలి ఆ బిడ్డ పిశాచిగామారి జన్మించింది. ఇంకొన్ని కథనాల ప్రకారం ఒక స్త్రీ ఒక మామూలు బిడ్డనే ప్రసవించిందని అయితే పుట్టినబిడ్డ హఠాత్తుగా పిశాచిరూపం ధరించిందని చెప్పబడుతున్నది. ఈ అన్ని ఉదంతాలలోను పుట్టినబిడ్డ క్షణాలలో పెరిగి పెద్దదయి జెర్సీడెవిల్‌గామారి ఆ ఇంటిని వదిలిపెట్టి వెళ్ళిపోయినట్టుగా తెలుస్తున్నది. మరికొంతమంది అభిప్రాయం ప్రకారం ఒక స్త్రీకి పుట్టినబిడ్డ పిశాచిగామారి ఆ ఇంట్లో ఉన్న అందరినీ చంపి తినివేసి ఆపై ఆ ఇంటికప్పును చీల్చుకుని పైకి ఎగిరిపోయినట్టుగా తెలుస్తున్నది.

ఈ జెర్సీ డెవిల్ అర్ధరాత్రి సమయాలలో ఎక్కువగా పశువులనివాసాలపై దాడిచేసి వాటి రక్తమాంసాలను పీల్చివేసి బొమికలను చెల్లాచెదరుగా పడవేసి వెళ్ళిపోతుందని ఆ ప్రాంతం ప్రజలు చెబుతున్నారు. 1740వ సంవత్సరంలో ఒక క్రైస్తవఫాదర్ కొన్ని ప్రత్యేక తాంత్రిక పూజలు నిర్వహించి జెర్సీ డెవిల్ రాత్రి సమయాలలో రాకుండా నిరోధించాడు. అయితే ఆ నిరోధం ఒక్క వంద సంవత్సరాలు మాత్రమే పనిచేస్తుందని ఆ ఫాదర్ అక్కడవారికి చెప్పటం జరిగింది. సరిగ్గా వంద సంవత్సరాల తరువాత 1845వ సంవత్సరం నుండి జెర్సీ డెవిల్ మళ్ళీ మానవులకు అప్పుడప్పుడూ కనిపించటం మొదలయ్యింది. పైన్‌బారెన్స్ ప్రాంతానికి దగ్గరలో ఉన్న ఒక మెటల్ ఫౌండ్రీకి కొందరు మిలటరీ అధికారులు తమవద్ద ఉన్న ఫిరంగులయొక్క పనితీరును పరిశీలించటానికి తీసుకువచ్చారు. ఆ మిలటరీ అధికారులలో ఒకడైన స్టీఫెన్‌డెకాటర్ తల ఎత్తిపైకి చూసినపుడు పైన ఒక విచిత్ర ఆకారంలో ఉన్న జంతువు ఎగురుతూ కనిపించింది. అది జెర్సీ డెవిల్ అని తెలియని ఆ అధికారి దానిమీదకు ఒక ఫిరంగిని పేల్చాడు. విచిత్రంగా కొన్ని కిలోల బరువున్న ఫిరంగి గుండు గాలిలోకి ఎగిరింది కాని, విచిత్ర జంతువును తాకలేకపోయింది. ఆ జంతువు ఆకాశంలో ఒక దిక్కుకి ఎగిరిపోయింది.

ఆ తరువాత కాలంలో అనగా 1816-1839 మధ్యకాలంలో బోర్డర్‌టౌన్ (న్యూజెర్సీ) ప్రాంతంలో నివాసం ఉన్న జోసెఫ్, న్యూజెర్సీ అడవులలో వేటాడుతున్న సమయంలో అతనికి జెర్సీడెవిల్ కనిపించినట్టుగా చెప్పాడు. నిజానికి ఆ సమయంలో జెర్సీడెవిల్‌మీద క్రైస్తవఫాదర్ విధించిన మంత్రబంధం ఉన్నప్పటికీ జెర్సీడెవిల్ బయట తిరుగుతూ ఎలా కనిపించింది? అందుకు కొందరు పరిశోధకులు ఇలా సమాధానం చెబుతున్నారు. మంత్రబంధంవల్ల జెర్సీడెవిల్ మానవులపై తనదృష్టిని మరల్చుకున్నది. కానీ దానిమీద ఆసక్తి ఉన్న మానవులకు అది అనేకసార్లు కనపడటం జరిగింది. గిట్టలలాంటి దానిపాదాల అడుగులు న్యూజెర్సీలోని అనేక ప్రాంతాలలో కనిపించాయని చెబుతారు.

ఆ తరువాత 19వ శతాబ్దం ప్రారంభ భాగంలో అనగా 1909వ సంవత్సరంలో ఒక వారంరోజుల వ్యవధిలో దాదాపు వందమందికి జెర్సీడెవిల్ కనిపించినట్టుగా తెలుస్తున్నది. ముఖ్యంగా ఎవాన్స్ దంపతులు 1909 జనవరి 19వ తారీఖు రాత్రి తమ గృహంలో నిద్రపోతున్నపుడు ఏవో వికృతమైన శబ్దాలు వినపడి నిద్రలేచి బెడ్‌రూం కిటికీలోంచి బయటకుచూడగా దాదాపు 10 నిమిషాలపాటు జెర్సీడెవిల్ వాళ్ళకి దర్శనమిచ్చింది. విద్యాధికుడైన ఎవాన్స్ తనకు కనిపించిన జెర్సీడెవిల్ ఎలా ఉన్నదో కళ్ళకు కట్టినట్టుగా వర్ణించాడు. జెర్సీడెవిల్ దాదాపు మూడున్నర అడుగుల

ఎత్తులో ఉన్నది. దానితల కుక్కలాగాను, ముఖం గుర్రంలాగాను ఉన్నది. దానికి పొడవైన మెడ ఉన్నది. రెండు అడుగుల పొడవున్న రెండు రెక్కలు ఉన్నాయి. దాని వెనుకకాళ్ళు కొంగకాళ్ళలాగా ఉన్నాయి. దాని కాళ్ళకు గుర్రపు డెక్కలు అతికినట్టుగా కనిపించింది. ఆ జంతువు వెనకకాళ్ళపై నడుస్తూ పొట్టిగా మరియు పంజాలతో కూడివున్న ముందుకాళ్ళను పైకెత్తి ఉంటుంది. మేము చూస్తున్నంతసేపు అది ముందు కాళ్ళను నడకకోసం ఉపయోగించలేదు. ఆ దృశ్యంచూసిన నాకు, నాభార్యకు భయంతో గుండె గడ్డకట్టుకుపోయింది. అయినా ధైర్యం కూడగట్టుకుని కిటికీ తలుపులు తెరచి "షూ" అని పెద్దగా అరిచాను. అపుడ ఆ జంతువు గిరుక్కున వెనక్కి తిరిగి నావైపు చూస్తూ మొరిగి ఆపై గాలిలోకి ఎగిరిపోయింది.

కాలక్రమంలో సాంకేతిక పరిజ్ఞానం పెరిగిపోయి అద్భుతమైన సాంకేతిక పరికగాలు అందుబాటులోకి రావటంతో రెండవ ప్రపంచయుద్ధం తరువాత జెర్సీ డెవిల్ గురించిన వార్తలు క్రమంగా తగ్గిపోవటం ప్రారంభం అయ్యింది. అయితే 1951 మరియు 52 ప్రాంతంలో జిప్స్‌టౌన్ మరియు పౌల్‌బోరో ప్రాంతాలలో జెర్సీడెవిల్ కనిపించినట్టుగా వార్తలు వచ్చాయి. ఆ సమయంలో ఆ ప్రాంతంలోని వార్తాపత్రికలు జెర్సీడెవిల్ గురించి ఉన్నవీ లేనివీ గుదిగుచ్చి సంచలనాత్మక వార్తలు ప్రచురించాయి. అసలే జెర్సీడెవిల్ భయంతో బాధపడుతున్న ప్రజలు వార్తాపత్రికల ప్రచారంతో మరింత భయాందోళనలకు గురికావటం జరిగింది.

1966వ సంవత్సరంలో ఒక వ్యవసాయ క్షేత్రంలో 31 బాతులు, 4 పిల్లులు, 2 కుక్కలు ఒక అదృశ్య జంతువుచేత చంపబడ్డాయి. ముఖ్యంగా వాటిలో ఒక జర్మన్ షపర్డ్‌డాగ్ గొంతు దారుణంగా చీల్చి చంపబడింది. సాంకేతిక పరిజ్ఞానం విపరీతంగా పెరిగిన 70వ దశకంలో జెర్సీడెవిల్ కనిపించింది అన్న వార్తలు మళ్ళీ మొదలయ్యాయి. 1927వ సంవత్సరంలో ఒక కారు డ్రైవర్ రాత్రి సమయంలో సాలేం అనే ప్రాంతానికి కారు నడుపుకుంటూ వెళుతూ ఉండగా హఠాత్తుగా అతనికారు టైరు పంచరు అయ్యింది. అతను కారుదిగి ఎలాగో కష్టపడి కారు టైర్ మార్చి మరల కారులోకి ఎక్కి కారును స్టార్ట్ చెయ్యబోతుండగా అతనికారు ఎవరో ఊపేస్తున్నట్టుగా ఊగసాగింది. కారుదిగి చూసిన ఆ డ్రైవర్‌కి కారుపై భాగంలో భారీ ఆకారంలో నుంచుని ఉన్న వికృత జంతువు (జెర్సీడెవిల్) కనిపించింది. దాంతో ఆ డ్రైవర్‌కి విపరీతమైన భయం మరియు వణుకు కలిగి పెద్దగా గావు కేకలుపెడుతూ పరుగెత్తుకుంటూ సాలేంకి చేరుకున్నాడు. ఆ తరువాత అతని విషయాన్ని సాలేం పోలీస్‌స్టేషన్‌లోకి పోలీసులకు తెలియజేసాడు. 1930 ఆగష్టు నెలలో బెర్రీ పళ్ళుకోస్తున్న ఒక కూలీకి పొలాల్లో బెర్రీ పండ్లను తినివేస్తున్న విచిత్ర జంతువు కనిపించింది. ఆ జంతువు ధాటికి ఎకరాలకొద్ది బెర్రీపంట

నాశనం అయిపోయింది. 1951 నవంబర్ నెలలో జిబ్స్‌టౌన్ ప్రాంతంలో ఉన్న ఒక క్లబ్‌హౌస్‌లో ఆడుకుంటున్న కొంతమంది పిల్లలకి జెర్సీడెవిల్ కనిపించింది. అయితే అది పిల్లలకి ఏవిధమైన అపకారమూ చెయ్యలేదు. ఆ సమయంలో ఆ ప్రాంతంలో ఉన్న డజన్లకొద్దిమంది తాము జెర్సీ డెవిల్‌ని చూసామని చెప్పటం జరిగింది. 1960 ప్రాంతంలో మేస్‌లాండింగ్ ప్రాంతంలో ఉన్న కొంతమంది ప్రజలకి రాత్రి సమయాలలో నెత్తురు గడ్డకట్టించే భయానకమైన దాని అరుపులు కొంతకాలంపాటు వినిపించాయి.

ఆ శబ్దాలు ఎవరుచేస్తున్నారో? అర్థంకాని ఆ ప్రాంత ప్రజలు భయాందోళనకు గురి అయ్యారు. ప్రభుత్వం ఈ విషయాన్ని తీవ్రంగాతీసుకుని పోలీసుల్ని రంగంలోకి దింపింది. పోలీసులు ఎంత ప్రయత్నించినా ఆ శబ్దాలు ఎవరుచేస్తున్నారో తెలుసుకో లేకపోయారు. ఎవరో సంఘ వ్యతిరేకశక్తులు ఈ శబ్దాలను చేస్తున్నారని అవి ఏ క్షుద్రశక్తుల వల్ల రావటంలేదని, భయపడవద్దని ప్రభుత్వం అనేక ప్రకటనలను జారీ చేసింది. అయితే ఆ అరుపులు ఎక్కడనుండి వస్తున్నాయో? ఎవరుచేస్తున్నారో? ప్రభుత్వానికి ఏమాత్రం తెలియకపోవటం ఒకవిశేషం.

తాజాగా అనగా 1993వ సంవత్సరంలో దక్షిణ న్యూజెర్సీ ప్రాంతంలో ఉన్న ముల్లికానది ఒడ్డున ఉన్న రోడ్డు మార్గంలో జీపులో వెళుతున్న జాన్‌ఇర్విన్ అనే ఒక ఫారెస్ట్ రేంజర్‌కి రోడ్డుమీద కొంచెం దూరంలో జెర్సీడెవిల్ కనిపించింది. అది దాదాపు ఆరు అడుగుల ఎత్తు ఉన్నదని, దాని ఒంటిమీద జడలుకట్టిన బొచ్చు ఉన్నదని నెత్తిమీద రెండు కొమ్ములు ఉన్నాయని చెప్పాడు. అయితే అది జెర్సీడెవిలా? లేక ఇంకొక విచిత్రమైన జంతువా, అన్నవిషయం అర్థంకావటంలేదు. రోడ్డుకి అడ్డంగా ఉన్న ఆ జంతువు తనకేసి కొద్ది క్షణాలపాటు తీక్షణంగా చూసిందని తానుకూడా దాన్ని పరిశీలనగా చూసానని కొంతసేపటికి ఆ జంతువు అడవులలోకి పరుగెత్తిందని ఆ ఫారెస్ట్‌రేంజర్ తెలియజేసాడు.

జెర్సీడెవిల్ నిజంగా లేదని, కంగారు (కంగారుజంతువు)నో లేక పెద్ద ప్రమాణంలో ఉండే కొంగనో చూసి జెర్సీడెవిల్ అని ప్రజలు భ్రమపడుతున్నారని కొందరు హేతువాదులు వాదిస్తున్నారు. అయితే సమాజంలో ఉన్నతస్థానంలో ఉన్న వ్యాపారులు, పోలీసు అధికారులు మరియు సివిల్‌సర్వీస్ అధికారులు తాము జెర్సీడెవిల్‌ను చూసామని సాక్ష్యం చెప్పటం జరిగింది. విద్యాధికులు మరియు ఆధునిక పరిజ్ఞానంకల వీళ్ళు దేన్నోచూసి జెర్సీడెవిల్ అని భ్రమపడటం సాధ్యమా?



# 13. ప్రేతాత్మగా మారిన పారాసైకాలజిస్టు మాంటేగ్‌కీన్ వివరాలు?

తన మృతదేహాన్ని కొందరు వ్యక్తులు అంబులెన్స్‌లోకి ఎక్కిస్తుంటే మాంటేగ్ ఆత్మ నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయింది. అతనికి కొంచెం దూరంలో అతని భార్య వెరోనికా శూన్యంలోకిచూస్తూ మనస్సులో కుమిలిపోతున్నది. ఆమె కళ్ళనుండి కన్నీరు వరదలాగా పొంగుతున్నది. ఆమె ప్రక్కన ఉన్న స్నేహితులు ఆమెను బాధపడవద్దని ధైర్యంగా ఉండమని ఆమెకు చెబుతున్నారు. ఎవరు ఎన్ని చెబుతున్నా వెరోనికా తన బాధను నియంత్రించుకోలేకపోతున్నది. ఆమెకు తెలుసు తనభర్త తనని శాశ్వతంగా వదలి పరలోకానికి వెళ్ళిపోయాడని.

అప్పటికి ఒక గంటముందు మాంటేగ్ లండన్‌లోని "రాయల్ సొసైటీఆఫ్ఆర్ట్స్" భవనంలో అతీంద్రియ శక్తులగురించి ఉపన్యాసం ఇస్తూ హఠాత్తుగా గుండెపోటుతో నేలపై కూలిపోయాడు. కన్నుమూసి తెరిచేలోగా ఆ గుండెనొప్పి మాంటేగ్ ఆత్మను అతని శరీరంనుండి వేరుచేసింది. మాంటేగ్ మరణించాడు. కొద్దిరోజుల క్రితం 75 సంవత్సరాల వృద్ధుడు అయిన మాంటేగ్‌కీన్ తనభార్యతో "నేను చనిపోయినా నా ఆత్మ మళ్ళీ నీదగ్గరకు తిరిగివస్తుంది. ఆత్మలు నిజంగా ఉంటాయనీ మరణం తరువాత కూడా మనిషికి జీవితం ఉంటుందని నమ్మి ఆవిషయాలపై పరిశోధనచేస్తున్ననేను చనిపోయిన తరువాత మరల ఆత్మగా తిరిగివచ్చి నా పరిశోధనలను కొనసాగిస్తాను" అన్నాడు. ఒకవిధంగా మాంటేగ్ తన భార్యకు ఒక వాగ్దానాన్ని చేసాడు అన్నమాట.

ఆరిజోనా యూనివర్సిటీకి చెందిన ప్రొఫెసర్ గారీ షావార్జ్ అనే పరిశోధకుడు మీడియాలో మాట్లాడుతూ ఇలా అన్నాడు. మాంటేగ్ ఆత్మరూపంలో ఇప్పటికీ జీవించే ఉన్నాడు ప్రేత మాధ్యమాలద్వారా (మీడియమ్స్) పరలోక విషయాలను మాకు తెలియజేస్తున్నాడు. ఆయన ఇప్పుడుకూడా ఆత్మరూపంలో తన పరిశోధనలు కొనసాగిస్తున్నాడు.

ఒక జర్నలిస్ట్‌గా మరియు గౌరవనీయుడైన రైతుగా జీవించిన మాంటేగ్‌కీన్ 2004 జనవరి 15వ తేదీన హార్ట్‌ఎటాక్‌తో అకస్మాత్తుగా మృతిచెందాడు. ఆయన "సొసైటీఫర్ సైకికల్‌రీసర్చ్"కి చెందిన కమిటీలో సభ్యుడుగా ఉండి క్రాప్‌సర్కిల్స్ గురించి మరణానంతర జీవితం గురించి అనేక దశాబ్దాలపాటు లోతైన పరిశోధనలుచేసాడు. చనిపోయిన తరువాత మనిషియొక్క ఆత్మ తనవారి దగ్గరకు

తిరిగివస్తుంది అని వాదించే మాంటేగ్ స్వయంగా తానే ప్రేతాత్మగామారి తన సహచరులవద్దకు, భార్య వద్దకువచ్చి మనిషికి మరణంతో జీవితం అంతంకాదని నిరూపించటం జరిగింది. మాంటేగ్ చనిపోయిన 6వ రోజున అతని స్నేహితుడైన దినేష్‌సోలంకి అనే పరిశోధకుడికి మాంటేగ్‌యొక్క ఆత్మ కనిపించింది. తన ఇంట్లో టి.వి.చూస్తూ కూర్చున్న దినేష్‌సోలంకికి ఆ టి.వి. ప్రక్కన చిరునవ్వుతో చూస్తున్న మాంటేగ్‌యొక్క శిరస్సు కనిపించింది. ఆత్మకు మరణంలేదు అన్న తన వాదన నిజమైనందుకు మాంటేగ్‌యొక్క ముఖంలో అంతులేని సంతృప్తి కనిపించిందని దినేష్ చెప్పటం జరిగింది. కొద్దినిమిషాల పాటు కనిపించిన మాంటేగ్ శిరస్సు ఆ తరువాత గోడలోకి అదృశ్యం అయిపోయినట్టుగా కనిపించిందని దినేష్ తెలియజేసాడు. ఇది జరిగిన కొన్ని వారాల తరువాత ప్రపంచ వ్యాప్తంగా ఉన్న అనేకమంది ప్రేతాత్మ మాధ్యమాలకు (మీడియమ్స్) మాంటేగ్ ఆత్మ పరలోకానికి సంబంధించిన విస్తారమైన సమాచారాన్ని అందించినట్టుగా తెలుస్తున్నది.

మొదటిసారి మాట్లాడే పసిపిల్లవాడు ఏవిధంగా తడబడుతూ అపసవ్యంగా మాట్లాడతాడో ఆవిధంగానే మాంటేగ్ ఆత్మ మాట్లాడేవిధానం ఉన్నట్టుగా అనేకమంది మాధ్యమాలు చెప్పటం జరిగింది. తమకు అత్యంత స్పష్టమైన సమాచారాన్ని మాంటేగ్ ఆత్మ అందించినట్టుగా అనేకమంది పారాసైకాలజిస్టులు చెప్పటం జరిగింది. మాంటేగ్ ఆత్మనుండి తొలిసారి సమాచారం అందుకున్నది దినేష్‌సోలంకి కావటం విశేషం. మొదటిసారి దినేష్‌కి కనిపించిన మాంటేగ్ ఆత్మ రెండవసారి దినేష్‌తో ఇలా చెప్పింది. "నా అస్తికలను ఒక రత్నంగామార్చి తనమెడలో నెక్‌లెస్‌గా ధరించమని నాభార్య వెరోనికాకు తెలియజెయ్యి". ఈ మాట విన్న దినేష్ దిగ్భ్రాంతి చెందాడు. అస్తికలను రత్నంగా మార్చటం ఎలాగో అతనికి అర్ధంకాలేదు. ఆ తరువాత దినేష్ ఈ విషయాన్ని వెరోనికాకు తెలియజేసినపుడు ఆమె ఆశ్చర్యంతో నోటమాటరాక ఉండిపోయింది.

మాంటేగ్ చనిపోవటానికి ముందురోజు రాత్రి తన బెడ్‌రూంలో కూర్చుని తాను మరియు మాంటేగ్ మాట్లాడుకున్న మాటల్ని ఎక్కడో ఉన్న దినేష్‌వినే అవకాశంలేదు. అలాంటిది మాంటేగ్ తనతో అన్నమాటల్ని దినేష్ చెప్పాడు అంటే తప్పనిసరిగా దినేష్‌కి మాంటేగ్ ఆత్మ కనిపించినమాట నిజమే అని వెరోనికాకు అర్ధమయ్యింది. తను చనిపోయిన తరువాత తన అస్తికలతో చేసిన నెక్‌లెస్ ధరించమని వెరోనికాకు మాంటేగ్ స్వయంగా చెప్పాడు. ఆ తరువాతకాలంలో మాంటేగ్ ఆత్మ వెరోనికా ద్వారా ప్రపంచ వ్యాప్తంగా ఉన్న అనేకమంది పారాసైకాలజిస్టులతో మరియు ప్రేతాత్మ మాధ్యమాలతో మాట్లాడటం జరిగింది. చనిపోయిన తరువాత తనకు ఎదురయిన అనుభవాల గురించి మరియు రెండవ ప్రపంచయుద్ధంలో తన తండ్రి

ఏవిధంగా చనిపోయాడన్న విషయం గురించి మాంటేగ్ ఆత్మ అనేకమంది పారాసైకాలజిస్టులకు తెలియజేయటం జరిగింది. మాంటేగ్ మరియు వెరోనికాల వివాహం సెప్టెంబర్ 23వ తేదీన జరిగింది. ఆ రోజున వారి వివాహ వార్షికోత్సవం జరుగుతుంది. మాంటేగ్ తరచుగా అదే తేదీన ఇతరులకు కనిపించటం జరుగుతుంది.


మాంటేగ్ కీన్

ఒక విచిత్రమైన విషయం ఏమంటే ఒక ప్రేతాత్మ మాంధ్యమంగా పనిచేసే ఒక స్త్రీ, మాంటేగ్ ఆత్మ తనకు చెప్పిన వివరాల ఆధారంగా మాంటేగ్‌యొక్క బస్ట్ సైజు బొమ్మను తయారుచేసింది. ఆ తరువాత ఆ బొమ్మను వెరోనికాచూసి ఆశ్చర్యపోయింది. కారణం ఆ బొమ్మ అచ్చుగుద్దినట్టుగా మాంటేగ్ లాగానే ఉన్నది. అంతకన్నా విచిత్రం ఏమంటే ఆ బొమ్మను తయారుచేసినవ్యక్తి గతంలో మాంటేగ్‌నుకాని, అతని ఫోటోను కాని చూసి ఉండలేదు.

సాధారణంగా యువకులు మాత్రమే తమ ప్రేమికురాళ్ళను విపరీతంగా ప్రేమించి వాళ్ళకోసం తపిస్తారు. కానీ వృద్ధుడైన మాంటేగ్ చనిపోయిన తరువాతకూడా తన భార్య వెరోనికాను ప్రేమిస్తూ ఆమెకు కనిపిస్తూ ఉంటాడు. తనకు ఇష్టమైన బార్లి మొక్కను నాటి జాగ్రత్తగా పెంచమని వెరోనికాకు మాంటేగ్ ఆత్మ సూచించింది. అతనికి చెట్లన్నా, వ్యవసాయమన్నా ఎంతో ఇష్టమని వెరోనికా తరచుగా అంటూ ఉంటుంది.



# 14. దేవతలు మరియు దయ్యాలు మాగ్నటిక్ ప్లాస్మాతో తయారవుతాయా?

పురాణ కథలలో చెప్పబడే దేవతలు, దేవుళ్ళు అంతర్గతమైన వెలుగుతో మెరిసిపోతూ ఉంటారని చెప్పబడి ఉన్నది. అదేవిధంగా ప్రేతాత్మలుకూడా వెలుగులు చిమ్ముతూ కనిపిస్తాయని చెబుతారు. అదేవిధంగా హైందవ మతపరమైన సాహిత్యంలో మనిషి వెన్నుముక లోని చక్రాలు వివిధ రంగులలో మెరిసిపోతూ ఉంటాయని చెప్పబడి ఉన్నది. చాలా మందికి తెలియని ఒక ముఖ్యమైన విషయం ఏమంటే మనిషి వెన్నుముకలో ఉంటాయి అని చెప్పబడే షట్చక్రాలు (మూలాధార చక్రము, అనాహత చక్రము వగైరాలు) నిజంగా మనిషి వెన్నుముకలో కాకుండా అతనియొక్క ఈథరిక్‌డబుల్‌కి ఉండే వెన్నుముకలో ఉంటాయి. మనిషియొక్క భౌతికదేహంలో ఆ చక్రాలయొక్క కేంద్రాలు ఉంటాయి. కనుక మనిషి తన వెన్నుముకలోని కుండలినీశక్తి నిద్రలేవటం అంటే తన ఈథరిక్‌డబుల్‌లోని షట్చక్రాలను తెరిచి వాటిగుండా కుండలినీశక్తిని పైకి పంపించినట్టుగా గుర్తించాలి.

ఇటీవలకాలంలో జరిగిన కొన్ని విభిన్నమైన పరిశోధనల ఫలితంగా పారా సైకాలజీ రంగంలో ఊహించని అద్భుత రహస్యాలు బయటపడ్డాయి. దేవుళ్ళు, దయ్యాలు, గ్రహాంతర జీవులు, బయోప్లాస్మా అనే జారుడుగుణంగల జిగటలాంటి పదార్థంతో తయారవుతున్నాయి అని శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. అంతేకాకుండా మనిషి భౌతికదేహంచుట్టూ ఒక కవరులాగా ఉండే ఈథరిక్‌డబుల్ (ఒక మనిషి ఏ రూపంలో ఉంటాడో అదేరూపం అదృశ్యంగా ఆ మనిషిని అంటిపెట్టుకుని ఉంటుంది దీనినే ఈథరిక్‌డబుల్ అని పిలుస్తారు) మరియు మనిషియొక్క సూక్ష్మశరీరంకూడా అనంత విశ్వంలో తయారయ్యే బయోప్లాస్మా అనేపదార్థంతో తయారవుతాయని చెబుతున్నారు. అసలు ప్లాస్మా అంటే ఏమిటో మొదట తెలుసుకుందాం. మనిషి శరీరంలోని రక్తంలో తెల్లరక్తకణాలు మరియు ఎర్రరక్తకణాలుఉంటాయి. అందులో తెల్లరక్తకణాలు లింఫ్ అనే ఒక ద్రవ పదార్థంలో ఉంటాయి. ఇంకా పాలల్లో కూడా ఏ రంగూలేని లింఫ్ అనే ద్రవ పదార్థం ఉంటుంది. అయితే ఈ పదార్థమే భూమికి అవతల ఉండే జీవుల్ని తయారుచేయటానికి బయోప్లాస్మాగా రూపాంతరం చెంది ఉన్నది అని గుర్తించాలి.

ప్లాస్మాలో ఉండే అణువులు అయస్కాంత మరియు విద్యుత్‌శక్తుల బలాల కారణంగా తమమధ్య దూరాన్ని పెంచుకోవటం మరియు తగ్గించుకోవటం చేయటం

ద్వారా ప్లాస్మాయొక్క మందాన్ని నిర్ణయిస్తాయి. ప్లాస్మాఅన్నపదం తొలిసారిగా 1929వ సంవత్సరంలో ఇర్వింగ్‌లాంగ్‌మోర్ అనే భౌతికశాస్త్రవేత్తచేత ఉపయోగించబడింది. 20వ శతాబ్దంలో ప్లాస్మా ఫిజిక్స్ ఉనికి ప్రారంభం అయ్యింది. వెయ్యి సంవత్సరాల క్రితం ప్లాస్మా అనే భావన(Concept) ఉనికిలోలేదు. ఉండిఉంటే ఫ్లోరోసెంట్ దీపాలను నియోన్‌సైన్లను (ఈ రెండూ ప్లాస్మాతోనే తయారవుతాయి) పొగలేని అగ్నిగా పేర్కొని ఉండేవారు. కానీ వెయ్యి సంవత్సరాలకి పూర్వమే జిన్నులు పొగలేని అగ్నితో అనగా ప్లాస్మాతో తయారవుతాయని నాటి గ్రంధాలలో వ్రాయబడి ఉండటం ఒక విశేషంగా భావించాలి.

కళ్ళు మిరమిట్లుకొలిపే మెరుపుతో ప్రకాశించే సూర్యుడు కూడా ప్లాస్మాతోనే తయారు అయినట్టుగా తెలుస్తున్నది. అయితే మామూలుగా మనుషులకు తెలిసిన ప్లాస్మా చాలావేడిగాను మరియు స్వల్పకాలం మాత్రమే నిలిచి ఉండేదిగాను ఉంటుంది. కానీ అనంత విశ్వంలో ఉండే ప్లాస్మా, డార్క్‌ప్లాస్మాగా పిలువబడుతున్నది. కారణం దీనిలో నల్ల పదార్ధ అణువులు ఉంటాయి. కొన్ని దశాబ్దాల క్రితమే శాస్త్రజ్ఞులు ఇలా చెప్పారు. సాధారణ ప్లాస్మాకన్నా అంతరిక్షంలో ఉండే ప్లాస్మా ఐదురెట్లు మందంగా ఉంటుంది. ఫలితంగా అది మామూలు కళ్ళకి కనిపించదు. అయితే డార్క్‌ప్లాస్మా డార్క్ ప్రోటాన్లను అనగా నల్లటి కాంతిని విడుదల చేస్తుంది అని నాటి శాస్త్రజ్ఞులు చెప్పటం జరిగింది. డార్క్‌ప్లాస్మా వేడిగా ఉన్నప్పటికీ అది కర్బన ఆధారితమైన మానవ శరీరాలకు తాకదు. నాసాకు చెందిన బార్బారాబ్రెన్నెన్ అనే శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం అనంత విశ్వంలో ఉండే సమస్త పదార్థాలు ప్రకాశిస్తూ ఉంటాయి. అయితే అవి ద్రవస్థితిలో ఉంటాయి. మందవు కానీ ప్రకాశిస్తాయి. దాదాపుగా దేవతలు మరియు దయ్యాలు సూర్యుడి లాంటి లక్షణాలనే కలిగి ఉంటాయి. అసలు సూర్యుడే ఒకపెద్ద అయస్కాంత ప్లాస్మా అని గ్రహించాలి.

1917, మే 13వ తేదీ మధ్యాహ్నాం హఠాత్తుగా ఒక బలమైన గాలి వీచింది. ఆ సమయంలో ఒక కొండ లోయలో ముగ్గురు రైతు బిడ్డలు ఆడుకుంటున్నారు. ఆ సమయంలో ఆకాశంలోంచి మెరుస్తున్న ఒక చిన్న గోళం దొర్లుకుంటూ వారివైపు వచ్చింది. ఆ గోళం వారికి దగ్గరయ్యే లోగా ఒక ప్రకాశంతో మెరిసిపోతున్న యువకుడిగా మారిపోయింది. ఆ తరువాత ఆపిల్లలు తమకు ఎదురయిన అనుభవం గురించి తమ పెద్దవాళ్ళకు ఇలా చెప్పారు. "మంచుకన్నా తెల్లగా ఉన్న ఒక పారదర్శక యువకుడిని మేము చూసాం".



# 15. పిశాచాల వలన వ్యాధులు వస్తాయా?

సాధారణంగా ఒక మనిషి తీసుకునే ఆహారంలోని లోపాలు మరియు అతను నివసించే ప్రదేశంయొక్క ప్రభావం అతనిపై చెడుప్రభావాన్ని చూపినపుడు అతడు రోగగ్రస్తుడు అవుతాడు. భౌతికంగా మనిషి రోగగ్రస్తుడు కావటంలో కేవలం భౌతిక కారణాలేకాక మానసికమైన కారణాలుకూడా ఉంటాయని ఈనాడు వైద్యులు అంగీకరిస్తున్నారు.

మనచుట్టూ అదృశ్యరూపంలో సంచరించే కొన్ని క్షుద్రశక్తులు, అసంతృప్తితో రగిలిపోయే ప్రేతాత్మలు మనల్ని వీలున్నపుడు దెబ్బతియ్యటానికి ప్రయత్నిస్తాయి. ఫలితంగా మనం కొన్ని అనూహ్యమైన రోగాలకు లేదా వ్యాధులకు గురికావటం జరుగుతుంది. క్షుద్రశక్తులవల్లవచ్చే రోగాలను కేవలము తాంత్రికులు మాత్రమే పర్తించగలరు. (కలరా, మసూచి నుండి ఎయిడ్స్ వరకు అనేక మహారోగాలను కలిగించే సూక్ష్మ క్రిములు లేదా వైరస్‌కూడా అదృశ్యరూపంలోనే ఉంటాయని మర్చిపోకూడదు).

కొన్నిసార్లు దీర్ఘకాలంపాటు వ్యాధులతో బాధపడుతున్నవారికి ప్రేతాత్మల వలన మరింత హాని కలిగే అవకాశం ఉంటుంది. ఆ కారణంగానే కొంతమంది రోగులకి ఎంత సమర్ధులైన వైద్యులు వైద్యంచేసినా రోగం నయంకావటంలేదు.

కొంతమందికి కొన్ని గృహాలలో నివసిస్తున్నపుడు ఊహాతీతంగా కొన్నిరకాల శారీరక బాధలు ఏర్పడతాయి.

బలరాం అనేవ్యక్తి విజయవాడలో కృష్ణానది దక్షిణం గట్టుమీద ఒడ్డున ఉన్న ఒక పాతకాలం ఇంట్లో కొన్నేళ్ళపాటు అద్దెకు ఉన్నాడు. ఆ ఇంట్లో అతడికి ఆర్ధికంగా బాగానే ఉన్నప్పటికీ నిద్ర సమస్య ఏర్పడింది. అది ఎలాగంటే బలరాం తన మంచం మీద పడుకున్న 10 నిమిషాలకే నిద్రలోకి జారుకునేవాడు. 11వ నిమిషంలో పొగ ఆకారంలో ఉన్న ఒక వృద్ధుడు, బలరాం ప్రక్కనే మంచంమీద కూర్చుని బలరాం ముఖంమీద ఊదేవాడు. ఫలితంగా బలరాంకి మెలుకువ వచ్చేసేది. కాసేపు అటు ఇటు తిరిగి మళ్ళీ పడుకునేవాడు. మళ్ళీ సరిగ్గా 10 నిమిషాలకి ఆ వృద్ధుడి ఆత్మ బలరాంని నిద్ర లేపేసేది. ఇక ఏం చెయ్యాలో అర్ధంకాక తన వరండాలో కుర్చీవేసుకుని అందులో కూర్చుని నిద్రపోయేవాడు. కొన్నాళ్ళకి బలరాం కుర్చీనే మంచంగా భావించుకుని నిద్రపోవటం అలవాటుచేసుకున్నాడు. ఇదేకాకుండా ఈ ఇంట్లో

బలరాంకి మరికొన్ని అనుభవాలు ఎదురయ్యాయి. ప్రతి శుక్రవారంనాడు బలరాంకి ఏదోఒక కారణంచేత చెయ్యోకాలో తెగి నెత్తురు కారిపోయేది. కొన్నిసార్లు అర్ధరాత్రి సమయాలలో బలరాంకి ఊపిరి ఆడకుండాపోయేది. బలరాం అనేకమంది వైద్యుల్ని సంప్రదించి వేలాది రూపాయలు వదిలించుకుని ఎన్ని మందులు వాడినా అతడి సమస్య తీరలేదు.

ఈ పరిస్థితుల్లో బలరాం ఒక మిత్రుడి సలహామీద శ్రీకార్తికేయపీఠ నిర్వాహకులైన స్వామిగారిని కలుసుకున్నాడు. ఆయన ఆ సమయంలో సుదర్శన హెూమాన్ని తన పీఠంలో నిర్వహిస్తున్నారు. బలరాం తన సమస్యను స్వామిగారికి తెలియజేసాడు. ఆయన తన పీఠంలోని యజ్ఞగుండంవద్ద కూర్చుని కార్తికేయుడిని స్మరించుకుని ప్రశ్నచక్రం వేసారు. బలరాం ఏ కారణంగా నిద్రలేమికి మరియు శ్వాస సమస్యకు గురి అవుతున్నాడో ప్రశ్నచక్రంద్వారా స్వామిగారు తెలుసుకున్నారు. బలరాం ఎదుర్కొంటున్న సమస్యలకు మూలకారణం అతను ఉంటున్న ఇంట్లోనే ఉన్నది. పరమ పిసినారివాడు, కోపిష్టివాడు, నోటిదురుసువాడు అయిన ఒక పురోహితుడు అతి తక్కువ రేటులో కృష్ణానది ఒడ్డున ఉన్న స్థలాన్నికొని దాంట్లో రెండు అంతస్తులుగా ఒక భవనాన్ని నిర్మించాడు. పేరుకి అది భవనమేకాని బయట గోడలకి ప్లాస్టింగ్ కూడా ఉండదు. ఆ ఇంటికి వాడిన కిటికీలు, తలుపులు ఎవరిదగ్గరో ఉచితంగా తెచ్చినవి కావటంవల్ల ఆ ఇంటికి వాస్తుదోషం ఏర్పడింది. ఆ అతడు వృద్ధుడు అయి చనిపోయిన తరువాత ప్రేతాత్మగామారి ఆ ఇంట్లోనే తిరగటం ప్రారంభించాడు. ఆ ప్రేతాత్మ కేవలం బలరాంని మాత్రమే ఎంచుకుని పీడించటం ఆశ్చర్యకరమే. బలరాం ఆ ఇంట్లో ఉంటున్న సమయంలో అతని గ్రహస్థితులు అతనికి పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నాయి. ఆ కారణంగానే ఆ ప్రేతాత్మ బలరాంని నిద్రపోకుండా చెయ్యటం మొదలు పెట్టింది.

స్వామిగారు బలరాంచేత పీఠంలో వెలసి ఉన్న సుబ్రహ్మణ్యస్వామికి పూజలు చేయించి ఆ తరువాత అతనిమెడలో కార్తికేయ రహస్య యంత్రం లాకెట్‌ను వేశారు. అంతేకాకుండా బలరాంని వెంటనే ఆ ఇల్లుఖాళీచేసి వెళ్ళిపొమ్మని చెప్పారు. బలరాం స్వామిగారు చెప్పినట్లే చేసాడు. అపై అతని ఆరోగ్య సమస్యలు సంపూర్తిగా తొలగిపోయాయి.

ఆధునిక వైద్యం అని పిలువబడుతున్న అల్లోపతి వైద్యశాస్త్రం మానవులకు వ్యాధులు రావటానికి మానసిక మరియు భౌతిక కారణాలు మాత్రమే ఉంటాయని భావిస్తుంది. కానీ ఇతర ఆత్మలవల్ల, క్షుద్రశక్తులవల్ల నెగటివ్ ఎనర్జీలవల్ల కొన్నిరకాల రోగాలు వస్తాయని అల్లోపతికి ఇప్పటివరకు తెలియదు.

ఆధ్యాత్మిక దృష్టితో చూసినట్లయితే మనిషి వెన్నుముకలో ఉండే ఏడు చక్రాలలో ఏ చక్రంలో దోషం ఏర్పడితే ఆ చక్రానికి సంబంధించిన రోగం మనిషికి వస్తుంది. ఉదాహరణకి ఒక మనిషికి ఛాతీలో నెప్పి వస్తున్నట్లయితే ఆ భాగంలో ఉండే అనాహత చక్రంలో ప్రవహించే ఆత్మశక్తి ప్రవాహానికి ఒక భౌతిక అంశము లేదా ఒక క్షుద్రశక్తి ఆటంకం కలిగిస్తున్నట్లుగా గుర్తించాలి. భౌతిక కారణాలవల్ల వచ్చే రోగాల్ని మాత్రమే ఔషధాలు తగ్గిస్తాయి. ప్రేతాత్మల కారణంగా వచ్చే రోగాల్ని దైవ సంబంధ పరిహారాలు మాత్రమే తగ్గించగలవు.

క్షుద్రశక్తులు లేదా ప్రేతాత్మలు మనిషిలోని అవయవ వ్యవస్థను పనిచెయ్యకుండా నిరోధిస్తాయి. ఫలితంగా మనిషి అనారోగ్యంపాలు కావటం జరుగుతుంది. కొన్నిసార్లు ఈ క్షుద్రశక్తులు ఫంగస్ లేదా బాక్టీరియా కారణంగావచ్చే రోగాలను మానవులకు కలిగిస్తాయి. వైద్యులు రోగిని పరిశీలించినపుడు రోగానికి కారణం ఫంగస్ లేదా బాక్టీరియా అనుకుంటారు. కానీ ఆ ఫంగస్‌లోనే ప్రేతాత్మలు అత్యంత సూక్ష్మరూపంలో దాగి ఉంటాయి. కొంతమందికి ప్రకృతిసిద్ధంగా సిక్త్ సెన్స్ అభివృద్ధిచెందుతుంది. అలాంటివారు రోగుల్ని పరిశీలించినపుడు ఆ రోగులు క్షుద్రశక్తులవలన ప్రభావితులు అవుతున్నట్టుగా గుర్తించగలరు. సాధారణ మానవులు తమకు వచ్చే రోగాలలో ఏవి మానవాతీతశక్తుల వలన వస్తున్నాయి అని తెలుసుకోవటంకోసం కొన్ని గుర్తులను క్లుప్తంగా తెలియజేస్తాను. జాగ్రత్తగా పరిశీలించండి.



1. పౌర్ణమి లేదా అమావాస్య రోజులలో రోగబాధ అధికం అవుతుంది.

2. ఆలయాలకు లేదా స్వామీజీలవద్దకు వెళ్ళి అక్కడ తీర్థప్రసాదాలు అందుకున్నపుడు రోగం తాత్కాలికంగా నెమ్మళించటం జరుగుతుంది.

3. ప్రేత బాధవలన రోగాలు వచ్చినవారికి తరచుగా గాలిలో తేలిపోతున్నట్టుగాను లేదా ఏదో చీకటి తెరలతోకూడిన లోకంలోకి దూసుకుపోతున్నట్టుగాను అనిపిస్తుంది.

4. కొన్నిసార్లు చర్మంమీద దద్దుర్లు వస్తూ ఉంటాయి. అవి ఎన్ని మందులు వాడినా కొన్నిసార్లు తగ్గవు. అపుడు అందుకుకారణం ప్రేతబాధే అని గుర్తించాలి. కొంతమందికి హఠాత్తుగా నోట్లోపుండ్లు రావటం జరుగుతుంది. కొంతమంది స్త్రీలకు తమతో ఎవరో అదృశ్యవ్యక్తి సంభోగాన్ని జరిపినట్టుగా భ్రమలు కలుగుతాయి. అందుకు కారణం ప్రేతప్రభావమే అని గుర్తించాలి.

సైన్స్ అన్నిటికీ పరిష్కారాలు చూపిస్తుందని భావించరాదు. ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా పిల్లలనుండి పెద్దలవరకు కోట్లాదిమందిని పీడిస్తున్న షుగర్‌వ్యాధి ఏకారణంగా వస్తున్నదో సైంటిస్టులకి ఇప్పటికీ ఖచ్చితంగా తెలియలేదు.

మనిషిశరీరంలోని వెన్నుముక ప్రారంభంలో ఉన్న మూలాధారచక్రం మనిషిలోని విసర్జక వ్యవస్థకి శక్తిని ఇస్తుంది. స్వాధిష్టానచక్రం మానవుల పునరుత్పత్తి అంగాలకు బలాన్ని ఇస్తుంది. మణిపూరకచక్రం మనిషి జీర్ణవ్యవస్థను నిలబెడుతుంది. ఈ చక్రాలలో శక్తి ప్రసారానికి ఆటంకం కలిగినపుడు మానవులకు సంబంధించిన ఆయా అంగాలలో సమస్యలు ఏర్పడతాయి.



# 16. పంచమహాపాతక దోషాలను నిర్మూలించే అపర ఏకాదశి వివరాలు?

మనిషి తన జీవన పోరాటంలో కొన్నిసార్లు పాపాలు చేస్తూ ఉంటాడు. అయితే ఆ పాపాలు తీవ్రమైనవి అయినప్పుడు మనిషికి ఆజన్మలోను, వచ్చేజన్మలోను కూడా బాధలను అనుభవించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. పాపాలలో 5 రకాల పెద్ద పాపాలు ఉన్నాయి. వీటినే పంచమహాపాతకాలు అని పిలుస్తారు. పంచమహాపాతకాల పేర్లు ఇలా ఉన్నాయి. 1. శిశుహత్య 2. గోహత్య 3. స్త్రీహత్య 4. బ్రాహ్మణహత్య 5. మాతృహత్య. అయితే కొన్నిసార్లు చాలామంది ఆధునికులు పంచమహాపాతకాలలో కనీసం ఒకటైనా చెయ్యటం జరుగుతున్నది అని నా పరిశోధనలో తేలింది. పుట్టబోయేబిడ్డ ఆడపిల్ల అని స్కానింగ్ ద్వారా ముందే తెలిసినపుడు కడుపులోని బిడ్డను లేడీ (కేడీకాదా?) డాక్టరు సహాయంతో హత్యచేసి ఆ గర్భాన్ని పోగొట్టే వాళ్ళు పంచమహాపాతకాలలో ఒకటైన శిశుహత్యకు పాల్పడినట్టుగా భావించాలి.

అలాగే తెలిసో, తెలియకో, తల్లిచావుకి కారణమైన వాళ్ళుకూడా మాతృహత్యా దోషాన్ని మూటకట్టుకుంటారు. ఏది ఏమైనా పంచమహా పాతకాలలో ఒకటిచేసినాసరే భయంకర నరకం తప్పదు. (ఈ లోకంలో డబ్బు పలుకుబడి ఉపయోగించి శిక్షనుండి తప్పించుకున్నా పై లోకంలో శిక్షలు తప్పవు) ఈవిధమైన పంచమహాపాతకాలను చేసినవారు ఆ పాపంచేసిన ఒక సంవత్సరం నుండి చచ్చిపోయేవరకు అనేక రకాల మానసిక మరియు శారీరక రోగాలను పొందుతారు. వారి కుటుంబం అనేక రకాలుగా సమస్యల పాలు అవుతుంది. ఇలాంటివారు చేసిన పాపాలు వారినేకాక ఏడు తరాలవరకు వారి వారసుల్నికూడా వెంటాడతాయి. ఈ పంచమహాపాతక దోషాలనుండి మానవులకు విముక్తిని కలిగించే ఒక అద్భుతవిధానం హైందవ ధర్మశాస్త్రాల్లో చెప్పబడి ఉన్నది. దాని వివరాలు క్లుప్తంగా తెలుసుకుందాం.

ప్రతి సంవత్సరం జ్యేష్టమాసంలో వచ్చే శుక్లపక్షంలోని ఏకాదశి తిథినాడు అపర ఏకాదశి అనే అద్భుతమైన పుణ్యదినం వస్తుంది. ఈ అపర ఏకాదశి వ్రతాన్ని ఎలా చేసుకోవాలో పరిశీలిద్దాం. మొదట దశమి తిథినాడు కొద్దిగా భోజనం తీసుకోవాలి. తేనె, ఉల్లిపాయలు, వెల్లుల్లిపాయలు, మద్యము, మాంసము లాంటి పదార్థాలను ఎట్టి పరిస్థితులలోను ఆ రోజున అనగా దశమినాడు తీసుకోరాదు. ప్రశాంత చిత్తంతో శుచిగాఉండి సర్వజగద్రక్షకుడు అయిన శ్రీధరుడిని మనసులో నింపుకుని ఆయన నామాలను జపించాలి.

ఇక ఏకాదశి తిథినాడు ఉపవాసం ఉండాలి. సూర్యోదయానికిముందే నిద్రలేచి తలస్నానంచేసి కనీసం నీటినికూడా తాగకుండా శ్రీమన్నారాయణుడిని ధ్యానిస్తూ ఉండాలి. కొందరికి పూర్తిగా కఠిన ఉపవాసం ఉండటం వీలుకాదు. అలాంటివారు కొద్దిగా పళ్ళుతిని లేదా పళ్ళరసంతాగి లేదా పాలుతాగి ఉపవాసం ఉండవచ్చు. ఎవరికివారు తమ ఆరోగ్య పరిస్థితినిబట్టి ఏదైనా శాఖాహారం మితంగా తీసుకుని కూడా ఈ ఏకాదశి వ్రతాన్నిచేయవచ్చు. ఎట్టిపరిస్థితిలోను ఏకాదశి తిథినాడు పప్పులు మరియు ధాన్యాలతో కూడిన ఆహారాన్ని తీసుకోకూడదు. ముఖ్యంగా బియ్యం ఆ రోజున ఉపవాసం ఉన్న వారి నాలుకపై పడరాదు. ఆరోగ్యంగా ఉన్న ఏడు సంవత్సరాల నుండి 70 సంవత్సరాలలోపు వయస్సు ఉన్న వారు ఎవరైనా ఈ వ్రతాన్నిచేయవచ్చు. అయితే గర్భిణీస్త్రీలు, వృద్ధులు జబ్బుపడ్డవారు ఈ వ్రతాన్ని చెయ్యకూడదు. ఒక విచిత్రం ఏమంటే హైందవమతంలోని వ్రతాలన్నింటిలోను శుచికి, శుభ్రతకు ఎంతో ప్రాధాన్యత ఉంటుంది కానీ పంచ మహాపాతకాలను నిర్మూలించే ఈ అపర ఏకాదశి వ్రతాన్ని బహిష్టులో ఉన్న స్త్రీలుకూడాచేసుకోవచ్చు. వారు తలస్నానంచేసి ఉపవాసం

ఉండి శ్రీదేవీ సమేతుడైన శ్రీధరనామాలను మనస్సులో జపించుకోవాలి. ఒక ముఖ్య సూచన ఏమంటే ఈ వ్రతాన్నిచేసే బహిష్టు స్త్రీలు మంత్రాలనుమాత్రం చదవకూడదు.

ఏకాదశిరాత్రి నిద్రపోకుండా జాగారంచేసి భగవద్గీత, రామాయణం, భాగవతం లాంటి పుణ్య గ్రంధాలను పఠించాలి. లేదా భగవత్ సంబంధమైన గీతాలను వినవచ్చు. ఆ తరువాత అవకాశం ఉన్నవారు మహావిష్ణువుకి ఆనందం కలగటంకోసం హరి భజన కార్యక్రమాలు చేసుకోవచ్చు.

మర్నాడు ద్వాదశి తిథి వస్తుంది. నీరుకూడా తాగకుండా ఏకాదశి ఉపవాసం చేసినవారు సూర్యోదయం అయిన తరువాత తులసితీర్థం తీసుకుని ఉపవాసం నుండి సెలవు తీసుకోవాలి. కొంచెం నీరసంగా ఉన్నవారు పళ్ళను తీసుకుని ఉపవాసానికి స్వస్తిచెప్పాలి.

ద్వాదశితిథినాడు ఆహారంలో చింతపండు, మిరపకాయలు, పచ్చిమిరపకాయలు ఉపయోగించకూడదు. చింతపండు బదులు నిమ్మరసాన్ని, కారం బదులు మిరియాల కారాన్ని ఉపయోగించుకోవచ్చు. సర్వకోర్కెలను ఈడేర్చే మహావిష్ణువుయొక్క అభిమానాన్ని పొందటంకోసం ద్వాదశితిథినాడు ఉసిరికాయలను ఆహారంగా తీసుకోవాలి.

ఎవరైతే భక్తి శ్రద్ధలతో ఈ అపర ఏకాదశి ఉపవాస వ్రతాన్ని నిర్వహిస్తారో వారు చేసిన సమస్త పాపాలు దహించుకుపోతాయి. వారికి అప్పటివరకు ఎదురవుతున్న సమస్త కష్టాలు తొలగిపోతాయి. సంపదలు మరియు కీర్తిప్రతిష్టలు అప్రయత్నంగా వారికి లభిస్తాయి. ఈ అపర ఏకాదశియొక్క మహత్యాన్ని హైందవ ధర్మశాస్త్రాలు ఈవిధంగా తెలియజేసాయి. కార్తీకమాసంలో వచ్చే పవిత్రనదీ పుష్కరాలలో పుష్కరం నడుస్తున్న నదిలో రోజుకి మూడుసార్లు చొప్పున 30 రోజులు నదీస్నానంచేస్తే ఎంత పుణ్యం వస్తుందో అంతపుణ్యం అపర ఏకాదశివ్రతం వల్ల వస్తుంది. ఇంకా అపర ఏకాదశి వల్ల కలిగే పుణ్యం ఏఏ ఇతర పుణ్యకార్యాలతో సమానమో తెలుసుకుందాం.

ప్రయాగ క్షేత్రంలో మాఘమాసంలో స్నానంచేస్తే ఎంత పుణ్యం వస్తుందో?

శివరాత్రినాడు వారణాసి క్షేత్రంలో విశ్వనాధుడిని పూజిస్తే ఎంతపుణ్యం వస్తుందో?

పూర్వీకుల ఆత్మలకు గయలో శార్ధకర్మలు నిర్వహిస్తే ఎంతపుణ్యంవస్తుందో?

సింహరాశిలో గురుగ్రహం సంచారంచేస్తున్నపుడు పవిత్ర గౌతమి (గోదావరి) స్నానంచేస్తే ఎంతపుణ్యంవస్తుందో?

కేదార్‌నాధుడిని దర్శిస్తే ఎంతపుణ్యంవస్తుందో

కుంభమాసంలో (కుంభరాశిలో సూర్యుడు ఉండేకాలం) బదరీనాధుడిని దర్శిస్తే ఎంతపుణ్యంవస్తుందో?

కురుక్షేత్రంలో (హర్యానా రాష్ట్రంలో ఉన్నది) సూర్యగ్రహణ సమయంలో స్నానం చేసి, మహాపండితులైన బ్రాహ్మణులకు బంగారం, ఏనుగులు మరియు ఆవులు దానం ఇస్తే ఎంతపుణ్యంవస్తుందో?

ఒక పుణ్యాత్ముడైన బ్రాహ్మణుడికి మాగాణి పొలాన్ని, బంగారాన్ని, కడుపుతో వున్న ఆవుని కలిపి దానంచేస్తే ఎంతపుణ్యంవస్తుందో?

అంతపుణ్యం అపర ఏకాదశి వ్రతాన్ని త్రికరణశుద్ధిగాచేస్తే తప్పక వస్తుంది అని మహర్షులు, మహానుభావులు తెలియజేసారు.

# పార్టు-2

## 1. హైందవ మతంలో శ్రార్ధకర్మల ప్రాధాన్యత ఏమిటి?

హైందవమతం మరియు హైందవమతం నుండి ఆవిర్భవించిన బౌద్ధమతం మరియు బౌద్ధమతం నుండి ఆవిర్భవించిన టావోయిజం, షింటోయిజం లాంటి మతాలలో మరణించిన పెద్దలయొక్క ఆత్మలకు శాంతి కలగటంకోసం అనేకరకాలైన ప్రక్రియలను జరపటం ఒక సాంప్రదాయంగా ఉన్నది. ముఖ్యంగా వేదమార్గాన్ని అనుసరించే హైందవమతంలో పెద్దల ఆత్మశాంతికి శ్రార్ధకర్మలు నిర్వహించటం జరుగుతున్నది. ప్రతి సంవత్సరం తమ వారసులు అందించే నీరు మరియు ఆహారాన్ని పితృదేవతలు స్వీకరించటం జరుగుతుంది. ఆధునికకాలంలో చాలామంది హైందవులు ఈ శ్రార్ధకర్మల విషయం పూర్తిగా మర్చిపోవటం జరుగుతున్నది. ఫలితంగా అశాంతి చెందిన పూర్వీకులయొక్క ఆత్మలుఇచ్చే శాపాలకు వారి వారసులు గురికావటం జరుగుతున్నది. భూలోకానికి, స్వర్గలోకానికి మధ్యలోకాని, చంద్రలోకంలోకాని, పితృ దేవతలు ఉండే పితృలోకం ఉంటుందని హైందవధర్మశాస్త్రాలు తెలియజేస్తున్నాయి. కొన్నిసార్లు కొంతమంది అనేక పాపాలుచేసి, ఆపై ప్రమాదాలలో మరణించటంకాని, ఇతరుల చేతిలో హత్యకు గురికావటంకాని జరుగుతుంది. అలాంటివారియొక్క ఆత్మలు తప్పనిసరిగా పిశాచాలుగా మారతాయి. అలామారిన ఆత్మలు అటు స్వర్గానికి, ఇటు నరకానికి లేదా పితృలోకానికి చేరలేక ఈ భూమిమీదే నిరంతరం క్షోభిస్తూ సంచరిస్తూ ఉంటాయి. అలాంటి పిశాచాలకు శాంతి కలగటంకోసంకూడా శ్రార్ధకర్మలు జరుపబడతాయి. ఇతర ఏ మతాలలోలేని ఒక గొప్పతనం హైందవమతంలో ఉన్నది.

అది ఏమిటంటే చనిపోయిన తరువాతకూడా తమకు జన్మను ఇచ్చిన తల్లి దండ్రులను మర్చిపోకుండా వారి ఆత్మశాంతికోసం మతపరమైన కర్మలను ఈ మతం వారు చెయ్యటం జరుగుతున్నది. ఏ హైందవుడుకూడా అటు దైవాన్ని, ఇటు పితృ దేవతలను నిర్లక్ష్యం చెయ్యటంకాని, అవమానించటంకాని చెయ్యరాదు. అలా చెయ్యటం వల్ల ఎన్ని అనర్ధాలు జరుగుతాయని గుర్తించాలి. సుమంతుడు అనే మహర్షి అభిప్రాయం ప్రకారం అన్ని మతపరమైన ప్రక్రియలలో శ్రార్ధకర్మ అత్యుత్తమమైనది అని తెలుస్తున్నది.

బ్రహ్మవైవర్తన పురాణం ఇచ్చే సమాచారం ప్రకారంచూస్తే దైవానికిచేసే పూజలకన్నా కూడా చనిపోయినవారి ఆత్మలకుచేయవలసిన కర్మకాండలే అతిముఖ్యమని తెలుస్తున్నది. ప్రతి హైందవుడు తనశక్తికొద్ది తప్పనిసరిగా తన పూర్వీకుల ఆత్మలకు శాంతి కలిగించే ప్రక్రియలనుచేసి తీరాలి. కొంతమంది వేదపండితుల అభిప్రాయం ప్రకారం చనిపోయిన పెద్దలయొక్క ఆత్మలు తమవారు తమకు శ్రార్ధకర్మలు చెయ్యాలని ప్రతి సంవత్సరం కోరుకుంటాయి. ఆ ఆత్మలయొక్క వారసులు ఆ విషయాన్ని పట్టించుకోకుండా ఉన్నట్లయితే ఆ ఆత్మలు అసంతృప్తితో రగిలిపోతాయి. అంతేకాకుండా అలాంటి ఆత్మలు, ఋణాత్మకశక్తులుగా (Negative Energy) మారి తమ వారసుల్ని వీలైనవిధంగా బాధించటం జరుగుతుంది. కొన్నిసార్లు శ్రార్ధకర్మలకోసం తపించిపోయే పూర్వీకులఆత్మలు తమకు మాత్రమే ప్రత్యేకమైన ఒక ఫ్రీక్వెన్సీలో ఒక రూపాన్ని ధరించి తమ వారసులకు కనిపించి తమ బాధను వెళ్ళగక్కటం జరుగుతుంది.

కొన్నిసార్లు సరైన శ్రార్ధకర్మలు జరగకుండా తల్లడిల్లిపోతున్న పూర్వీకుల ఆత్మలు ఎవరోఒకరిని ఆవహించి వారిద్వారా తమతో మాట్లాడటం జరుగుతుంది. కొన్నాళ్ళ క్రితం తూర్పుగోదావరిజిల్లాలో జరిగిన ఒక యదార్థ సంఘటన ఇది. ఆ సంఘటనలో చనిపోయిన ఒక వ్యక్తియొక్క ఆత్మ తన కొడుకుని ఆవహించి ఎదురుకుండా ఉన్న వారితో ఏదేదో మాట్లాడటం ప్రారంభించాడు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన ఆ ప్రాంత పురోహితుడు ఆత్మ ఆవహించిన వ్యక్తితో "అయ్యా! ఎవరుమీరు? ఎందుకని ఈ వ్యక్తిని ఆవహించారు?" అన్నాడు. అపుడు ఆ వ్యక్తిని ఆవహించి ఉన్న ఆత్మ ఆ వ్యక్తిద్వారానే అక్కడ ఉన్న అందరితో ఇలా చెప్పింది. "నేను ఆవహించిన వ్యక్తి నా కొడుకు. వీడికి నానా కష్టాలుపడి చదువుచెప్పించి ఉన్నత ఉద్యోగం పొందేలాచేసాను. వీడు నాకు ఏ సంవత్సరమూ శ్రార్ధకర్మలు చెయ్యలేదు. ఫలితంగానేను భూతంగామారి ఈ లోకంలో సంచరిస్తున్నాను. నా ఆత్మకు శాంతి కలగాలిఅంటే నాకు నా కొడుకు శ్రార్ధకర్మలు చెయ్యాలి.

అమవసుడు అనే మహారాజు పేరుమీదగా అమావాస్య అన్నపేరు ఏర్పడింది. ఈ భూమి ఏర్పడిన తరువాత భూమిపై ఆవిర్భవించిన తొలి మానవుడినుండి నేటి ఆధునిక మానవుడి వరకు ఆకాశంలో ప్రకాశించే చంద్రుడియొక్క ఒకవైపునే చూడటం జరుగుతున్నది. కానీ చంద్రుడికి అటువైపున పితృలోకం ఉన్నది అని చాలామందికి తెలియదు. కృష్ణపక్షం రోజులలో (పౌర్ణమి మర్నాటినుండి అమావాస్య వరకు ఉన్న 15 రోజులు లేదా తిథులు) ఈ పితృలోకం సూర్యుడికి ఎదురుకుండా వస్తుంది. కనుక ఆ సమయంలో హైందవులు తమ పితృదేవతలకు శాంతిని కలిగించే మత పరమైన ప్రక్రియలను తప్పనిసరిగా చెయ్యాల్సి ఉంటుంది. విష్ణుధర్మశాస్త్రము అనే

గ్రంధములో చెప్పబడిన సమాచారం ప్రకారం అమావాస్య తిథి, ఒక మనిషియొక్క మూడు తరాల పెద్దల ఆత్మలకు శ్రార్ధకర్మలు చెయ్యటానికి ఉత్తమమైనవి అని తెలుస్తున్నది. పితృదేవతలకు తర్పణాలు ఇచ్చే వ్యక్తికి తప్పనిసరిగా తండ్రి బతికి ఉండరాదు. పితృదేవతలు తమ వంశములోని పురుష వారసులు అందించే తర్పణాలపై ఆధారపడి పితృ లోకంలో జీవిస్తూ ఉంటారు.

పితృదేవతలలో ఏడు రకాలు ఉన్నారు. వారిలో ఒకటైన అగ్నిష్వతులు అనే ఒకరకం పితృదేవతలకు అక్కోదా అనే మానసపుత్రిక ఉన్నది. పితృలోకంలో ఉండే ఈమె తనకు ఒక మానవ తండ్రి ఉంటే బాగుంటుందని ఆశపడుతూ ఉండేది. మానవలోకంపై అభిమానం పెంచుకున్న అక్కోదాయొక్క మహిమలు, శక్తులు తొలగించి ఆమెను భూలోకంలోకి నెట్టివేశారు దేవతలు. ఆమె స్వర్గంనుండి కిందపడబోతూ ఒక్కొక్కలోకం మీదగా భూమిమీదకి జారిపోతున్న సమయంలో ఆమె నన్నురక్షించండి అని ఆర్తనాదాలు చెయ్యటం మొదలుపెట్టింది. అలా కిందకుజారిపోతున్న ఆమె పితృలోకం దగ్గరకువచ్చేసరికి అక్కడ ఉన్న పితృదేవతలు అక్కోదానుచూసి జాలిపడి ఆమెను కిందపడకుండా పట్టుకుని రక్షించారు. ఆ తరువాత ఆమెను నాడు భూలోకాన్ని పరిపాలిస్తున్న అమవసుడు అన్న పేరుగల రాజుకు కుమార్తెగా జన్మించమని పితృ దేవతలు ఆమెకు సలహా ఇచ్చారు. ఆపై ఆమె అమవస మహారాజుకు కూతురుగా జన్మించింది. ఆమె క్రమంగా పెరిగి పెద్దదవుతూ ఉండగా గతజన్మలో ఆమె కోల్పోయిన మంత్రశక్తులు మరియు మహిమలు ఆమెకు తిరిగి సంక్రమించటం జరిగింది. పూర్తిగా శక్తివంతురాలిగా మారిన ఆమె ఆ తరువాత కాలంలో తనను కిందపడకుండా రక్షించి మానవలోకంలో జన్మించేలా చేసిన పితృదేవతలపట్ల తన కృతజ్ఞతను తెలియ జెయ్యటంకోసం ఒక ప్రత్యేకమైన ప్రక్రియను నిర్వహించింది. ఆనాటి నుండి మానవులు కూడా పితృదేవతలను తృప్తిపరచటంకోసం అమావాస్యతిథినాడు పితృదేవతలకు తర్పణాలు ఇవ్వటం మొదలయ్యింది.

ఆధునిక కాలంలో అనేక హైందవ విద్యాధికులు శ్రార్ధకర్మలను హేళనచెయ్యటం జరుగుతున్నది. ఫలితంగా వాళ్ళు పూర్వీకుల శాపానికి గురికావటం జరుగుతున్నది. అందువల్ల వారియొక్క దాంపత్యజీవితం దెబ్బతినటం, వాళ్ళు అకారణంగా మానసిక వ్యాధులకు గురికావటం, వారి సంతానం చెడుదోవలుపట్టిపోవటం లేదా అకాలమృత్యువుపాలు కావటం జరుగుతున్నది. తమ కష్టాలకు కారణం తమ పూర్వీకుల ఆత్మఘోషేనని ఆ విద్యాధికులకు తెలియపోవటం శోచనీయం. 'స్మృతిచంద్రిక' అనే సంస్కృత గ్రంథంలో ఇవ్వబడిన సమాచారం ప్రకారంచూస్తే శ్రార్ధకర్మలను సక్రమంగా నిర్వహించటంవల్ల సంతానభాగ్యం కలుగుతుంది. దీర్ఘాయుష్షు కలుగుతుంది.

విజయాలు లభిస్తాయి. భోగభాగ్యాలు కలుగుతాయి అని తెలుస్తున్నది. గ్రహణ సమయాలలో జరుపబడే శ్రార్ధములవల్ల అద్భుత ఫలితాలు వస్తాయని తెలుస్తున్నది. హైందవులు ఒకవ్యక్తి చనిపోయిన రోజు, తారీఖు లేదా వ్యక్తిచనిపోయినప్పుడు నడుస్తున్న నక్షత్రం ఆధారంగా శ్రార్ధకర్మలను చేయవలసిన రోజును నిర్ణయించుకుంటారు. ఈ శ్రార్ధాలలో అనేక రకాలు ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి నందిశ్రార్ధము, మహాలయశ్రార్ధము, భరణి శ్రార్ధము మరియు త్రిపిండిశ్రార్ధము.

సంస్కృతంలో శ్రద్ధ అంటే విశ్వాసం అనిఅర్ధం. ఈ శ్రద్ధ అనేపదం నుండి శ్రార్ధము అనేపదం పుట్టింది. తమకు జన్మనిచ్చి పెంచిపెద్దచేసిన పెద్దలయొక్క ఆత్మలప్ను పరిపూర్ణమైన శ్రద్ధతోచేసే ప్రక్రియనే శ్రార్ధము అని పిలువవచ్చు. బ్రహ్మదేవుని కుమారుడైన అత్రిమహర్షి ఈ శ్రార్ధప్రక్రియల విధానాన్ని రూపొందించినట్టుగా తెలుస్తున్నది. ఆ తరువాత అత్రిమహర్షి నుండి నిమికి మరియు ఆయన వారసులకు ఈ శ్రార్ధకర్మలు నిర్వహించేవిధానం తెలియజేయబడింది. తొలిసారిగా మానవలోకంలో మనువు ఈ శ్రార్ధ ప్రక్రియను నిర్వహించటంచేత ఆయనను శ్రార్ధకర్మలకు అధిదేవతగా గుర్తించటం జరిగింది. శ్రార్ధకర్మలతో సంబధం ఉండే దేవతలను వసువు, రుద్రుడు మరియు ఆదిత్యుడు అని పిలవటం జరుగుతుంది. ఏవ్యక్తికోసం అయితే శ్రార్ధకర్మ జరుపబడుచున్నదో ఆ వ్యక్తిని వసువు అని పిలుస్తారు. ఆ వ్యక్తియొక్క తల్లిదండ్రులను రుద్ర అని పిలుస్తారు. ఆ తల్లిదండ్రులలో తండ్రియొక్క మాతాపితరులను ఆదిత్య అని పిలుస్తారు. ఆ కారణంగానే ప్రతి హైందవుడు శ్రార్ధకర్మలు నిర్వహించినపుడు తన తండ్రి, తాత మరియు ముత్తాతలయొక్క పేర్లను వసు-రుద్ర-ఆదిత్య దేవతలకు ప్రతినిధులుగా ఉచ్ఛరించటం జరుగుతున్నది.

మత్స్యపురాణంలో ఇవ్వబడిన సమాచారం ప్రకారం శ్రార్ధకర్మలు మూడు రకాలుగా ఉంటాయి. అవి. (1) ప్రతినిత్యం నిర్వహించేవి (2) ఒక నిర్ణీతకాలపరిమితి తరువాత నిర్వహించేవి (3) ఆశించినవి పొందటానికి నిర్వహించబడేవి. ఇవేకాకుండా నందిశ్రార్ధము, పర్వన్‌శ్రార్ధము అనే ప్రధానమైన రకాలు ఉన్నట్టుగా తెలుస్తున్నది.

హైందవమతంలో పేర్కొనబడిన 12 రకాల శ్రార్ధములపేర్లు ఇలా ఉన్నాయి.

1. నిత్యశ్రార్ధ 2. నైమిత్తికశ్రార్ధ 3. కామ్యశ్రార్ధ 4. వృద్ధిశ్రార్ధ 5. సపిండశ్రార్ధ 6. పార్వణ్‌శ్రార్ధ 7. గోష్టిశ్రార్ధ 8. సుర్ధ్యుద్‌శ్రార్ధ 9. కర్మాంగశ్రార్ధ 10. దైవికశ్రార్ధ 11. ఉపచారికశ్రార్ధ 12. సాంవత్సరికశ్రార్ధ.

భాద్రపదమాసంలోని కృష్ణపక్ష ఏకాదశినాడు ప్రారంభించి అమావాస్యతిధినాడు ముగించే శ్రార్ధకార్యక్రమాన్ని మహాళాయశ్రార్ధము అని పిలుస్తారు.

కొంతమంది హైందవులు ప్రయాగ, కాశి లాంటి పవిత్ర ప్రదేశాలకు వెళ్ళినపుడు ఆ ప్రదేశాలలో ఉన్న పుణ్య నదుల ఒడ్డుమీద తమపితృదేవతల ఆత్మశాంతికోసం నిర్వహించే శ్రార్ధకర్మలను తీర్థశ్రార్ధము అని పిలుస్తారు.

కొంతమంది పురోహితులు మరియు పండితులు కలిసి ఒక పవిత్ర ప్రదేశంలో పూర్వీకుల ఆత్మలకు శాంతి కలగటంకోసంచేసే శ్రార్ధ ప్రక్రియను గోష్టిశ్రార్ధము అని పిలుస్తారు.

ప్రధానశ్రార్ధ కర్మలో భాగంగా పురోహితులకు భోజనంపెట్టే కార్యక్రమాన్ని శుద్ధిశ్రార్ధము అంటారు. ఈ కార్యక్రమంవల్ల శ్రార్ధకర్తకు మైలదోషం సంపూర్తిగా తొలగిపోతుంది.

హైందవ మత గ్రంథాలలో మొత్తం 96 రకాల ఉప శ్రార్ధముల వివరాలు తెలియజేయబడ్డాయి.

పూర్వీకుల ఆత్మశాంతికోసం జలాన్నికాని, నువ్వులనుకాని, ప్రతిరోజూ సమర్పించే శ్రార్ధం ఒకరకం కాగా, సంవత్సరానికి ఒకసారి శాస్త్రోక్తంగా నిర్వహించేశ్రార్ధం ఒకరకం అవుతుంది. కొన్నిసార్లు ఒక ప్రత్యేక లక్ష్యం సాధించటానికి శ్రార్ధకర్మ నిర్వహించబడుతుంది. దీనిని కామ్యశ్రార్ధ అని పిలుస్తారు. ఈ క్రింద, కామ్యశ్రార్ధం ఏ తిథినాడు నిర్వహిస్తే ఏవిధమైన ఫలితం వస్తుందో తెలియజేయటం జరుగుతుంది పరిశీలించండి.

1. పాడ్యమినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే ఆరోగ్యవంతుడైన మగబిడ్డ జన్మిస్తాడు.

2. విదియనాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే ఆడపిల్ల పుడుతుంది.

3. తదియనాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే వాహనాలు, కీర్తి లభిస్తాయి.

4. చవితినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే కోళ్ళఫారాలు నిర్వహించేవారికి నష్టాలు తొలగిపోయి అపారమైన లాభాలు వస్తాయి.

5. పంచమినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే అందగాడైన కొడుకుపుడతాడు.

6. షష్టినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే లాటరీలు, స్పెక్యులేషన్‌లాంటి అంశాలలో విజయాలు లభించటమేకాకుండా మేధావి అయిన కొడుకుకూడా జన్మిస్తాడు.

7. సప్తమినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే వ్యవసాయభూమి లేదా స్థలాలు లభిస్తాయి.

8. అష్టమినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే వ్యాపారంలో ఎదురులేని విజయాలు లభిస్తాయి.

9. నవమినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే వాహనయోగం కలుగుతుంది.

10. దశమినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే పశుసంపద పెరుగుతుంది.

11. ఏకాదశినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే విశేషమైన అన్నవస్త్రాలు మరియు పండితుడైన కొడుకు లభిస్తాడు.

12. ద్వాదశినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే బంగారం, వెండి లభిస్తాయి.

13. త్రయోదశినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే తన కులంలో అధికస్థాయి కలవాడు అవుతాడు.

14. చతుర్ధశినాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే పదునైన ఆయుధంతోకాని, యుద్ధరంగంలో శత్రువులచేతకాని చనిపోయినవ్యక్తియొక్క ఆత్మకు చాలా తొందరగా న్నత లోకాలు లభిస్తాయి.

15. పౌర్ణమి/అమావాస్యనాడు కామ్యశ్రార్ధకర్మ నిర్వహిస్తే కోరిన సమస్త కోర్కెలు తీరతాయి.

(ఈ రెండు తిధులలో (పౌర్ణమి, అమావాస్య) కామ్యశ్రార్ధకర్మలు రాత్రి సమయంలో మాత్రమే చెయ్యాలని గుర్తించాలి. ముఖ్యంగా భాద్రపదమాసంలో వచ్చే అమావాస్య రాత్రులలోచేసే కామ్యశ్రార్ధకర్మలు విశేషమైన ఫలితాలను ఇస్తాయని తెలుస్తున్నది.)

♦ ఏ స్త్రీకైనా తరచుగావచ్చే గర్భస్రావాల కారణంగా గర్భాలు నిలవకుండా పోతున్నట్లయితే మాఘమాసంలోవచ్చే శుక్లపక్షంలోని అష్టమితిధినాడు కురుపితామహుడైన భీష్మాచార్యుడికి నీటిని సమర్పించి ఒక శ్రార్ధకర్మను నిర్వహిస్తారు. దీనిని భీష్మాష్టమి శ్రార్ధకర్మ అని పిలవటం జరుగుతుంది.

♦ కొన్నిసార్లు దుర్మార్గపు కార్యాలనుచేసేవారు అకాలమృత్యువుపాలుకావటం జరుగుతుంది. అలాంటివారికి ఆరుద్రానక్షత్రంలో శ్రార్ధకర్మ జరిపించినట్లయితే వారి ఆత్మ వేగంగా పుణ్యలోకాలకు చేరుకుంటుంది.

శ్రార్ధము అంటే కేవలము చెడు సందర్భాలలో మాత్రమే చేస్తారని భావించరాదు. ఇంతకుముందు కోరినకోర్కెలు సాధించుకోవటంకోసంచేసే కామ్య అనే శ్రార్ధకర్మ

గురించి వివరించటం జరిగింది. మంచి సందర్భాలలోచేసే శ్రార్ధాలను గురించి క్లుప్తంగా తెలియజేస్తాను.

**కర్మాంగశ్రార్ధము :** గర్భాదానము జరిగే సమయంలో ఈ శ్రార్ధకర్మను నిర్వహిస్తారు.

**వృద్ధిశ్రార్ధము :** ఒకబిడ్డ పుట్టిన సమయంలో దీనిని నిర్వహిస్తారు. ఫలితంగా ఆ బిడ్డ ఎలాంటి అనారోగ్యాలు లేకుండా పెరిగి పెద్దవాడు అవుతాడు.

**ఘృతశ్రార్ధము :** దీనినే యాత్రాశ్రార్ధము అనికూడా పిలుస్తారు. దూరప్రాంతంలో ఉన్న పుణ్యక్షేత్రాలకు క్షేమంగావెళ్ళి తిరిగిరావటానికి పితృదేవతలయొక్క ఆశీస్సులు పొందటానికి ఆవునేతిని ఉపయోగించి ఈ శ్రార్ధాన్ని జరపటం జరుగుతుంది.

**దధిశ్రార్ధము :** పుణ్యక్షేత్రాల నుండి తిరుగుప్రయాణాన్ని ప్రారంభించటానికి ముందు పెరుగుతో ఈ ప్రక్రియను నిర్వహిస్తారు.

**అష్టకశ్రార్ధము :** అష్టక అనగా చంద్రమానంలోవచ్చే నెలలోని శుక్లపక్షంలోని ఎనిమిదవరోజు అనిఅర్ధం. కనుక ఏ నెలలో అయినా శుక్లపక్షంలోని ఎనిమిదవరోజున చేసే శ్రార్ధకర్మను అష్టకశ్రార్ధకర్మ అని పిలుస్తారు. అయితే వేదకాలంలో ఈ అష్టకశ్రార్ధ కర్మను మార్గశిరం, పుష్యం, మాఘం మరియు ఫాల్గుణమాసాలలోని శుక్లపక్షంలోని ఎనిమిదవరోజున చెయ్యటం జరిగేది. ఆ సమయంలో శ్రార్ధకర్తలు తమ పూర్వీకుల ఆత్మలకు కూరలు, మాంసము, నువ్వులు, తేనె, బియ్యపుపాయసము, పండ్లు, దుంపల సమర్పించటం జరిగేది. విశ్వదేవుడు, అగ్ని, ఆదిత్యుడు, ప్రజాపతి, రాత్రి, నక్షత్రములు మరియు ఋతువులు ఈ శ్రార్ధానికి అధిదేవతలుగా చెప్పబడుచున్నారు.

**దైవికశ్రార్ధము :** దైవంయొక్క అనుగ్రహాన్ని పొందటంకోసం ఈ శ్రార్ధకర్మను నిర్వహిస్తారు.

**హిరణ్యశ్రార్ధము :** ఈవిధానంలో బ్రాహ్మణులకు భోజనాలుపెట్టకుండా కేవలం ధనాన్ని మాత్రమే దక్షిణగా ఇవ్వటం జరుగుతుంది అంతేకాక భోజనం పెట్టని కారణంగా ఆ బ్రాహ్మణులకు తినటానికిసరిపోయే అన్నం తయారుకావటానికి ఎన్ని బియ్యపు గింజలు పడతాయో అంతకు నాలుగురెట్ల బంగారాన్ని ఆ బ్రాహ్మణులకు ఇవ్వటం జరుగుతుంది. (బంగారాన్ని సంస్కృతంలో హిరణ్యము అని పిలుస్తారు).

**హస్తశ్రార్ధము :** కొన్నిసార్లు కొన్ని ప్రత్యేక పరిస్థితులకారణంగా శ్రార్ధకర్మలు నిర్వహించిన బ్రాహ్మణులకు వండిన భోజనాన్ని పెట్టే అవకాశం ఉండదు. ఆ సమయంలో బ్రాహ్మణులకు ధనాన్నికాని, స్వయంపాకంకాని ఇవ్వాలి.

**ఆత్మశ్రార్థ :** ఎవరికైతే సంతానం ఉండదో లేదా ఎవరి సంతానం నాస్తికులుగా ఉంటారో అలాంటివారు తాము బ్రతికి ఉండగానే తమకు శ్రార్ధం పెట్టుకోవటం జరుగుతుంది. ఇలాంటి శ్రార్ధాన్ని ఆత్మశ్రార్ధం అని పిలుస్తారు. (నాస్తికులైన కుమారులు తల్లిదండ్రులకు ఎట్టిపరిస్థితిలో శ్రార్ధకర్మలు చెయ్యరు. సంతానం లేనివారికి శ్రార్ధకర్మలు చేసేవారు ఎలాగూ ఉండరు. కనుక ఈ రెండు పరిస్థితులలో ఉన్నవారు తాము జీవించి ఉన్నపుడే తమకు శ్రార్ధాలు పెట్టుకున్నట్లయితే తాము చనిపోయిన తరువాత ప్రేతాత్మలుగా మారవలసిన పనిఉండదు).

సాధారణంగా ఒకవ్యక్తి చనిపోయినతేదీన అనగా తిథినాడు అతని శ్రార్ధకర్మ ప్రతి సంవత్సరమూ జరుపబడుతుంది. అయితే కొన్నిసార్లు ఒకవ్యక్తి చనిపోయిన నెల ఏదో తెలుస్తుందికాని, తిథి తెలియదు. అటువంటప్పుడు ఆ వ్యక్తి చనిపోయిన నెలలో వచ్చే అమావాస్య రాత్రి సమయంలో ఆ వ్యక్తికి శ్రార్ధకర్మలు నిర్వహించాలి. కొన్నిసార్లు ఒకవ్యక్తి చనిపోయినతిథి మరియు నెలకూడా తెలియదు. అలాంటి సమయంలో మాఘం లేదా మార్గశిర మాసాల్లో వచ్చే అమావాస్య రాత్రి సమయాల్లో శ్రార్ధకర్మలు నిర్వహించాల్సి ఉంటుంది.

శ్రార్ధకర్మలు నిర్వహించటానికి రోజును 5 భాగాలుగా విభజిస్తారు. అందులో నాల్గవభాగాన్ని అపరాణ్ణకాలం అని పిలుస్తారు. శ్రార్ధకర్మలు చేయటానికి ఆ సమయం అత్యంత యోగ్యమైనదిగా గుర్తించబడినది.

**కల్పాదితిథి :** బ్రహ్మదేవునియొక్క ఒక పగటికాలాన్ని సృష్టియొక్క ఆరంభ దినంగా భావిస్తారు. అందువలన ఆ పగలును కల్పాదితిథి అనిపిలుస్తారు. చైత్రమాసంలోని 1 మరియు 5వ తిథులు, వైశాఖమాసంలోని 3వతిథి, కార్తీకమాసంలోని 7వ తిథి, మార్గశిరమాసంలోని 9వ తిథి, మాఘమాసంలో 13వ తిథి, పాల్గుణమాసంలోని 3వ తిథి కల్పాది తిథులుగా గుర్తించబడ్డాయి. (పైన పేర్కొన్న తిథులన్నీ ఆయా నెలలలోని శుక్లపక్షంలో ఉండాలని గుర్తించాలి) ఈ తిథులలో జరిపే శ్రార్ధకర్మలవల్ల పూర్వీకులయొక్క ఆత్మలు పరిపూర్తిగా తృప్తిచెందుతాయి.

**అక్షయ తృతీయ :** కృతయుగంయొక్క ప్రారంభాన్ని అక్షయ తృతీయ అనేతిథి సూచిస్తుంది. వైశాఖమాసంలోని శుక్లపక్షంలోవచ్చే తదియ (3వ తిథి)ను అక్షయతృతీయ అని పిలుస్తారు. ఈ తిథినాడు పితృదేవతలకు సమర్పించే శ్రార్ధములు మరియు తర్పణాలు మరియు ఆ సమయంలోచేసే దానాలు చిరస్థాయిగా ఉండే ఫలితాలను ఇస్తాయని తెలుస్తున్నది. హైందవ పురాణాలు ఇచ్చే సమాచారం ప్రకారం అక్షయ

తృతీయ తిథినాడు పురోహితునికి స్వయంపాకం (బియ్యం, పప్పులు, ఉప్పులు, కూరలు, విస్తరాకులు, ఆకుకూరలు, నెయ్యి, పాలు, పెరుగు), నీటికుండ, విసనకర్ర, గొడుగు, పాదరక్షలు ఇచ్చినట్లయితే అవి ఇచ్చినవారి పితృదేవతలకు చెందుతాయని గ్రహించాలి.

సూర్యుడు కన్యారాశిలో ఉన్నప్పుడు తమ పితృదేవతలకు శ్రార్ధకర్మలు నిర్వహించని మానవులకు సంతానభాగ్యము మరియు సంపదలు లభించవని మహాభారతగ్రంథంలో చెప్పబడి ఉన్నది. సూర్యుడు కన్యారాశిని మరియు తులారాశిని దాటి వృశ్చికరాశిలో ప్రవేశించేవరకు పితృలోకం ఖాళీగా ఉంటుంది. అనగా ఆ సమయంలో పితృదేవతలు భూమిమీదకువచ్చి తమ వారసులకు దగ్గరలో ఉంటారు. అలాంటి సమయంలో వారికి వారి వారసులు తగిన శ్రార్ధకర్మలను నిర్వహించి వారిని తృప్తిపరచాలి. అలా చేయకున్నట్లయితే ఆ పితృదేవతల ఆత్మలు తమ వారసుల్ని ఘోరంగా శపిస్తాయి అని పురాణ గ్రంధాలలో చెప్పబడి ఉన్నది.

సంస్కృతభాషలో "తర్ప" అంటే ఇతరులను తృప్తిపరచటం అనిఅర్థం. ఈ పదం నుండి ఏర్పడిన "తర్పణం" అనే పదానికి అర్థం ఏమిటంటే దేవుడికి, ఋషులకు, పూర్వీకుల ఆత్మలకు లేదా ఇతర మానవులకు దాహం తీర్చటంకోసం నీటిని సమర్పించటం అన్నమాట. శ్రార్ధకర్మల సమయంలో పితృదేవతలకు నువ్వులు కలిపిన నీటిని తర్పణాలుగా ఇవ్వటంవల్ల పితృదేవతలయొక్క ఆత్మలు అధికంగా తృప్తి చెందుతాయి. పితృదేవతలకు ఇచ్చే పిండప్రదానాలు సూర్యకిరణాలద్వారా పితృదేవతలకు చేరతాయని చెప్పబడుతున్నది. మానవులకు ఒక సంవత్సరం గడిస్తే పితృదేవతలకు ఒకరోజు గడుస్తుంది. కనుక మానవులు తమ పితృదేవతలకు సంవత్సరానికి ఒకసారి శ్రార్ధకర్మలు నిర్వహిస్తే పితృదేవతల లెక్కప్రకారం ప్రతిరోజూ శ్రార్ధకర్మలు నిర్వహించినట్టుగా భావించబడుతుంది.



# 2. జన్మకుండలి ద్వారా పిశాచపీడ వివరాలు తెలుస్తాయా?

ఒకవ్యక్తి జన్మించిన సమయంలో ఉన్న గ్రహస్థితులనుబట్టి ఆ వ్యక్తి జీవితంలో జరిగే అనేక సంఘటనలు నిర్ణయమవుతాయి. అలాగే ఒకవ్యక్తి జాతకచక్రంలోని కొన్ని గ్రహ స్థితిగతులవలన ఆ వ్యక్తికి మానసిక రోగాలు రావటం, పిశాచపీడ కలగటం మరియు ఉన్మాదం రావటం జరుగుతుంది. ఆ వివరాలు క్లుప్తంగా తెలుసుకుందాం. జాతకచక్రంలోని వివిధ గ్రహాలు ఒక్కొక్కస్థానంలో ఉన్నపుడు ఒక్కొక్కవిధమైన యోగం ఏర్పడుతుంది. రుచికయోగం, హంసయోగం లాంటి యోగాల లాగానే పిశాచగ్రస్తయోగం అనే ఒకయోగంకూడా జ్యోతిషశాస్త్రంలో చెప్పబడి ఉన్నది. ఒకవ్యక్తి జాతకచక్రంలోని లగ్నంలో రాహువు మరియు చంద్రుడు కలసి ఉన్నా, పాపగ్రహాలు కేంద్రాలలో ఉన్నా జాతకునికి పిశాచగ్రస్తయోగం పడుతుంది. ఇంకొక ముఖ్యవిషయం ఏమంటే ఈ యోగం పట్టిన జాతకుని జన్మచక్రంలో శని లగ్నంలో ఉన్నా లేదా లగ్నాని వీక్షించినా ఈ యోగం మరింత బలవత్తరమవుతుందని గ్రహించాలి.

| | | | |
|---|---|---|---|
| మీనం రాహువు | మేషం గుళికుడు | వృషభం | మిధునం కుజుడు |
| కుంభం చంద్రుడు | జన్మకుండలి | | కర్కాటకం 11 సూర్యుడు |
| మకరం గురువు | | | సింహం బుధుడు |
| ధనస్సు | వృశ్చికం | తుల | కన్య 1 |

| | | | |
|---|---|---|---|
| మీనం | మేషం లగ్నము | వృషభం శుక్రుడు | మిధునం |
| కుంభం | నవాంశ | | కర్కాటకం కుజుడు |
| మకరం కేతువు | | | సింహం |
| ధనస్సు | వృశ్చికం శని | తుల 7 | కన్య 6 |

పిశాచగ్రస్త యోగాన్ని కలిగి ఉన్న జాతకులు పిశాచాలచేత ఆవహించబడటం కాని, పిశాచాలచేత బాధించబడటంకాని జరుగుతుంది. అంతేకాకుండా ఈ యోగంలో ఉన్న జాతకులు అనేక రకాల పాశవికమైన మరియు దారుణమైన వ్యాధులను పొందటం జరుగుతుంది. ఈ రకమైనయోగం ఉన్న వ్యక్తులు ఉద్యోగస్తులైనట్లయితే

తమ పై అధికారులతో వీరికి తరచుగా గొడవలు జరుగుతూ ఉంటాయి. అంతేకాకుండా ఈ యోగంలో జన్మించిన వ్యక్తులు అనేక అవమానాలకు, అపకీర్తికి తరచుగా గురి కావటం జరుగుతుంది. ఈ క్రింద, మానసికరోగంతో బాధపడుతున్న ఒకవ్యక్తియొక్క జన్మకుండలి మరియు అంశచక్రం ఇవ్వబడుతున్నాయి. ఈ చక్రాలలో ఉన్న గ్రహస్థితులు మరియు వాటి ఫలితాల గురించి క్లుప్తంగా తెలుసుకుందాం....

ఎ) పైన ఇచ్చిన జన్మకుండలిని లగ్నంలో శిరస్సులేని పాపగ్రహం కేతువు స్థితి పొంది ఉన్నాడు.

బి) కేతువు లగ్నంలో ఉండటం మరియు ఆ గ్రహం కుజునియొక్క నాల్గవ దృష్టిని పొందటంవల్ల ఈ జాతకంలో పిశాచగ్రస్తయోగం ఏర్పడింది. నాల్గవ స్థానమైన ధనస్సులో ఏ గ్రహమూ లేకపోవటమూ మరియు కుజునియొక్క సప్తమ పాపదృష్టి ఈ స్థానంపై పడటం జరిగింది.

సి) ఏడవ స్థానమైన మీనరాశిలో రాహువు, పదవ స్థానమైన మిథునంలో పాపగ్రహమైన కుజుడు స్థితిపొందటం జరిగింది.

డి) జన్మకుండలినిలోని ఒక్క కేంద్రస్థానంలోకూడా శుభగ్రహాలైన గురువు, శుక్రుడు, బుధుడు మరియు పూర్ణచంద్రుడు లేకపోవటం వలన దోషం మరింత అధికమయ్యింది. ఫలితంగా ఈ వ్యక్తి చేతబడి వల్లగాని, దుష్టగ్రహపీడవల్లగాని పిశాచబాధను పొందటం జరిగింది.

ఇ) కేంద్రస్థానాలైన 4,7,10వ గృహాలలో పాపగ్రహాలు ఉండటం మరియు లగ్నం రాహుకేతువుల మధ్య ఉండటంవల్ల ఇతడు సర్పదోషానికి గురికావటం జరిగింది. ఇక ఈ జన్మకుండలినిలోని కుజుడు, కేతువు ఈ వ్యక్తి అగ్ని ప్రమాదాలకు గురి అవుతాడని సూచిస్తున్నాయి.

ఎఫ్) శత్రుస్థానమైన 6వ స్థానంలో చంద్రుడు స్థితిపొందటంవల్ల ఆ వ్యక్తి తీవ్రమైన రోగాన్ని పొందటం జరిగింది.

జి) ఇక నవాంశ చక్రాన్ని పరిశీలించినట్లయితే ఇందులో రంధ్రస్థానము అని పేర్కొనబడే అష్టమ గృహం మేషరాశి అయ్యింది. ఇది చెడుస్థానం. ఇందులో సూర్యుడు స్థితిచెంది ఉండటంవల్ల ఈ వ్యక్తికి శిరస్సుకు సంబంధించిన వ్యాధులు రావటం జరిగింది.

హెచ్) ఈ జన్మకుండలినిలో లగ్నం కన్య అయ్యింది. ఆ లగ్నాధిపతి అయిన బుధుడు వ్యవస్థానమైన 12వ గృహంలో శుక్రుడు మరియు శనితో కలిసి ఉండటం వల్ల ఆ వ్యక్తికి తీవ్రమైన చెడు జరుగుతుంది.

ఐ) నవాంశ చక్రంలో ఆత్మకారకుడైన శని రోగస్థానము మరియు ఆయుస్థానము అని పేర్కొనబడిన అష్టమభావము అనగా వృశ్చికరాశిలో స్థితిచెంది ఉండటంవల్ల ఈ జాతకునికి అపరిమితమైన రోగాలు వస్తాయి. ముఖ్యంగా నవాంశ చక్రంలోని 6/8/12వ స్థానాలలో ఆత్మకారకుడు స్థితిపొంది ఉండినట్లయితే ఆ వ్యక్తికి దీర్ఘకాల వ్యాధులు ప్రాప్తిస్తాయి.

ఈ జాతకునియొక్క జన్మకుండలినిలోని వ్యయస్థానంలో లగ్నాధిపతి అయిన బుధునితోపాటుగా శని మరియు రాహువు ఉండటంవల్ల ఈ జాతకుడు మేధస్సు ెబ్బతిని ఉన్మాదిగా మారిపోయాడు.

ఈ జాతకంలో బాధకుడిగా గురువు ఉన్నాడు. అంతేకాకుండా అతడు మకరరాశిలో వక్రించి ఉన్నాడు. అంతేకాకుండా మంత్రస్థానమని పేర్కొనబడే పంచమ స్థానంలో గురువు వక్రించి ఉన్న కారణంగా జాతకునిపై క్షుద్రప్రయోగాలు జరిగే అవకాశం ఉంటుంది.

గురు మహాదశలో శుక్రుని అంతర్దశ జరుగుతున్న సమయంలో ఈ జాతకునిపై చేతబడి జరిగింది. గురుమహాదశలోని రవి అంతర్దశలో ఈ జాతకుడు నివసించే ప్రాంతంలో ఒకపెద్ద అగ్ని ప్రమాదం జరిగి అతని గృహము మరియు అందులోని సమస్త సామాగ్రి దహనం అయిపోయాయి. ఫలితంగా ఈ వ్యక్తికి పిచ్చెక్కిపోయింది. ఆ తరువాత అతడిని మామూలు మనిషిగా మార్చటానికి అతని బంధువులు అతడిని ఎందరో సైకియాట్రిస్టులకు (మానసికవ్యాధి నిపుణులు) చూపించటం జరిగింది. ఎన్నిచేసినా అతని ఆరోగ్యం చక్కబడలేదు. **(ఇలాంటి పరిస్థితులలో ఈ వ్యక్తికి సంబంధించిన కొందరు వ్యక్తులు కార్తికేయపీఠ నిర్వాహకులు అయిన శ్రీస్వామిగారిని ఫోనుద్వారా సంప్రదించి ఆ తరువాత ఆ వ్యక్తియొక్క జాతకాన్ని స్వామిగారికి చూపించటం జరిగింది. అతిభయంకరమైన పిశాచగ్రస్త యోగంతో బాధపడుతున్న ఆ వ్యక్తికి క్షుద్రపీడలనుండి మరియు మానసిక రోగాలనుండి రక్షణ కలిగించటంకోసం శ్రీస్వామివారు సుబ్రహ్మణ్యత్రిశతి** అనే తాంత్రిక విధానాన్ని మూడు రోజులపాటు జరిపించి ఆపై ప్రసాదాన్ని, తీర్థాన్ని ఆ వ్యక్తికి ఇచ్చారు. ఆ తరువాత రహస్య సుబ్రహ్మణ్య యంత్రాన్ని ఆ వ్యక్తిమెడలో వేశారు. ఆ తరువాత రెండు నెలలకి ఆ

వ్యక్తికి మానసిక వ్యాధులు మరియు శారీరక వ్యాధులు నయం అయిపోయాయి. ప్రస్తుతం ఆ వ్యక్తి ఇపుడు హైదరాబాద్‌లో హోటల్‌వ్యాపారంచేస్తూ ప్రశాంతమైన జీవితాన్ని కుటుంబ సభ్యులతో కలసి గడుపుతున్నాడు.)

మానవులు గతజన్మలో చేసిన పాపాల కారణంగా ఈ జన్మలో పిశాచగ్రస్త యోగాన్ని లేదా సర్పశాపాన్ని లేదా దైవశాపాన్ని అనుభవించవలసి ఉంటుంది. ఇలాంటి బాధలను పొందుతున్నవారియొక్క జాతకచక్రాలను పరిశీలించినట్లయితే కొన్ని ముఖ్య విషయాలు తేలికగా అర్ధమయిపోతాయి.

ఒకవ్యక్తి జాతకంలోని బాధకస్థానాధిపతిఅయిన గురుడు 6/8/12వ స్థానాలలో ఉండటం మరియు రాహువు నుండి కేంద్రస్థానాలైన 1/4/7/10వ స్థానంలో ఉండటం జరిగినట్లయితే ఆ జాతకుడు గతజన్మలో దేవజాతికి చెందిన సర్పాలను దారుణంగా సంహరించి సర్పశాపానికి గురైనట్లుగా గుర్తించాలి. అలాకాకుండా బాధకుడైన గురువు విషగ్రహమైన గుళికుడి నుండి కేంద్రస్థానాలలో స్థితిపొందినట్లయితే ఆ వ్యక్తి గతజన్మలో అల్పస్థాయికిచెందిన సర్పాలను సంహరించి నాగశాపాన్ని పొందినట్లుగా గుర్తించాలి.

ఒకవ్యక్తి జాతకచక్రంలోని బాధకస్థానంలో రాహువు ఉన్నట్లయితే ఆవ్యక్తికి సర్పాలవల్ల ప్రమాదం పొంచిఉన్నట్లుగా గుర్తించాలి.

ఒకవ్యక్తి జాతకచక్రంలోని రాహువుకి కేంద్రస్థానంలో కుజుడు ఉన్నట్లయితే ఆ వ్యక్తి గతజన్మలో సర్పాలకు నివాసంగా ఉన్న వృక్షాన్ని తగలపెట్టటం లేదా నరికివేయటంకాని లేదా సర్పాలు నివసించే పుట్టను తొలగించటంకాని చేసి ఉంటాడని గుర్తించాలి. తాను స్వయంగా ఆ పాపాలను చెయ్యకపోయినప్పటికీ వాటికి అతడు పరోక్షంగా బాధ్యుడు అయితే ఆ పాప ఫలాన్ని చాలావరకు అతడు పొందక తప్పదు.

చాలామందికి తెలియని విషయం ఏమంటే ఒక భవనాన్నికాని లేదా ఆలయాన్నికాని నిర్మించేటపుడు ఒక ఇంజనీర్ మరియు మేస్త్రి సహాయం ఎలా తీసుకుంటామో అదేవిధంగా ఆ సమయంలో ఒక పురోహితుని సహాయంకూడా తప్పకుండా తీసుకోవాలి. నిర్మాణాన్ని చెయ్యబోతున్న భూమిలో ఉండే చెట్లను తొలగించే ముందు ఆ చెట్లపై అదృశ్యరూపంలో నివాసం ఉండే శక్తుల్ని మరియు ఆ చెట్టుపై సజీవంగా నివసించే సర్పాలను మంత్ర ప్రక్రియలద్వారా శాంతింపచేసి ఆపై వాటిని

అక్కడ నుండి పంపివేసిన తరువాతే తరువాత కార్యక్రమాల్ని ప్రారంభించాలి. ఇందుకోసం పురోహితుని మంత్రబలం ఎంతగానో ఉపయోగపడుతుంది.

జ్యోతిషశాస్త్రంలో పిశాచగ్రస్తయోగంతోపాటుగా ప్రేతశాపయోగం అనే ఇంకొక భయంకరమైన యోగం గురించికూడా చెప్పబడి ఉన్నది. ఒకవ్యక్తి జాతకచక్రంలో 5వ స్థానంలో శని మరియు సూర్యుడు స్థితిపొంది ఉండటం మరియు కృష్ణపక్ష చంద్రుడు (క్షీణచంద్రుడు) సప్తమస్థానంలో ఉండటం, రాహువు లగ్నంలో ఉండటం గురువు 12వ స్థానంలో ఉండటం వల్ల ఆ జాతకునికి ప్రేతశాపయోగం ఏర్పడుతుంది. చనిపోయినవారియొక్క ఆత్మలు ఇచ్చే శాపకారణంగా ఆ వ్యక్తియొక్క సంతానం అకాల మృత్యువుపాలు కావటం జరుగుతుంది.

కేవలము జాతక ప్రకారమే కాకుండా బుద్ధిపూర్వకంగా చేసే కొన్ని పొరపాట్ల వల్లకూడా ప్రేతశాపాన్ని పొందే అవకాశం మానవులకు ఉంటుంది. అది ఎలాగంటే సాధారణంగా ఎవరైనా హైందవుడు లేదా హైందవురాలు చనిపోయిన 13 రోజుల పాటు వారియొక్క ఆత్మశాంతికోసం కొన్ని శాస్త్రీయ ప్రక్రియలను నిర్వహించాల్సి ఉంటుంది. అలాచేయని పక్షంలో చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలు, ప్రేతాత్మలుగా మారి తమ వారసుల్ని శపించటం జరుగుతుంది.

నోట్ : సైన్స్ అంగీకరించకపోయినా కొన్ని క్షుద్రశక్తులు ఈ లోకంలో సంచరిస్తున్నాయి. వాటి బారినపడ్డ మానవులు తమ జీవితాలలో అనుకోని ప్రమాదాలకు, పరాజయాలకు, నష్టాలకు గురికావల్సి ఉంటుంది. జ్యోతిషశాస్త్రాన్ని మరియు తంత్రశాస్త్రాన్ని ఉపయోగించుకుని అలాంటి ప్రమాదాలబారినుండి రక్షించుకునే అవకాశం మానవులకు భగవంతునిచేత ప్రసాదించబడింది. వాటిని ఉపయోగించుకుని సమస్యనుండి బయటపడాలా? లేదా నాస్తికత్వాన్ని, హేతువాదాన్ని విశ్వసిస్తూ ఇంగ్లీషు వైద్యానికి డబ్బుని, కాలాన్ని జీవితాన్ని బలిచేయాలా? అన్న విషయాన్ని ఎవరికివారే నిర్ణయించుకోవలసి ఉంటుంది.



# 3. దేవతగా మారిన కంజీరొట్టు యక్షి వివరాలు ఏమిటి?

నేను ఇంతవరకు వ్రాసిన గ్రంధాలలో కేరళకు చెందిన యక్షిల గురించి వ్రాయటం జరిగింది. ఈ గ్రంథంలో ఒక యక్షియొక్క విచిత్రమైన కధ గురించి వ్రాయటం జరుగుతున్నది. దాదాపు 100 సంవత్సరాలక్రితం కేరళ రాష్ట్రంలో యదార్థంగా జరిగిన ఈ సంఘటన వివరాలు ఇలా ఉన్నాయి.

ఒక స్త్రీ లేదా పురుషుడు తీరని కోర్కెలతో మరణించినపుడు ప్రేతాత్మగామారి తన కోర్కెలను తీర్చుకోవటం జరుగుతుంది. అలాంటి వాటిలో ఒకటి యక్షి. ఈ యక్షి అతి క్రౌర్యమైన స్వభావం కలిగి ఉంటుంది. ఇది అందమైన స్త్రీ రూపాన్ని ధరించి జన సంచారంలేని ప్రదేశంలో సంచరిస్తూ పొరపాటున అటువైపుగా వచ్చిన పురుషుడిని ఆకర్షించి దగ్గరగా తీసుకుని ఆపై వికృతమైన తన అసలు రూపాన్ని అతడికి చూపించి, అతడిని చంపి అతడి రక్త మాంసాలను తినివేస్తుంది. ఈ యక్షి కథలు ఒకప్పుడు, యదార్థంగా జరిగినవే అని గుర్తించాలి. అలాంటి వాటిలో ఒకటి కంజీరొట్టుయక్షి.

దాదాపు ఒక శతాబ్దం క్రితం కేరళ రాష్ట్రంలో ఉన్న దక్షిణ ట్రావెన్‌కూర్ (ప్రస్తుతం ఇది తమిళనాడులో ఉన్నది)లోని కంజీర్‌కోడ్ ప్రాంతంలో ఉన్న మంగలాత్తు అనే పేరుగల సంపన్న నాయర్ కుటుంబంలో ఒక అందమైన స్త్రీ శిశువు జన్మించింది. ఆమెపేరు చిరుదేవి. ఆమె పెరిగి పెద్దది అవుతున్నకొద్ది అంతకంతకు సౌందర్యాన్ని పెంచుకుంటూ పురుషుల్ని మన్మధ బాధలో కాలిబూడిద అయ్యేలా చేస్తూ ఉండేది. ట్రావెన్‌కూర్ సంస్థానాధీశుడైన మార్తాండవర్మకు ప్రత్యర్థిగా చెప్పబడిన కుంజుధంపి అనే సంపన్నుడితో చిరుదేవి శారీరక సంబంధం పెట్టుకున్నది. ఆ తరువాత ఆమె ఎంతోమంది ధనికులైన పురుషుల్ని తనవద్దకు రప్పించుకోవటం ప్రారంభించింది. అయితే ఎందరు అందగాళ్ళతో సంభోగించినా ఆమె దృష్టిమాత్రం ఎల్లప్పుడూ కంజూర్‌మన్ అనే యువకుడి మీదే ఉండేది. పొడవుగా, చక్కటి ఛాయతో, బలమైన శరీరంతో, అందమైన ముఖ వర్చస్సుతో వెలిగిపోయే కంజూర్‌మన్ పల్లకీమోసే పనిచేసేవాడు. కంజూర్‌మన్‌మీద చిరుదేవికి విపరీతమైన వ్యామోహం ఉండేది. ఆమె మరియు ఆమె సోదరుడు గోవిందన్ అనేకసార్లు కంజూర్‌మన్ మోసే పల్లకిఎక్కి చుట్టుప్రక్కల ప్రదేశాలకు వెళ్ళివచ్చేవారు.

చిరుదేవి, కంజూర్‌మన్‌ని శారీరకంగా మరియు మానసికంగా బాధపెడుతూ రాక్షస ఆనందం పొందుతూ ఉండేది. అతని భుజంపై మోయలేని బరువులు పెట్టేది. అతని కాళ్ళను కాల్చిన ఇనుపకడ్డీలతో కాల్చేది. ఊపిరి ఆడకుండా రెండు చేతులతో అతడి గొంతు పిసికేది. ఎందువల్ల చిరుదేవి, కంజూర్‌మన్‌ని ఇన్నిరకాలుగా బాధిస్తున్నది ? అన్న అనుమానం మీకు వస్తుంది. అందుకు నా సమాధానం ఏమిటి అంటే కంజూర్‌మన్ అప్పటికే వివాహితుడు. అతడు తన భార్యను తప్ప పరస్త్రీని కన్నెత్తికూడా చూడడు. అందువల్ల చిరుదేవి అతడిని మగ్గులోకి దింపాలని ఎంత ప్రయత్నించినా ఆమెకు వీలుకాలేదు. తనకు దక్కని కంజూర్‌మన్ తనభార్యతో సుఖంగా ఉండటం నచ్చని చిరుదేవి అతడిని రోజులో అనేకసార్లు అవమానిస్తూ, శారీరకంగా బాధిస్తూ తన కసి తీర్చుకుంటూ ఉండేది. చిరుదేవి చేస్తున్న అక్రమాలనుచూసి ఆమె సోదరుడైన గోవిందన్ ఆగ్రహించేవాడు. అమాయకుడైన కంజూర్‌మన్‌ని చూసి జాలిపడేవాడు.

పద్ధతిమార్చుకోమని చిరుదేవికి గోవిందన్ ఎన్నోసార్లు సలహా ఇచ్చాడు. చిరుదేవి తన పంతం వదలలేదు. చివరికి ఆమె, కంజూర్‌మన్ భార్యను చంపటానికి ఒక పథకం పన్నింది. ఆ విషయం తెలుసుకున్న గోవిందన్, ఒకసారి కంజూర్‌మన్ మోస్తున్న పల్లకిలో వెళుతూ చిరుదేవి చేస్తున్న కుట్ర గురించి కంజూర్‌మన్‌కి తెలియ జేసాడు. ఈ విషయం తెలుసుకున్న కంజూర్‌మన్‌లో సహనం నశించిపోయింది. ఎలాగైనా చిరుదేవిని చంపి తన భార్యను ఆమె బారినుండి రక్షించుకోవాలని పథకం వేసాడు. ఒక వర్షం కురుస్తున్న రాత్రి చిరుదేవి చిరునవ్వుతో కంజూర్‌మన్‌ని తన పడక గదిలోకి ఆహ్వానించింది. చిరుదేవి ఒంటరిగా దొరికితే చంపాలన్న ఆలోచనలో ఉన్న కంజూర్‌మన్‌కి ఆ ఆహ్వానం మహా ఆనందాన్ని కలిగించింది. అతడు మరింతగా నవ్వులు చిందిస్తూ ఆమె పడక గదిలోకి వెళ్ళాడు.

చిరుదేవి క్షణాలలో వివస్త్రగామారి అర్ధనగ్నంగా ఉన్న కంజూర్‌మన్ బలిష్ఠ దేహాన్ని గాఢంగా ఆలింగనం చేసుకుని అతడిని శెయ్యమీదకి నెట్టింది. ఇద్దరూ శృంగారంలో మునిగితేలుతున్నారు. చిరుదేవికి ఎన్నో నెలలుగా కంజూర్‌మన్‌మీద ఉన్న కోరిక తీరుతున్నది. ఆమె మైకంలో ఉన్న సమయంలో కంజూర్‌మన్ తన చేతుల్ని ఆమె గొంతుపైవేసి ఆమె గొంతు పిసికాడు. ఇనుపకడ్డీల్లాంటి కంజూర్‌మన్ చేతుల్లో సున్నితమైన చిరుదేవి గొంతు మూగపోయింది. చిరుదేవి చనిపోయింది. తన సోదరిని కంజూర్‌మన్ హత్యచేసినప్పటికీ గోవిందన్ ఏమాత్రం బాధపడలేదు.

అలాంటి పాపిష్ఠిదానికి కంజూర్‌మన్ ద్వారా దైవం తగిన శిక్షే విధించాడని భావించిన గోవిందన్, కంజూర్‌మన్ చేసిన హత్యానేరాన్ని దాచిపెట్టి కంజూర్‌మన్‌ని కాపాడాడు.

అయితే ఆ కథ అంతటితో ముగిసిపోలేదు. మరణించిన కొద్ది నెలలకే చిరుదేవి కంజీరకోడ్ ప్రాంతంలోని ఒక దంపతులకి బిడ్డగా జన్మించింది. జన్మించిన కొద్ది నిమిషాలలోనే కళ్ళుచెదిరే అందంతో మెరిసిపోయే యువతిగా పెరిగిపోయింది. ఇపుడు ఆమెపేరు కంజీరొట్టుయక్షి. ఇపుడు ఆమె మానవ స్త్రీకాదు. పగ, ప్రతీకారాలతో రగిలిపోతున్న యక్షి. ఆ తరువాత ఆమె రాత్రి సమయాలలో ట్రావెన్‌కూర్ రాజ్యంలో సంచరిస్తూ తన కంటికి నచ్చిన మగ వాడిని ఆకర్షించి అతడితో శృంగారం జరిపి తన కోర్కె తీర్చుకుని, ఆపై అతడిగొంతు కొరికి అతడి ఒంట్లోని రక్తాన్ని సమూలంగా పీల్చివేస్తూ ఉండేది. ఆమె ఆవిధంగా ఎంతమంది అందమైన పురుషుల్ని అనుభవించినా తృప్తిచెందలేదు. ఆమె మనసులో ఎల్లప్పుడు కంజూర్‌మన్ మెదులుతూ ఉండేవాడు.

ఆ తరువాత కొద్ది నెలలకి ఆ యక్షి, కంజూర్‌మన్ దగ్గరకి వెళ్ళింది. "నువ్వు నన్ను చంపేశావు. నేను ఇప్పుడు పిశాచిగా జన్మించాను. ఇప్పటికైనా నీవు నన్ను పెళ్ళి చేసుకో నీ భార్యను చంపకుండా వదులుతా" అని కంజూర్‌మన్‌ని హెచ్చరించింది. అందుకు కంజూర్‌మన్ అంగీకరించలేదు. అతని తిరస్కారాన్ని సహించలేని యక్షి కంజూర్‌మన్ భార్యను అనేక రకాలుగా బాధలుపెట్టింది. తన భార్యను యక్షి బారినుం రక్షించుకోవటంలో విఫలుడైన కంజూర్‌మన్ సహాయంకోసం గోవిందన్ వద్దకు వెళ్ళాడు. గోవిందన్‌వద్దకువెళ్ళి తాను చంపిన చిరుదేవి యక్షిగామారి తన భార్యను వేధిస్తున్నది అని గోవిందన్‌కి చెప్పాడు. గోవిందన్ విషయం అర్థంచేసుకుని యక్షి వద్దకు కంజూర్‌మన్ తరపున మధ్యవర్తిగావెళ్ళి ఆమెతో ఇలా చెప్పాడు. నిన్ను కంజూర్‌మన్ తప్పకుండా వివాహం చేసుకుంటాడు. అయితే అందుకు రెండు షరతులు నేను విధిస్తున్నాను వాటికి నువ్వు అంగీకరించాలి. అవి ఏమిటంటే....

1. కంజూర్‌మన్ నీకు భర్తగా ఒక సంవత్సరంపాటు ఉండి నిన్ను శారీరకంగా సుఖపెడతాడు. అందుకు ప్రతిఫలంగా నువ్వు దేవతా విగ్రహంగామారి గుడిలో ప్రతిష్టించబడాలి.

2. గుడిలో దేవతగా ప్రతిష్టించబడ్డ నువ్వు కంజూర్‌మన్‌ని ప్రేమించే ప్రతి ఒక్కరినీ దీవించాలి. కంజూర్‌మన్ ఎన్ని జన్మలు ఎత్తినాసరే అతడిని ఇష్టపడే వారిని నువ్వు దీవిస్తూనే ఉండాలి.

కనీసం ఒక్క సంవత్సరం అయినా సరే కంజూర్‌మన్‌ని భర్తగా పొందే అవకాశం రావటంతో యక్షి మధ్యవర్తిగా వచ్చిన గోవిందన్ పెట్టిన రెండు షరతులకు అంగీకరించి

కంజూర్‌మన్‌ని వివాహం చేసుకున్నది. ఇద్దరూ సంవత్సరంపాటు శృంగార సామ్రాజ్యంలో ఓలలాడారు. సంవత్సరం గడిపోయింది. యక్షి ఒక అందమైన శిల్పంగా మారిపోయింది. ఆ తరువాత గోవిందన్ ఒక ఆలయాన్నికట్టి అందులో యక్షి విగ్రహాన్ని ఉంచి పూజలు చేయటం ప్రారంభించాడు. ఆనాటి నుండి ఆ యక్షి ఆలయాన్ని కంజీరకొట్టువల్లెవీడు ఆలయం అని పిలువబడింది.

మలయాళీలకు వచ్చే మీనమాసంలోని పౌర్ణమినాడు మరియు వారి మిగిలిన 11 సౌర మాసాలలోని తొలి శుక్రవారంనాడు యక్షి అమ్మకి పొంగలిని నైవేద్యంగా పెడతారు.

**మెలాన్‌కోడ్ యక్షి** ట్రావెన్‌కూర్ సంస్థానాన్ని పరిపాలించిన మార్తాండవర్మయొక్క వతితల్లి ఒకసారి ఏ కారణంచేతనో విపరీతంగా ఆగ్రహించి రెండు చేతులతో తన ాలుకను బయటకు లాగి తెంపి ఆత్మహత్య చేసుకున్నది. ఆ బలవన్మరణం కారణంగా .మె మెలాన్‌కోడ్ యక్షిగా మారిపోయింది.



# 4. సినీ నిర్మాణ సమయంలో ప్రేతాత్మలు?

ఎంతోమంది తమ మేధస్సును, శ్రమను, సమయాన్ని, డబ్బుని ఉపయోగిస్తేకాని ఒక చలన చిత్రం తయారుకాదు. అయితే ఈ చిత్రాలను కొన్నిసార్లు బహిరంగ ప్రదేశాలలో అనగా నగరాలలో, కొండలమీద, అడవులలో తియ్యటం జరుగుతుంది. అలాంటి సమయాలలో ఆ చిత్ర నిర్మాణంలో పాల్గొనేవారికి అప్పుడప్పుడూ అతీంద్రియ శక్తులతో కొన్నిరకాల ఇబ్బందులు రావటం జరుగుతుంది. కొన్నిసార్లు కొన్ని చిత్రాలను నిర్మించినపుడు ఆ చిత్ర నిర్మాణంలో పాల్గొన్న నటులకో, నిర్మాతలకో, దర్శకులకో, ఇతర టెక్నీషియన్లకో భయంకర అనుభవాలు ఎదురుకావటం జరుగుతుంది.

కొన్ని దశాబ్దాల క్రితం తెలుగులో దక్షయజ్ఞం అనే ఒక చిత్రం నిర్మించబడింది. అందులో పరమశివునిగా నాటి తెలుగు అగ్రనటుడు యన్.టి.రామారావు నటించటం జరిగింది. సాధారణంగా ఇతర నటుల సంగతి ఎలా ఉన్నా యన్.టి.రామారావు మాత్రం పౌరాణిక చిత్రాలు వేషాలు వేసేటప్పుడు కొన్ని నియమాలను పాటించటం జరిగేది. ఉదాహరణకు దైవ పాత్రలు వేసినపుడు మద్య, మాంసాలకు దూరంగా

ఉండటం, నేలపై పడుకోవటం లాంటి నియమాలను ఆయన పాటించటం జరిగింది. అంత నిబద్ధతతో నటించిన కారణంగానే ఆయన వేసిన పౌరాణిక పాత్రలన్నీ అపూర్వమైన ప్రజాదరణను పొందటం జరిగింది. అయితే దక్షయజ్ఞం నిర్మాణం సమయంలో ఆయన పాటించే నియమాలలో ఏదో పొరపాటు జరిగిందని ఫలితంగా ఆ చిత్రంలో శివునివేషం వేసిన ఆయన, ఆ చిత్ర షూటింగ్ సమయంలో పుత్రశోకాన్ని భరించవలసి వచ్చింది. దక్షయజ్ఞం చిత్ర షూటింగ్ జరుగుతున్నపుడు ఆయన పెద్ద కుమారుడు రామకృష్ణ ఆకస్మిక మరణం పొందటం జరిగింది. ఆ తరువాత యన్.టి.రామారావు ఎప్పుడూ పౌరాణిక వేషాలు వేసినా చాలా కఠినంగా నియమాలు పాటిస్తూ షూటింగులో పాల్గొనటం జరిగింది.



ఇక ఆధునిక కాలానికివస్తే ఆంధ్రదేశంలో హాలివుడ్ స్థాయి సినిమాలను సృష్టించిన రామ్‌గోపాల్‌వర్మ తన బృందంతో కలిసి 2000 సంవత్సరంలో ఒక అడవిలో జంగిల్ అనే సినిమాను చిత్రీకరిస్తున్న సమయంలో ఆ చిత్ర నిర్మాణంలో పాల్గొన్న అనేకమందికి ఏవేవో క్షుద్రశక్తులతో లేదా ప్రేతాత్మలతో ఇబ్బందులు కలిగాయని తెలుస్తున్నది. ఆ అనుభవాల ఆధారంగా రాంగోపాల్‌వర్మ అగ్యాత్ అనే హారర్ సినిమాను నిర్మిస్తున్నాడు.

2000 సంవత్సరంలో వర్మ దర్శకత్వంలో తయారయిన జంగిల్ అనే హిందీ చిత్రంలో నటించిన ఊర్మిళామంటోడ్కర్, ఫర్దీన్‌ఖాన్‌లకు కూడా అడవిలో షూటింగ్ జరిగినపుడు విచిత్రమైన అనుభవాలు ఎదురయినట్టుగా తెలుస్తున్నది. ఏవో అజ్ఞాత నేత్రాలు తమను దగ్గరగా గమనించినట్టుగా అనిపించిందని ఆ చిత్ర యూనిట్‌లోని అనేకమంది సభ్యులు చెప్పటం జరిగింది. కర్నాటక రాష్ట్రంలోని బండిపూర్ రిజర్వ్ ఫారెస్టులో ఈ షూటింగ్ జరిగింది. ఈ షూటింగ్ జరుగుతున్న సమయంలో ఒక అమ్మాయి ఒక అదృశ్యశక్తి ప్రభావంవల్ల అడవిలో దోవతప్పిపోయి ఒక పూటంతా అడవిలో తిరిగి సాయంత్రానికి షూటింగ్ స్పాట్‌కి చేరుకున్నది. ఆ తరువాత ఆ అమ్మాయి ఆ షూటింగ్‌లో పాల్గొనకుండా బొంబాయి వెళ్ళిపోయింది. బండిపూర్ అడవులలో అనేక అతీంద్రియశక్తులు ఖచ్చితంగా ఉన్నాయని ఆ ప్రాంతంలో సినిమా షూటింగులు జరిపిన అనేకమంది చెప్పటం జరిగింది.

**గంధర్వ శాపంతో ప్రాణాలు కోల్పోయిన మళయాళ చిత్ర దర్శకుడు :**

పురుషుల రక్తాన్నితాగే ఆడపిశాచాలను కేరళలో యక్షి అని పిలుస్తారు. ఈ జాతికి చెందిన పురుష రక్తపిశాచాలను గంధర్వులు అని పిలుస్తారు. (హైందవ పురాణాలలో చెప్పబడిన గంధర్వులు ఈ గంధర్వులు ఒకటికాదని గుర్తించాలి) ఈ పురుష గంధర్వులు విపరీతమైన కామవాంఛను కలిగి ఉంటారు. వీళ్ళు ఒక అమ్మాయిని ఒకసారి అనుభవిస్తే ఆ అమ్మాయిని ఇకపై ఏ మానవ పురుషుడూ అనుభవించలేడు. కారణం ఆమెను తొలిసారి అనుభవించిన గంధర్వుడు ఆమె చనిపోయేవరకు ఆమెను రోజూ రాత్రిపూట అనుభవిస్తూనే ఉంటాడు. ఫలితంగా ఆ అమ్మాయి వివాహం చేసుకున్నా భర్తకు ఆమెతో సుఖాన్ని పంచుకునే అవకాశం ఉండదు.


పద్మరాజన్

కేరళ ప్రాంతంలో గంధర్వులు కన్నెపిల్లలకు ప్రమాదం కలిగించేవారుగా గుర్తించబడ్డారు. వయసుకు వచ్చిన ఏ అమ్మాయి అయినా నగ్నంగా పడుకుని నిద్ర పోతే ఆమెను గంధర్వుడు ప్రేమించి, ఆపై ఆమెను ఆవహించి, ఆ తరువాత ఆమెను చాలాకాలంపాటు శారీరకంగా అనుభవిస్తాడు. అందువలన కేరళ ప్రాంతంలోని వృద్ధస్త్రీలు తమ ఇంటిలోని అమ్మాయిలను మరియు మధ్యవయస్సు స్త్రీలను నగ్నంగా పడుకోవద్దని హెచ్చరించటం జరుగుతుంది. కొన్నేళ్ళక్రితం మళయాళంలోయన్‌జెన్ గంధర్వ్‌సె అనే చలన చిత్రం విడుదల అయ్యింది.

ఒక గంధర్వుడు ఒక మానవ స్త్రీ ప్రేమలోపడి తరచుగా భూలోకానికి వస్తూ ఆమెతో శారీరక సుఖాలు అనుభవిస్తూ ఉంటాడు. అయితే గంధర్వ లోకాన్ని వదిలి సామాన్య మానవ స్త్రీతో సంబంధం పెట్టుకోవటం వల్ల గంధర్వులకు పరువు తక్కువ అని దేవేంద్రుడు ఆ గంధర్వుడిని నిందిస్తాడు. అంతేకాక ఇకపై ఆ మానవ స్త్రీని కలువరాదని, కలిస్తే తీవ్రమైన శిక్షలకు గురి కావల్సి వస్తుందని దేవేంద్రుడు గంధర్వుడిని హెచ్చరిస్తాడు. అయితే ప్రేమ మైకంలో పడిన గంధర్వుడు ఇంద్రుని మాటలు లెక్క చెయ్యకుండా తన ప్రియురాలికోసం తరచుగా భూలోకం వెళుతూ ఇంద్రుడి ఆగ్రహానికి గురిఅయి తీవ్ర శిక్షలకు గురి అవుతాడు. ఇది క్లుప్తంగా ఆ మళయాళ చిత్రం కథ. అయితే ఈ చిత్రం గంధర్వులకు సంబంధించినది కావటం

వల్ల ఈ చిత్రానికి గంధర్వుల శాపం తగులు తుందని కేరళ సినిమా పరిశ్రమలోని కొందరు పెద్దలు ఆ చిత్ర షూటింగు ప్రారంభం కావటానికి ముందే ఆ చిత్ర దర్శకుడైన పద్మరాజన్‌ను హెచ్చరించారు. హిందీ టి.వి. సీరియల్ శ్రీకృష్ణలో, శ్రీకృష్ణ పాత్ర ధరించిన నితీష్ భరద్వాజ్ ఈ చిత్రంలో గంధర్వుడిపాత్ర ధరించటం విశేషం. అప్పటికే కొన్ని విజయవంతమైన చిత్రాలను తీసిన ఆ 29 సంవత్సరాల యువ దర్శకుడు ఎవరి మాటలు లెక్కచెయ్యకుండా గంధర్వుడు సినిమాను పూర్తిచేసి విడుదల చేసాడు. ఆ చిత్రం విడుదల అయిన కొద్ది రోజులకే ఏ కారణమూ లేకుండానే చాలా అసహజంగా మరణించాడు. అంతేకాకుండా ఆ చిత్రంలో నటించిన చాలామంది నటీనటులకు ఆ చిత్ర షూటింగ్ సమయంలో ఏవో అదృశ్య శక్తులవల్ల రకరకాల ఇబ్బందులు కలిగినట్లుగా ఆ తరువాత కాలంలో బయటపడింది.



# 5. లిఫ్ట్ అడిగే పిశాచ ప్రయాణీకులు నిజంగా ఉంటారా?

అర్ధరాత్రి సమయం చిమ్మచీకటి ప్రకృతిని ఆవరించి ఉన్న సమయంలో తారు రోడ్డుమీద ఒక బైక్ లేదా కారు హెడ్‌లైట్ల కాంతిలో ముందుకు దూసుకుపోతున్న సమయంలో ఎవరో ఒక అపరిచితవ్యక్తి హెడ్‌లైట్ల వెలుగులో రోడ్డుకి మధ్యగా నిలబడి ఉంటాడు. ఆ వాహనం దగ్గర అయ్యేసరికి ఆవ్యక్తి వాహనం దగ్గరకువచ్చి వాహనంలో ఉన్న వారిని తనకి ఫలానా ప్రదేశంవరకు లిఫ్ట్ ఇవ్వమని అడుగుతాడు. బైక్‌మీద ఉన్నవ్యక్తి లేదా కారులోని వ్యక్తి నూతన వ్యక్తిని తన వాహనంలో వాహనంపైన ఎక్కించుకుని బయలుదేరతాడు. కొంతసేపు గడిచాకచూస్తే బైక్‌మీద తన వెనక కూర్చున్న అపరిచిత ప్రయాణీకుడు అదృశ్యం అయిపోతాడు. లేదా కారులో వెనకసీట్లో కూర్చుని ఉన్న అపరిచిత ప్రయాణీకుడు కనపడడు. ఇలాంటి సందర్భాలు ప్రపంచంలో చాలాచోట్ల జరిగినట్టుగా మరియు జరుగుతున్నట్టుగా చరిత్రలో నమోదు అయ్యింది. పారాసైకాలజీ ప్రపంచంలో ఇలాంటి సందర్భాలలో కనిపించే అమానుష ప్రయాణీకులను హిచ్‌హైకర్స్ (Hitch Hikers) అని పిలవటం జరుగుతున్నది. అలాంటి కొన్ని యదార్థ సంఘటనల గురించి తెలుసుకుందాం.

సాధారణంగా ఇలాంటి పిశాచ ప్రయాణీలు తమకు లిఫ్ట్ ఇచ్చినవారి వాహనాలలో తమకు సంబంధించిన ఏదోఒక వస్తువును వదిలిపెట్టి మధ్యమార్గంలో అదృశ్యం కావటం జరుగుతుంది. ఆ వస్తువు కారణంగా ఆ పిశాచ ప్రయాణీకుడికి లిఫ్ట్ ఇచ్చినవ్యక్తి ఇంకా అనేకసార్లు ఆ పిశాచి ప్రయాణికుడిని కలవటం జరుగుతుంది. తొలిసారిగా 1942 ప్రాంతంలో అమెరికాకు చెందిన జానపద కథా రచయితలు అయిన రిచర్డ్‌బియర్డ్స్లే మరియు రొసాలిహాంకేలు తొలిసారిగా అమెరికాదేశంలోని అనేక ప్రాంతాల్లో పర్యటించి పిశాచప్రయాణీకులకు సంబంధించిన అనేక ఉదంతాలను పుస్తకాలలో నమోదు చెయ్యటం జరిగింది. ముఖ్యంగా ఈ రచయితలు దాదాపు 79 మంది వద్ద ఇలాంటి సంఘటనలకు సంబంధించిన వివరాలను వ్రాత పూర్వకంగా తీసుకోవటం జరిగింది.

ఈ పిశాచ ప్రయాణీకులతో పరిచయాలు అనేక రకాలుగా ఉంటాయి. ఒక విధానంలో పిశాచి ప్రయాణీకుడు తనకు లిఫ్ట్ ఇచ్చిన వ్యక్తికి ఒక వస్తువును ఇవ్వటం జరుగుతుంది. ఆ తరువాత ఆ వ్యక్తి తనకు ఇవ్వబడ్డ వస్తువును పరిశీలించగా అది శ్మశానాలలో సమాధులపై ఉంచబడింది అని తెలుస్తుంది.



పిశాచ ప్రయాణీకురాలు

(Hitchhiker)

ఇంకొక రకమైన విధానంలో ఒక స్త్రీ ప్రయాణీకురాలు మార్గమధ్యంలో కనిపించి తనకు లిఫ్ట్ ఇచ్చినవారికి భవిష్యత్‌లో రాబోయే ప్రమాదాల గురించి వివరించి ఆపై అదృశ్యం కావటం జరుగుతుంది. అమెరికాలో 1940 ప్రాంతంలో ఒక అర్ధరాత్రి సమయంలో ఒక నిర్మానుష్యమైన హైవేమీద కారులో ప్రయాణిస్తున్న ఒకవ్యక్తికి మార్గమధ్యంలో ఎదురయిన ఒక వృద్ధ ప్రయాణీకురాలు ఆ వ్యక్తిని లిఫ్ట్ అడిగింది. ఆ వ్యక్తి ఆ వృద్ధురాలిని తన కారులో ఎక్కించుకుని వెళుతున్న సమయంలో ఆ వృద్ధురాలు త్వరలో రెండవ ప్రపంచయుద్ధం రాబోతున్నదని ఫలితంగా ప్రపంచంలో లక్షలమంది చనిపోబోతున్నారని చెప్పటం జరిగింది. ఆ తరువాత కాలంలో ఆ పిశాచ ప్రయాణీకురాలు చెప్పిన జోస్యం నిజమయ్యింది.

ఇంకోరకం విధానంలో ఒక అందమైన అమ్మాయి మార్గమధ్యంలో నిల్చొని తనకు ఎదురయిన ఒక మోటారిస్ట్‌ని (మోటారువాహనాన్ని నడుపుతున్నవాడు) ఆపి తనకు లిఫ్ట్ ఇవ్వమని అడుగుతుంది. ఆ తరువాత ఆ యువతి ఆ మోటారిస్ట్ దగ్గర ఒక మఫ్లర్‌నిగాని, కోటునుకాని తీసుకుని తను ధరిస్తుంది. ఆ తరువాత ఆమె ఎక్కడో ఒకచోట వాహనంఆపి దిగి నడుచుకుంటూ వెళ్ళిపోతుంది. ఆమె అలావెళ్ళిపోగానే మోటారిస్ట్ తన దోవన తను వెళ్ళిపోకుండా ఆమె ఎవరు? ఆమె ఎటువైపువెళ్ళింది? లాంటివి తెలుసుకోవటంకోసం ఆమె వెనకాలే వెళ్ళిచూడగా ఆమె ఒక శ్మశానంలోకి ప్రవేశించి అదృశ్యం కావటం జరుగుతుంది. ఆ మోటారిస్ట్ ఆ శ్మశానంలో ఆమెకు కోసం వెతుకుతున్నపుడు ఒక సమాధిమీద ఆ మోటారిస్ట్ అపరిచిత అమ్మాయికి ఇచ్చిన మఫ్లర్ లేదా కోటు పెట్టబడి ఉంటుంది. ఆవిధంగా ఆ అమ్మాయి తాను ప్రేతాత్మని అని ఆ మోటారిస్ట్‌కి తెలియజేస్తుంది అన్నమాట.

కొన్నిసార్లు స్థానికంగా పూజించబడే స్త్రీ దేవతలు అర్ధరాత్రి సమయంలో నడి రోడ్డుపై నిలబడి వాహనాలపై వెళ్ళేవారిని లిఫ్ట్ ఇవ్వమని అడిగినట్టుగా విదేశాలలోనే కాకుండా భారతదేశంలోని అనేక ప్రాంతాలలో జరిగినట్టుగా తెలుస్తున్నది. కొన్ని దశాబ్దాల క్రితం విజయవాడలోని ఒక సినిమాథియేటర్‌లో "మా ఇలవేల్పు" అనే భక్తిరసప్రధాన చిత్రం విడుదలయ్యింది. అందులో కనకదుర్గ అమ్మవారి లీలలు అత్యంత ఆసక్తికరంగా చూపించబడ్డాయి. ఆ సినిమా మొదట విడుదలయిన సమయంలో ఒకరోజు అర్ధరాత్రి సెకండ్‌షో వదిలిపెట్టిన తరువాత సినిమాహాల్ నుండి బయటకు వస్తున్న ప్రేక్షకుల నుండి మధ్యవయస్సులో ఉన్న ఒక స్త్రీ ప్రేక్షకురాలు ఇవతలికివచ్చి ఒక ప్రక్కగా నిలబడి ఉన్న ఒక రిక్షావాడి దగ్గరకువెళ్ళి తనని విజయవాడ వన్‌టౌన్‌లో కనకదుర్గ కొండకి వెళ్ళే మెట్లు ఉన్న ప్రదేశం వరకు తీసుకువెళ్ళమని అడిగింది. (ఆ రోజుల్లో విజయవాడలో అసలు ఆటోలు లేవు. ప్రయాణీకులు ఎక్కడికి వెళ్ళాలన్నా రిక్షాలలోనే వెళ్ళటం జరిగేది.) ఆ రిక్షావాడు తన రిక్షాఎక్కిన స్త్రీని పరిశీలించి చాలా ఆశ్చర్యానికి గురి అయ్యాడు. ఆమె రూపురేఖలు చాలా విచిత్రంగా ఉన్నాయి. ఎరుపురంగు పట్టుచీర మరియు జాకెట్ ధరించిన ఆమె నుదుటన రూపాయినాణెం పరిమాణంలో ఉన్న కుంకుమబొట్టు ఉన్నదని, ఆమె తన పొడవాటి శిరోజాలను వెనకముడిగా వేసుకున్నదని, ఆమె వద్దనుండి సంపంగిపూల వాసన వచ్చిందని ఆ తరువాత కాలంలో ఆ రిక్షావాడు అందరికీ తెలియజేయటం జరిగింది. ఆ స్త్రీని రిక్షాలో ఎక్కించుకుని రిక్షా తొక్కుకుంటూ రాత్రి ఒంటిగంట ప్రాంతంలో టుటౌన్ నుండి విజయవాడ వన్‌టౌన్ రథం సెంటర్‌కిచేరి ఆపై అక్కడ నుండి బ్రాహ్మణవీధిలోకి ప్రవేశించి అక్కడ ఒకచోట రిక్షాని ఆపాడు. అక్కడ నుండి కనకదుర్గ కొండమీదకి నేరుగా మెట్లు ఉన్నాయి. ఆమె ఆ రిక్షాదిగి ఆ తరువాత ఒక

రూపాయి నాణాన్ని ఆ రిక్షావాడి చేతిలోపెట్టి "ఆరేయ్!బాబూ! నువ్వు వెనక్కితిరిగి చూడకుండా వెళ్ళిపో" అని విచిత్రంగా నవ్వింది. ఆ రిక్షావాడికి మనసులో ఏదో అనుమానం మరియు గుండెలో కంగారుగా భయం మెదిలాయి. దాంతో వాడు తన రిక్షాని తీసుకుని ముందుకు కదిలాడు. మానవ సహజమైన ఆసక్తి వాడిని పీడించటంతో రిక్షాతో నడిపిస్తూ ముందుకు వెళుతున్నవాడు హఠాత్తుగా వెనక్కితిరిగి చూసేసరికి మెట్లవైపు వెళుతున్న ఆ స్త్రీ ఒక పెద్ద అగ్ని జ్వాలలాగామారి కొండమీదకి వెళ్ళిపోయిందట. ఆ దృశ్యంచూసిన రిక్షావాడికి భయంతో చచ్చినంత పనయ్యింది. ఆ తరువాత వాడు ఎలాగో ఇల్లు చేరుకున్నాడు. ఆపై వారం రోజులపాటు వాడికి తీవ్రమైన జ్వరం వచ్చింది.

(ఆ రోజుల్లో కనకదుర్గ అమ్మవారు సినిమాచూసి రిక్షాలో తన కొండకి (ఇంటికి) తిరిగి వెళ్ళింది అని ఈ సంఘటన గురించి బెజవాడ జనాలు విపరీతంగా చెప్పుకోవటం జరిగింది.)

పోర్చుగల్ దేశంలోని సింట్రా అనే ప్రదేశంలో కొంతకాలం క్రితం అటువైపుగా వెళుతున్న ఒకకారు రోడ్డుమీద నడుస్తూ వెళుతున్న ఒక అమ్మాయిని ఢీ కొట్టింది. ఆ ప్రమాదంలో ఆ అమ్మాయి చనిపోయింది. ఇది జరిగిన కొంతకాలానికి కొంతమంది యువతీయువకులు ఒక కారులో కొండమీదకి వెళుతున్నారు. ఆ తరువాత కొంతసేపటికి వారు దోవతప్పి ఏదో ప్రాంతానికి చేరుకున్నారు. ఆ కొత్తప్రాంతంలోని రోడ్డుమీదుగా వారు ప్రయాణిస్తూ సింట్రా అనే ప్రదేశానికి చేరుకున్నారు. ఆ సమయంలో వారికి రోడ్డుప్రక్కన నిల్చుని ఉన్న ఒక అమ్మాయి కనిపించింది. వాళ్లు తమ కారుఆపి ఆ అమ్మాయిని తన కారులో ఎక్కించుకున్నారు. వాళ్ళు కారులో వెళుతూ ఉన్నారు. కొన్ని నిమిషాల తరువాత వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకోవటం ప్రారంభించారు. కొంతసేపు తరువాత ఆ కారులో కూర్చుని ఉన్న అమ్మాయి కారు విండోలోంచి చేతిని బయటకుపెట్టి చూపుడువేలుతో ఒక ప్రదేశాన్నిచూపి అక్కడే తనను ఒక కారుఢీ కొట్టిందని, తాను చనిపోయానని చెప్పింది. అయితే ఆ కుర్ర బృందం ఆ అమ్మాయి చెప్పిన మాటలు నమ్మలేదు. వాళ్ళు పెద్దగా నవ్వారు. అపుడు ఆ అమ్మాయి వికృతంగా అరిచింది. అపుడు ఆ అమ్మాయి ముఖం మీద రక్తం కారిపోతూ కనిపించింది. ఆ దృశ్యంచూసిన ఆ కారులోవాళ్ళు భయాందోళనకు గురిఅయ్యారు. ఫలితంగా ఆ కారు నడుపుతున్న యువకుడు కంగారుతో ఆ కారుని ఒక చెట్టుకి గుద్దించాడు. ఆ ధాటికి ఆ కారులోనివారందరూ చనిపోయారు.



# 6. కొరివి దయ్యాలు నిజంగా ఉంటాయా?

అర్ధరాత్రిపూట ఒంటరిగా ఎక్కడికో ప్రయాణిస్తున్న ఒకబాటసారికి దూరంలో ఒక అగ్నిజ్వాల కనిపిస్తుంది. దానినిచూసి అక్కడ ఎవరో మనుషులు ఉన్నారని వాళ్ళు అక్కడ చలిమంట వేసుకుంటున్నారని భావించిన ఆ బాటసారి తనుకూడా వాళ్ళ దగ్గరకువెళ్ళి అక్కడవేసిన చలిమంట దగ్గర తెల్లవారేదాకా వెచ్చగాకూర్చుని ఆపై తన దోవనతాను వెళదామని నిర్ణయించుకుని ఆ అగ్నిజ్వాల కనిపించిన దిక్కుకేసి నడుస్తాడు. అయితే అతడు ఎంతదూరం నడిచినా ఆ అగ్నిజ్వాల ఇంకా అంతదూరంలో కనిపిస్తూ ఉంటుంది. ఆవిధంగా ఆ ప్రయాణీకుడు ఆ అగ్నిజ్వాల దగ్గరకు చేరుకోవటం కోసం ఆ చీకటిలో ఎటుపడితే అటు నడుచుకుంటూ పోతాడు. తెల్లవారుతున్న సమయంలో ఆ జ్వాల అదృశ్యం అయిపోతుంది. ఆ వ్యక్తి తాను వెళ్ళవలసిన దోవను మర్చిపోయి ఎక్కడో గుర్తు తెలియనిచోట తెల్లవారేసరికి చిక్కుకునిపోయి ఉంటాడు. ఇలాంటి సందర్భాలు కొన్ని దశాబ్దాలక్రితం ప్రపంచంలోని చాలామంది ప్రయాణీకులకు ఎదురయినట్టుగా తెలుస్తున్నది. ఇలా ప్రయాణీకుల్ని తప్పుదోవ పట్టించే ఈ అగ్ని జ్వాలల్ని పాశ్చాత్యులు ఘోస్ట్ ఫైర్స్ అని, తెలుగువారు కొరివిదయ్యాలు అని పిలవటం జరుగుతున్నది. ఇప్పటికీ ప్రపంచంలో అనేకచోట్ల హైవేలమీద ఇలాంటి కొరివి దయ్యాల అప్పుడప్పుడూ కనిపిస్తున్నట్లుగా వార్తలు అందుతున్నాయి. కొంతమం పాశ్చాత్య పారాసైకాలజిస్టుల అభిప్రాయం ప్రకారం ఈ కొరివి దయ్యాలు ఒక సమాధి లేదా గృహానికి దగ్గరలో కనిపిస్తాయని తెలుస్తున్నది. ఇవి నీలంరంగులో వెలిగే అగ్ని గోళంరూపంలోకాని, ఒక జ్వాలరూపంలోకాని, ఒక కొవ్వొత్తిరూపంలోకా కనిపిస్తాయి. ఇవి కేవలము రాత్రి సమయాలలో మాత్రమే మానవులకు దర్శనమిస్తాయి. ఇవి నేలకు కొన్ని అడుగుల ఎత్తులో గాలిలో తేలుతూ ప్రయాణిస్తూ ఉంటాయి. సాధారణంగా ఇవి ప్రయాణీకులను తప్పుదోవ పట్టించి ఆనందిస్తాయని తెలుస్తున్నది. పుట్టగానే చనిపోయిన శిశువులు, దైవాన్ని ధిక్కరించి పాపకార్యాలుచేసే మానవులు చనిపోయిన తరువాత కొరివి దయ్యాలుగా మారతారని క్రైస్తవమత సిద్ధాంతాల ద్వారా తెలుస్తున్నది.

అటు స్వర్గానికి, ఇటు నరకానికి వెళ్ళలేక మరియు పూర్తిగా పిశాచిగాకూడా మారలేకపోయిన సగంశక్తిగల ఆత్మలు ఇలాంటి కొరివి దయ్యాలుగా మారతాయి. వీటివల్ల సాధారణంగా మానవులకు ఎలాంటి ప్రాణనష్టం ఉండదని గ్రహించాలి.

సాధారణంగా ఎవరికైనా ఈ పిశాచ వెలుగులు కనిపిస్తే ఆ వ్యక్తికి త్వరలో ఏదో చెడు జరగబోతున్నట్టుగా గుర్తించాలి. కొన్నిసార్లు చనిపోయినవారియొక్క ఆత్మలు కొరివి దయ్యాలుగామారి రాత్రి సమయాలలో తమ సమాధుల నుండి ఒక జ్వాల రూపంలో బయటకువచ్చి తమ గృహాల పరిసరాలవరకు ప్రయాణిస్తాయి. ఆ తరువాత తమ గృహాలచుట్టూ గాలిలో కాసేపు సంచరించి ఆ తరువాత మరల శ్మశానానికి చేరుకుంటాయి. ప్రపంచంలోని చాలాదేశాలలో కొరివిదయ్యాలు అని పిలువబడే అతీంద్రియ శక్తులు ఉన్నాయని బలంగా విశ్వసించబడుచున్నది.

అమెరికాలో ఈ కొరివిదయ్యాలను పిశాచ దీపాలు అని, ఆర్బ్‌లు (కాంతిగోళాలు) అని పిలుస్తారు. రైలు కట్టలమీద సంచరిస్తూ, రైలు పట్టాలకు మరామ్మత్తులుచేసే కొందరు కార్మికులు ప్రమాదవశాత్తు రైళ్ళక్రిందపడి చనిపోవటం జరుగుతుంది. అలా చనిపోయినవారి ఆత్మలు కొరివి దయ్యాలుగామారి తాము చనిపోయిన ప్రదేశంలో రైలు పట్టాలమీద సంచరిస్తూ కనిపిస్తాయని కొందరు రైల్వే గాంగ్‌మాన్‌లు చెప్పటం జరిగింది.

స్వీడన్, క్విన్‌లాండ్, డెన్మార్క్ లాంటి దేశాలలో కొరివి దయ్యాలను గురించి విభిన్నమైన అభిప్రాయాలు ఉన్నట్టుగా తెలుస్తున్నది. ఆయా దేశాల ప్రజల విశ్వాసాల ప్రకారంచూస్తే కొరివిదయ్యాలు ఎగురుతూ కనిపించే ప్రదేశంలో భూమి అడుగున గుప్తనిధులుకాని, జలవనరులుకాని ఉంటాయని తెలుస్తున్నది. ఫిన్‌లాండ్ మరియు ఇతర ఉత్తర దేశాలలో వసంతకాలం ప్రారంభంలో ఆదేశాలలోని గ్రామీణ ప్రాంతాల ప్రజలు అటవీ ప్రాంతాలకువెళ్లి అక్కడ కొరివి దయ్యాలు ఎక్కడ సంచరిస్తూ కనిపిస్తాయో అక్కడ భూమిలో నిధులకోసం త్రవ్విచూస్తారు. ఎక్కువసార్లు వాళ్ళప్రయత్నం ఫలించి వాళ్ళకు ప్రాచీనకాలంనాటి గుప్తనిధులు ఆప్రాంతంలో వారికి దొరకటం జరుగుతుంది.

కొంతమంది అభిప్రాయం ప్రకారం కొంతమంది వ్యక్తులు ఒక ప్రదేశంలో గుప్త నిధుల్ని దాచిపెట్టినపుడు ఆ ప్రదేశంమీద మంత్రసాయంతో కొన్ని కొరివి దయ్యాలను కాపలాగా ఉంచటం జరుగుతుంది. అయితే ఈ కొరివి దయ్యాలు ఎండాకాలం మధ్యభాగంలో రాత్రి సమయంలో మాత్రమే మానవులకు కనిపిస్తాయి. ఆ సమయంలో మాత్రమే అక్కడ నిధులు ఉన్నాయని వాటిని పాతిపెట్టిన వ్యక్తికి తెలుస్తుంది. ఆవిధంగా కొరివి దయ్యాల సహాయంతో ఒకవ్యక్తి తాను పాతిపెట్టిన నిధులను మరల త్రవ్వి తెచ్చుకో గలుగుతాడు.

ఇంగ్లండులో కొరివి దయ్యాలగురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. కాలక్రమంలో యదార్థ సంఘటనలే కథలుగా మారతాయని గుర్తించాలి. పూర్వం

ఇంగ్లాండులోని ఒక గ్రామీణ ప్రాంతానికి చెందిన రైతు పొలం నుండి తన ఇంటికి నడిచివెళుతూ ఉన్న సమయంలో సూర్యాస్తమయం అయిపోయి చీకటిపడిపోతుంది. ఆ చీకటిలో అతను ముందుకు నడుస్తున్నపుడు దూరంలో అతనికి ఒక వెలుగుతున్న లాంతరు గాలిలో ఎగురుతూ కనిపిస్తుంది. తొందరగా ఆ లాంతరు దగ్గరకి చేరుకుంటే ఆ లాంతరు పట్టుకున్న వ్యక్తితో కలిసి తనుకూడా వెలుగులో తన ఇంటికి చేరుకోవచ్చని ఆ రైతు భావించి వేగంగా ముందుకు అడుగులు వేస్తాడు. అతను ఎంత వేగంగా నడిచినా ఆ లాంతరు అతనికన్నా ముందు కొంచెం దూరంలో గాలిలో తేలుతూ ముందుకు వెళ్ళిపోతూ ఉంటుంది. ఎలాగైనా ఆ లాంతరును చేరుకోవాలన్న ఆత్రుతతో ఆ రైతు ఏమీ ఆలోచించకుండా ఆ లాంతరు ఎటువెళితే అటు వెళ్ళిపోతాడు. అలా కొంతసేపు గడిచాక ఆరైతుకు పెద్దశబ్దంతో ప్రవహించే జలప్రవాహంయొక్క శబ్దం వినిపిస్తుంది. అతను ఉలిక్కిపడి తేరుకుని చూడగా అతను అప్పటికే ఒకకొండ కొస మీద నించుని ఉంటాడు. ఆ కొండకు ఆనుకుని క్రింద ఒకపెద్ద జలప్రవాహం ప్రవహిస్తూ ఉంటుంది. తాను కాసేపు అలాగే నడిచిఉంటే తప్పకుండా ఆ కొండ శిఖరంమీద నుండి కింద ఉన్న జలపాతంలో పడి ఉండేవాడినని ఆ వ్యక్తికి అర్థమవుతుంది.

ఇంతలో అతనికి కొంచెం దూరంలో గాలిలో చక్కర్లు కొడుతున్న లాంతరు కనిపిస్తుంది. భయంకరమైన నవ్వులు వినిపిస్తాయి. తనను తప్పుదోవ పట్టించి చంపాలనుకున్నది ఒక కొరివిదయ్యం అని ఆ రైతుకి అపుడు అర్థం అవుతుంది. ఆ తరువాత ఎలాగో తెల్లవారేదాకా ఆ కొండమీదే ఉండి తెల్లవారినాక ఎంతోదూరం వెనక్కినడిచి తన ఇల్లు చేరుకుంటాడు.

పోల్టర్‌గెస్ట్ అనే ఒకరకం ప్రేతాత్మలలాగానే కొరివి దయ్యాలుకూడా అనేక రకాల విచిత్రమైన శబ్దాలను సృష్టిస్తాయి. కొరివిదయ్యాలు కనిపించినపుడు మానవులు తాము తొడుక్కున్న చొక్కాను విప్పి దాన్ని తిరగేసి తొడుక్కోవాలి. అలా చెయ్యటంవల్ల కొరివి దయ్యానికి మానవులను ఆకర్షించగలిగేశక్తి తాత్కాలికంగా స్తంభిస్తుంది. ఒక కర్రను లేదా కత్తిని నేలలో దింపినాసరే కొరివి దయ్యాలు అక్కడనుండి దూరంగా పారిపోతాయి.



# 7. మనిషి డమ్మీలా కనిపించే సూక్ష్మశరీరం డాపెల్‌గాంగర్ వివరాలు?

మనిషికి భౌతికశరీరం ఏవిధంగా ఉంటుందో అదేవిధంగా అదృశ్యంగా ఉండే ఇంకొక శరీరంకూడా ఉంటుంది. దీనినే ఆంగ్లంలో డాపెల్‌గాంగర్ అని పిలుస్తారు. సాధారణంగా మనుషులకు తమ డాపెల్‌గాంగర్ కనపడదు. అయితే కొన్నిసార్లు అనూహ్యమైన ప్రమాదాలు వచ్చినపుడు ఈ అదృశ్యశరీరాలు తమకు సంబంధించిన భౌతికశరీరధారులకు కనిపిస్తాయి. మానవ శరీరం నాలుగు రూపాలలో ఉంటుంది. అందులో మొదటిది భౌతిక దేహం. రెండవది మానసిక దేహం. మూడవది బౌద్ధికదేహం. నాలుగోది సూక్ష్మదేహం (లింగశరీరం).

స్థూల శరీరంలో ఉండే ప్రతి ద్రవ, వాయు మరియు స్థూల కణాలు వేరు వేరు తొడుగులను కలిగి ఉంటాయి. అందువలన మామూలు భౌతిక కణాలతో రూపొందిన దేహం ఎలా ఉంటుందో ఆ కణాలపై ఉండే తొడుగులన్నీ కలిసి ఏర్పడే దేహం అలాగే ఉంటుంది. అనగా ఒక మట్టి విగ్రహాన్ని అచ్చుపోసే అచ్చు ఏవిధంగా అయితే ఆ అచ్చులో గుద్దబడే బొమ్మను పోలి ఉంటుందో అలాగే భౌతిక దేహంపై తొడుగు లాగా ఉండే తొడుగు దేహంకూడా ఉంటుంది. అయితే ఈ తొడుగు (ఎన్వలప్) దేహం మానవ భౌతిక నేత్రాలకు కనిపించదు. దీనినే ప్రాణమయకోశము (ఈథరిక్ బాడీ) అని పిలుస్తారు. ఇది సాధారణంగా మనిషియొక్క చర్మముపైన మూడు నాలుగు అంగుళాల దూరంలో మనిషి భౌతికదేహంమీద ఒక తొడుగులాగా లేదా ఒక పొరలాగా అమరి ఉంటుంది. మనిషి శరీరంలో ఏ భాగాలైతే ఉంటాయో ఆ భాగాల యొక్క నకళ్ళు (తొడుగులు) ప్రాణమయకోశానికికూడా ఉంటాయి. ఒక ముఖ్య విషయం ఏమంటే చాలామంది భావిస్తున్నట్టుగా మనిషి వెన్నుముకలో చక్రాలు ఉండవు. ఆ చక్రాలకు సంబంధించిన ప్రాతినిధ్య బిందువులు మాత్రమే భౌతిక వెన్నుముకలో ఉంటాయి. సాధకుడు తన భౌతికదేహానికి చెందిన వెన్నుముకలోని ఆ బిందువులను ప్రభావితం చేయగలిగినపుడు ప్రాణమయకోశ శరీరంలో ఉన్నా షట్చక్రాలు తెరుచుకుంటాయి. అన్నమయకోశ శరీరం లేదా ఈథరిక్‌బాడీ వెన్నుముక లో ఉండే చక్రాలు మాత్రమే వివిధ రంగులలో మెరుస్తాయి అని గుర్తించాలి.

ఈ ఈథరిక్ బాడీనే ఈథరిక్‌డబుల్‌అనికూడా పిలుస్తారు. ఈ దేహం వంగపండు రంగులోకాని, బూడిదరంగులోకాని ఉంటుందని యోగశాస్త్ర నిపుణులు తెలియ జేస్తున్నారు. నిజానికి ఈథరిక్‌డబుల్ సొంతంగా వ్యవహరించలేదు. అది భౌతిక

దేహానికి అంకితమై ఉంటుంది. భౌతికదేహం ఎలా ప్రవర్తిస్తే ఈథరిక్‌డబుల్ కూడా అలాగే ప్రవర్తిస్తుంది. అయితే కొన్నిసార్లు మాదక ద్రవ్యాలనుకాని, వశీకరణాన్ని కాని ఉపయోగించి ఈథరిక్‌డబుల్‌ను అసలు శరీరంనుండి వేరుచేసి దూరంగా నిలబెట్టవచ్చు. కొన్నిసార్లు మనిషి ప్రమాదకరమైన గాయాలను తగిలించుకున్నపుడు కూడా ఆ మనిషికి చెందిన ఈథరిక్‌డబుల్ దూరంగా వెళ్ళిపోతుంది. కొన్నాళ్ళక్రితం జర్మనీలో ఒకవ్యక్తి తీవ్రమైన విద్యుద్ఘాతానికి గురిఅయి మూర్ఛపోవటం జరిగింది. అపుడు అతని శరీరం ఒక బెడ్డుపై పడుకోపెట్టబడింది. ఆ సమయంలో అతని శరీరం నుండి లేచిబయటకు రావాలని ప్రయత్నించిన అతడి డోపెల్‌గాంగర్‌ను ఫోటో తియ్యటం జరిగింది. ఇక్కడ కనిపిస్తున్న ఫోటో అదే.



డాపెల్‌గాంగర్

1947వ సంవత్సరంలో అమెరికాకు చెందిన గార్డన్‌బరోస్ అనే పరిశోధకుడికి అతని డాపెల్‌గాంగర్ కనిపించింది. ఇది ఎలా జరిగింది? అంటే ఒకసారి గార్డన్ యు.ఎస్.ఎ.లోని వియోమింగ్ ప్రాంతంలో ఉన్న ఎడారి ప్రదేశాలలో ఉన్న రోడ్డుపై ఒక కారులో చాలాదూరం చాలాగంటలపాటు ప్రయాణించి అలిసిపోయాడు. ఆ సమయంలో అతనికి అలసట కారణంగా హఠాత్తుగా నిద్రముంచుకు వచ్చింది. నిద్రపోతూ కారు డ్రైవ్ చెయ్యటం ప్రమాదం అయినప్పటికీ అతను కారులో ముందుకు వెళుతూనే ఉన్నాడు. కొంతదూరం పోయిన తరువాత, అతనికి కొంచెందూరంలో రోడ్డుమీద ఒక పాదచారి నడుస్తూ కనిపించాడు. అనుకోకుండా గోర్డన్ తన కారువేగ

తగ్గించి కారు విండో అద్దాన్ని కిందకుదించి ఆ పాదచారికి తన కారులో లిఫ్ట్ ఇద్దామని కారును అతనికి దగ్గరగా నడిపాడు. ఆ పాదచారి హఠాత్తుగా వెనక్కితిరిగి చూసాడు. బోర్డాన్‌కి తీవ్ర ఆశ్చర్యంతో తల తిరిగినంత పని అయ్యింది. ఏం జరిగింది? ఆ బాటసారి అచ్చుగా తనలాగే ఉన్నాడు.

తన ఫోటోస్టాట్ కాపీలా ఉన్నాడు. అంతకన్నా విచిత్రం ఏమంటే ఆ బాటసారి గార్డన్ కారుదగ్గరకివచ్చి తాను కారు డ్రైవ్‌చేస్తానని గార్డన్‌ని ప్రక్కసీటులో విశ్రాంతి తీసుకోమని చెప్పాడు. గార్డన్ సంభ్రమాశ్చర్యాలతో ఆ బాటసారిని తన కారులోకి ఆహ్వానించి డ్రైవింగ్ అతనికి అప్పగించాడు. గార్డన్ నిద్రలోకి జారిపోయాడు. కొన్ని గంటల తరువాత గార్డన్‌కి మెలుకువ వచ్చి చూడగా అతనికారు రోడ్డుకి ఒకప్రక్కగా ఆపి ఉన్నది. అప్పటివరకు కారు డ్రైవ్‌చేసిన ఆ బాటసారి ఎలాంటి కదలికలు లేకుండా బొమ్మలాగా డ్రైవింగ్ సీటుముందు కూర్చుని ఉన్నాడు. ఆ తరువాత గార్డన్ ఆ బాటసారికి కృతజ్ఞతలు చెప్పాలి అనుకుంటున్న సమయంలోనే ఆ బాటసారి హఠాత్తుగా అక్కడ నుండి అదృశ్యం అయిపోయాడు. ఆ తరువాత గార్డన్ తన కారుని డ్రైవ్‌చేసుకుంటూ ఎడారిలోని రోడ్డుమీదగా ముందుకు వెళుతున్నాడు. తనకు ఎదురయిన ఆ బాటసారి ఎవరో గార్డన్‌కి అంతుపట్టటంలేదు. ఇలాంటి సంఘటనలు కేవలం గార్డన్‌కి మాత్రమే కాదు ప్రపంచవ్యాప్తంగా ఎందరికో అనుభవంలోకి వచ్చాయి.

సైకాలజిస్టుల అభిప్రాయం ప్రకారం డాపెల్‌గాంగర్‌లు జీవించి ఉన్న మనిషియొక్క భూతములు అని (భూతములు పారదర్శకంగా ఉంటాయి. మనిషి చనిపోయిన తరువాత భూతాలు ప్రేతాత్మగా మారతాయి. అపుడు అవి ఒక దట్టమైన ఆకారాన్ని సంతరించుకుంటాయి) ఈ డాపెల్‌గాంగర్‌లు కొన్నిసార్లు అనేక రంగులలోను, కొన్నిసార్లు పేలవమైన రంగులలోను కనిపిస్తాయి. ఇవి తమకు సంబంధించిన మనుషులు ఏవిధంగా ప్రవర్తిస్తారో అదేవిధంగా ఇవికూడా ప్రవర్తిస్తాయి.

సాధారణంగా సూర్యాస్తమయ సమయంలోను, అర్ధరాత్రి సమయంలోను మానవులకు తమ డాపెల్‌గాంగర్‌లు కనిపిస్తాయని తెలుస్తున్నది. ఎవరైతే విపరీతమైన మానసిక ఒత్తిడితో చితికిపోతారో లేదా శరీరంలోని ఓపిక పూర్తిగా నశించిపోయేవరకు శ్రమపడతారో వారికి కొన్నిసార్లు వారియొక్క డాపెల్‌గాంగర్‌లు కనిపించటం జరుగుతుంది. ఇలా ఎందుకు జరుగుతుందో ఇప్పటివరకు సైన్స్ సరిగ్గా వివరించలేకపోతున్నది. క్రీస్తుపూర్వకాలానికి చెందిన గ్రీకు వేదాంతి అరిస్టాటిల్, ఈ డాపెల్‌గాంగర్‌లు ఉన్నట్టుగా ఒక శిష్యుడితో చెప్పటం జరిగింది. ఇప్పటికీ అనేక ఆధునిక నాగరికతలలో వీటి ఉనికిని విశ్వసించటం జరుగుతున్నది.

ఈ డాపెల్‌గాంగర్‌లలో ఇంకొక రకంకూడా ఉన్నది. దీనిని వార్డోజర్ అని పిలుస్తారు. అంటే ముందుగా వెళుతున్నవాడు అనిఅర్థం. ఒకవ్యక్తి ఇంకొకచోటికి అతిముఖ్యమైన పనిమీద బయలుదేరటానికి కొద్దివారాలముందుగా అతని డాపెల్‌గాంగర్ ఆత్రుత తట్టుకోలేక అతనికంటే ముందుగా అతను వెళ్ళాల్సిన ప్రదేశానికి చేరుకుంటుంది. శాస్త్రవేత్తల అభిప్రాయం ప్రకారం మనసుకి ఉన్న శక్తికారణంగానే ఇలాంటి సంఘటనలు జరుగుతాయని తెలుస్తున్నది. మనిషి మనస్సు వెళ్ళినంత వేగంగా మనిషి వెళ్ళలేడు. ఒకచోటుకి మనోవేగంతో వెళ్ళాలి అని మనిషి బలంగా కోరుకుంటున్నపుడు అతని డాపెల్‌గాంగర్ మనోవేగంతో ప్రయాణించి అతను కోరుకున్న చోటుకుచేరుకుని అక్కడ ఉన్నవాళ్ళకు కనిపించటం జరుగుతుంది. యు.ఎస్.ఎ.లోని మసాఛుసెట్స్ ప్రాంతానికి చెందిన రెవరెండ్ డబ్ల్యూమౌంట్‌ఫోర్డ్ ఒకసారి విభిన్న ప్రదేశాలలో ఉన్న అనేకమంది స్నేహితులను కలుసుకోవలసి వచ్చింది. అందరినీ కలుసుకోవాలి అన్న రెవరెండ్‌యొక్క విపరీతమైన ఆతృతకారణంగా ఆయనయొక్క డాపెల్‌గాంగర్ విభిన్న ప్రదేశాలలో ఉన్న ఆయన మిత్రులందరికి ఏకకాలంలో కనపడటం జరిగింది.

ప్రఖ్యాత ఇంగ్లీషు పద్యకవి జాన్‌డాన్ 1612వ సంవత్సరంలో పారిస్ నగరంలో ఒక రాత్రి సమయంలో తన మిత్రులతో కలిసి సరదాగా కాలక్షేపం చేస్తున్న సమయం ఎక్కడో లండన్‌లో గర్భవతిగా ఉన్న అతనిభార్యయొక్క డాపెల్‌గాంగర్, చనిపోయిన తనబిడ్డను చేతుల్లో పట్టుకుని కనిపించింది. గర్భవతిగా ఉన్న తన భార్యకు మృత శిశువు జన్మించిందని ఆ కవికి అర్థమయ్యింది. నిజానికి ఆ తరువాత రెండు నెలలకి జాన్, లండన్‌కి చేరుకున్నపుడు మాత్రమే అతనిభార్య రెండు నెలల క్రితం ఒకరాత్రి సమయంలో మృతశిశువును ప్రసవించిందని అధికారికంగా తెలిసింది.

పెంగ్విన్ ఇండియా అనే పుస్తక ప్రచురణ సంస్థకు అధిపతి అయిన రవిసింగ్‌కి ప్రఖ్యాత ఆంగ్లరచయిత అయిన రస్కిన్‌బాండ్‌యొక్క డాపెల్‌గాంగర్ ముసోరీలోని, సవాయ్ హొటల్లో జరుగుతున్న రచయితల సమావేశంలో కనిపించిందని తెలుస్తున్నది. నిజానికి రస్కిన్‌బాండ్ ఆ సమయంలో మధ్యాహ్న భోజనంచేసి ఒక గదిలో నిద్రపోతున్నట్టుగా ఆ తరువాత రవిసింగ్‌కి తెలిసింది.



# 8. ఆత్మలతో మానవులు సంభాషించగలరా?

పరిష్కారంకాని సమస్యలతో నలిగిపోతున్నవారు ప్రేతాత్మల సహకారంతో తమ సమస్యలకు తగిన పరిష్కారాన్ని కనుక్కోవచ్చు అంటే అతిశయోక్తిగా భావించరాదు. తనపై మరియు మానవాతీతశక్తులపై నమ్మకం ఉన్నవ్యక్తి తన మనోశక్తితో ఏకాగ్రతతో ఒక ఫ్రీక్వెన్సీని సృష్టించుకుని ఆ ఫ్రీక్వెన్సీలోకి తనతో పరిచయం ఉండి చనిపోయినవారి ఆత్మలను ఆహ్వానించి వాటికి తన సమస్యలను తెలియజేసి తగిన పరిష్కారాలను ఆ ఆత్మలద్వారా తెలుసుకోవచ్చు. కొన్నిసార్లు విపరీతమైన బాధకుగురై మరణించినవారి ఆత్మలను ఆహ్వానించినపుడు ఆ ఆత్మలు తనను పిలిచిన వ్యక్తికి మంచి చెయ్యకపోగా విపరీతమైన మానసిక ఆందోళనను కలిగించటం జరుగుతుంది. సాధారణంగా ఇలా పిలువబడే ఆత్మలలో అధికశాతం ఇతరులకు మంచి చెయ్యాలనే ప్రయత్నిస్తాయి.

ప్రేతాత్మలతో మాట్లాడాలి అని అనుకునేవారు కొంతకాలంపాటు ప్రతిరోజూ ఉదయం సమయంలో 30 నిమిషాలపాటు మెడిటేషన్ చెయ్యాలి. ఆవిధంగా చెయ్యటం వల్ల మనస్సు ఏకాగ్రతను సాధిస్తుంది. మానసిక ఏకాగ్రత ఉన్నవారు మాత్రమే ఆత్మలను పిలిచి వాటితో మాట్లాడగలశక్తిని కలిగి ఉంటారని మాత్రమే గ్రహించాలి.

సాధారణంగా భూమిపై సంచరించే ప్రేతాత్మలు మానవులయొక్క శక్తి క్షేత్రాన్ని తాకినపుడు ఆ మానవుల ఆలోచనలలో, భావోద్వేగాలలో, భావాలలో మార్పులు వస్తాయి. ముఖ్యంగా ఈ ప్రేతాత్మలు మనిషియొక్క మెదడును ప్రభావితంచేస్తాయి. కొన్నిసార్లు ఈ ప్రేతాత్మలు కొందరుమానవులయొక్క ఎనర్జీని తాముతీసుకుని ఆ మానవులయొక్క స్వభావాన్ని తమ స్వభావంగా మార్పుచేస్తాయి. సాధారణంగా ఒంటరి తనంతో బాధపడుతున్నవారు సమాజంపై తీవ్ర ఆగ్రహం ఉన్నవారు, నెగటివ్ భావాలతో కలత చెందుతున్నవారు ప్రేతాత్మలయొక్క ప్రభావానికి సులువుగా గురి అవుతారని తెలుస్తున్నది. ఇలాంటి పరిస్థితులలో కొందరు మానవులు అకారణంగా విపరీతమైన కోపాన్ని ప్రదర్శించటం, ఇతరులపైకి దాడిచెయ్యటం జరుగుతున్నది. ఆ మానవుల మనస్సుపై ప్రభావం చూపిస్తున్న ఆత్మల కారణంగానే మానవులు ఇలాంటి కారణ రహిత చర్యలకు పాల్పడటం జరుగుతుంది. మానవులయొక్క శక్తి క్షేత్రానికి మరియు శరీరాలకు పరస్పరం సంబంధం ఉంటుంది. ఫలితంగా ప్రేతాత్మలచే ప్రభావితం చేయబడుతున్న మానవులకు విపరీతమైన ఒళ్ళునొప్పులు రావటం, తలనొప్పులు రావటం లేదా విపరీతమైన ఆకలివేయటం జరుగుతుంది.



# 9. మరణం ఎలా ఉంటుంది?

లండన్‌లోని కింగ్స్ కాలేజీలో న్యూరోసైకియాట్రిస్ట్‌గా పనిచేస్తున్న ప్రొఫెసర్ పీటర్‌ఫెన్‌విక్ ఆధ్వర్యంలోని ఒక బృందం మరణశయ్యపై చావుకు సిద్ధంగా ఉన్నవారి అనుభవాలు ఎలా ఉంటాయి? మరియు అతీంద్రియశక్తులు ఏవిధంగా పనిచేస్తాయి? అనే అంశాలపై కొన్ని సంవత్సరాలపాటు పరిశోధనలు చెయ్యటం? జరిగింది. ఆ పరిశోధనలలో అనేక అనూహ్యమైన వాస్తవాలు వెలుగుచూసాయి. ముఖ్యంగా కొన్ని ఆసుపత్రులలో మరణశయ్యమీద ఉన్న పేషెంట్లు తమకు ఎవరో కొత్త, కొత్తవ్యక్తులు కనిపిస్తున్నారని, ఏవో విచిత్రమైన వెలుగులు కనిపిస్తున్నాయని చెప్పటం జరిగింది. ఆ రోగులు వివరించిన తమ అనుభవాలు ఆధారంగా పీటర్‌ఫెన్విక్ తన పరిశోధనలను కొనసాగించటం జరిగింది. ఆయన అభిప్రాయం ప్రకారం మరణశయ్యపై ఉన్నవారికి కలిగే అనుభవాలు మూడు రకాలుగా ఉంటాయని తెలుస్తున్నది. అది ఎలాగంటే...

1. చనిపోవటానికి సిద్ధంగా ఉన్నవారికి, చనిపోయిన వారి ముఖ్య బంధువుల ఆత్మలు కనిపించటంకానీ, ఇతర లోకాలకు సంబంధించిన వెలుగులు కనిపించటంకాని జరిగింది.

2. రోగులు మరణశయ్యపై చనిపోవటానికి సిద్ధంగా ఉన్న సమయంలో అప్పటికి కొద్ది నిమిషాల క్రితం లేదా గంటల క్రితం ఎక్కడో చనిపోయిన ఆ రోగుల తాలూకు బంధువు యొక్క రూపం ఆత్మ మరణశయ్యపై ఉన్నవారికి కనిపించటం జరుగుతుంది. నిజానికి ఆ రోగులకు కనిపించేది ఆత్మ మాత్రమే. కానీ ఆ ఆత్మ ఆ రోగులకు ప్రక్కన ఉన్న మామూలువాళ్ళకు కనిపించదు.

3. కొన్ని సందర్భాలలో తమ కుటుంబ సభ్యుడు లేదా సభ్యురాలు మరణశయ్యపై ఉన్నపుడు ఆ కుటుంబం నివసించే గృహంలో కొన్ని విచిత్రమైన సంఘటనలు జరుగుతాయి. వాటిలో ముఖ్యమైనవి తిరుగుతున్న గడియారాలు హఠాత్తుగా ఆగిపోవటం లేదా మరణశయ్యపై ఉన్న వ్యక్తిచుట్టూ విచిత్రమైన కాంతుల వలయాలు కొంతసేపు కనిపించటం జరగవచ్చు. కొంతమంది చనిపోతున్న సమయంలో వారి శరీరం నుండి పారదర్శకంగా ఉండే ఒక కాంతిరూపం బయటకువెళ్ళటం అక్కడ ఉన్నవారికి కనిపించటం జరుగుతుంది.

ఈ పరిశోధనలో పాలుపంచుకున్న లిండాజాకోట్ అనే ఒక యువతి తన అనుభవాన్ని ఇలా తెలియజేసింది. ఆమె తండ్రి ఒక దీర్ఘరోగి. అతడు కొద్ది నెలలుగా మాంచెస్టర్‌లోని ఒక ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నాడు. అతడిని పర్యవేక్షిస్తున్న డాక్టర్, లిండాతో ఇలా అన్నాడు. "బహుశా ఈ రోజు రాత్రితో మీ నాన్నకు ఈ లోకంతో సంబంధం తెగిపోవచ్చు. కనుక మీవాళ్ళందరినీ పిలిపించుకుని ఆయన్ని ఆఖరిసారి చూసుకోండి". లిండా తన అన్నదమ్ముల్ని, అక్కచెల్లెళ్ళని హాస్పటల్‌కి రప్పించింది.



**(మనిషి భౌతికదేహం నుండి బయటకు వెళ్ళిపోయిన సూక్ష్మదేహాన్ని మరియు భౌతికదేహం తలనుండి సూక్ష్మదేహం తలవరకు సంధించబడి ఉన్న ఒక వెండిరంగు తీగను ఈ ఫోటోలో చూడవచ్చు. సూక్ష్మ మరియు స్థూల (భౌతిక) దేహాలను కలిపి ఉంచే ఈ అదృశ్యతీగ తెగిపోయినపుడు మనిషి శరీరంలోని ఆత్మ అనగా సూక్ష్మ శరీరం బయటకు ఎగిరిపోతుంది. అపుడు ఆ మనిషి మరణించటం జరుగుతుంది.)**

ఆ రోజురాత్రి 9 గంటల ప్రాంతంలో ఆమె తండ్రి హఠాత్తుగా స్పృహలోకివచ్చి ఉల్లాసంగా నవ్వుతూ కనిపించాడు. అంతేకాకుండా మీ అమ్మ హాస్పటల్‌కి ఎందుకువచ్చింది ఇంట్లోనే ఉండవచ్చుకదా! అన్నాడు లిండాతో. తండ్రిమాట విని లిండా ఉలిక్కిపడింది. కారణం అప్పటికి వారం రోజుల క్రితం లిండాతల్లి హఠాత్తుగా మరణించింది. ఆ వార్త మంచంలో పడిఉన్న తండ్రికి తెలిస్తే మరింతగా కుంగిపోతాడని తల్లి మరణవార్తని లిండా రహస్యంగా ఉంచింది. తన తల్లి చనిపోయి వారం రోజులు అయ్యింది. మరి అలాంటప్పుడు తన తండ్రికి ఆమె ఎలా కనిపిస్తున్నది? అన్న ప్రశ్న లిండాని చాలాసేపు వేధించింది. లిండా తండ్రి పడుకుని ఉన్న మంచం చుట్టూ

నిలుచుని ఉన్న బంధువులు ఎవరికీ కనపడని లిండాతల్లి ఒక్క లిండా తండ్రికి మాత్రమే ఎలా కనిపించింది?.

చావటానికి సిద్ధంగా ఉన్న లిండా తండ్రిని ఇంకోలోకంలోకి ఆహ్వానించటానికి లిండా తల్లియొక్క ప్రేతాత్మ ఆ హాస్పటల్‌కి వచ్చిందని ప్రొఫెసర్‌పీటర్‌ఫెన్విక్ అర్థం చేసుకున్నాడు. ప్రొఫెసర్ పీటర్ చేసిన పరిశోధనలలో పాల్గొన్న అనేకమంది తమ తమ అనుభవాలను ఆయనకి చెప్పటం జరిగింది. తన భర్త చనిపోయినపుడు తమ ఇంట్లోని గడియారాలన్నీ హఠాత్తుగా ఆగిపోయాయని ఆయన పోయిన వారం తరువాత వాటంతట అవే మళ్ళీ పనిచెయ్యటం ప్రారంభించాయని ఒక స్త్రీ, పీటర్‌కి చెప్పటం జరిగింది. ప్రొఫెసర్ పీటర్ ఫెన్విక్‌కి పరిచయస్తుడైన ఒకవ్యక్తి న్యూజిలాండ్‌దేశంలో గాయపడి మంచంలోపడ్డ ఒక గోల్ఫ్ ఆటగాడికి సహాయం చెయ్యటానికి న్యూజిలాండ్ వెళ్ళాడు. అతడు, న్యూజిలాండ్‌లో ఆ ఆటగాడు ఉన్న హాస్పటల్‌కి వెళ్ళిచూడగా మంచంపై పడుకుని ఉన్న ఆటగాడి శరీరంనుండి తెల్లటి పొగలాంటి ఆకారం బయటకువెళ్ళటం కనిపించింది.

ఈ పరిశోధనలో పాల్గొన్న దయానాస్మిత్ తన అనుభవాన్ని ఇలా తెలియజేసింది. కొంతకాలం క్రితం ఆమె తండ్రికి విపరీతమైన అనారోగ్యంచేసి మంచం పట్టాడు. ఒకరోజు రాత్రి ఆయన శరీరానికి కొన్ని అడుగుల ఎత్తులో ఏదోఒక విచిత్రమైన జ్వాల గాలిలో ఎగురుతున్నది. ఆమె తండ్రి ఆ ఆకారంకేసి గుడ్లు మిటకరించి చూస్తున్నాడు. ఆ దృశ్యాన్ని చూసిన దయానా నిశ్చేష్టురాలు అయిపోయింది. ఆమె కదలటానికికానీ, మాట్లాడటానికికానీ అశక్తురాలైపోయింది. ఆమె తండ్రి పైన ఎగురు తున్నది ఒకరకమైన అగ్నిజ్వాల అది కొద్దిసార్లు ఇంటి సీలింగ్‌నుతాకి మరల కిందకు వస్తూ ఉన్నది. ఆ తరువాత కొంతసేపటికి ఆమె తండ్రి ప్రాణం వదలటం ఆ విచిత్రమైన జ్వాల అదృశ్యం కావటం జరిగింది.

తన పరిశోధన ఫలితాలను వెల్లడించిన ప్రొఫెసర్ పీటర్‌ఫెన్విక్ మానవ సమాజానికి ఇలా సందేశం ఇచ్చాడు. "మీరు ఏ క్షణంలో అయినా చనిపోవటానికి సిద్ధంగా ఉండాలి. అలా ముందుగానే మరణానికి సిద్ధమయి పోయినవారు చాలా తేలికగా ప్రాణం వదులుతారు. ఎవరైతే ఆగ్రహంతోకాని, అలజడితోకాని ఉంటారో వారు చనిపోయేటపుడు విపరీతమైన బాధను అనుభవిస్తారు. మనిషి జీవించటానికి మంచిమార్గం ఎలా ఉంటుందో చనిపోవటానికికూడా మంచి మార్గం ఉంటుంది. అది ఏమిటంటే చావు మనిషికి చాలా సహజమని గ్రహించటమే".



# 10. ప్రేతాత్మలు సంచించే రోడ్లు, పిశాచ వాహనాలు నిజంగా ఉంటాయా?

మనుషులు చనిపోతే ప్రేతాత్మలుగా మారతారు. అయితే ప్రాణంలేని వాహనాలు యాక్సిడెంట్ జరిగినంత మాత్రాన పిశాచాలుగా లేదా ప్రేతాత్మలుగా ఎలా మారతాయి? అన్న సందేహం ఆలోచనాశక్తి ఉన్న ఎవరికైనా వస్తుంది. ఇందుకు సరైన సమాధానం ఏమిటంటే ఒక రోడ్డు ప్రమాదం జరిగినపుడు వాహనంలో ఉన్నవాళ్ళు ముఖ్యంగా డ్రైవరు దారుణంగా మరణించినపుడు అతని ఆత్మ, ప్రేతాత్మగా మారుతుంది. అయితే అతను చనిపోయే సమయంలో కారుని నడుపుతూ ఉండటంవల్ల ఆ తరువాతకాలంలో అతడు ప్రేతాత్మగా కనిపించినపుడుకూడా కారుని నడుపుతూ కనిపిస్తాడు. ఇక్కడ కనిపించేకారు నిజమైనకారుకాదు. అది ప్రేతాత్మయొక్క భావననుండి ఏర్పడినదిగా గుర్తించాలి. కనుక పిశాచ వాహనం అంటే ప్రేతాత్మయొక్క సృష్టే అని గ్రహించాలి. ఈ పిశాచ వాహనాలు శరవేగంతో డ్రైవరు లేకుండా ప్రయాణిస్తూ కనిపిస్తాయి. అవి ఇలా కనిపించి అలా మాయం అవుతూ ఉంటాయి. సాధారణంగా మిట్టమధ్యాహ్నం 12 గంటల నుండి ఒంటి గంట వరకు మరియు తెల్లవారుఝామున రెండు గంటల నుండి మూడు గంటల మధ్య ఈ పిశాచి వాహనాలు రోడ్డుమీద పరుగెడుతూ దర్శనమిస్తాయి. అయితే ఈ వాహనాలు ఏ కారణంగా రోడ్డుపై ప్రయాణిస్తున్నాయో ఇంతవరకు ఏ పారాసైకాలజిస్టుకి అర్థంకాలేదు.

ఒక మనిషి తన కారుని వేగంగా నడుపుతూ ముందుకి వెళుతున్నపుడు హఠాత్తుగా అతనికి ఎదురుగా దయ్యంకారు వస్తుంది. అది దయ్యంకారని తెలియని ఈ కారు డ్రైవరు ఆ కారుని గుద్దకుండా ఉండటంకోసం తన కారుని ప్రక్కకు తప్పిస్తాడు. దయ్యం కారు ముందుకు దూసుకుపోతుంది. ఈ డ్రైవరు తన కారుని ప్రక్కకు తప్పించినపుడు రెండు రకాల సంఘటనలు జరిగే అవకాశం ఉంటుంది.

1. తనకారుని హఠాత్తుగా వేగంగా ప్రక్కకు తప్పించటం వలన ఆ కారు రోడ్డు ప్రక్కనే ఉన్న ఏ చెట్టుకో ఢీకొనటం లేదా రోడ్డు ప్రక్కనే ఉన్న పెద్ద గుంటలో పడి పోవటంకాని జరుగుతుంది. అంటే ఆ కారుకి హాని జరుగుతుంది.

2. వేగంగా ఎదురుగుండా వస్తున్న కారును తప్పించుకోవటంకోసం ఈ కారుని ప్రక్కకు తప్పించిన మరుక్షణమే దయ్యంకారు వెనకాల ఒక భారీ వాహనం దూసుకుని

వస్తుంది. నిజానికి ఈ కారు డ్రైవరు తనకు దగ్గరలో వస్తున్న భారీ వాహనాన్ని ముందుగా గమనించడు. దయ్యంకారు తనకు ఎదురుకాకుండా ఉన్నట్లయితే ఈ కారు డ్రైవరు తనకారుని తిన్నగా పోనిచ్చేవాడు, ఫలితంగా వేగంగా ఎదురుగుండా వస్తున్న భారీ వాహనాన్ని గుద్దేసేవాడు. అంటే ఒక కారుకి ఒక ప్రదేశంలో ఇంకా కొద్ది క్షణాల్లో జరగబోయే యాక్సిడెంట్‌ను తప్పించటంకోసం ఆ దయ్యంకారు ఆ సమయంలో అక్కడ కనిపించింది అని అర్థంచేసుకోవాలి.



ఈ ఫోటోలో భయంకరమైన ప్రమాదంలో చితికిపోయిన కారును, ఆ ప్రమాదంలో చనిపోయి కారుఎదురుగా పొగరూపంలో కనిపిస్తున్న ఆ కారు డ్రైవరుయొక్క ప్రేతాత్మను చూడవచ్చు.

సాధారణంగా ఏ ప్రదేశంలో అయితే ఒక ఘోర రోడ్డుప్రమాదం జరిగి వాహనాలు నాశనం అయి అందులో ప్రయాణించేవారు దారుణంగా చనిపోతారో ఆ ప్రదేశంలోనే పిశాచ వాహనాలు తరచుగా కనపడుతూ ఉంటాయని తెలుస్తున్నది. ఇటీవలకాలంలో విజయవాడ-గుంటూరు మధ్యలో ఉన్న రహదారిని చాలాపెద్దదిగా అనగా ఎనిమిది రోడ్ల రహదారిగా మారుస్తున్నారు. ట్రాఫిక్‌ని మొత్తంగా ఆపేసి అదేపనిగా రోడ్డువెయ్యటం సాధ్యంకాదుకనుక రోడ్డును అక్కడకొంచెం అక్కడకొంచెం నిర్మిస్తూ ట్రాఫిక్‌ను చిత్ర విచిత్రాలుగా వంకర టింకర మార్గంలో మళ్ళిస్తూ పంపిస్తున్నారు. గంటకి హీనపక్షం 60 కి.మీ. నుండి 120 కి.మీ. వరకు వేగంతో ప్రయాణించే వాహనాలు కొన్ని రోడ్డు వంపులలో ప్రమాదాలకు గురికావటానికి అవకాశాలు చాలా ఉన్నాయి. కొంతకాలం క్రితం గుంటూరుకి చెందిన ఒక వ్యాపారి గుంటూరు నుండి మోటారుబైక్‌మీద

విజయవాడ వెళుతూ చిన్నకాకాని దాటిన తరువాత ఒక పెద్ద ప్రమాదానికి గురిఅయ్యాడు. వంకరటింకరగా ఉన్న రహదారిలో వేగంగా ఎదురుగావస్తున్న ఒక లారీ ఈ గుంటూరు వ్యాపారిని ఢీకొట్టింది. ఫలితంగా ఆవ్యాపారి తలపగిలి మెదడు బయటకు వచ్చింది.

ఆ తరువాత ఎవరోధర్మాత్ములు అతడిని దగ్గరలో ఉన్న N.R.I. హాస్పటల్‌కి పంపించారు. అతను అక్కడ దాదాపు 15 రోజులపాటు కోమాలో ఉండి మరణించాడు. ఆ తరువాత అతడి ప్రేతాత్మN.R.I. హాస్పటల్ ముందున్న రోడ్డుమీద నుండి బైపాస్‌రోడ్డు మీదుగా చిన్నకాకాని వరకు మోటారుబైక్‌పై ప్రయాణిస్తూ పౌర్ణమి రాత్రులలో 12 నుండి ఒంటిగంట వరకు కనిపిస్తుందని కొందరు లారీ డ్రైవర్లు చెప్పుకోవటం జరుగుతున్నది. అయితే ఈ మోటారుబైక్, కన్నుమూసి తెరిచే లోగాN.R.I. హాస్పటల్ ముందునుండి చిన్న కాకాని వరకు ఉన్న రోడ్డుమీదగా మూడు నాలుగుసార్లు ఒక ంట వ్యవధిలో దూసుకుపోతూ కనిపిస్తుందని, దానిమీద పూర్తిగా తెల్లటి దుస్తులు దరించిన తలలేని ఒక మానవ ఆకారం కూర్చుని కనిపిస్తుందని ఈ దృశ్యాలను చూసిన కొందరు ఆటో డ్రైవర్లు నాతో చెప్పటం జరిగింది.

ప్రపంచవ్యాప్తంగా ఎన్నోదేశాలలో పిశాచ వాహనాలు కనిపించినట్టుగా చరిత్రలో నమోదు అయ్యింది. ఆధునిక కాలంలోకూడా అనేక నగరాలలో పిశాచ వాహనాలు కనిపిస్తున్నట్టుగా వార్తలు వస్తున్నాయి. ముఖ్యంగా పశ్చిమ లండన్‌లోని క్రేంబ్రిడ్జిగార్డెన్స్, నాటింగ్‌హిల్‌గేట్ ప్రాంతాలలో పిశాచ వాహనాలు కనిపిస్తున్నట్టుగా మీడియాలో వార్తలు వస్తున్నాయి.

1990 నుండి7వ నంబరుతో ఉండే ఒక పిశాచ బస్సు (ఇది డబల్‌డెక్కర్ అనగా రెండస్తులుగల బస్సు) ప్రతి సంవత్సరమూ మే నెలలో అర్ధరాత్రి 1.15 (a.m.) ప్రాంతంలో కనిపిస్తుందని తెలుస్తున్నది. సాధారణంగా ఆ నెలలో మోటారిస్టులు తమ వాహనాలపై వెళుతున్నపుడు ఎదురుగా ఈ పిశాచ డబల్‌డెక్కర్ ఎదురుగా వస్తుందని, దానిబారినుండి తప్పించుకోవటానికి తమ వాహనాలను ప్రక్కకు తప్పించటం జరుగుతుందని చెబుతున్నారు. ఒకసారి ఒక వ్యక్తి అర్ధరాత్రి దాటిన తరువాత బైక్‌పై వెళుతూ ఎదురుగుండా ఏ వాహనమూ లేకపోయినా ఏదో వాహనం ఎదురుగా వస్తున్నంత హడావుడితో తన బండిని ప్రక్కకు తప్పించాడని, ఆ సమయంలో అక్కడ ఉన్న కొందరు బాటసారులు చెప్పటం జరిగింది. ఆ వాహనదారు మాత్రం తనకు ఎదురుగా డబల్‌డెక్కర్‌బస్సు వచ్చిందని ఆ సమయంలో అక్కడ ఉన్నవారితో చెప్పాడు.

అంటే వాహనాలపై వెళుతున్నవారికి మాత్రమే ఎదురుగావచ్చే ఈ పిశాచిబస్సు కనిపిస్తుంది అన్నమాట.

కొంతమంది యువకులు ఈ దయ్యపు బస్సును పరిశీలనగా చూసినపుడు డ్రైవరు సీటులో ఎవరూలేరని, బస్సుయొక్క హెడ్‌లైట్స్ వెలుగుతూ ఉండవని తెలిసింది. కొంతమంది అభిప్రాయం ప్రకారం ప్రమాదాలలో నాశనం అయిపోయిన వాహనాలను ఎక్కడైనా వదిలివేసినపుడు వాటిని ప్రేతాత్మలు ఆవహిస్తాయని ఫలితంగా ఆ వాహనాలు ప్రయాణానికి సిద్ధమయి డ్రైవరు లేకుండానే ఆత్మల ఆదేశంతో రోడ్లపై దూసుకు పోతాయని తెలుస్తున్నది.

**కారక్‌హైవే-మలేషియా :**

మలేషియాదేశంలోని కారక్‌హైవే అనే రోడ్డుమార్గం మీద రాత్రి సమయాలలో కొన్ని రకాల ప్రేతాత్మలు సంచరిస్తూ ఉంటాయని, అవి అటువైపుగా వెళ్ళే మానవులను చంపివేస్తూ ఉంటాయని మలేషియన్ ప్రజలు బలంగా విశ్వసిస్తున్నారు. కొన్ని సంవత్సరాల క్రితం ఈ కారక్‌హైవేమీద యదార్థంగా జరిగిన ఒక సంఘటన గురించి క్లుప్తంగా తెలుసుకుందాం.

అర్ధరాత్రి 12 గంటలు దాటింది. ఒక యువజంట ఒక కారులో కారక్‌హైవే మీద ప్రయాణిస్తున్నారు. త్వరలో పండగ సీజన్ రాబోతున్నది కనుక పగటిపూట ఆ హైవేమీద ట్రాఫిక్ విపరీతంగా ఉంటుంది. అందువల్ల ఆ యువజంట రాత్రి సమయంలో తమ ప్రయాణాన్ని కొనసాగిస్తున్నారు. ఆ జంటతోపాటుగా నెలల వయస్సు ఉన్న వాళ్ళబిడ్డకూడా ఉన్నది. రాత్రిపూట ప్రయాణిస్తే ఎండబాధ ఉండదు. పైగా పౌర్ణమి రోజులు కావటంతో వెలుతురుకూడా బాగా ఉంటుంది అన్న అభిప్రాయంతో రాత్రి సమయంలో ప్రయాణం ప్రారంభించారు. తెల్లవారేసరికి తమ ఇల్లుచేరుకోవచ్చని వాళ్ళు ఆశపడుతున్నారు. రాత్రి సమయం కావటంతో ఆ రోడ్డుమీద గంటకో, అరగంటకో ఒక వాహనం కనిపిస్తున్నది. మొత్తంమీద ఒంటరిగా ఉన్న ఆ రోడ్డుమీద ఆ జంట ప్రయాణిస్తున్న ఆ కారు ఒంటరి ప్రయాణీకుడిలా కనిపిస్తున్నది. ఇంతలో ఆ కారు హఠాత్తుగా ఒక కుదుపుతో ఆగిపోయి విచిత్రమైన శబ్దాలను చెయ్యటం ప్రారంభించింది. ఆ జంటలోని భర్త ఈ సంఘటనచూసి ఆశ్చర్యపోయాడు. తాము చెయ్యబోయేది దూర ప్రయాణం కనుక కారుకి మధ్యలో ఎక్కడా సమస్య రాకూడదు అన్న అభిప్రాయంతో అతడు బయలుదేరటానికిముందే కారు అన్ని రకాలుగా బాగానే ఉన్నది అని తేల్చుకున్నాడు. అయితే ఇప్పుడు కారు ఇలా రోడ్డుమధ్యలో ఆగిపోవటంతో ఏం చెయ్యాలో అర్థంకాని ఆ వ్యక్తి తన కారును ఎలాగో శ్రమపడి రోడ్డుకు ఒకప్రక్కగా తీసుకువెళ్ళి ఆపాడు.

భార్యను మరియు బిడ్డను కారులోనేకూర్చోమనిచెప్పి అతను కారుదిగి, కారు ముందుకు వెళ్ళి బాయ్‌నెట్‌ని ఓపెన్‌చేసి కారులో ఏమైనా రిపేరు ఉన్నదేమో అని పరిశీలించాడు. కొన్ని నిమిషాల తరువాత అతను కారు విండో దగ్గరకువచ్చికారులో ఏ లోపమూలేదు అని భార్యకుచెప్పి మరల కారుఎక్కి కారు స్టార్ట్ చెయ్యాలని ప్రయత్నించాడు. ఎంత ప్రయత్నించినా కారు ఒక్క అడుగుకూడా ముందుకు వెయ్యలేదు. ఇంకొకరి సహాయం లేనిదే తమ కారు ఇక ముందుకు వెళ్ళదని అతనికి అర్థమయిపోయింది. ఇపుడు ఆ జంటముందు రెండు పరిష్కారాలు ఉన్నాయి. ఒకటి ఆ రోడ్డుమీదగా అటువైపువచ్చే ఏదోఒక వాహనాన్ని ఆపి అందులో ఎక్కి తమ ఊరికి చేరుకోవాలి. లేదా తను ఒక్కడే ముందుకు నడిచివెళ్ళి దగ్గరలో ఏదైనా టెలీఫోన్ బూత్ ఉంటే అక్కడకుచేరుకుని అక్కడ నుండి తనకు తెలిసిన మెకానిక్‌కి కారు ఆగిపోయిన ప్రదేశానికి రమ్మని ఫోన్ చెయ్యాలి. దురదృష్టవశాత్తు ఆ జంట తమ సెల్‌ఫోన్లను తాము ఖాళీచేసిన హోటల్‌రూంలో మర్చిపోవటం జరిగింది. అందువలన మెకానిక్‌ని సంప్రదించటానికి సెల్‌ఫోన్ లేకపోవటంతో దగ్గరలో ఉన్న టెలీఫోన్ బూత్ దగ్గరకి వెళ్ళాల్సి వస్తున్నది.

తాను నడుచుకుంటూ కొంతదూరం వెళ్ళి అక్కడ ఉండే టెలీఫోన్‌బూత్‌కి వెళ్ళవచ్చు. అయితే భార్యాబిడ్డల్ని ఒంటరిగా అక్కడకారులో వదిలి వెళ్ళాల్సి ఉంటుంది. అది అతనికి ఇష్టంలేదు. ఏమి చెయ్యాలో అర్ధంకాక దాదాపు 20 నిమిషాలపాటు అతను కారుదగ్గరే ఉండిపోయాడు. హాయిగా ఇంటికివెళ్ళి పండుగ జరుపుకుందామని ఆశపడుతున్న తమకు ఈ సమస్య వచ్చిపడిందే అని ఆ వ్యక్తి మనసులో దిగాలుపడుతున్నాడు. ఇలా చాలాసేపు ఆలోచనలతో హైవేమీద తన కారుప్రక్కన నిలుచుండిపోయిన ఆవ్యక్తి చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. ఏది ఏమైనాకాని తాను, భార్యాబిడ్డల్ని కారులోనే ఉంచి నడిచి ముందుకువెళ్ళి అక్కడ నుండి మెకానిక్‌కి ఫోన్‌చెయ్యాలి అని నిర్ణయించుకున్న ఆవ్యక్తి, భార్యకు కారునుండి దిగవద్దు. కారుడోర్లు తియ్యవద్దు అని జాగ్రత్తలుచెప్పి నడుస్తూ ఆ వెన్నెల వెలుగులో ఆ తారురోడ్డుమీద ముందుకు వెళ్ళిపోయాడు. ముందునడుస్తున్న అతని మనసులో రోడ్డుప్రక్కన ఏ తోడూ లేకుండా కారులో కూర్చున్న అతని భార్యాబిడ్డలు మెదులుతున్నారు.

కారులోకూర్చున్న అతనిభార్యకు ఒంటరిగా నడిచివెళుతున్న భర్త కనిపించాడు. ఆమెలో ఏదో తెలియనిబాధ. కొంతసేపటికి అతను, ఆమె దృష్టిపరిధి నుండి మాయం అయ్యాడు. ఎంతసేపు గడిచినా ఆమెభర్త తిరిగిరాలేదు. అతడికి ఏదైనా ప్రమాదం జరిగిందేమో అని ఆమె విపరీతమైన ఆందోళనకు గురి అవుతున్నది. ఆమెలో భర్త ఏమైపోయాడో అన్న ఆత్రుత అంతకంతకూ అధికమై పోయింది. ఒకసారి అనుకోకుండా

రిస్ట్‌వాచీకేసి చూసుకుంది. అపుడు సమయం తెల్లవారుఝాము 3 గంటలు అవుతున్నట్టుగా ఆమెకు అర్థమయ్యింది. ఏమైతే అదిఅవుతుంది నేను కారుదిగి నా భర్త వెళ్ళినవైపే వెళతాను. అదృష్టం బాగుంటే అతను కనపడవచ్చు అని నిర్ణయించుకున్న ఆమె కారుదిగి నుంచున్నది. ఇంతలో ఆమెకు తన వెనకాల ఎవరో నుంచున్నట్టుగా అనిపించి గిరుక్కున వెనక్కితిరిగిచూసింది. అక్కడ కనిపించిన భయానకదృశ్యం ఆమె గుండెల్ని పిండివేసింది. ఏమిటాదృశ్యం? నోరు మరియు కళ్ళు విశాలంగా తెరుచుకుని ఉన్న ఆమె భర్తయొక్క శిరస్సు గాలిలో తేలుతూ ఆమెవైపు చూస్తున్నది. ఆమెభర్త మొండెం భాగం కనపడటంలేదు. ఆమె భయంతో పెద్దగా అరుస్తూ నేలమీద పడిపోయి మూర్ఛపోయింది. ఆమె అరుపుకు గాఢనిద్రలో కారు వెనకసీటులో పడుకుని ఉన్న ఆమె రెండు సంవత్సరాలబిడ్డనిద్రలేచి పెద్దగా ఏడవటం ఆరంభించింది. తెల్లవారిన తరువాత అటువైపుగా కారులో వచ్చే కొందరు యువకులు రోడ్డుప్రక్కన ఆగిఉన్న కారును, ఆ కారుప్రక్కన రోడ్డుమీద స్పృహతప్పి పడిఉన్న యువతిని, కారులో కూర్చుని బిక్కుబిక్కుమంటూ బయటకుచూస్తున్న బిడ్డనుచూసారు. దాంతోవాళ్ళు తమకారును అక్కడ ఆపి కారుదిగి కిందకువచ్చి ఆ యువతిని మరియు బిడ్డను తమ కారులో ఎక్కించుకుని వాళ్ళ ఊరికిచేర్చారు. ఆనాడు అర్ధరాత్రి మాయమయి ఆ తరువాత కొంతసేపటి శిరస్సువరకు కనిపించిన ఆమెభర్త ఏమయ్యాడో ఈనాటికీ ఎవరికీ తెలియలేదు.



# 11. ప్రేతాత్మ ఆవహించిన 'ఒకికు' బొమ్మ వివరాలు ఏమిటి?

జపాన్‌దేశంలో హొక్కైడో ప్రాంతంలో ఉన్న ఐవామింజువా పట్టణంలోని మన్నెన్‌జీ ఆలయంలో జీవం ఉన్న మనిషి లక్షణాలను ప్రదర్శించే 'ఒకికు' అనే ఒక బొమ్మ ఉన్నది. దాదాపు 1938వ సంవత్సరం నుంచి ఆ బొమ్మ అక్కడే ఉన్నది. ఈ బొమ్మలో విశేషం ఏమంటే ఈ బొమ్మకు జుట్టు పెరుగుతూ ఉంటుంది. ఈ ఆలయ సాంప్రదాయాల ప్రకారం ఇందులో ఉండే బొమ్మలకి పొట్టిక్రాఫ్ ఉండాలి. అందువలన ఈ ఆలయంలో ఆ బొమ్మను పెట్టినపుడు దానికి పొట్టిక్రాఫ్ చేయించటం జరిగింది. ఆ తరువాత ఆ బొమ్మతలమీద ఉండే జుట్టు దాదాపు 25 మీటర్ల పొడవుపెరిగి ఆ బొమ్మ మోకాళ్ళదాకా వచ్చింది. అప్పుడప్పుడూ ఆ బొమ్మకు జుట్టు కత్తిరించి పొట్టి

క్రాఫ్ చేయించినప్పటికి మరల జుట్టు పెరుగుతూనే ఉండటం విశేషం. ప్రాణంలేని బొమ్మతలపై ఉండే జుట్టు ఎలా పెరుగుతున్నది? అన్న ప్రశ్న ప్రపంచవ్యాప్తంగా ఉన్న అనేకమంది శాస్త్రజ్ఞులకి చిక్కువీడని మిస్టరీగా మిగిలిపోయింది.

1918వ సంవత్సరంలో ఎక్‌చీసుజుకీ అనే 17 సంవత్సరాల బాలుడు తన కుటుంబంతో ఒకసారి ఒక మెరైన్ ఎగ్జిబిషన్‌కి వెళ్ళినపుడు అక్కడ కనపడిన బొమ్మను కొనుగోలుచేసాడు. ఆ తరువాత ఆ బొమ్మని 'ఒకికు' అనే పేరుగల తన రెండు సంవత్సరాల చెల్లెలికి బహుమతిగా ఇచ్చాడు. ఆ పసిపిల్ల ఆ బొమ్మతో ఎల్లప్పుడూ ఆడుకుంటూ కాలక్షేపం చేస్తూ ఉండేది. అయితే ఊహించనివిధంగా ఒక దారుణం జరిగింది. అది ఏమిటంటే ఆ మరుసటి సంవత్సరమే ఆ పసిపిల్ల విపరీతమైన జలుబుచేసి మరణించింది. ఈ పరిస్థితులకు ఆందోళన చెందిన ఒకికు కుటుంబ సభ్యులు ఆ బొమ్మని వాళ్ళ ఇంట్లో వాళ్ళుపూజించే దేవతా విగ్రహాల మధ్యలో ఒకికు జ్ఞాపకార్థం ఉంచి పూజించటం ప్రారంభించారు. కొంతకాలం గడిచిన తరువాత ఆ బొమ్మ శిరస్సుమీద ఉండే జుట్టు పెరగటం గమనించారు. అకాలమృత్యువుపాలయిన పసిపిల్ల ఒకికుయొక్క ప్రేతాత్మ తనకు ప్రాణసమానమైన బొమ్మలో ప్రవేశించిన కారణంగానే ఆ బొమ్మ తలపై జుట్టు పెరుగుతూ ఉన్నదని ఆ కుటుంబ సభ్యులు గుర్తించారు.

ఆ తరువాత 1938వ సంవత్సరంలో ఆ కుటుంబంవారు షాక్‌హాలిన్ అనే ప్రాంతానికి వెళ్ళిపోతూ ఆ బొమ్మని మన్నెన్‌జీ ఆలయ నిర్వాహకులకు ఇచ్చారు. అప్పటినుండి ఆ బొమ్మ ఒకికు అన్నపేరుతో పిలువబడుతూ ఆ ఆలయంలోనే ఉన్నది. ఎందరో హేతు వాదులు మరియు శాస్త్రజ్ఞులు ఈ ఒకికు బొమ్మను పరిశీలించి ఏమీ అర్థంకాక మౌనం వహించారేకానీ ప్రాణంలేని బొమ్మకు జుట్టు ఎలా పెరుగుతుంది? అన్న విషయాన్ని తెలుసుకోలేకపోయారు. ఆ బొమ్మలో ఒకికుయొక్క ఆత్మ ఉన్నదని చాలామంది నమ్ముతున్నారు.



జపాన్‌దేశానికి చెందిన ఒక పరిశోధకుడు ఆ బొమ్మమీద ఫోరెన్సిక్ (Forennic) పరీక్షలు జరిపి ఆ బొమ్మ తలమీద పెరిగే జుట్టు నిజమైనదే అని పది సంవత్సరాల

వయస్సు ఉండే ఆడపిల్లతలపై ఉండే జుట్టులాగా బొమ్మపై పెరుగుతున్న జుట్టు ఉన్నదని అతను తేల్చాడు. 40 అంగుళాల ఎత్తులో ఉండే ఈ బొమ్మపై జపాన్ సాంప్రదాయ వస్త్రం అయిన కిమినో ధరింపచేయబడి ఉంటుంది. (కిమినో అంటే ఇంచుమించుగా నేటి ఆడవారు ధరించే నైటీలాగా ఉంటుంది. ప్రేతాత్మలు ఉన్నాయి అని నిరూపించటానికి తిరులేని సాక్ష్యంగా మిగిలిపోయింది ఒకికు బొమ్మ.



# 12. శత్రువుల్ని దెబ్బతియ్యటానికి ఉపయోగించే వుడూ ప్రయోగాల వివరాలు?

ప్రతి మనిషిలోనూ కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము అనే ఆరు గుణాలు ఉంటాయి. వీటినే అరిషడ్వర్గాలు అని పిలుస్తారు. ఈ మనిషిలో గుణాలు చాలా తక్కువ స్థాయిలో ఉన్నంతవరకు ఎవరికీ ఇబ్బంది ఉండదు. అయితే ఎవరిలో ఈ గుణాలు తీవ్రరూపం ధరిస్తాయో వారు మొదట్లో ఇతరుల్ని నాశనంచెయ్యటం అంతిమంగా ఇతరుల చేతిలో తాము నాశనంకావటం జరుగుతుంది. అరిషడ్వర్గాలలో మొదటిది అయిన కామం విపరీతం కావటంతో రావణుడు నశించి పోయాడు. క్రోధం విపరీతం కావటంతో దూర్వాసుడు అనేక సమస్యలు ఎదుర్కొన్నాడు.

లోభం మరియు మత్సరం అనే గుణాలు అధికం అవటంవల్ల దుర్యోధనుడు పాండవులమీద కక్షపూని, కురుక్షేత్ర యుద్ధానికిదిగి చివరిగా తొడలువిరిగి యుద్ధ రంగంలో పడిపోయాడు. అంటే పైన పేర్కొన్న ఆరు గుణాలలో ఏ గుణమైనా మోతాదు మించితే ఆ గుణం ఆ మనిషి నాశనానికి కారణమవుతుంది. లోభగుణం అధికమయిన ధనవంతుడు తాను తినడు, ఇతరులకు పెట్టడు. అలాంటివాడి డబ్బుని ఏ అనామకుడో సొంతంచేసుకోవటం జరుగుతుంది. ఈ గుణాలవల్లే మానవులు క్షుద్ర శక్తుల్ని, క్షుద్రప్రయోగాల్ని ఆశ్రయిస్తూ ఉంటారు.

క్షుద్ర ప్రయోగాలద్వారా తమకు ఇష్టంలేని వ్యక్తుల్ని అనేక రకాలుగా హింసించే అవకాశం ఉంటుంది. కొన్నిసార్లు తనకు ఇతరులు అకారణంగా పరాభవాన్నికాని, నష్టానికాని కలిగించినపుడు అందుకు కారణమైనవారిని భౌతికంగా శిక్షించే

ధనబలంకాని, కండబలంకాని వాళ్ళచేత దెబ్బతిన్న తనదగ్గర లేనప్పుడు ఆ వ్యక్తి తన ప్రతీకారంకోసం క్షుద్ర ప్రయోగాల్ని ఆశ్రయించటం జరుగుతుంది. భారతదేశంలో జరిగే క్షుద్రప్రయోగాలు అధర్వణవేదంలోని మంత్రాలు ఆధారంగా జరుపబడతాయి. కానీ ఆఫ్రికాదేశాలలో మరియు పాశ్చాత్యదేశాలలో ప్రయోగించే చేతబడులు (బ్లాక్ మాజిక్) వుడూ అనే తాంత్రిక విధానంలో చేయబడతాయి. ఈ గ్రంథంలో ఇతరులకు అనగా తనకు హానిచేసినవారికి ప్రమాదం కలిగించటంకోసం ఉపయోగించే కొన్ని వుడూ తాంత్రిక మంత్రాలను మరియు పద్ధతులను ఇవ్వటం జరుగుతున్నది. వీటిని కేవలం పాఠకులకు సమాచారం తెలియజెయ్యాలి అన్న ఉద్దేశంతో మాత్రమే ఇస్తున్నాను.

ఎవరైనా వీటిని స్వయంగా ప్రయోగించాలి అనుకుంటే అనుకోని కొన్ని ప్రమాదాలు వారికి ఎదురయ్యే ప్రమాదముంటుంది. ఎందుకంటే క్షుద్రప్రయోగాలు రెండువైపులా పదునున్న కత్తులలాంటివి. వాటిని సక్రమంగా ప్రయోగిస్తే శత్రువులు నాశనం అవుతారు. తేడాగా ప్రయోగిస్తే ఆ ప్రయోగాలు చేసినవారికే బెడిసికొడతాయి. కనుక ఈ వుడూ ప్రయోగాలను ఎవరూ చేయకుండా ఉంటేనే మంచిది అని నా విన్నపం. ఈ క్రింద వివిధ రకాల వుడూ ప్రయోగ విధానాలను ఇస్తున్నాను పరిశీలించండి.

**ప్రతీకారం తీర్చుకోవటంకోసం వుడూ మంత్రం :**

1. మొదట నలుపు రంగులో ఉండే 13 కొవ్వొత్తులు సంపాదించుకోవాలి. ఆ తరువాత ఏ వ్యక్తిమీద ఈ ప్రయోగం చెయ్యాలో ఆవ్యక్తి ఉపయోగించే వస్త్రమో, పాదరక్షలో, వెంట్రుకలో, గోళ్ళో సంపాదించాలి. ఒక గంగాళము మరియు కొన్ని మిరియాలుకూడా సేకరించాలి.

2. ఆ తర్వాత నేలమీద ఒక వృత్తాన్నిగీసి ఆ వృత్తంలో 13 నల్ల కొవ్వొత్తులను అక్కడ ఒకటి అక్కడ ఒకటి నిలబెట్టాలి. ఆ తరువాత చేతిలో కాసిని మిరియాలు తీసుకుని ఆ వృత్తంచుట్టూ కొద్దికొద్దిగా చల్లుతూ ఈ క్రింద ఇస్తున్న మంత్రాన్ని పఠించాలి. ("To lock in hate, To lock out love, rage i must create, revenge i must think of".)

ఆ తరువాత మొదటి కొవ్వొత్తిని వెలిగించి ఇలా మంత్రం చదవాలి. "I light thee with only heate in my heart. Only with revenge in mind. I give thee light to aid my range into the direction of she/he i hate".

(రెండవ లైనులో షి(ఆమె) లేదా హి(అతడు) అని ఉన్నచోట ఎవరిమీద అయితే ఈ ప్రయోగం జరుపబడుతున్నదో అతడి లేదా ఆమెయొక్కపేరును ఉంచి చదవాలి. ఆ తరువాత ఒక్కొక్క కొవ్వొత్తి వెలిగిస్తూ రెండవ మంత్రాన్ని చదువుతూ ఉండాలి. అనగా మొదట కొవ్వొత్తిని వెలిగించినపుడు ఒకటవ మంత్రాన్ని ఒకసారి చదవాలి. ఆ తరువాత మిగిలిన 12 కొవ్వొత్తులు వెలిగిస్తూ రెండవ మంత్రాన్ని 12 సార్లు చదవాలి అన్నమాట.

ఆ తరువాత ఎవరిపై ఈ ప్రయోగం జరుపబడుతున్నదో ఆవ్యక్తియొక్క వస్తువును రెండు చేతులతో గట్టిగా పట్టుకుని గాలిలోకి ఎత్తి మనస్సులో ఆవ్యక్తియొక్క ముఖాన్ని ఊహించుకుంటూ, ఆ వ్యక్తి మీకు ఏరకంగా చెడు చేశాడో లేదా చేసిందో స్పష్టంగా గుర్తుకు తెచ్చుకోవాలి. ఆ సమయంలో శత్రువుకి హాని కలగాలని చాలాబలంగా పూర్తి ఏకాగ్రతతో కోరుకోవాలి. ఆ తరువాత కళ్ళు తెరచి ఈ క్రింద ఇచ్చిన మంత్రాన్ని మూడుసార్లు పఠించాలి.

"Make she/he see the hurt he/she brings me, make him/her feel the pain i feel. Remove the hate from my heart, and all the pain he/she brought me, move it towards the more deserving. All she has down she shall now see, I will seek my revenge times three".

ఆ తరువాత ప్రయోగం చేయబడుతున్న వ్యక్తియొక్క వస్తువును 13 కాండిల్స్ మధ్యగా తిప్పుతూ ఆపై దానిని ఒక పెద్ద గిన్నెలో లేదా చిన్న గంగాళంలో పడవెయ్యాలి. ఆ తరువాత సాంబ్రాణి వెలిగించి ఆ పొగలోకి చూస్తూ క్రింద మంత్రాన్ని చదవాలి.

"As this burns, your pain shall begin, and all you brought me, now shall and."

ఆ తరువాత గంగాళంలో లేదా గిన్నెలో పడవేసిన శత్రువుకు చెందిన వస్తువుని అందులోనే కాల్చివెయ్యాలి. దాంతో ఈ వుడూ ప్రయోగం సమాప్తి అవుతుంది.

ఈ ప్రయోగ ఫలితంగా ప్రయోగంచేసే వ్యక్తిచేతిలో ఉన్న వస్తువులో నెగటివ్ ఎనర్జీ ప్రవేశించి ఆ వస్తువుద్వారా శత్రువు శరీరాన్ని లేదా మనసును చేరుకుని శత్రువుకి హాని కలిగిస్తుంది. (ఒక ముఖ్యవిషయం ఏమిటంటే ఎవరైనా మనిషి ఒక వస్తువుని కొంతకాలంవాడి వదిలివేసిన తరువాత ఆ వస్తువు భౌతికంగా ఆ మనిషికి దూరం అయిపోయినప్పటికీ ఆ మనిషి నుండి ఒక అదృశ్య తీగలాంటి బంధం ఆ

వస్తువుకు తాకి ఉంటుంది. వ్యక్తికి మరియు అతడి వస్తువుకు మధ్యదూరం కొన్నివేల కి.మీ. ఉన్నప్పటికీ ఆ అదృశ్య బంధం కొనసాగుతూనే ఉంటుంది. ఆ కారణంగానే ఒక మనిషికి సంబంధించిన వస్తువుపై క్షుద్రప్రయోగంచేస్తే, నెగటివ్ ఎనర్జీ ఆ వస్తువు మరియు ఆ మనిషికి మధ్య వ్యాపించి ఉన్న అదృశ్యతీగద్వారా వ్యాపించి ఆ మనిషికి హానిస్తుంది.)

**2. శత్రువుకి ఉన్మాదాన్ని కలిగించే వుడూ విధానం :** మానసికంగా లేదా శారీరకంగా హింసించి బాధిస్తున్న శత్రువుకి పిచ్చిపట్టేలాచేసి, వాడు నలుగురిలో నవ్వులుపాలు అయ్యేలా చెయ్యటంకోసం ఒక వుడూ పద్ధతి ఉన్నది.


వుడూ దేవత

మొదట ఒక నల్లకోడిపెట్ట పెట్టిన కోడిగ్రుడ్డును సంపాదించాలి. ఆ తరువాత ఆ కోడిగుడ్డు వెనకభాగంలో శత్రువుయొక్క పేరును వ్రాయాలి. ఆ తరువాత ఆ గుడ్డును కళ్ళకి అద్దుకుని శత్రువుకి ఉన్మాదం కలగాలి అని 13సార్లు కోరుకుని ఆపై ఆ గుడ్డును శత్రువు ఇంటి కప్పుమీదకి విసరివెయ్యాలి. అలా విసరటం సాధ్యం కాకపోతే శత్రువు ఇంటి ప్రధాన ద్వారంముందు భూమిలో ఆ గుడ్డును పాతిపెట్టినా తప్పక ఫలితం లభిస్తుంది. శత్రువు మతిచెడి పరుగెడతాడు.

**3. ఒక పురుషుడిని నపుంసకునిగామార్చే వుడూ విధానం** :ఒక పురుషుడు ఒక స్త్రీతో సుఖాలు అనుభవిస్తున్నపుడు "నువ్వుతప్ప ఏ ఇతర స్త్రీ నాకు అవసరంలేదు. నువ్వేనాకు శాశ్వతం" అని వాగ్దానాలు చేస్తాడు. అయితే ఆ తరువాత ఇంకొక అందమైన స్త్రీ దొరికితే అతడు తన వాగ్దానాన్ని మరచిపోయి కొత్తస్త్రీతోకూడా సుఖాలు అనుభవిస్తాడు. ఇలా స్త్రీలను వంచించే పురుషులను శిక్షించటంకోసం ప్రాచీన వుడూ విధానంలో ఒక ప్రక్రియ చెప్పబడి ఉన్నది. ఏ స్త్రీ అయితే తనకు ద్రోహం చేసిన పురుషుడికి మగతనం పోవటంకోసం వుడూ తంత్రాన్ని ప్రయోగించాలనుకుంటుందో ఆ స్త్రీ తాను ఆ పురుషుడితో సంభోగం జరిపినపుడు అతని నుండి మరియు తననుండి

వెలువడిన ద్రవాలతో తడిసిన ఒక వస్త్రాన్ని సేకరించి దానికి ఏడు ముడులు వెయ్యాలి.

ఆ తరువాత ఆ వస్త్రాన్ని ఒక నదిలో ముంచి తనకు ద్రోహంచేసిన పురుషుడికి నపుంసకత్వం రావాలని మూడుసార్లు కోరుకోవాలి. ఈ ప్రక్రియ ఫలితంగా ఆమెకు ద్రోహంచేసిన పురుషుడికి మగతనం నశించిపోతుంది. ఏ కారణంచేతైనా ఆమె అతన్ని క్షమించాలి అనుకుంటే ఆమే స్వయంగా నదిలో ముంచిన వస్త్రాన్ని తీసుకువచ్చి ఆ ఏడు ముడులను విడదీయ్యాలి. అప్పుడు మాత్రమే అతనికి మరల పురుషత్వం వస్తుంది. ఏ కారణంచేతనైనా ఆ వస్త్రం పోయినట్లయితే ఆ వ్యక్తి శాశ్వతంగా నపుంసకుడిగా మిగిలిపోతాడు.



# 13. శీల రక్షణకోసం ప్రాణాలు కోల్పోయిన 'టాషికి' వివరాలు?

జపాన్‌దేశంలో అత్యంత ప్రముఖమైన ప్రేతాత్మగా పేరుపొందిన 'టాషికి' వివరాలు తెలుసుకుందాం. కొన్నిశతాబ్దాల క్రితం జపాన్‌దేశంలో అనేకమంది మహాయోధులు ఉండేవారు. వాళ్ళని జపాన్‌భాషలో సమురాయ్ అని పిలిచేవారు. వీరు పౌరుషానికి, నిజాయితీకి మారుపేరుగా ఉండేవారు. ధర్మాన్ని రక్షించటంకోసం తమ పరాక్రమాన్ని ఉపయోగించిన ఈ సమురాయ్‌లకు జపాన్ చరిత్రలో విశేషమైనస్థానం ఉన్నది. అలాంటి ఒక సమురాయ్ యోధునికి సంబంధించిన యదార్ధగాథే ఈ 'టాషికి'. టెస్సాన్‌ఔయామా అనే ఒక సమురాయ్ యోధుని భవనంలో అనేకమంది అమ్మాయిలు పనులుచేస్తూ ఉండేవాళ్ళు. అలాంటివాళ్ళలో 'టాషికి' అనే ఒక అందమైన అమ్మాయి కూడా ఉన్నది. ఆమెనుచూసిన ఆ సమురాయ్ ఆమెపై మనసుపడ్డాడు. ఆమెను ఎలాగైనా ఒప్పించి, ఆమెతో స్వర్గసుఖాలు అనుభవించాలని నిర్ణయించుకుని ఆమెకు అనేక రకాల ఆశలుచూపాడు. అయితే ఆమె తన యజమాని అయిన సమురాయ్ ఇవ్వజూపిన అన్ని కానుకలను తిరస్కరించి తనకి శీలమే ప్రధానమని చెప్పింది.

ఆమె తిరస్కారానికి ఖంగుతిన్న ఆ సమురాయ్ ఆమెను కుతంత్రాలతో లొంగ దీసుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఒకరోజు రాత్రి సమురాయ్ భవనంలో అందరూ భోజనాలు ముగించిన తరువాత పని అమ్మాయిలు వంటగది సామాన్లను సర్దుతున్నారు.

అలాంటి సమయంలో సమురాయ్ ఎవరూచూడకుండా వంట గదిలోకి వచ్చి అక్కడ ఒక టేబుల్‌మీద ఒక బొత్తిగా పెట్టబడిన 10 విలువైన డచ్ పళ్ళాలను చూసాడు. భోజనానికివాడే ఆ పళ్ళాలలో ఒకదానిని తీసివేసి ఎక్కడో దాచిపెట్టాడు. మర్నాడు ఉదయం అమ్మాయిలందరూ సమురాయ్ భవనానికి పనులు చెయ్యటానికి వచ్చారు. వాళ్ళతోపాటుగా వచ్చి వంటగదిలో పనులుచేస్తున్న 'టాషికి' దగ్గరకు వెళ్ళిన సమురాయ్ ఆమెను క్రూరంగాచూస్తూ "ఇదిగో అమ్మాయి! నా భవనంలో ఉన్న పది విలువైన డచ్ ప్లేట్లలలో ఒకటి పోయింది. అది నువ్వే దొంగిలించి ఉంటావని అను మానిస్తున్నాను" అన్నాడు. అమాయకురాలు మరియు నిజాయితీపరురాలైన 'టాషికి' భయంతో గజగజా వణకిపోతూ "ఆ పళ్ళెంగురించి నాకు తెలియదు. నేను నిర్దోషిని అని సమురాయ్‌కి చెప్పింది. సమురాయ్ చిరునవ్వు నవ్వుతూ పోతేపోయిందిలే ఆ ..టు గురించి నాకేమి చింతలేదు. నువ్వు ఇప్పటికైనా మనసు మార్చుకుని నాతో ..డక పంచుకో. నా కోర్కెతీర్చు. నిన్ను నిర్దోషిగా ప్రకటిస్తాను. ఇంకా కావాలంటే నీకు ..తో బంగారం కానుకగా ఇస్తాను" అన్నాడు. అప్పటికీ 'టాషికి'కి అర్ధమయ్యింది. సమురాయ్ కావాలనే తనని దొంగతనంలో ఇరికించాడని. తను సమురాయ్ శరీరంకింద నలిగిపోవాలా. తన శీలాన్ని బలిఇవ్వాలా? అని తీవ్రమైన మనోవేదనకి గురైన 'టాషికి' ఆ రోజు అర్ధరాత్రి సమురాయ్ భవనం పెరట్లో ఉన్న ఒక బావిలో దూకి ఆత్మహత్య చేసుకున్నది.

సమురాయ్‌కి అపుడు అర్ధమయ్యింది. 'టాషికి' తనకు లొంగటం ఇష్టంలేక ఆత్మహత్య చేసుకున్నది అని. ధనవంతుడికి పేదవాళ్ళ ప్రాణాలు మరియు మానాలు వెంట్రుకముక్కతో సమానం కనుక 'టాషికి' చనిపోయినందుకు సమురాయ్‌కి ఎలాంటి బాధ కలగలేదు. అయితే 'టాషికి' కథ అంతటితో ముగిసిపోలేదు. తన భౌతిక శరీరాన్ని వదలిన 'టాషికి' ప్రేతాత్మ తాను చనిపోయిన బావిలోనే నివసిస్తూ అర్ధరాత్రి దాటిన తరువాత ఆ బావిలో నుండి బయటకువచ్చి సమురాయ్ భవనంలో ఉన్న వంటగదిలోకివెళ్ళి అక్కడ బొత్తిగా ఉన్న పళ్ళాలను లెక్కించటం ప్రారంభించేది. ఒకటి రెండు మూడు.....తొమ్మిది అంటూ ఎన్నిసార్లు లెక్కించినా పళ్ళాలు తొమ్మిది మాత్రమే ఉండేవి. పదవ పళ్ళెం కనపడేదికాదు. (ఆ పళ్ళాన్ని సమురాయ్ తన దగ్గర దాచుకున్నాడు) దాంతో టాషికి ఆత్మ పదవ పళ్ళెం కనపడలేదు నాకు శిక్షపడుతుంది అని బిగ్గరగా రోదిస్తూ ఉండేది. కాలక్రమంలో టాషికి ఆత్మ రాత్రి సమయాలలో సమురాయ్ భవనంలోకి వచ్చి పళ్ళాలను లెక్కపెట్టి ఆపై పదవ పళ్ళెం లేకపోవటంతో రోదిస్తుందని అందరికీ అర్ధమయిపోయింది.

సమురాయ్‌కూడా ఎన్నో రాత్రులపాటు పళ్ళాలను లెక్కిస్తూ వికృతంగా రోదిస్తున్న 'టాషికి' ఆత్మను చూసాడు. కొద్దికాలం గడిచేసరికి మహా ధైర్యవంతుడయిన సమురాయ్ కూడా గుండెనిబ్బరం కోల్పోయి 'టాషికి' ఆత్మనుచూసి విపరీతంగా భయపడ్డాడు. ఇంకొంత కాలానికి తాను 'టాషికి'కి చేసిన అన్యాయాన్ని తలచుకుని కుమిలిపోయాడు. ఇక పశ్చాత్తాప భారాన్ని భరించలేక ఆ సమురాయ్ కత్తితో పొడుచుకుని ఆత్మహత్య చేసుకుని చనిపోయాడు. ఆ తరువాత కూడా 'టాషికి' ఆత్మ ఆ భవనంలోకి రావటం రోదించటం కొనసాగింది. ఇక ఆ బాధ భరించలేక సమురాయ్ యొక్క భార్య ఒక తాంత్రికుడిని సంప్రదించి 'టాషికి' ఆత్మబారినుండి తమను రక్షించమని వేడుకున్నది. ఆ తాంత్రికుడు ఇందుకోసం ఒక ఉపాయాన్ని కనుగొన్నాడు. ఆ పథకం ప్రకారం తాంత్రికుడు, 'టాషికి' ఆత్మ వంటగదిలోకి వచ్చే సమయానికి వంటగదిలో ఒకమూల దాక్కున్నాడు. కొన్ని నిమిషాల తరువాత 'టాషికి' ఆత్మ వంటగదిలోకి వచ్చి అక్కడ ఉన్న ప్లేట్లను ఒకటి రెండు మూడు.....తొమ్మిది అంటూ లెక్కిస్తున్నది. 'టాషికి' ఆత్మ తొమ్మిది అనగానే ఒకమూల దాక్కుని ఉన్న తాంత్రికుడు పెద్దగొంతుతో పది అని అరిచాడు. ఆ మాట వినగానే ప్లేట్లు పది ఉన్నాయి అని అర్థంచేసుకున్న 'టాషికి' ఆత్మ శాంతించి అక్కడ నుండి వెళ్ళిపోయింది. ఆ తరువాత మళ్ళీ ఎన్నడూ సమురాయ్ భవనంలో 'టాషికి' ఆత్మ కనపడలేదని చెబుతారు. ఈనాటికీ జపాన్‌లోని హెమేజీ కోటలో ఆనాడు 'టాషికి' దూకి ఆత్మహత్య చేసుకున్న బావి ఉన్నది.


టాషికి ప్రేతాత్మ

**మాన రక్షణకోసం అగ్నికి ఆహుతి అయిపోయిన జపాన్ అమ్మాయిలు :**

1932 డిసెంబర్ 16వ తేదీన టోక్యో పట్టణంలో ఉన్న షిరోకియా డిపార్టమెంట్ స్టోర్‌లో ఒక పెద్ద అగ్ని ప్రమాదం జరిగింది. ఈ ప్రమాదంలో 14 మంది చనిపోయారు. ఈ స్టోర్‌లో అనేకమంది ఆడపిల్లలు సేల్స్‌గాళ్స్‌గా పనిచేస్తూ ఉండే

వాళ్ళు. జపాన్‌లో సాంప్రదాయబద్ధంగా ఉండే స్త్రీలు మరియు అమ్మాయిలు కిమినో అనే వస్త్రాన్ని ధరిస్తారు. మెడనుండి పాదాలవరకు ఉండే ఈ దుస్తు ఈనాటి స్త్రీలు రాత్రిపూట ధరించే నైటీని పోలి ఉంటుంది. అనేక అంతస్తులు ఉన్న ఈ స్టోర్‌లో అగ్ని ప్రమాదం జరుగుతున్న సమయంలో పై అంతస్తులలో ఉన్న విభాగాలలో పనిచేసే సేల్స్‌గాళ్స్ మంటల్లో చిక్కుకున్నారు. కింద ఉన్న అగ్నిమాపక సిబ్బంది (ఫైర్‌ఫైటర్స్) నేలమీద నుంచుని ఒక పెద్ద వలను పైకెత్తి పట్టుకుని పై అంతస్తులలో చిక్కుకుని ఉన్న సేల్స్‌గాళ్స్‌ని పై నుండి ఆ వలలోకి దూకి అగ్నిబారినుండి రక్షణ పొందమని మైకుల్లో చెప్పారు. అయితే ఆ సేల్స్‌గాళ్స్ అందుకు ఇష్టపడలేదు. కారణం సాంప్రదాయ జపాన్ యువతులు కిమినోల అండర్‌వేర్‌లు ధరించరు. తాము ప్రాణరక్షణకోసం పై నుండి కిందకు దూకినపుడు కిమినో పైకి ఎగిరిపోయి తమ "నిగూఢప్రదేశాలు" కింద ఉన్న అందరికీ కనిపిస్తాయని తమ సిగ్గుపోతుందని భయపడి మంటల్లోనే ఉండిపోయారు. తమ మాన రక్షణకోసం ఆ మంటల్లో కాలి బూడిద అయిపోయారు. ఈ వార్త ఆ రోజుల్లో ఐరోపా ఖండంలో ఒక సంచలనాన్ని సృష్టించింది. తరువాత ఆ డిపార్ట్‌మెంట్ స్టోర్ యజమానులు తమ దగ్గర పనిచేసే సేల్స్‌గాళ్స్‌ని కిమినోల క్రింద పాంటీలనుకాని, అండవేర్ లాంటిదిగాని ధరించాలని ఒక నియమం విధించారు.



# 14. కోర్కెలు తీర్చే వుడూ మాంత్రికురాలి సమాధి వివరాలు?

అమెరికాలోని న్యూఆర్లెన్స్ నగరాన్ని ప్రేతాత్మలు సంచరించే నగరంగా పిలుస్తున్నారు. అనేకమందికి ఈ నగరంలో పిశాచాలు కనపడటం, అతీంద్రియశక్తులతో అనుభవాలు కలగటం జరుగుతున్నది. ముఖ్యంగా ఈ నగరాన్ని వుడూ రాజధానిగా పిలుస్తారు. ప్రపంచవ్యాప్తంగా ఉన్న అనేకమంది పారాసైకాలజిస్టులు మరియు ప్రేతాత్మ సంబంధ పరిశోధకులు తమకు అవకాశం ఉన్నపుడల్లా ఈ నగరానికి వస్తూ ఉంటారు. వుడూ తాంత్రికవిద్యలో ఎదురులేని పాండిత్యం ఉన్న మేరీలెవేవూ గతంలో ఈ నగరంలోనే జీవిస్తూ ఉండేది. ఈ నగరంలోని అనేక గృహాలు, వీధులు మరియు శ్మశానాలు ప్రేతాత్మల సంచారానికి నిలయంగా ఉంటాయి. ప్రఖ్యాత అతీంద్రియ

శక్తుల పరిశోధకుడు ఆలిస్టర్ క్రౌలే ఈ నగరానికివచ్చి ఇక్కడ ఎన్నో ప్రేతాత్మలను దర్శించటం జరిగింది. ఈ నగరంలో వుడూ మహారాణి మేరీలవేవూయొక్క సమాధి ఉన్నది.

న్యూఆర్లెన్స్ నగరానికి చెందిన మేరీలవేవూ గతంలో అనే వుడూ తాంత్రికురాలు తన శత్రువుల్ని నాశనం చెయ్యటంకోసం మంత్రించిన వుడూ బొమ్మల్ని ఉపయోగిస్తూ ఉండేది. అనేక సమస్యలతో బాధపడేవారు ఈమె దగ్గరకి వస్తూ ఉండేవాళ్ళు. కోర్టుకేసుల్లో గెలుపురావటంకోసం, విడిపోయిన ప్రేమికుల్ని కలపటంకోసం తన వుడూవిద్యని మేరీ ఉపయోగిస్తూ ఉండేది. ఈమె తరచుగా చిన్న చిన్న బొమ్మల్ని మైనంతో తయారుచేస్తూ వాటిని మంత్రించి శత్రువుల వాకిటి తలుపు వద్ద ఉన్న మెట్లమీద ఉంచేది. ఆ రోజుల్లో న్యూఆర్లెన్స్ నగరంలో ఎవరైనా తమ ఇంటి వాకిట్లో వుడూ బొమ్మని చూసినట్లయితే వారు వెంటనే మేరీ వద్దకు పరుగెత్తుకువెళ్ళి ఆమె సహాయం కోరేవాళ్ళు. అపుడు ఆమె తనవద్దకు వచ్చినవారిని భయపడవద్దనిచెప్పి మీ వాకిట్లో ఉన్న వుడూ బొమ్మల్ని నేను తీసివేస్తాను.



మేరీలవేవూ సమాధి

అందుకు ప్రతిఫలంగా మీరు ఈ నగరంలో ఉన్న గొప్పవాళ్ళ జీవితాల్లో జరిగే రహస్య సంఘటనల గురించి నాకు తెలియజేయాల్సి ఉంటుంది అనేది. ఈవిధంగా వుడూ బొమ్మల్ని ఉపయోగించి కొందర్ని భయభ్రాంతుల్ని చేసి వారిని తన గూఢచారులుగా మార్చుకోవటంలో మేరీ మంచి నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ ఉండేది.

న్యూఆర్లెన్స్ నగరంలో మేరీలవేవూ మరియు ఆమెయొక్క పెంపుడు కూతురు సమాధి చేయబడ్డారు. తిరుగులేని వుడూ మంత్రగత్తెగా పేరుపొందిన మేరీలవేవూ చనిపోయిన తరువాత నిర్మించబడిన ఆమె సమాధిని దర్శించి మేరీ ఆత్మను ప్రార్థించిన వారికి కోరిన కోర్కెలు తీరుతున్నాయని చాలాకాలంగా అమెరికా ప్రజలు విశ్వసిస్తున్నారు. కొంతమంది అభిప్రాయం ప్రకారం కొందరు తాంత్రికులు సమాధిలో నిద్రపోతున్న మేరీలవేవూ ఆత్మను మంత్రాలతో నిద్రలేపి ఆమెద్వారా తమయొక్క తమ ఖాతాదారుని

యొక్క కోర్కెలు తీరేలా జరుగుతున్నది. కొన్నిసార్లు రాత్రి సమయాలలో మేరీలవేవూ ఆత్మ ఆ సమాధి పరిసరాలలో సంచరిస్తున్నట్టుగా వార్తలు వస్తున్నాయి. ఈ ప్రాంతాన్ని సందర్శించటానికి వచ్చే యాత్రికులకు అన్ని విషయాలను వివరించే ఒక గైడు గతంలో జరిగిన ఒక సంఘటనను మీడియాకు ఇలా వివరించాడు.

ఒకసారి నిరుద్యోగం కారణంగా ఒక విద్యాధికుడు దేశదిమ్మరిగామారిపోయి దేశమంతటా తిరుగుతూ న్యూఆర్లెన్స్ నగరంలోని ఉన్న మేరీలవేవూ సమాధివద్దకు వచ్చి ఆ రాత్రికి ఆ సమాధిమీదే పడుకుని నిద్రపోయాడు. అర్ధరాత్రి దాటిన తరువాత అతనికి వుడూ తాంత్రిక ప్రక్రియలు జరిగే సమయంలో వాయించే డ్రమ్స్‌శబ్దం మరియు ఆఫ్రికన్‌భాషలో మంత్రాలు వినిపించటంతో ఉలిక్కిపడి నిద్రలేచి చూచాడు. కళ్ళ ఎదురుగా కనపడిన భయానకమైన దృశ్యంచూసి గడగడా వణకి పోయాడు. అతని చుట్టూతా నగ్నంగా ఉన్న స్త్రీ, పురుషుల ప్రేతాత్మలు వికృతంగా నృత్యాలు చేస్తున్నాయి. తలమీద ఒక పెద్ద త్రాచుపామును తలపాగాలాగాచుట్టి తలపై పెట్టుకున్న ఒక పొడవాటి నగ్నస్త్రీ కూడా కనిపించింది. ఆమె మేరీలలేవూయొక్క ప్రేతాత్మే అని ఆ తరువాత కొంతసేపటికి ఆ యువకుడికి అర్ధమయ్యింది. కొంతమంది అభిప్రాయం ప్రకారం మేరీలవేవూ నిజంగా మరణించలేదని ఆమె తనకు మరణ సమయం ఆసన్నం అయ్యిందని తెలియంగానే ఒక నల్లకాకిరూపం ధరించిందని, ఆమె ఇప్పటికీ రాత్రి సమయాలలో కాకి రూపంలో సమాధులమీద ఎగురుతూ ఉంటుందని తెలుస్తున్నది.

మరికొందమంది అభిప్రాయం ప్రకారం మేరీలవేవూ భౌతికంగా మరణించినప్పటికీ ఆమె ఆత్మ అప్పుడప్పుడూ జంతువుల రూపంలోను, మానవ స్త్రీ రూపంలోను న్యూఆర్లెన్స్ నగరంలోని సెంట్‌ఆన్స్ స్ట్రీట్‌లో సంచరిస్తూ ఉంటుందని తెలుస్తున్నది. మేరీలవేవూ ఏడు ముడులువేసిన తెలుపురంగు కర్చీఫ్‌ని తన మెడలో ధరించేది. ఆ ఏడు ముడుల కర్చీఫ్ మేరీలవేవూ తాంత్రిక సామ్రాజ్యానికి మహారాణి అని తెలియజేస్తుంది. ఇప్పటికీ మేరీలవేవూయొక్క ప్రేతాత్మ సజీవులైన తన శిష్యులతోకలిసి తన పాత ఇంట్లో వుడూ ప్రయోగాలు చేస్తూ ఉంటుందని 1996లో హక్ అనే పరిశోధకుడు వ్రాయటం జరిగింది.

1946 ప్రాంతంలో టాలెంట్ అనే ఒక రచయిత న్యూఆర్లెన్స్‌లో పర్యటించి మేరీలవేవూయొక్క ప్రేతాత్మ నిజంగా ఉన్నదా? లేదా? అన్న విషయం తెలుసుకోవటం కోసం ఆ ప్రాంతంలోని అనేక మందిని కలవటం జరిగింది. అందులో భాగంగా

ఎల్మోర్‌లీబాంక్స్ అనే ఒక ఆఫ్రో అమెరికన్ (నీగ్రో)ని కలుసుకున్నాడు. అపుడానీగ్రో తనకు ఎదురయిన ఒక భీకరమైన అనుభవాన్ని టాలెంట్‌కి తెలియజేసాడు. అప్పటికి కొంతకాలం క్రితం ఎల్మోర్ ఒక మెడికల్ షాపులో సేల్స్‌మాన్‌గా పనిచేస్తూ ఉండేవాడు. ఆ సమయంలో ఒక వృద్ధురాలు ఆ మెడికల్ షాపుకి వచ్చి ఆ షాపు యజమానితో ఏదో విషయంమీద వాదించి అతను తనమాటకు ఎదురు రావటంతో ఆగ్రహించి అతడిని గుడ్లు ఉరిమిచూసింది.


మేరీలవేవూ

ఆమె కళ్ళనుచూసి హడలిపోయిన ఆ షాపు ఓనరు షాపు వెనకభాగంలో ఉన్న గదిలోకి వెళ్ళిపోయి దాక్కున్నాడు. అతను వెళ్ళగానే ఆమె విచిత్రంగా నవ్వి సేల్స్‌మాన్‌గా ఉన్న ఎల్మోర్‌వైపుకి తిరిగి నేను ఎవరో నీకు తెలుసా? అన్నది. ఆమెను అంతవరకు చూసి ఉండని ఎల్మోర్ మీరు ఎవరో నాకు తెలియదు మాడమ్ అన్నాడు వినయంగా. అంతే ఆమె ఆగ్రహించి నేనెవరో తెలియదా? పెద్దగా అరుస్తూ హఠాత్తుగా గాలిలోకిలేచి జుయ్యిమనే శబ్దంతో బాణంలా గాలిలో ఎగురుతూ షాపు తలుపులు తెరుచుకుని బయటకు వచ్చి స్తంభాలమీదుగా వెళుతున్న టెలిఫోను వైర్లమీదనుండి ఎగురుతూ అక్కడకి దగ్గరలో ఉన్న శ్మశానం కాంపౌండ్ గోడమీదగా ఎగురుతూ శ్మశానంలోకి వెళ్ళిపోయింది. ఆమె వెనకాలషాపు నుండి బయటకివచ్చి ఆ దృశ్యం చూసిన ఎల్మోర్ భయంతో మూర్ఛపోయాడు.

ఆతరువాత కొంతసేపటికి ఆ షాపు ఓనరు షాపులోకివచ్చి ఎల్మోరా గొంతులో విస్కీపోశాడు. ఆ ఘాటుకి ఎల్మోర్‌కి స్పృహ వచ్చింది. అతను తన ఓనరుతో ఏదో చెప్పేలోగా ఆ ఓనరు, ఎల్మోర్‌తో ఇలా అన్నాడు. "మన షాపుకి వచ్చింది వుడూ మాంత్రికురాలు మేరీలవేవూ ప్రేతాత్మ అని నాకు ముందే తెలిసి పెరట్లోకి పారిపోయాను. నీకు తెలియదు కనుక నువ్వు దానికి చిక్కిపోయావు".

ప్రపంచవ్యాప్తంగా పేరుపొందిన మేరీలవేవూ జీవితం అనేక ఒడిదొడుకులకు గురి అయ్యింది. ప్రముఖవ్యాపారి అయిన చార్లెస్‌లెవెక్స్‌కి మరియు అతడి నీగ్రో

ఉంపుడుగత్తె అయిన మార్గరేట్‌కి మేరీలవేవూ జన్మించింది. కొంతమంది చరిత్రకారుల అభిప్రాయం ప్రకారం మేరీలవేవూ 1794వ సంవత్సరంలో జన్మించి ఉంటుందని తెలుస్తున్నది. తన 25వ ఏట ఆమె, జాక్‌వెస్‌పారిస్ అనే ఒక వడ్రంగిని పెళ్లి చేసుకున్నది. అయితే వారి వివాహం అయిన కొంతకాలానికే జాక్‌వెస్ అదృశ్యం అయిపోయాడు. అతడు ఎక్కడో అనామకంగా చనిపోయి ఉంటాడని అందరూ భావించారు. ఆ తరువాత ఆమె ఆనాటి సాంప్రదాయాల ప్రకారం పారిస్‌యొక్క విధవ భార్యగా పిలువబడుతూ కొంతకాలం గడిపింది. ఆ తరువాత ఆమె క్లిష్టఫర్ అనే వ్యక్తిని పెండ్లాడి అతనిద్వారా 15 మంది పిల్లల్ని కన్నది.

ఆ తరువాత ఆమె ఆనాటి ప్రముఖ వుడూ మంత్రగాడు అయిన డా॥జాన్ వద్ద వుడూ తాంత్రిక విద్యల్ని క్షుణ్ణంగా నేర్చుకుంది. 1830వ సంవత్సరం వచ్చేసరికి మేరీలవేవూ ఆనాటి న్యూఆర్లెన్స్ లోని ప్రముఖ మంత్రగత్తెలలో ఒకటిగా గుర్తించబడింది. మొదట్లో మేరీలవేవూ తన ఉదర పోషణకోసం న్యూఆర్లెన్స్‌లోని ధనిక స్త్రీలకు వారి ఇళ్ళలోనే శిరోజాలు అలంకరిస్తూ ఉండేది. ఆ సమయంలోనే ఆమె అయా ధనిక స్త్రీల కుటుంబంలోని రహస్యాలు తనకు తెలియజేసే ఏజెంట్లను ఏర్పాటుచేసుకున్నది. న్యూఆర్లెన్స్‌లోని ఏ కుటుంబంలోని రహస్యమైనా మేరీలవేవూకు తెలియకుండా ఉండదు అన్న పుకారు ఆరోజుల్లో షికార్లుచేసింది. ఆ తరువాత ఆమె తన తెలివితేటల్ని మంత్రశక్తిని ఉపయోగించుకుని తనకు ఆపారమైన ప్రచారం వచ్చేలాచేసుకున్నది. ఫలితంగా ఆమెకు అంతులేని సంపద, ఆపారమైన కీర్తి ప్రతిష్టలు వచ్చిపడ్డాయి. మేరీలవేవూ ఎంత వయసు వచ్చినా కుర్రదానిలాగానే కనిపిస్తూ ఉండేది. ఆమెకు ఉన్న తాంత్రిక శక్తివల్లే ఆమె చనిపోయేవరకు అందచందాలతో వెలిగిపోతూ ఉండేది.



# పార్టు-3

## 1. మా పనిమనిషి ఎవరు?

సుమారు 5 సంవత్సరాల క్రితం జరిగిన ఒక విచిత్రకరమైన సంఘటన గురించి మీకు చెబుతాను. ఈ సంఘటన గురించి విన్న తరువాత దయ్యాలు నిజంగా ఉన్నాయి అని మీరు నమ్ముతారు. ఈ సంఘటనతో ప్రత్యక్ష సంబంధం ఉన్న ఒకవ్యక్తి మాటల్లో ఈ సంఘటన వివరాలు విందాం.

5 సంవత్సరాల క్రితం అంటే బహుశా 2006వ సంవత్సరంలో మా ఇంట్లో పనిచెయ్యటానికి ఒక మధ్యవయస్సు అమ్మాయిని చెన్నైలో ఎన్నుకున్నాను. ఆమెను ఎన్నోవిధాలుగా పరీక్షించాను. ఒక మంచి పనిమనిషికి ఉండాల్సిన లక్షణాలన్నీ ఆమెకు ఉండటంతో ఆమెను మా ఇంట్లో పనిచెయ్యటానికి ఎన్నుకున్నాను. అన్నట్టు ఆ అమ్మాయిపేరు ముత్తమ్మ. ముత్తమ్మ చాలా శ్రద్ధగా మా ఇంట్లో పనిచేస్తూ ఉండేది. మా ఇంట్లో ఎవరికి ఏదికావాలో చెప్పాల్సిన అవసరంలేకుండానే అమరుస్తూ ఉండేది. ఆమె తెలివి తేటలకు, చురుకుదనానికి తగిన గుర్తింపు ఆమెకు త్వరలో లభించింది. అంతా బాగానే ఉన్నదికానీ ఒక విషయం మాత్రం విచిత్రంగా ఉండేది ముత్తమ్మ మా ఇంట్లో ఎన్నో రకాల పనులుచేసేది. అంట్ల గిన్నెలు తోమేది. తడిగుడ్డ నేల తుడిచేది. ఇంకా బాల్కనీలో ఉన్న చెట్ల కుండీలలో నీళ్ళుపోసేది. అయితే నీటి సంబంధించి ఇన్ని పనులుచేసినా ముత్తమ్మ ఒంటి మీద పొరపాటునకూడా ఒకచుకనీరు మాకు ఏనాడూ కనపడలేదు. ఆమాటకు వస్తే కనీసం చెమట బిందువులుకూడా ముత్తమ్మ ముఖంమీదకాని, శరీరంమీద కాని మాకు ఏనాడూ కనపడలేదు. అంత శ్రమపడి పనిచేసే ముత్తమ్మకి కనీసం చెమటకూడా పొయ్యకపోవటం మాకు ఆశ్చర్యం కలిగించేది. అంతేకాదు ఎంత కష్టపడ్డాసరే ముత్తమ్మ ముఖంలో అలసట అనేది ఏమాత్రం కనిపించేదికాదు. ఈమె మనిషా? లేక పని యంత్రమా? అని చాలాసార్లు నాకు అనిపిస్తూ ఉండేది.

మా కుటుంబం నివసిస్తున్న బంగళాకి కొంచెం పక్కగా ఉన్న చిన్న పెంకుటింట్లో ముత్తమ్మ నివాసం ఉంటూ ఉండేది. ఒకరోజు రాత్రి ఒకవిచిత్రమైన సంఘటన జరిగింది. ఆరోజున మా కుటుంబ సభ్యులంతా ఎగ్జిబిషన్‌కివెళ్ళి ఇంటికి తిరిగివచ్చాము. నా భార్య తన పిల్లలతో ఎగ్జిబిషన్ వివరాలు చర్చిస్తూ భోజనం చెయ్యటం

ప్రారంభించింది. ఎగ్జిబిషన్‌లో కనిపించినవన్నీ కొనుక్కునితిని మరియు తాగి ఆకలిచచ్చిన నా పిల్లలు ఇంటికి వచ్చిన తరువాత అన్నం తినకుండా డైనింగ్ టేబుల్ ప్రక్కన ఉన్న కుర్చీలలో కూర్చుని వాళ్ళ అమ్మతో ఏవో విషయాలు మాట్లాడుతూ ఉన్నారు. సాయంత్రం వరకు ఏమీ తినకుండా ఆఫీసుపనిమీద ఉన్న నేను నా భార్య, పిల్లలు మాట్లాడుకుంటున్న మాటలను నిశ్శబ్దంగా వింటూ భోజనం చేస్తున్నాను. ముత్తమ్మ ఈరోజు భోజనం బాగా తయారుచేసింది. ముఖ్యంగా చేమదుంపల పులుసు అదరగొట్టింది. అంతేనా ఆ పులుసులోకి నంజుకోటానికి సన్నటి అరటికాయ చిప్స్ అంతకన్నా బాగా చేసింది. సహజంగా భోజన ప్రియుడిని అయిన నేను ఆ రోజుకూడా ముత్తమ్మచేతి భోజనం తింటూ స్వర్గాధిపత్యం వచ్చినంత ఆనందంగా ఫీలవుతూ ఉన్నాను.

ఇంతలో డ్రాయింగ్‌రూంలో ఉన్న లాండ్‌లైన్ ఫోన్ క్రింగ్!క్రింగ్!మని మ్రోగింది. నా భార్యాపిల్లలు నాన్‌స్టాప్‌గా కబుర్లుచెప్పుకుంటూ వాళ్ళలోకంలో వాళ్ళు ఉన్నారు. నేను ఏకాగ్రతగా భోజనంచేస్తూ ఉన్నప్పటికీ డ్రాయింగ్‌రూంలో ఫోన్ మోగటం గమనించకుండా ఉండలేకపోయాను. ఫోన్ లిఫ్ట్‌చెయ్యటంకోసం నేను డైనింగ్ టేబుల్ ముందునుంచి లేవబోయేలోగానే ముత్తమ్మ నన్ను వద్దని చేతులతో వారిస్తూ తనే డ్రాయింగ్‌రూంలో ఉన్న ఫోన్ దగ్గరకు వెళ్ళి రిసీవర్‌ని ఎత్తి చెవుదగ్గరపెట్టుకుని హలో అన్నది. అవతలవైపు నుండి ఎలాంటి సమాధానం లేదు. నేను భోజనం పూర్తిచేసేలోగా దాదాపు నాలుగుసార్లు అలా ఫోన్ రింగ్ అయ్యింది. నా భోజనానికి ఆటంకం కలగకూడదన్న ఉద్దేశ్యంతో ముత్తమ్మ పాపం! నాలుగుసార్లు తానేవెళ్ళి ఫోన్ ఎత్తింది.

విచిత్రంగా అవతలవైపు నుండి ఏ సమాధానము ముత్తమ్మకు వినపడలేదు. నా భోజనం పూర్తికాగానే నేను డ్రాయింగ్ రూంలోకి వచ్చి అక్కడ ఫోన్ దగ్గర నుంచుని ఉన్న ముత్తమ్మతో ఇదిగో! ఇంకోసారి ఫోన్ రింగ్‌అయితే నువ్వు ఎత్తవద్దు. ఈసారి నేను ఎత్తుతాను. ఆ ఫోన్‌చేస్తున్నది ఎవరో తేల్చుకుంటా అన్నా కొంచెం చిరాకుగా. ముత్తమ్మ సరే అన్నట్టుగా తలూపి ఫోన్ దగ్గర నుండి కొంచెం దూరంగా వెళ్ళి నుంచున్నది. నేను ఫోన్ మళ్ళీ ఎప్పుడు మోగుతుందా అని దాదాపు రిసీవర్‌మీద చెయ్యి ఆనించి ఆత్రుతగా ఎదురుచూస్తున్నా. సరిగ్గా 5 నిమిషాల తరువాత మళ్ళీ ఫోన్ రింగ్ అయ్యింది. ధడాల్‌న ఫోన్ రిసీవర్ తీసి చెవిదగ్గరపెట్టుకుని హలో! ఎవరు మాట్లాడేది? అన్నాను గట్టిగా. అవతలవైపు నుండి ఎవరో కుర్రాడు కంగారుగా ఉన్న స్వరంతో మీ "సార్! నీ ప్రక్కన మీ పని అమ్మాయి ఉన్నట్లయితే మీరు ఏమీ మాట్లాడకుండా కేవలము నేను చెప్పిన మాటకి అవును లేదా కాదు అని మాత్రమే చెప్పండి" అన్నాడు.

అతని మాటలు నాకు చాలా విచిత్రంగాను మరియు ఆసక్తికరంగాను అనిపించాయి. "సరే! ఏం చెబుతావోచెప్పు అన్నాను. నాకు కొంచెం దూరంగా చేతులు నడుముమీద పెట్టుకుని ఫోన్‌వైపే ఏకాగ్రతతో చూస్తున్న ముత్తమ్మను ఓరకంటతో పరిశీలిస్తూ ఫోన్‌కి అవతలవైపు నుండి మాట్లాడుతున్న కుర్రాడి మాటలు వింటున్నాను. ఫోన్‌లో కుర్రాడు మేము ఉంటున్న ఇంటి వివరాలు, మా పనిమనిషి రూపురేఖలు బొమ్మ గీసినట్టుగా సవివరంగా నాకు చెప్పాడు. అంతేకాదు మా కుటుంబం చాలా ప్రమాదంలో ఉన్నదనికూడా చెప్పాడు. వెంటనే మీరు మీ కుటుంబాన్ని బయటకి తీసుకుని వచ్చి నక్కలరోడ్డు ప్రాంతంలో తనని కలవమని చెప్పి ఫోన్‌పెట్టేశాడు.

ఎందుకో నాకు ఆ క్షణంలో ముత్తమ్మను చూస్తూ ఉంటే ఏదో తెలియని భయంలాంటి ఫీలింగ్ వళ్ళంతా పాకింది. నేను నా భావాలను పైకి వ్యక్తం చెయ్యకుండా ఏమీ ఎరగని వాడిలాగా కిచెన్‌లోకి వెళ్ళాను. అప్పటికి నాభార్య తృప్తిగా భోజనం ముగించి వాష్‌బేసిన్ దగ్గర చెయ్యికడుక్కుని ఆపై ప్లాస్టిక్ డబ్బాలోంచి కాస్త వక్కపొడి తీసుకుని నోట్లోవేసుకుని అప్పటిదాకా వాగి, వాగి కుర్చీలలో నిద్రపోతున్న పిల్లల్ని భుజాలమీద చేతులువేసి నడిపించుకుంటూ తీసుకువెళ్ళే ప్రయత్నంలో ఉన్నది. ముత్తమ్మ గబగబా కిచెన్‌లోకివచ్చి ఎంగిలి పళ్ళాలు శుభ్రంచేసేపనిలో పడింది. నేను నా భార్యతో రేవతీ! మా అమ్మకి సీరియస్‌గా ఉన్నదిట మనం వెంటనే హాస్పటల్‌కి వెళ్ళాలి. పిల్లల్ని నిద్రలేపు వాళ్ళనికూడా తీసుకువెళదాం అన్నా గొంతులో కొద్దిపాటి ఆదుర్దాను ప్రదర్శిస్తూ. నాభార్య కాస్త కంగారు మనిషి. దాంతో ఆమె "అయ్యో! అత్తయ్యగారికి సీరియస్‌గా ఉన్నదా? మొన్నటిదాకా బాగానే ఉన్నదిగా ఇప్పుడు ఏమయ్యింది? అని ప్రశ్నలవర్షం నామీద కురిపించింది.

అంత టెన్షన్‌లోనూ ఆమె ప్రశ్నలకు నాకు చాలాకోపం వచ్చింది. నాభార్యకి సమయం సందర్భం ఉండదు. ఎప్పుడూ నామీదకాని, పిల్లలమీదకాని వీలున్నప్పుడల్లా నాన్‌స్టాప్‌గా ప్రశ్నలు కురిపిస్తూ ఉంటుంది. విచిత్రం ఏమంటే ఆమె ప్రశ్నలువేస్తుందేకాని వాటికి వచ్చే సమాధానాల్ని పొరపాటునకూడా వినదు. ఆమె తన అలవాటు ప్రకారమే అలాంటి పరిస్థితిలోకూడా ప్రశ్నలు వదిలింది. నేను ఆ సమయంలో ఆవేశపడటం సరైనపనికాదు కనుక కోపాన్ని నిగ్రహించుకుని "పిల్లల్ని వెంటనే రెడీచెయ్యి నేను షెడ్డులోనుండి కారుబయటకు తీస్తాను" అన్నాను. నా ముఖంలో కనిపిస్తున్న చిరాకును గమనించిన నాభార్య ఆపై నోరెత్తకుండా అప్పటికే గురకపెట్టి నిద్రపోతున్న నా కొడుకుని ఒక జెల్లకాయకొట్టింది. వాడు ఉలిక్కిపడి నిద్రలేచాడు. చడీచప్పుడులేకుండా నిద్రపోతున్న నాకూతుర్ని ఒక ఊపు ఊపింది. అది వెంటనే కళ్ళు తెరచి గుడ్లుమిటకరించి వాళ్ళఅమ్మవైపు చూడటం ప్రారంభించింది. నా భార్య వెంటనే

వాళ్ళిద్దరిని బయటకు తీసుకువెళ్ళటానికి సిద్ధంచేసే ప్రయత్నంలో పడింది. నేను గబగబా సేఫ్టీలాకర్‌లోంచి ఒక వెయ్యిరూపాయల నోట్లకట్టను బయటకుతీసి పాంటు జేబులో పెట్టుకుని ఆపై డ్రస్సింగ్ టేబుల్‌మీద ఉన్న కారు తాళాలు తీసుకుని కారు షెడ్డువైపు నడిచాను. అప్పటివరకూ మౌనంగా నించున్న ముత్తమ్మ గబగబా కారు స్టార్ట్‌చెయ్యబోతున్న నా దగ్గరకు వచ్చి "అయ్యగారూ! నేనుకూడా మీవెంట వస్తాను. నేను ఒక్కదాన్నే ఇంట్లో ఉండలేను" అన్నది భయంతోకూడిన స్వరంతో. నేను కొంచెం కఠినమైన స్వరంతో "ముత్తమ్మా! నువ్వుకూడా వచ్చేస్తే ఇంట్లో దొంగలు పడతారు. ముందు మేమువెళ్ళి మా అమ్మనుచూసివస్తాము. అంతగా కావాలంటే రేపొద్దున్న నువ్వు కూడా వద్దువుగాని అన్నాను" ఆమెతో. ఆమె ఇకచేసేదిలేక మౌనం వహించింది. నేను నా భార్యా పిల్లల్ని కారులో ఎక్కించుకుని కారుని మా ఇంటి కాంపౌండ్‌దాటించి రోడ్డుమీదకి తీసుకువచ్చాను.

సరిగ్గా 10 నిమిషాలలో మా కారు సూర్యారావుపేటలో ఉన్న మా అత్తగారింటికి చేరింది. నా భార్యాపిల్లల్ని మా అత్తగారింట్లో వదిలేసి నేనుమాత్రం మళ్ళీకారులో మిమ్మల్ని కలుస్తాను అని చెప్పిన ఆ కుర్రాడు నాకోసం వేచిఉండే నక్కలరోడ్డు ప్రాంతానికి వెళ్ళాను. అప్పుడు సమయం రాత్రి 12.15నిమిషాలు అవుతుంది అని నా చేతికి ఉన్న రిస్ట్‌వాచి చెప్పింది. నేను నా కారుని నక్కలరోడ్డు సెంటర్‌లో ఆపి కారుదిగి సిగరెట్ కాలుస్తూ కారుకి ఆనుకుని నిలబడి చుట్టూ చూస్తున్నాను. అప్పుడప్పుడూ అటువైపు కొన్ని వాహనాలు జుయ్‌మని శబ్దంచేస్తూ వెళుతున్నాయి. నా చేతిలో సిగరెట్టు పూర్తిగా కాలి చేతిని చురుక్కుమనిపించటంతో సిగరెట్టు పీకను దూరంగా విసిరేసాను. సరిగ్గా అదే సమయంలో నా ప్రక్కన ఒక మోటార్‌బైక్ ఆగింది. దానిమీదనుండి దాదాపు ముప్పై సంవత్సరాల వయస్సు ఉన్న ఒక యువకుడు కిందకుదిగి నా దగ్గరకు వచ్చాడు. నన్ను పలకరించాడు.

అతడినిచూసి తల ఊపుతూ "మిస్టర్ నా ఫోన్ నెంబర్ నీకు ఎలా తెలుసు? మా కుటుంబానికి ఏదో ప్రమాదం ఉంటుంది అంటున్నావ్? పైగా మా పనిమనిషికి తెలియకుండా మమ్మల్ని బయటకు వచ్చెయ్య మన్నావు ఏమిటి ఇదంతా? అన్నాను కొంచెం కరకుగా. ఆ అర్ధరాత్రి సమయంలో నా గొంతు నాకే విచిత్రంగా అనిపించింది. ఆ యువకుడు చిన్నగా తల అడ్డంగా ఊపుతూ "సారీ సార్! మీకు ఇబ్బంది కలిగించటం నాకు బాధగానే ఉన్నది. కానీ నాకు కలిగిన సమస్య మీకు కూడా కలగ కూడదని భావించటం వల్లే మిమ్మల్ని ఇంత అర్ధరాత్రి పూట ఇంట్లో నుండి బయటకు రప్పించాను" అన్నాడు. అతని మాటలు నాకు ఏదో తెలియని ఉత్కంఠను కలిగించాయి. ఇంతకీ నువ్వు ఏం చెప్పాలనుకుంటున్నావు? అన్నాను ఆ యువకుడితో. ఆ యువకుడు తన

షర్ట్ జేబులోనుండి సిగరెట్ పాకెట్‌తీసి ఒక సిగరెట్ నాకుఇచ్చి ఇంకొకటి తను పెదవులమధ్య పెట్టుకుని అంటించుకుని గట్టిగా పొగపీల్చాడు. అతను ఇచ్చిన సిగరెట్‌ని తిరస్కరించకుండా నేనుకూడా సిగరెట్ అందుకుని కాల్చుకుంటూ అతను చెప్పేది వినటానికి సిద్ధం అయిపోయాను. అతను చెప్పటం ప్రారంభించాడు.

సార్! మాకు 5 సంవత్సరాల కొడుకుని ఉన్నాడు. ఇప్పుడు మీ ఇంట్లో పని చేస్తున్న ముత్తమ్మ కొద్ది నెలల క్రితం మా ఇంట్లో పనిచేస్తూ ఉండేది. ఆమె నా కొడుకు అంటే ఎంతో ఇష్టపడేది. నా కొడుకుని ఎప్పుడూ ముద్దుచేస్తూ కనపడేది. అయితే కొద్ది రోజుల తరువాత నాకొడుకి చేతివేళ్ళు క్రమంగా సన్నగా మరియు చిన్నవిగా మారిపోవటం మొదలయ్యింది. నాకు, నా భార్యకు ఎంతో భయం వేసింది. 5 సంవత్సరాల నా కొడుకిని దాదాపు విజయవాడలో ఉన్న అందరు డాక్టర్ల దగ్గరకు తీసుకువెళ్ళి చూపించాము. వాళ్ళు అందరూ చెప్పినమాట ఒకటే. నా కొడుకు చేతివేళ్ళలో ఉంటున్న రక్తం అనూహ్యాం అదృశ్యం అవుతున్నది. అది ఎలా సాధ్యమో? నాకు అర్థంకాలేదు. నా కొడుకు రోజు రోజుకీ క్షీణించి పోతున్నాడు. ఒక రోజు మధ్యాహ్నంపూట పక్షవాతంతో మంచంలో పడ్డ మా నాన్న నన్ను దగ్గరగా పిలిచి చాలా సన్నని స్వరంతో నాతో "ఉరేయ్‌బాబూ! మన ఇంట్లో పని చేస్తున్నదే ఆ అమ్మాయి మనిషికాదురా అది దయ్యంపిల్ల. అదీ నీ కొడుకు చేతి వేళ్ళను ప్రతి రోజూ అర్థరాత్రిపూట 2 గంటలకు నోట్లోపెట్టుకుని చీకుతున్నది. ఆ సమయంలో దానిమూతి అంచులనుండి నెత్తురు కారుతున్నది అది నీ కొడుకు నెత్తురు తాగేస్తున్నదిరా. దాన్ని వెంటనే బయటకు పంపించరా!" అన్నాడు. మా నాన్న పక్షవాత రోగేకానీ, పిచ్చివాడుకాదు. అలాంటివాడు పనిమనిషి గురించి అలా చెప్పటం నాకు ఆశ్చర్యం కలిగించింది. ఏది ఏమైనా ఈ విషయంలోని నిజా నిజాలు నేనే స్వయంగా తెలుసుకోవాలని నిర్ణయించుకున్నాను.

ఆ రోజురాత్రి యధావిధంగా హాలులో సోఫాలో పడుకుని పని అమ్మాయి నిద్రపోతున్నది. నేనుమాత్రం నిద్ర నటిస్తూ నా భార్యప్రక్కనే బెడ్‌రూంలో పడుకుని ఉన్నాను. గోడ గడియారం సరిగ్గా అర్థరాత్రి దాటిన తరువాత రెండు గంటలు కొట్టింది. నేను ఏమాత్రం శబ్దం చెయ్యకుండా బెడ్‌దిగి ఇవతలకువచ్చి బెడ్‌రూం కిటికీలోంచి హాలులోకి చూసాను. అప్పుడే ముత్తమ్మ నిద్రలేచింది. ఒక్కసారి చుట్టూచూసి సోఫానుండి లేచి హాల్‌కి అటువైపుగా ఉన్న నా కొడుకు ఉన్న బెడ్‌రూంలోకి మెల్లిగా ప్రవేశించింది. నేను ఏమాత్రం శబ్దం రాకుండా నా బెడ్‌రూం తలుపులుతీసి పిల్లిలా అడుగులువేస్తూ బయటకు వచ్చి నా కొడుకు బెడ్‌రూం దగ్గరకువెళ్ళి బయట నుంచుని కిటికీలోంచి బెడ్‌రూంలోకి తొంగిచూసాను. అక్కడ కనపడ్డ దృశ్యం చూసిన

నాకు గుండె భయాందోళనలతో గడ్డకట్టుకుపోయింది. ఏమిటా దృశ్యం! నా కొడుకు నిద్రలేచి చిరునవ్వులు నవ్వుతూ ముత్తమ్మకేసి చూస్తున్నాను. ముత్తమ్మ నా కొడుకు ప్రక్కనే కూర్చుని వాడి కుడిచెయ్యి వేళ్ళని తననోట్లో ఉంచుకుని చప్పరిస్తున్నది. బహుశా ఆమె నా కొడుకు రక్తం తాగుతున్నది అని నాకు అనిపించింది. అలా రక్తం చప్పరిస్తున్న ఆమె నోటి అంచులనుండి నెత్తురు కారుతున్నది. నేను ఆ క్షణంలో ఏమీ చెయ్యలేక పోయాను. ఆ తరువాత చడీచప్పుడు చెయ్యకుండా దడదడలాడుతున్న గుండెలతో నా బెడ్‌రూంలోకి వెళ్ళిపోయాను. ఆ మర్నాడు ఉదయమే ముత్తమ్మకి రెండు నెలల జీతం చేతిలోపెట్టి వెంటనే పనిమానేసి వెళ్ళి పొమ్మన్నాను. ముత్తమ్మ అమాయకంగా ముఖంపెట్టి "బాబుగారూ! నావల్ల ఏమైనా పొరపాటు జరిగిందా?" అన్నది. గద్గదమైన స్వరంతో. నేను ఏమీ వాదించకుండా "మా పనిమేమే చేసుకుంటాం ఇక నువ్వు వెళ్ళిరా" అన్నాను ముత్తమ్మతో. ఆమె తన పాతకాలంనాటి చిన్న ట్రంకుపెట్టెను చేతిలోకి తీసుకుని నావైపు విచిత్రంగా చూస్తూ మా ఇంట్లోనుండి వెళ్ళిపోయింది.

అతను ముత్తమ్మ గురించి చెప్పింది విన్న నాకు వొళ్ళు జలదరించింది. మిస్టర్! "మీరు ఎవరో నాకు తెలియదు. కానీ నాకు ముత్తమ్మ గురించి తెలియజేసి నేను జాగ్రత్త పడేటట్లుగా చేస్తున్నారు. థాంక్స్!" అన్నాను. అతను చిన్నగా నవ్వుతూ మొన్న మధ్యాహ్నం రోడ్డుమీద ఉన్న కిరాణాకొట్లో కందిపప్పు కొనుక్కుని మీ ఇంట్లోకి వెళుతున్న ముత్తమ్మను చూసాను. ఆ తరువాత మీ ఇంటి నెంబరు మరియు మీ కాంపౌండ్‌వాల్ గేటుమీద ఉన్న మీ పేరునుబట్టి టెలిఫోన్ డైరెక్టరీలో మీ ఫోన్ నెంబర్ కనుక్కుని మీకు ఫోన్‌చేసాను అన్నాను అన్నాడు. ముత్తమ్మ మా ఇంట్లోనే ఉన్నదని అతనికి ఎలా తెలిసింది? నా ఫోన్ నెంబర్ అతనికి ఎలా తెలిసింది? అన్న నా మనసులోని ప్రశ్నలకు అప్రయత్నంగానే అతడిద్వారా సమాధానం దొరికింది. నేను ఇంకొకసారి అతనికి థాంక్స్‌చెప్పి కారుస్టార్ట్‌చేసి సూర్యారావుపేటవైపు నడిపాను. అతను తన బైక్‌మీద ఎటో వెళ్ళిపోయాడు. ఆ రాత్రి మా మామగారి ఇంట్లోనే పడుకుని ఉదయం మా మామగారి సలహా మీద విజయవాడ కొత్తపేట ప్రాంతంలో ఉన్న పంజా సెంటర్‌కి నా భార్యతో సహా కారులో వెళ్ళాను. అక్కడ దాదాపు 50 మంది దాకా ముస్లిం మంత్రగాళ్ళు చిన్న చిన్న కొట్లు పెట్టుకుని కూర్చుని ఉన్నారు. వాళ్ళ దుకాణాల్లో అనేక రకాల తాపీదులు గోడకి కొట్టిన మేకులకు వేలాడుతున్నాయి. ఆ దుకాణంలో ముస్లిం మతంలో భూతాలుగా చెప్పబడే జిన్నులు, సైతానులు లాంటి క్షుద్రశక్తుల బొమ్మలు కనపడుతున్నాయి. బెజవాడ పంజా ప్రాంతంలో ఉన్న ముస్లిం మంత్రగాళ్ళు అనేక రకాల దయ్యాలను తరిమివెయ్యటంలో పేరుపొందారు. వాళ్ళలో బాగా వృద్ధుడిలాగా కనిపిస్తున్న ఒక మంత్రగాడి వద్దకు వెళ్ళాము. మేము ఏమీ

చెప్పకుండానే ఆ ముస్లిం మంత్రగాడు గరగరలాడుతున్న స్వరంతో "యా అల్లా! హారే మీది ఇంట్లో రక్త దాహంతో అలమటించిపోతున్న ఆడషైతాన్ తిస్టవేసింది. దానిని మీ ఇంట్లో నుంచి తరివెయ్యటంకోసం మాది దగ్గరకు వచ్చారు అవునా!" అన్నాడు.

నేను నా భార్య ఆ వృద్ధ మంత్రగాడి మాటలువిని ఉలిక్కిపడ్డాము. అప్పటివరకు మానవాతీత శక్తులు నిజంగా ఉంటాయని పూర్తిగా నమ్మని మాకు ఆ క్షణంతో వాటిపై పూర్తి నమ్మకం ఏర్పడింది. నా భార్య గజగజావణుకుతూ చేతులు జోడించి ఆ వృద్ధ మాంత్రికుడికి దణ్ణంపెడుతూ "ఎలాగైనా మమ్మల్ని కాపాడండి" అన్నది. అరే, అరే పరేషాన్‌కాకు బేఠీ. పైన అల్లా ఉన్నాడు భయపడకు. ఆ షైతాన్‌ని బెజవాడనుండి బెల్గాందాకా తరుముతాను అన్నాడు చిరునవ్వు నవ్వుతూ. నేను మౌనంగా ఆ వృద్ధమాంత్రికుడి మాటలూ వింటూ ఉండిపోయాను. ఆ తరువాత ఆ ముస్లిం మంత్రగాడు కారులో మాతోపాటుగా అయోధ్యనగర్‌లో ఉన్న మా ఇంటికి వచ్చాడు. మేము ఇంటికి వెళ్ళేసరికి ముత్తమ్మ హాలులోకూర్చుని టి.వి. చూస్తున్నది.

మమ్మల్నిచూసి చిరునవ్వు నవ్విన ముత్తమ్మ మా వెనకాలే లోపలికి వచ్చిన ముస్లిం వృద్ధ మంత్రగాడినిచూసి ముఖం చిట్లించింది. ఆ వృద్ధ మంత్రగాడు ముత్తమ్మ వైపు చూసి హి! హి! హి! అని బిగ్గరగా నవ్వాడు. అదిచూసిన ముత్తమ్మ కంగారుగా వంట గదిలోకి వెళ్ళిపోయింది. ఆ తరువాత ఆ మంత్రగాడు గబగబా వంటగదివైపుకి వెళ్ళి వంటగది తలుపులు బయటనుంచి గొళ్ళెంపెట్టాడు. అది గమనించిన ముత్తమ్మ శరవేగంతో వంటగది లోపలవైపు ఉన్న కిటికీవద్దకువచ్చి "ఏయ్ ముసలోడా! తలుపు తియ్యరా! తలుపు గడియ ఎందుకువేశావురా! అని వికృతంగా అరిచింది. అప్పటి వరకు ముత్తమ్మకు అంతపెద్ద కంఠస్వరం ఉందని, అంత వికృతంగా ఆమె అరవగలదని తెలియనిమాకు విపరీతమైన ఆశ్చర్యం కలిగింది".

ఆ వృద్ధ ముస్లిం మంత్రగాడు ఒక తావీదును కిటికీలోంచి బయటకు చూస్తున్న ముత్తమ్మకు చూపించి మాకు అర్థంకాని ఉర్దూ భాషలో ఏవేవో మంత్రాలు చదువుతూ తావీజును వంటగది గొళ్ళానికి బిగించి వేగంగా హాలులోకి వచ్చాడు. ఆ తరువాత ముత్తమ్మ నివాసం ఉండే పెంకుటింట్లోకి మమ్మల్ని తీసుకుని వచ్చాడు. ఆ పెంకుటింట్లో ఒక మూలగా ఒక పాత ట్రంకుపెట్టె కనిపించింది. ఆ ముస్లిం మంత్రగాడు ఏదో మంత్రం చదువుతూ ఆ పెట్టెను తెరిచాడు. ఆ పెట్టెలో ఒక నల్లటి అట్ట ఉన్న పుస్తకం ఉన్నది. ఆ పుస్తకంలో ఏవేవో త్రిభుజాలు మరియు వాటి మధ్యలో ఏవో విచిత్రమైన గుర్తులు చిత్రించబడి ఉన్నాయి. ఇంకొక విచిత్రమైన విషయం ఏమంటే ఆ పుస్తకంలోనే ముత్తమ్మ ప్రతి రోజూ రాత్రి ఏ ఆహారం తీసుకోవాలో వ్రాసి ఉన్నది. వారానికి ఉండే ఏడు రోజులలో ఏడు రకాల ఆహారాలు ఆమె తీసుకోవాలట. అందులో ఉన్న

సూచనల ప్రకారం ఆదివారం, మంగళవారం, శుక్రవారం అర్ధరాత్రులలో ఆమె మానవ రక్తం తాగాలట. సోమవారం, గురువారం, శనివారం నాడు ఒక్కోరాత్రికి 36 కోడిగుడ్లు పచ్చివి తాగాలట. ఇక బుధవారంనాడు రాత్రిమాత్రం పంది గుండెను తినాలట. అంటే ఇన్నాళ్ళూ ముత్తమ్మ ఇలాంటి వికృతమైన ఆహారాన్ని తింటూ పైకి అమాయకురాలుగా నటిస్తూ మా ఇంట్లో ఉంటున్నది అన్నమాట.

నాకు, నాభార్యకు విపరీతమైన భయం వేసింది. మమ్మల్నే గమనిస్తున్న ఆ ముస్లిం వృద్ధ మాంత్రికుడు "దర్నామత్! భయపడకండి. నేను చూసుకుంటాను. ఆ షైతాన్‌నుండి ఇక్కడనుండి తరిమివేస్తాను" అన్నాడు. ఆ తరువాత ఆ వృద్ధ మంత్రగాడు తన భుజంనుండి వేలాడుతున్న నల్ల గుడ్డసంచీనుండి కొన్ని నిమ్మకాయలు, గవ్వలు మరియు యేవేవో రంగు పూసలు బయటకుతీసి వాటిని నేలమీద ఉంచి వాటిముందు పద్మాసనం వేసుకుని కూర్చుని సంచీలోంచి ఒక డబ్బీని బయటకుతీసి దాంట్లోనుంచి కొంచెం సాంబ్రాణి పొడిని తీసుకుని నేలపైవేశాడు. విచిత్రంగా నిప్పులేకుండానే ఆ సాంబ్రాణి అంటుకుని పొగలు వెలువరించటం ఆరంభించింది. కొద్దిసేపటిలోనే ఘాటైన సాంబ్రాణిపొగ ఆ గదిలో వ్యాపించింది. ఆ తరువాత ఆ వృద్ధ మంత్రగాడు మమ్మల్ని ఇద్దరిని ఆ ఇంట్లో నుండి బయటకువెళ్ళి నుంచోమని ఏవో ఉర్దూ మంత్రాలు మంద్ర స్వరంతో ఉచ్చరించాడు. మాలో ఏదో తెలియని భయం ఆవరించింది. అప్పుడు సమయం మధ్యాహ్నం నాలుగు కావొస్తుంది. మేము పొద్దుటినుండి ఏమీ తినకపోవటంవల్ల నీరసంగా అనిపించింది. ఆ తరువాత కొద్దిసేపటికి ఆ మంత్రగాడు నిమ్మకాయల్ని చేతిలో పట్టుకుని వేగంగా నడుస్తూ మావైపు వచ్చాడు. మా చేతుల్లో ఒక్కొక్క నిమ్మకాయ ఉంచి, రెండు నిమ్మకాయలు తన చేతితో పట్టుకుని మమ్మల్ని తనతోపాటు రమ్మనిచెప్పి తను వేగంగా నడుస్తూ మా ఇంట్లోని వంటగదివైపు వెళ్ళాడు. పొద్దుటినుండి వంటగదిలో బంధించబడ్డ ముత్తమ్మ భయంకరంగా అరుస్తూ అందులోనుంచి బయటపడటానికి వంటగది కిటికీని పీకటానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నది. ఆ వృద్ధ మంత్రగాడు తలుపుబయట గొళ్ళానికి కట్టిన తావీజువల్ల ముత్తమ్మ ఆ గదిలోంచి బయటకు రాలేక సతమతమవుతున్నది.

ఆ వృద్ధ మంత్రగాడు వంటగది తలుపు గొళ్ళానికి కట్టిన తావీదును తీసివేసి ఆపై వంటగది తలుపులు తెరిచాడు. అందుకోసం ఎదురుచూస్తున్న ముత్తమ్మ సుడిగాలిలాగా బయటకు దూకింది. ఆమె బయటకు వచ్చిన సమయంలో దాదాపు 100 కిలోమీటర్ల వేగంతో సుడిగాలి వీచినట్టుగా మాకు అనిపించింది. వృద్ధ మంత్రగాడు, మేము ఆ గాలి వేగానికి హాలులో తలోమూల పడిపోయాం. ఆ తరువాత ముత్తమ్మ మాకు కనపడలేదు. ఆ రోజు సాయంత్రం ఆ వృద్ధ మంత్రగాడు

మా ఇంటి చుట్టూ మంత్రించిన పూసలు చల్లి, ఆపై ఇంట్లోకివచ్చి డ్రాయింగ్‌రూంలో ఉన్న కుర్చీలో కూర్చుని నాతో ఇలా చెప్పటం ప్రారంభించాడు. "మీ ఇంట్లో ఉన్న అమ్మాయి వయస్సు షుమారు మూడు వందల సంవత్సరాలు ఉంటుంది. ఆమె క్షుద్రశక్తుల్ని ఆరాధిస్తున్నది. ఆ కారణంగానే ఆమెకు ఎంత వయస్సు వచ్చినా 30 సంవత్సరాలు అమ్మాయిలాగా కనిపిస్తున్నది. ఆమె పగలంతా ఏవిధమైన ఆహారం తీసుకోకుండా ఉండి కేవలం రాత్రి సమయాలలో ఒక్కో రాత్రి ఒక్కో రకమైన మాంస సంబంధమైన ఆహారం తీసుకుంటూ ఆపై క్షుద్ర పూజలు చేస్తున్నది. మీరు ముందుగానే ఆమెను అనుమానించి నన్ను తీసుకు రాబట్టి సరిపోయిందికాని లేకుంటే ఇవాళో రేపో ఆమె మీ ఇంట్లో అందర్ని చంపి రక్తం తాగిఉండేది. ఇందుకు సందేహం ఎంతమాత్రంలేదు. ఆ వృద్ధ మాంత్రికుడు మాటల్లో ఉండగానే సూర్యారావుపేటనుండి మా మామగారు మా పిల్లల్ని తీసుకుని మా ఇంట్లోకి ప్రవేశించాడు. ఇంతలో నా భార్య మాకు టీ తెచ్చిఇచ్చింది. ఆ తరువాత కొద్దిసేపటి ఆ వృద్ధ మాంత్రికుడు మేము ఇచ్చిన సొమ్మును తీసుకుని జాగ్రత్తగా తన లాల్చిజేబులో వేసుకుని తన ప్రక్కనే కిందపడిఉన్న నల్లసంచీని భుజాన తగిలించుకుని మా అందరికీ శుభం కలగాలని ఆశిస్తూ మా ఇంట్లో నుండి రోడ్డుమీదకు నడిచాడు. ఆ రోజు రాత్రి మాకు ఫోన్‌చేసి మమ్మల్ని హెచ్చరించిన ఆ యువకుడి కారణంగానే మేము ముత్తమ్మ వల్ల రాబోయే ప్రమాదాన్ని ముందుగానే గ్రహించి జాగ్రత్త పడ్డాము. ఈ ప్రపంచంలో మానవాతీత శక్తులకు సంబంధించిన సంఘటనలు ప్రతి నిత్యం ఎక్కడో అక్కడ జరుగుతూనే ఉంటాయి. అయితే మన అనుభవంలోకి వస్తేకాని ఏదీ నమ్మకపోవటం నాగరికులమని చెప్పుకునే మనకు అలవాటు కాదంటారా!.



## ౨. టీనేజ్ లవర్స్?

ఫ్రాన్స్‌దేశంలో దాదాపు 100 సంవత్సరాల క్రితం జరిగిన యదార్థ సంఘటన గురించి క్లుప్తంగా తెలియజేస్తాను. ఫ్రాన్స్‌దేశంలోని ఒక రాష్ట్రంలోని ఒక పట్టణంలో ఉన్న ఒక విశాలమైన ప్రదేశంలో ఆరు భవనాలు ఉన్నాయి. ఆ భవనాలలో నాలుగు భవనాలు వందేళ్ళక్రితం నిర్మించబడ్డాయి. ఈ భవనాలు ఉన్న క్యాంపస్‌లో ఒక చర్చికూడా ఉన్నది. ఆ క్యాంపస్‌లో ఆడపిల్లలకి మరియు మగపిల్లలకి వేరువేరుగా స్కూల్స్ నడపబడుతున్నాయి. ఒకప్పుడు ఆ స్కూళ్ళని క్రైస్తవ మిషనరీలు నడుపుతున్న

కాలంలో ఆ చర్చిలో ప్రార్థనలు జరుగుతూ ఉండేవి. ఇప్పుడు ఆ చర్చి, ఫ్రెంచ్ భాషనునేర్పే విద్యాసంస్థకోసం కేటాయించబడింది. ఆ భవనాన్ని టీనేజ్‌లో ఉండే ఒక అబ్బాయి మరియు అమ్మాయి మరియు మధ్యవయస్సు దాటిన ఒక క్రైస్తవ సన్యాసిని (నన్)యొక్క ఆత్మలు ఆవరించి ఉంటాయని, అర్ధరాత్రి సమయాలలో ఆ ముగురి ఆత్మలు ఆ భవనంలో సంచరిస్తూ ఉంటాయని ఆ ప్రాంతంలోని ప్రజలు చెప్పుకుంటూ ఉంటారు. ఉదయం 10 నుండి సాయంత్రం 5 గంటల వరకు ఆ భవనంలో ఫ్రెంచ్ భాషా శిక్షణా తరగతులు జరుగుతాయి. ఆ సమయంలో వందలాదిమంది ఆడ, మగ పిల్లలు ఆ క్లాసులకు హాజరు అవుతారు. సాయంత్రం ఆరు దాటితే ఆ భవనంలోనేకాదు ఆ భవన పరిసరాలలో కూడా మనిషి అనేవాడు ఎట్టిపరిస్థితిలోను కనపడడు. ఆ భవనంలో దయ్యాలు ఎలా చేరాయి? అన్న విషయం గురించి తెలియజేసే ఒక విచిత్రమైన వృత్తాంతం గురించి తెలుసుకుందాం.

దాదాపు వందసంవత్సరాల క్రితం ఆ భవనంలో ఒక చర్చి ఉండేది. ఆ చర్చికి పరిసరాలలో ఉండే భవనాలలో ఆడపిల్లలకి, మగపిల్లలకి వేరువేరు స్కూళ్ళు నడుస్తూ ఉండేవి. ఆ స్కూళ్ళలో పనిచేసే నన్స్ (క్రైస్తవ సన్యాసినులు) కఠినమైన నియమాలను విద్యార్థుల విషయంలో పాటించటం జరిగేది. పొరపాటునకూడా ఆ స్కూళ్ళలో చదివే ఆడపిల్లలు మరియు మగపిల్లలు ఆ స్కూళ్ళ క్యాంపస్‌లో పరస్పరం మాట్లాడుకోవటం సంపూర్తిగా నిషేధించబడింది. అలాంటి సమయంలో అలీస్ అనే ఒక 13 సంవత్సరాల టీనేజ్ అమ్మాయి, 14 సంవత్సరాల వయస్సు ఉన్న హెన్రీ అనే పేరుగల ఒక కుర్రాడిని గాఢంగా ప్రేమించింది. వాళ్ళిద్దరూ వీలు దొరికినప్పుల్లా రహస్యంగా కలుసుకుంటూ, గాఢంగా కౌగిలించుకుని నాలుగు పెదవులు కలిపి గాఢంగా ముద్దులు పెట్టుకుంటూ ఉండేవాళ్ళు. వీళ్ళ ప్రేమ వ్యవహారం స్కూల్లోని చాలామంది ఇతర పిల్లలకు తెలిసిపోయింది. ఇది ఇలా ఉండగా ఒకరోజు అర్ధరాత్రి ఆడపిల్లల హాస్టల్ కారిడార్‌లో ఏదో కుర్రాడి గొంతు వినపడటంతో ఆ హాస్టల్‌కి వార్డెన్‌గా ఉన్న సిస్టర్ జేన్ వెలుగుతున్న కొవ్వొత్తి ఉన్న ఇనుప హోల్డర్‌ని చేత్తో పట్టుకుని కారిడార్‌లోకి వచ్చింది.

స్వభావ రీత్యా సిస్టర్‌జేన్ విపరీతమైన కోపిష్టి తనాన్ని కలిగి ఉండేది. తన ఆధీనంలో ఉన్న ఆడపిల్లల హాస్టల్లోకి వచ్చిన కుర్రాడు ఎవరా? అన్న ఆగ్రహంతో కారిడార్‌లోకి వచ్చిన సిస్టర్‌జేన్‌కి కొవ్వొత్తి వెలుగులో ఒక మూలగా పరస్పరం ముద్దులుపెట్టుకుంటున్న ఒక టీనేజర్స్ జంట కనిపించింది. అది చూసిన ఆమె కోపం హద్దులు దాటింది. ఆమె వెంటనే అటువైపు వేగంగా నడిచి చుంబనంలో ఉన్న హెన్రీ తలమీద తన చేతిలో ఉన్న కొవ్వొత్తి హోల్డర్‌తో బలంగా కొట్టింది. ఆ

దెబ్బకి 14 సంవత్సరాల కుర్రాడు అయిన హెన్రీతల రెండుగా విచ్చిపోయి మెదడు బయటపడింది. ఆ దెబ్బకి సెకండ్లలో హెన్రీ ప్రాణాలు కోల్పోయాడు. ఆ దృశ్యం చూసి పెద్దగా అరుస్తూ గజగజా వణికిపోతున్న అలీస్‌ని చూసి మరింత ఆగ్రహంతో రెచ్చిపోయిన సిస్టర్‌జేన్ తనచేతిలో వెలుగుతున్న కొవ్వొత్తిని అలీస్ జుట్టుకి అటించింది. సెకన్ల వ్యవధిలో అలీస్‌యొక్క పొడవైన తలవెంట్రుకలు తగలపడిపోయాయి. ఈ లోగా ఆమె ఒంటిపై ఉన్న దుస్తులుకూడా అంటుకుని భగభగ మండటం ప్రారంభించాయి. అలీస్ మంటల్లో తగలబడుతూ భయంతో కారిడార్‌లో అటుఇటూ పరుగెత్తింది.

రెండు నిండు ప్రాణాల్ని హింసాత్మకంగా, నిర్ధాక్షణ్యంగా బలితీసుకున్న సిస్టర్‌జేన్ అందుకు ఏమాత్రం చలించకుండా అక్కడ నుండి బయటకు వెళ్ళి కారిడార్ బయట నుంచున్నది. కొద్దిసేపటిలో పూర్తిగా తగలపడిపోయిన అలీస్ హాస్టల్‌నుండి క్యాంపస్‌లోకి వచ్చి నేలమీద కూలిపోయింది. అలీస్ దారుణమైన నరకం అనుభవిస్తూ మరణించింది. సిస్టర్‌జేన్ ఆ తరువాత తాపీగా చర్చిలోకివెళ్ళి మోకాళ్ళపై కూర్చుండి "ప్రభువా! నావల్ల ఏదైనా పొరపాటు జరిగిందని నీవు భావిస్తే నాయందు దయవుంచి నన్ను క్షమించు" అని ప్రార్థించి ఆపై ఏమీ జరగనట్టుగా తన గదిలోకి వెళ్ళిపోయింది. మర్నాటి ఉదయం తలపగిలి చనిపోయిన హెన్రీ మరియు కాలిపోయి వికారంగా మారిపోయి చనిపోయిన అలీస్‌యొక్క మృతదేహాలనుచూసి అక్కడి విద్యార్థులు మరియు ఉపాధ్యాయులు భయంతో గజగజ వణికిపోయారు. కొన్నిరోజుల తరువాత ఒక రోజు అర్థరాత్రి సిస్టర్‌జేన్ పెద్దగా అరుస్తూ తన హాస్టల్ నుండి దగ్గరలో ఉన్న అడవిలోకి పారిపోయింది. ఆ తరువాత కొన్ని రోజులకి ఆమె అస్తిపంజరం దొరికింది

ఆ తరువాత ఆ చర్చిని పడగొట్టి ఆ ప్రదేశంలో కొత్త భవనాన్ని కట్టి అందులో ఫ్రెంచి భాషా క్లాసులు ప్రారంభించారు అక్కడి అధికారులు. గతంలో ఆ భవనంలో చనిపోయిన అలీస్ మరియు హెన్రీ ప్రేతాత్మలు, అడవిలో చనిపోయిన సిస్టర్‌జేన్ యొక్క ప్రేతాత్మ ఈనాటికీ చాలామందికి కనిపిస్తూ ఉంటాయని తెలుస్తున్నది. ఈ మధ్య కాలంలో ఒక యువకుడు తన మిత్ర బృందంతో కలిసి రాత్రి సమయంలో ఆ భవనంలోకి ఒక వెలుగుతున్న కొవ్వొత్తిని చేతిలో పట్టుకుని వెళ్ళాడు. ఆ భవనంలో ఒకమూల అతనికి 100 సంవత్సరాలనాటి క్రైస్తవ సన్యాసిని దుస్తులు ధరించిన సిస్టర్‌జేన్‌యొక్క ప్రేతాత్మ కనిపించింది. ఆ ప్రేతాత్మ, వెలుగుతున్న కొవ్వొత్తిని చేత్తో పట్టుకున్న యువకుడి దగ్గరకు వచ్చి ఆ కొవ్వొత్తిని చేత్తో కొట్టింది. దాంతో కొవ్వొత్తి కిందపడి ఆరిపోయింది. ఆ ప్రాంతం అంతా చీకటి ఆవరించింది. ఆ తరువాత ఆ యువకుడితోపాటు వచ్చిన బృందంలోని ఒక యువతియొక్క జుట్టు పట్టుకుని ఎవరో

నేలమీద ఈడ్చుకు వెళ్ళారు.

ఇంతలో ఆ యువకుడు అగ్గిపెట్టె సహాయంతో కిందపడ్డ కొవ్వొత్తిని వెలిగించి చూడగా ఎవరూ లేకుండానే ఎవరో తనను ఈడ్చుకుపోతున్నట్టుగా నేలపై జారిపోతున్న ఆ యువతి కనపడింది. ఆ తరువాత ఆ యువకుడి బృందం ఆ షాక్‌నుండి తేరుకుని ఇంకొంచెం ముందుకు నడవగా ఒక మూల చుంబన దృశ్యంలో ఉన్న ఒక టీనేజ్ జంటయొక్క ప్రేతాత్మలు కనిపించాయి. ఆ యువకుడి బృందం ఆ ప్రేతాత్మల దగ్గరకు వెళ్ళేసరికి అవి పొగగామారి గాలిలో కలిసిపోయాయి. ఆ సంఘటన తరువాత ఎవరూ రాత్రి సమయాలలో ఆ భవనంలోకి వెళ్ళటంలేదు. కనీసం రాత్రి సమయాలలో ఆ భవనంకేసి చూసే ధైర్యంకూడా చెయ్యటంలేదు.



# 3. రాజమహల్‌లో ఒక రాత్రి?

మొన్నటి వరకు దేవుడు, దయ్యం నాన్‌సెన్స్! అని వాదించే నాకు ఈమధ్య ఎదురయిన అనుభవంతో కళ్ళు తెరుచుకున్నాయి. మన కంటికి కనపడనంత మాత్రాన కొన్ని అంశాలు లేవు అని భావించకూడదని నాకు అర్థమయ్యింది. ఒకవ్యక్తి చనిపోవటంతో అతని కథ పూర్తికాదని, అతను చనిపోయినా అతని ఆత్మ చాలాకాలంపాటు ఈ భూమిపై సంచరిస్తూ ఉంటుందని నా అనుభవంలో తేలింది. భయానకమైన నా అనుభవం గురించి మీతో పంచుకోవాలనిపిస్తుంది. ఈ వివరాలు ఇలా ఉన్నాయి.

పవన్, ప్రదీప్, పార్థు మరియు నేను చిన్నప్పటి నుండి కలిసే చదువుకున్నాం. మేము దగ్గర, దగ్గర ఇళ్ళలో ఉండేవాళ్ళం కనుక స్కూలు అయిపోయిన తరువాత ఇళ్ళ దగ్గరకూడా కలిసే ఆడుకుంటూ, పాడుకుంటూ పెరిగి పెద్దవాళ్ళం అయ్యాం. కాల చక్రంలో 10 సంవత్సరాలు తిరిగిపోయినాయి. ఇప్పుడు పవన్, మలేషియాలో ప్రదీప్ యు.ఎస్.ఎ.లో ఉద్యోగాలు చేస్తున్నారు. ఇక ఇండియాలో మిగిలింది నేను మరియు పార్థు మాత్రమే. మేము ఇద్దరం కూడా ఉద్యోగ రీత్యా వేరు వేరు ప్రదేశాలలో ఉంటున్నాం. నేను అనేకసార్లు పార్థుని ముంబయిలో కలుసుకోవటం జరిగింది. ఈ సంవత్సరం వేసవి సెలవులలో మా మిత్రులందరం ముంబయిలో కలుసుకున్నాం.

మేము అందరం కలిసి దాదాపు నాలుగు సంవత్సరాలు కావొస్తున్నది. ఒకేసారి నలుగురం ఒకచోట కలిసే సరికి మా ఆనందానికి పట్టపగ్గాలు లేకుండా పోయాయి. ఈ అద్భుతమైన సందర్భాన్ని జీవితంలో మరుపురానివిధంగా సెల్రబ్రేట్ చేసుకోవాలని నిర్ణయించుకున్నాం.

అందుకోసం ఒక ప్లాన్‌కూడా తయారుచేసుకున్నాం. మొదట మేము ముంబయికి దగ్గరగా ఉన్న గోవాకి వెళ్ళాలి. అక్కడ రెండు రోజులు గడిపి ఆ తరువాత గోవా నుండి కర్ణాటక రాష్ట్రంలో ఉన్న మంగుళూరు పట్టణం వరకు ఉన్న పశ్చిమ సముద్ర తీరం వెంట అనగా నేషనల్ హైవే 17 మీదుగా సరదాగా ప్రయాణంచేస్తూ, మధ్య మార్గంలో తగిలే వివిధ బీచ్‌ల వద్ద మరియు కర్ణాటక రాష్ట్రంలో ఉన్న అద్భుతమైన మార్‌వంటే బీచ్ వద్ద కులాసాగా కాలం గడపాలని నిర్ణయించుకున్నాం. ఈ బీచ్‌యొక్క ప్రత్యేకత ఏమంటే ఈ బీచ్‌కి ఒకవైపున అరేబియా సముద్రము మరియు సముద్రానికి ఒక ప్రక్కన ఉన్న 17వ నంబర్ జాతీయ రహదారి మరియు ఆ రహదారి ప్రక్కనే ఉన్న మంచినీటి సరస్సు. మొత్తం రెండు వారాలపాటు మా విహారయాత్ర కొనసాగాలని నిర్ణయించబడింది. అనుకున్న ప్రకారమే మొదట ఒకరోజు ఉదయం మేము గోవా చేరుకున్నాం. అక్కడ మొదట్లో రెండు రోజులు గడపాలని నిర్ణయించుకున్న మేము అక్కడ ఉన్న బీచ్‌యొక్క ఆకర్షణవల్ల 5 రోజులపాటు అక్కడే ఉండిపోయాం. గోవా చుట్టు ప్రక్కల ఉన్న కాలంగుటే, బాగా మరియు అంజునా లాంటి అద్భుతమైన ఎన్నో బీచ్‌లను ఈ 5 రోజులలో చూడటం జరిగింది. గోవా తీరప్రాంతంలో లభించే పీతలు, రొయ్యలు, చేపలు లాంటి జల చరాలతో చేసిన అత్యద్భుతమైన వంటకాలను గోవాలోని రెస్టారెంట్లలలో తృప్తి తీరా ఆరగించాం.

ఆ తరువాత మేము గోవా నుండి 17 నంబర్ నేషనల్ హైవేమీదుగా మంగుళూరు వెళ్ళాలని నిర్ణయించుకున్నాం. ఆ సమయంలో పార్థు మాతో "డియర్ ఫ్రెండ్స్! మా సొంత ఊరు గోవాకు దగ్గరలో ఉన్నదని మీకు తెలుసు. మనం తిరిగి ఇక్కడకు వచ్చే సమయంలో మీకు ఒక అద్భుతాన్ని మా ఊరులో చూపిస్తాను. నేను చెప్పేవరకు ఆ అద్భుతం ఏమిటి? అని దయచేసి మీరు ఎవరూ అడగకూడదు" అన్నాడు. ఆ అద్భుతం ఏమిటో తప్పకుండా చూడాలని నేను, పవన్, ప్రదీప్, గట్టిగా నిర్ణయించుకున్నాం. ఆ తరువాత మేము కారులో గోవా నుండి బయలుదేరి మంగుళూరుకి చేరేలోగా మధ్య మార్గంలో తగిలిన అనేక అద్భుత ప్రకృతి దృశ్యాలను ఆస్వాదిస్తూ కాలక్షేపం చేసాం. ఆ తరువాత 5 రోజులు మంగుళూరులో గడిపి తిరిగి

బయలుదేరాం. వచ్చేటప్పుడు గోవాకు దగ్గరగా ఉన్న కార్వార్ అనే పట్టణానికి చేరుకున్నాం. ఆ పట్టణం నుండి కారులో రెండు గంటలు ప్రయాణిస్తే గోవా చేరుకోవచ్చు. పార్థు సొంత ఊరు కార్వార్ అని మా అందరికి ముందే తెలుసు. మాకు తెలియని విషయం ఏమంటే పార్థు ఒక పెద్ద జమిందారు కుటుంబానికి చెందినవాడన్న విషయం.

కార్వారు పట్టణం పొలిమేరల్లో ఉన్న ఒక పెద్ద రాజమహల్ దగ్గరకు మా కారు చేరుకున్నది. తమ పూర్వీకులు ఆ రాజమహల్‌లో జీవిస్తూ ఉండేవారని పార్థు మాతో అన్నాడు. చూడటానికి పాతపడి ఉన్నప్పటికీ ఆ రాజభవనం అద్భుతమైన కళావైభవంతో దర్శనమిచ్చింది. ఆ భవనం చుట్టూతుగా విశాలమైన తోట ఉన్నది. ఆ భవనం కాంపౌండ్‌వాల్‌కి వందేళ్ళ క్రితం నిర్మించిన ఒక పెద్ద ఇనుపగేటుకూడా ఉన్నది. మేము ఆ భవనానికి చేరగానే ఆ భవనంలో ఎన్నాళ్ళగానో ఉంటున్న గణేశ్ అనే పనివాడు మాకు స్వాగతంచెప్పి లోపలికి తీసుకువెళ్ళాడు. గణేశ్ ప్రతిరోజూ సాయంత్రం గంటల వరకు ఆ భవనంలో ఉండి, ఆ తరువాత ఆ భవనానికి 2 కిలోమీటర్ల దూరంలో ఉన్న తన ఇంటి వెళ్ళిపోతూ ఉంటాడు. అంటే రాత్రి సమయంలో ఆ రాజమహల్‌లో ఎవరూ ఉండరు అన్నమాట. గణేశ్ మాకు రుచికరమైన ఆహారాన్ని ఏర్పాటుచేసాడు. సాయంత్రం 7 గంటలకే కావల్సినంత ఆహారాన్ని తృప్తిగా తిన్నాం. ఆ తరువాత గణేశ్ తన ఇంటికి వెళ్ళిపోతూ మాతో "బాబులూ! మీరు ఈ భవనంలో ఉన్న హాలుదాటి ఎట్టి పరిస్థితులలోను బయట గదులలోకికాని, కారిడార్‌లోకికాని వెళ్ళవొద్దు ఈ హాల్ తలుపులువేసుకుని హాయిగా నిద్రపోండి. తెల్లవారి 6 అయ్యేసరికల్లా పాలుతీసుకుని వస్తాను" అన్నాడు. మేము సరే అన్నాం. మేం నలుగురం హాలులో సోఫాల్లో కూర్చుని సరదాగా మాట్లాడుకుంటున్నాం. హఠాత్తుగా పార్థు కొత్త విషయం చెప్పటం ప్రారంభించాడు. "మిత్రులారా! మీకు ఈ భవనంలో నేను చూపించబోయే విచిత్రం ఏమంటే ఈ భవనంలో మా పూర్వీకుల ఆత్మలు అర్ధరాత్రి దాటిన తరువాత సంచరిస్తూ ఉంటాయి. మనం ఈ హాలుదాటి బయటకు వెళితే అవన్నీ చూడవచ్చు. ఇంకొక ముఖ్య విషయం ఏమంటే ఈ ప్రాంతంలో ముఖ్యంగా ఈ భవనంలో కరెంటు ఎప్పుడుపోతుందో? ఎప్పుడు వస్తుందో? ఎవరికీ తెలియదు. కనుక మనం ఈ హాలు బయటకు వెళ్ళినపుడు కరెంటుపోయి, లైట్లు ఆరిపోయి భవనం అంతా చీకటి మయం అయినపుడు మీరు ఎట్టి పరిస్థితిలోను భయపడకూడదు".

పార్థు మినహా మిగిలిన మా ముగ్గురికి ఆ రాజమహల్‌లో సంచరించే ఆత్మలని చూడాలని తహతహ పుట్టింది. పవన్, ప్రదీప్ మొదట్లో ప్రేతాత్మల్ని చూడటానికి ఉత్సాహపడినా హఠాత్తుగా కరెంటు పోవటంతో పవన్ భయపడి పోయాడు. "నేను

ప్రేతాత్మలు చూడను ఈ హాలులోనే కూర్చుంటాను. మీరుకూడా నా దగ్గరే కూర్చోండి" అన్నాడు ఒణికిపోతూ. ఇక ప్రదీప్ లోపల భయపడుతున్నా పైకి మాత్రం ధైర్యంగానే కనిపిస్తూ "ప్రేతాత్మల్ని ఖచ్చితంగా చూడాలి" అన్నాడు. ఇక నా విషయానికి వస్తే ప్రేతాత్మలు అసలు ఉండవని పూర్తిగా నమ్ముతున్న నాకు ప్రేతాత్మల గురించి భయపడాల్సిన అవసరంలేదు. ప్రేతాత్మల్ని చూడటానికి ఉత్సాహ పడ్డాను. మా దగ్గర ఫ్లాష్ అమర్చిన ఒక కెమెరాకూడా ఉండటంతో దాన్ని చేతిలోకి తీసుకుని హాలులోకి నడిచాను. నాతోపాటు పార్థు, పవన్, ప్రదీప్ కూడా బయటకు వచ్చారు. అది పున్నమి రాత్రి కావటంతో ఆ భవనంలో ఉన్న ఏదో ఒక కిటికీ నుండి లోపలికి వెన్నెల వెలుగు ప్రసరిస్తున్నది. అప్పటికి కరెంటుపోయి దాదాపు పావుగంట కావొస్తున్నది. మేము ఆ హాలు బయట ఉన్న కారిడార్ని పరిశీలిస్తున్నపుడు ఆ కారిడార్ దాదాపు 50 మంది నుంచోటానికి సరిపోయేటంత పెద్దదిగా ఉన్నదని మాకు అనిపించింది.

ఒకటవ అంతస్తులో 6 బెడ్రూంలు, రెండవ అంతస్తులు 12 బెడ్రూంలు ఉన్నాయని, ఆ భవనం కట్టి దాదాపు 150 సంవత్సరాలు గడిచాయని, దాదాపు 4 తరాల పూర్వీకులు అక్కడ నివసించారని పార్థు సన్నటి స్వరంతో మాకు చెబుతున్నాడు. తాము ఏ క్షణంలో అయినా ప్రదీప్యొక్క పూర్వీకుల ప్రేతాత్మలను చూడవలసి ఉంటుందని నేను తప్ప మిగిలిన ఇద్దరూ దృఢంగా నిర్ణయించుకున్నారు. నాకు మాత్రం ప్రేతాత్మలు లేవని గట్టి నమ్మకం అప్పటిదాకా ఉండేది. ఇంతలో హఠాత్తుగా మేము ఉన్న ప్రదేశంలో విపరీతమైన చలి ఏర్పడింది. నిజానికి ఆ భవనం తాలీకు కిటికీలన్నీ సాయంత్రమే మూసివేయబడ్డాయి. మరి ఆ వరండాలోకి చలిగాలి ఎలా వస్తున్నది?. ఆ చలి ఎంత తీవ్రంగా ఉన్నది అంటే మా నలుగురికి వళ్ళు గజగజా వణికిపోతున్నది. పళ్ళు టకటకామని కొట్టుకుంటున్నాయి. ఒక నిమిషం తరువాత ఆ చలి హఠాత్తుగా అదృశ్యం అయిపోయింది. అంతేకాదు మా ముందునుంచి ఎవరో బూటు కాళ్ళతో నడిచి వెళుతున్నట్టుగా టక్,టక్మని శబ్దం వినిపించింది. ఆ శబ్దం కారిడార్కి ఒక వైపు ఉన్న పై అంతస్తుకు ఉన్న మెట్లవైపు వెళుతున్నట్టుగా నాకు అనిపించింది.

ప్రదీప్ చేతిలో సాయంత్రం గణేష్ ఇచ్చివెళ్ళిన కిరోసిన్ దీపం వెలుగుతూ కనిపిస్తున్నది. ఆ చిన్నదీపం ఆ పెద్ద భవనంలోని చీకటిని తరిమివేయలేక పోతున్నది. నేను హఠాత్తుగా నా చేతిలో ఉన్న ఫ్లాష్ లైట్ని మెట్లవైపుగా బూట్ల శబ్దం వినిపిస్తున్న

దిక్కులో ఫ్లాష్ చేసాను. ఆ వెలుతురు పడగానే కొద్ది సెకండ్లపాటు బూట్లశబ్దం ఆగి పోయింది. ఇంతలోనే ఆ బూట్ల శబ్దం మావైపు వస్తున్నట్లుగా నాకు అనిపించింది. దాంతో నాకు ఏదో తెలియని భయం కలిగి పార్థు, ప్రదీప్, పవన్‌లను చేతులుపట్టుకుని లాగుతూ హాలులోకి వెళ్ళిపోయి హాలు తలుపులు బిగించాను. ఆ బూట్ల శబ్దం మూసి ఉన్న ఆ హాలు తలుపు బయట వరకు వచ్చి ఆగిపోయాయి. "కాసేపు నిశ్శబ్దం" మా నలుగురికి ఏదో తెలియని భయం కలిగింది. ఇంతలో ఆ బూట్ల శబ్దం మేము ఉన్న హాలు తలుపుల బయట నుండి దూరంగా వెళుతున్నట్లుగా వినిపించింది. అంతటితో నాకు అర్థం అయిపోయింది ప్రేతాత్మలు నిజంగా ఉన్నాయని. ఆ ఆలోచన రాగానే ఒక్కసారి నా వెన్ను భయంతో జలదరించింది. ఆ తరువాత నాకు అక్కడ ఉండబుద్ధి కాలేదు. 15 నిమిషాలపాటు ఒకరినొకరు తాకుతూ పరస్పరం ధైర్యం చెప్పుకున్నాం. ఆ తరువాత పార్థు మాతో "హేయ్ గైస్! మనం ఇప్పుడు మా పూర్వీకుల లైబ్రరీ రూంకి వెళదాం. అక్కడకూడా మీకు ప్రేతాత్మలు కనిపిస్తాయి" అన్నాడు చిరు నవ్వు నవ్వుతూ. అతడి నవ్వుచూసి పవన్‌కి వణుకు పుట్టింది. పైకి వినపడకుండా హనుమాన్‌చాలీసా చదవటం ప్రారంభించాడు అతడు. ప్రదీప్ ఏ భావాలు లేకుండా పార్థు చెప్పిందే వింటున్నాడు. నాకు అప్పటికే ప్రేతాత్మల ఉనికి గురించి ఒక అనుభవం అయ్యింది. సరే! లైబ్రరీకి వెళితే అక్కడ ఏమి కనిపిస్తుందో అదీచూద్దాం అనిపించింది.

నలుగురం లైబ్రరీ రూంకి చేరుకున్నాం. అక్కడ కనిపించిన దృశ్యాలు మరింత భయంకరంగా ఉన్నాయి. అది ఎలాగంటే ఒకటవ అంతస్తులో ఉన్న ఆ లైబ్రరీ గదిలో పార్థు ముత్తాతయొక్క ప్రేతాత్మ సంచరిస్తూ ఉంటుందట. మేము లైబ్రరీ గదికి చేరుకున్నాం. అది చాలా పెద్దదిగా ఉన్నది. పార్థు, మాకు ఆ గదిలోని వివిధ భాగాలను మా చేతిలో ఉన్న దీపం వెలుగుతో చూపిస్తూ వివరించాడు. ఆ దీపం వెలుగు లేకపోతే ఆ గదిలో కటిక చీకటి తాండవం ఆడుతుంది అనటంలో సందేహం లేదు. ఇంతలో ఆ గదిలో ఒక మూల నుండి ఏదో శబ్దం వినిపించటంతో మేము అటువైపుకి వెళ్ళాం. అక్కడ పొగలాంటి ఒక ఆకారం కనిపించింది. కొద్ది సెకన్లలో ఆ ఆకారం దాదాపు 60 సంవత్సరాల వయస్సులో ఉన్న ఒక వృద్ధుడిరూపం ధరించింది. ఆ రూపం కుర్తా మరియు పైజమా ధరించినట్టుగా మాకు అనిపించింది.

ఆ రూపం ఒక షెల్ఫ్‌లో ఏదో పుస్తకాలకోసం వెతుకుతున్నట్టుగా మాకు కనిపించింది. అదిచూసి మాకు విపరీతమైన భయం వేసింది. ఆ భయంకర దృశ్యం

చూసి అసలే పిరికివాడైన పవన్ పెద్దగా కేకపెట్టి నేలపై బోర్లా పడ్డాడు. పవన్ అంత పెద్దగా అరిచినా ఆ రూపం మావైపు ఏమాత్రం తిరిగి చూడకుండా ఏకాగ్రతగా తనకు కావల్సిన పుస్తకాలకోసం వెతుక్కుంటూ కనిపించింది. ఆ దృశ్యం చూడటంతోనే నాకు ప్రేతాత్మలు ఉన్నమాట యదార్థమే అని నిస్సందేహంగా ఋజువు అయ్యింది. ఇంకా ప్రేతాత్మలను చూసే ధైర్యం చాలక ఆ భవనంలో ప్రేతాత్మలు ప్రవేశించని ఏకైక ప్రదేశం అయిన హాలులోకి వెళదామని లైబ్రరీలో నుండి బయటకువచ్చి కారిడార్‌లోకి ప్రవేశించాం. అక్కడ మా కోసం ఇంకొక దృశ్యం ఎదురుచూస్తున్నది. అది ఏమిటంటే కారిడార్‌లో ఒక మూలగా 80 సంవత్సరాల వయస్సున్న ఒక వృద్ధురాలు, వందేళ్ళ క్రితం వాడుకలో ఉన్న ఒక పట్టుచీర కట్టుకుని ముఖం చిట్లించుకుని మాకేసి చూస్తూ నుంచున్నది. ఆమె ఒకప్పుడు ఆ ఇంటికి పెద్దగా ఉండేదని పార్ధు నాతో గుసగుసగా అన్నాడు. దీపం వెలుగులో ఆమె మావైపు అడుగులువేస్తూ వస్తున్నట్టుగా కనిపించటంతో మాకు భయంతో పై ప్రాణాలు పైనే పోయినట్టు అనిపించి పెద్దగా అరుస్తూ దీపాన్ని గట్టిగా పట్టుకుని మాకు రక్షణ ఇచ్చే హాలులోకి శరవేగంగా ప్రవేశించాం. కాసేపు ఊపిరి పీల్చుకున్న తరువాత పార్ధు, “ఈ ఇంటి పెరట్లో ఒక పాతకాలం నాటి బావి ఉన్నది. ఆ బావిలో దాదాపు వంద సంవత్సరాల క్రితం ఒక పనిపిల్ల దూకి ఆత్మహత్య చేసుకున్నది. ఇప్పటికీ అర్ధరాత్రి సమయంలో ఆమె ప్రేతాత్మ ఆ బావి సమీపంలో కనిపిస్తుంది” అన్నాడు. పార్ధుకి తమ రాజమహల్‌లో తిరిగే ప్రేతాత్మల గురించి బాగా తెలుసు కనుక అతడు పెద్దగా భయపడటంలేదు. పైగా ఆ ప్రేతాత్మలన్నీ పార్ధు బంధువులే. కానీ మేము బయటవాళ్ళం. పైగా మాకు దయ్యాలను చూడటం అదే తొలిసారి. దాంతో మాకు విపరీతమైన భయం మా మనస్సులనిండా నిండిపోయింది. అయినప్పటికీ చివరిసారిగా పార్ధు చెప్పిన బావినికూడా చూద్దామని అనిపించటంతో ఎలాగో ఆ భవనం పెరటిభాగంలో ఉన్న బావి దగ్గరకు చేరు కున్నాం. వందఏళ్ళనాటి ఆ బావి చాలా పెద్దదిగా ఉన్నది. గిలక సహాయంతో నీళ్ళు తోడుకునే అవకాశంకూడా ఆ బావి దగ్గర ఉన్నది.

ఆ బావికి ప్రక్కగా 70, 80 అడుగులు ఎత్తు పెరిగిన బాదం చెట్లు ఉన్నాయి. పౌర్ణమి కావటంతో పండు వెన్నెల ఆ ప్రాంతాన్ని స్పష్టంగా చూపిస్తున్నది. అది చలికాలం కావటం వల్ల గాలి మా శరీరాన్ని గజగజలాడిస్తూ వీస్తున్నది. ఆ బావిని నిశితంగా పరిశీలిస్తున్న మాకు హఠాత్తుగా ఒక పొగలాంటి ఆకారం మా ముందుగా పరుగెడుతున్నట్టుగా కనిపించింది. కొన్ని సెకన్లలో ఎవరో బావిలోకి దూకినట్టుగా దబ్‌మని శబ్దం వినిపించింది. ఆ తరువాత కొద్దిసేపటికి ఎవరో ఆడపిల్ల ఏడుస్తున్నట్టుగా

బిగ్గరగా ఏడుపు వినిపించింది. అంతటితో మా ధైర్యం నశించిపోయింది. "ఇంకా ఇక్కడికి ప్రక్కన ఒక గులాబీ తోట ఉన్నది. అందులో కూడా కొన్ని ప్రేతాత్మలు ఉన్నాయి చూద్దాం వస్తారా?" అన్నాడు పార్థు చిరునవ్వుతో. మేం ముగ్గురం చేతులు జోడించి దణ్ణంపెడుతూ వణుకుతున్న స్వరంతో పార్థుతో ఇలా అన్నాం. "బాబూ! ఇప్పటి వరకు నువ్వు చూపించిన ప్రేతాత్మల దృశ్యాలు ఈ జన్మకి చాలు ఇంకా చూపిస్తే మేం బ్రతకటం కష్టం". ఆ తరువాత మేం నలుగురం హాలులోకి చేరుకుని అక్కడ ఉన్న నాలుగు రగ్గులు తీసుకుని కప్పుకుని నేలమీద దగ్గరదగ్గరగా పడుకుని నిద్రపోవాలని ప్రయత్నించాం. కానీ అనుక్షణం అప్పటివరకు మాకు కనిపించిన ప్రేతాత్మలే కళ్ళముందు మెదలటంతో నిద్ర పట్టటం కష్టం అయ్యింది. ఎప్పుడో తెల్లవారుఝాము ప్రాంతంలో నిద్ర పట్టినట్టు అనిపించింది. తెల్లవారిన తరువాత గణేశ్ వచ్చి వేడివేడి టీ.తో మాకు స్వాగతం పలికాడు. మాకు ఆ భవనంలో కనిపించిన ప్రేతాత్మల గురించి గణేశ్‌కి చెప్పాం. గణేశ్ ఆశ్చర్యంగా ముఖంపెట్టి మాతో ఇలా అన్నాడు. "ఇంతవరకు ఈ భవనంలో ప్రేతాత్మలు తిరుగుతున్నాయని ఎవరో చెబితే విన్నాను కానీ ఈనాడు మీరే స్వయంగా వాటిని చూడటంవల్ల ఈ భవనంలో దయ్యాలు తిరుగుతున్నాయన్నమాట నిజమే అని నాకు అర్థం అయ్యింది".

ఆ తరువాత మేం అందరం స్నానాలుచేసి గణేశ్ వడ్డించిన రుచికరమైన భోజనాన్ని చేసి మధ్యాహ్నం ఒంటిగంటకి మా లగేజ్‌తో సహా కారు ఎక్కాం. మా కారు ఆ రాజమహల్ ప్రహరీదాటి బయటకు వచ్చేసింది. అదురుతున్న గుండెలతో కారు విండోలోంచి బయటకు చూసిన నాకు ప్రహరీ గేటు దగ్గర నుంచుని చిరునవ్వుతో చేయి ఊపుతూ ఉన్న గణేశ్ కనిపించాడు. నేనుకూడా అప్రయత్నంగా నవ్వుతూ కారు విండోలోంచి చెయ్యిబయటకు పెట్టి చెయ్యి ఊపాను. మా కారు శరవేగంతో గోవా వైపు దూసుకు పోతున్నది. ఆ కారుని డ్రైవ్ చేస్తున్నది పవన్. పార్థూ మరియు ప్రదీప్ ఏదో మాట్లాడుకుంటున్నారు. నేను మాత్రం బయట నుండి వస్తున్న చల్లగాలికి కారు వెనక సీటులో నిద్రలోకి జారుకున్నాను.



# 4. బెంగుళూరు ఎయిర్‌పోర్ట్‌లో కనిపిస్తున్న ఆడ దయ్యం?

ప్రేతాత్మలు సంచరించని ప్రదేశాలు ఈ భూమిపై లేవు అని నిరూపించే ఒక యదార్థ సంఘటన గురించి తెలుసుకుందాం.......

కొంతకాలం క్రితం కర్నాటక రాష్ట్రంలోని దేవనహళ్ళి అనే ప్రాంతంలో బెంగుళూరు ఇంటర్‌నేషనల్ ఎయిర్‌పోర్టు నిర్మించబడింది. అయితే ప్రస్తుతం ఆ ఎయిర్‌పోర్ట్‌లోకి దిగే విమానాలను నడిపే పైలెట్లుకాని, ఆ ఎయిర్‌పోర్ట్‌లో విమానాలు ఎక్కే ప్రయాణీకులు కాని ఎంతమాత్రం ఆనందంగాలేరు. అందుకు కారణం ఎయిర్‌పోర్ట్‌లో సంచరిస్తున్న ఒక అమ్మాయి ప్రేతాత్మే.



ఒకరోజు రాత్రి సమయంలో ఆ ఎయిర్‌పోర్ట్‌లోకి ఒక విమానం లాండ్ కావటానికిముందు ఆ విమానం నడిపే పైలెట్ కిందకి చూసినపుడు విమానం నడిచే రన్‌వే మధ్యభాగంలో ఒక యువతి చేతులుజాచి నిలుచుని ఉన్నది. కింద నుంచుని ఉన్నది మనిషే అని భావించిన ఆ పైలెట్ విమానం లాండ్ కాకముందే ఆ యువతి గురించి ఎయిర్‌పోర్ట్‌లో ఉన్న పోలీసులకు ఫోన్‌ద్వారా తెలియజేసాడు. వెంటనే పోలీస్ జీబు రన్‌వే మీదకు పరుగెత్తింది. దూరంగా నిలుచుని ఉన్న అమ్మాయి జీబులో ఉన్న పోలీస్‌లకు కనిపించింది. జీబు ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళేసరికి ఆ అమ్మాయి అదృశ్యం అయిపోయింది.

అంతకుముందురోజు రాత్రి ఎయిర్‌పోర్ట్‌లో ఉన్న లిఫ్ట్ ఎవరూ లేకుండానే అనేకసార్లు కిందకి పైకి ప్రయాణించినట్టుగా కొందరు ఎయిర్‌పోర్ట్ ఉద్యోగులు తెలియజేయటం జరిగింది. మరుసటిరోజు రాత్రి 10 గంటలకు ఒక ఉత్సాహ వంతుడు తన సెల్‌ఫోన్‌లో రన్‌వే మధ్యలో కనిపిస్తున్న ఆడ దయ్యం ఫోటోతీసి మీడియాకు అందించటం జరిగింది. కొంతమంది చెబుతున్న సమాచారం ప్రకారం ఆ ఎయిర్‌పోర్ట్ ఒక శ్మశాన ప్రాంతంలో నిర్మించబడిందని, రన్‌వే మధ్యలో కనిపిస్తున్న అమ్మాయి బతికి ఉన్న సమయంలో అక్కడికి దగ్గరలో ఉన్న అడవిలో ఉండేదని, ఆమెను ఎవరో చంపివేశారని, ఆమె ప్రేతాత్మగామారి ఇప్పటికీ ఎయిర్‌పోర్ట్ ప్రాంతంలో సంచరిస్తున్నదని తెలుస్తున్నది. ఈ ఆడ దయ్యం వ్యవహారంతో భయపడిన ఎయిర్‌పోర్ట్ సిబ్బంది ముఖ్యంగా టికెటింగ్ మరియు కాటరింగ్ విభాగాల ఉద్యోగులు రాత్రి సమయంలో ఈ ఎయిర్‌పోర్ట్ లోకి తమ విధులను నిర్వర్తించటానికి రావటానికి వెనకాడుతున్నట్టుగా తెలుస్తున్నది.



## 5. ఎవరా ఇద్దరు?

రాజస్థాన్‌కి చెందిన ఒక మధ్యవయస్కుడు తన బాల్యంలో ఎదురయిన ఒక భయానక సంఘటన గురించి మనకి చెబుతున్నాడు.......

ఇది చాలాఏళ్ళక్రితం జరిగిన కథ. ఉహు! ఇది కథకాదు! యదార్ధ సంఘటన!. అపుడు నావయస్సు 12 సంవత్సరాలు ఉంటుంది. మా నాన్న అప్పుడప్పుడూ తన చిన్నతనంలో జరిగిన ఒక సంఘటన గురించి నాకు చెబుతూ ఉండేవాడు. ఆ కథ నన్ను భయపెడుతూ ఉండేది. ఆ కథలోని మర్మం ఏమిటో అర్థంకాక అప్పుడప్పుడూ తికమక పడుతూ ఉండేవాడిని. ఆ కథ ఏమిటంటే, అది మానాన్న 22ఏళ్ళ నవయువకుడిగా ఉన్న సమయం. మా నాన్నకి చదువులేదు. ఆస్తులు లేవు. మరి బ్రతకాలంటే రెక్కలకష్టం ఆయనకి ఆధారం. మానాన్న ఒక పాడిపశువుల పెంపకం కేంద్రంలో కూలివాడిగా పనిచేస్తూ ఉండేవాడు. ఇప్పుడంటే అన్ని పనులకి మిషన్లువచ్చేసాయి. చివరికి పశువుల పాలుపిండటానికికూడా ఈనాడు మిషన్లు ఉన్నాయి. కానీ ఆ రోజుల్లో ఏం చెయ్యాలన్నా మనుషులే కష్టపడి చెయ్యాల్సి ఉండేది.

ఆ కేంద్రంలో మానాన్నతోపాటుగా ఇంకో నలుగురు పనివాళ్ళు పనిచేస్తూ ఉండే వాళ్ళు. వాళ్ళపని ఏమిటంటే ఉదయం ఆ కేంద్రంలోని ఆవుల పాలు పిండటం, సాయంత్రంకాగానే ఆవులకి దాణావెయ్యటం. ఈ పనులన్నీ అయిన తరువాత వీళ్ళందరూ కలిసి ఒకచోట కూర్చుని వేడివేడి చాయ్‌తాగుతూ, అందంగా అస్తమిస్తున్న సూర్యుడిని చూస్తూ కాలక్షేపం చేస్తూ ఉండేవాళ్ళు. చాయ్ తాగటం పూర్తి అయినాక ఒక్కరుమాత్రం ఆ కేంద్రంలో ఉండగా మిగిలిన నలుగురు ఎవరిళ్ళకువాళ్ళు వెళ్ళిపోయేవారు. ఆ మిగిలిన ఒక్కడూ రాత్రంతా ఆవులను జాగ్రత్తగా చూసుకుంటూ ఉండేవాడు. ఇది ఇలా సాగుతూ ఉండగా......

ఒకరోజు సాయంత్రం ఆ కేంద్రంలోని పనివాళ్ళు కేంద్రంలో ఉన్న అన్ని ఆవుల్ని బయట ఉన్న పచ్చికబయలులో గడ్డిమెయ్యటానికి వదిలిపెట్టారు. అయితే అన్ని ఆవులూ బయటకువచ్చినా ఒక్కఆవు మాత్రము పనివాళ్ళు ఎంతప్రయత్నించినా కేంద్రాన్ని వదలి బయటకి రావటానికి ఇష్టపడలేదు. దానిని తాడుపట్టుకుని లాగారు. కర్రతో రెండు దెబ్బలువేసారు. అయినా ఆ ఆవు బయటకు రావటానికి మొండికెత్తింది. ఇక చేసేదిలేక కాస్త పచ్చగడ్డితెచ్చి ఆ మొండి ఆవుముందు పడేసి పనివాళ్ళు, బయట గడ్డి మేస్తున్న ఆవులదగ్గరకి వెళ్ళిపోయారు. ఆ తరువాత కాసేపటికి వాళ్ళందరూ చాయ్ తాగుతూ పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. ఇంతలో సూర్యాస్తమయం అయిపోయింది. అక్కడ పనిచేసే ఐదుగురు పనివాళ్ళలో ఒకడైన మానాన్నకి ఆ రోజు రాత్రి ఆ ఆవుల కేంద్రాన్ని కాపలాకాసే పని అప్పగించబడింది. అందరూ వెళ్ళిపోయాక మానాన్న మళ్ళీ కొంచెం టీ తయారుచేసుకుని కొంచెం, కొంచెం తాగుతూ ఆ సాయంత్రాన్ని ఆస్వాదిస్తున్నాడు. మానాన్న అలా ప్రకృతిలో లీనమయి ఉన్న సమయంలో "నమస్తే భాయిజీ!" అన్న స్వరం వినపడటంతో ఆయన ఈ లోకంలోకి వచ్చి చూసాడు. ఆయన ఎదురుగా పశువుల పెంపకంచేసే పనివాళ్ళలాగా దుస్తులు ధరించిన ఇద్దరు యువకులు నుంచుని ఉన్నారు.

పల్లెటూళ్ళకి అప్పుడప్పుడూ కొత్తవాళ్ళు రావటం జరుగుతూనే ఉంటుంది. అందువల్ల మానాన్న వాళ్ళని కూర్చోమనిచెప్పి వాళ్ళకికూడా టీ ఇచ్చాడు. వాళ్ళు టీ తాగుతూ తమపేర్లు జమేరు మరియు బాలు అని చెప్పారు. తాము అక్కడకు దగ్గరలో ఉన్న ఒక గ్రామం నుండి వచ్చామని మానాన్నతో చెప్పారు. మానాన్నకి దాదాపుగా చుట్టుప్రక్కల ఊళ్ళలోని జనాలందరూ తెలిసినవాళ్ళే. అయితే ఇప్పుడు వచ్చినవాళ్ళని మాత్రం మానాన్న ఎన్నడూ చూసిఉండలేదు. రాత్రి అయ్యింది. మానాన్న కేంద్రంలో

ఉన్న ఒక నులకమంచంమీద పడుకుని కొత్తవచ్చినవాళ్ళనికూడా పడుకోమనిచెప్పి వాళ్ళకి రెండు చాపలుఇచ్చాడు. మానాన్న పడుకుని కళ్ళుతెరుచుకుని పైకిచూస్తున్నాడు ఆ పశువులపెంపక కేంద్రానికి చుట్టుప్రక్కల ఉన్న చిత్తడిప్రదేశాలలో కాపురం ఉంటున్న కప్పలబెకబెకలు, కీచురాళ్ళ అరుపులు వికారంగా వినిపిస్తున్నాయి. ఇంతలో మానాన్నకి హఠాత్తుగా పశువుల కొట్టంలోంచి చిన్నగాకరకరమనే చప్పుడు వినిపించటం మొదలయ్యింది. మొదట్లో ఆ చప్పుడు ఎవరో మాట్లాడేమాటలేమో అని మానాన్నకు అనిపించింది.

ఎవరాచప్పుడు చేస్తున్నది? ఎవరాచప్పుడులాంటి శబ్దాలతో మాట్లాడుతున్నది? అన్న ప్రశ్నలు మానాన్నను వేధించటం మొదలుపెట్టాయి. ఏదిఏమైనా ఆ శబ్దాలు ఆవులను కట్టివేసి ఉన్న కొట్టంలోంచి వినిపిస్తున్నాయి అనిమాత్రం మానాన్నకు అర్థమయ్యింది. ఆ తరువాత మానాన్న, బాలుని వెంట తీసుకుని పశువులకొట్టంలోకివెళ్ళి వెతకగా అక్కడ ఒంటరిగా ఒక గుంజకు కట్టివేయబడి ఉన్న మొండి ఆవు కనిపించింది. ఆ శబ్దాలు ఎక్కడనుండి వస్తున్నాయో వాళ్ళకు అర్థంకాలేదు. ఇంతలో బాలు మానాన్న వైపుకి తిరిగి నేను మూత్రవిసర్జనచేసి వస్తాను అని, వేగంగా అక్కడనుండి బయటకు వెళ్ళిపోయాడు. మానాన్న బయటపడుకుని ఉన్న జమీరుదగ్గరకివెళ్ళాడు. ఆశ్చర్యకరంగా అక్కడ జమీర్‌లేడు. బహుశా అతడుకూడా ఏ మూత్రవిసర్జనకో బయటకువెళ్ళి ఉంటాడని మానాన్న అనుకున్నాడు. మా నాన్న ఆ తరువాత చాలాసేపు వాళ్ళు ఇద్దరూ తిరిగివస్తారని ఎదురుచూసాడు. వాళ్ళుమాత్రం రాలేదు. ఏం జరిగిందో తెలుసుకుందామని కేంద్రం బయట ఉన్న పచ్చికబయలులో టార్చిలైటు వేసుకుని తిరిగాడు. ఎంత వెతికినా జమీర్, బాలు మాకు కనపడలేదు. ఇంత చీకటిలో వీళ్ళిద్దరూ ఎక్కడికి వెళ్ళి ఉంటారా? అని మానాన్న తీవ్ర ఆలోచనలో పడ్డాడు. పోనీ ఒకవేళ వాళ్ళు తమ ఊరికి తిరిగి వెళ్ళిపోయినట్లయితే కాసేపు ఆతిథ్యం ఇచ్చిన తనకు వీడ్కోలు ఇవ్వకుండా వెళ్ళిపోవటం ఏమిటి? అని మానాన్న కాసేపు బాధపడ్డాడు.

సరే! అయ్యిందేదో అయ్యింది అనుకుని మానాన్న అక్కడ నుండి మళ్ళీ ఆవులకేంద్రం దగ్గరికి వస్తున్నాడు. ఇంతలో మానాన్నకి ఎవరో పెద్దగా మూలుగుతున్న శబ్దం పశువుల కొట్టంలోంచి వినిపించింది. ఎవరో విపరీతమైన బాధకు గురై మూలుగుతున్నట్టుగా మానాన్నకు అనిపించింది. మానాన్న వేగంగా నడుస్తూ మొండి ఆవు కట్టివేసి ఉన్న భాగంలోకి వెళ్ళాడు. మానాన్న వెళ్ళిచూసేసరికి అక్కడ ఆవులేదు. ఆ స్థానంలో కొద్దిగా పచ్చిగడ్డి మరియు రక్తం మడుగు ఉన్నాయి. ఆ దృశ్యంచూసిన

మానాన్న విపరీతమైన భయానికి గురై, కొట్టంలో ఇంకొక భాగంలో కట్టివేయబడిఉ న్న మిగిలిన ఆవుల్ని కూడా కట్లువిప్పేసి వాటిని తోలుకుంటూ కొట్టం బయట ఉన్న పచ్చికబయలు లోకి పరుగెత్తాడు కెంచెం తేరుకున్నాక మానాన్న ఏం జరిగిందో? మననం చేసుకోవటం మొదలు పెట్టాడు. హఠాత్తుగా అదృశ్యం అయిపోయిన జమీర్ మరియు బాలు మనుషులుకాదని దయ్యాలని, వాళ్ళే మొండి ఆవును చంపి తినేశారని మానాన్నకు అర్ధమయ్యింది.

మర్నాడు ఉదయం మానాన్న గత రాత్రి అనుభవాన్ని తనతోటి పనివాళ్ళకు చెప్పాడు. వాళ్ళలో బాగా వయస్సుపైబడిన ఒక పనివాడు వణుకుతున్న కంఠంతో మానాన్నతో "జమీర్ మరియు బాలు ఒకప్పుడు నిజంగా జీవించి ఉండేవారని, వాళ్ళు చాలాకాలం క్రితం ఇదే కేంద్రంలో పనిచేస్తూ ఉండేవాళ్ళని, ఒకసారి ఎవరూ చూడకుండా ఒక ఆవును దొంగిలించుకునిపోయి ఒక ముస్లిం మాంసం వ్యాపారికి అమ్ముకున్నారని ఆవిషయం బయటపడటంతో ఆ గ్రామంలోని ప్రజలందరూ వాళ్ళిద్దరినీ రాళ్ళతోకొట్టి చంపారని, చనిపోయిన తరువాత వాళ్ళిద్దరూ దయ్యాలుగా మారిపోయి అప్పుడప్పుడూ మనుషులకి కనిపిస్తూ ఉంటారనీ" చెప్పాడు. ఆ తరువాత మానాన్న మరియు మిగిలినపని వాళ్ళు కొట్టంలోకి వెళ్ళిచూస్తే అక్కడ మొండిఆవు క్షేమంగా ఉండటమేకాకుండా పచ్చగడ్డి తాపీగా నములుతూ కనిపించింది. ఆ ఆవు ఉన్న ప్రదేశంలో రాత్రి కనిపించిన నెత్తురుమడుగు ఇప్పుడు కనిపించటంలేదు. ఏం జరిగిందో? మానాన్నకు అర్ధంకాలేదు. అయితే ఈ సంఘటన జరిగిన మూడవ రోజున మొండిఆవు హఠాత్తుగా విరుచుకుని నేలమీద పడిపోయి చనిపోయింది.



# 6. టన్నెల్ నెంబరు 103?

దాదాపు కొద్ది సంవత్సరాల క్రితం సీమ్లా-కల్కా రైలుమార్గంలో జరిగిన ఒక యదార్ధ సంఘటన గురించి తెలుసుకుందాం.

సురేష్ కారులో బొంబాయి నుండి పూనాకు బయలుదేరాడు. అయితే మార్గ మధ్యంలో ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించాలి అన్న ఉద్దేశ్యంతో కొత్త ఎక్స్‌ప్రెస్‌వే మీదుగా కాకుండా పాతమార్గంలో అనగా ఘాట్‌రోడ్డులో తన ప్రయాణం మొదలు

పెట్టాడు. అలా వెళుతున్న అతనికి మధ్యమార్గంలో కారు బ్రేకులు డౌన్ అయ్యాయి. కారు ఆగిపోయింది. అతను ఒక అనామక ప్రదేశంలో చిక్కుకుపోయాడు. ఇక చేసేదిలేక కారును అక్కడే వదిలేసి ఆ ఘాట్‌రోడ్డుమీదగా నడుస్తూ ముందుకు వెళు తున్నాడు. ఎవరో ఒకరు ఏదో ఒక వాహనంమీద అటువైపుగావస్తూ తనకి లిఫ్ట్ ఇస్తారని అతను ఆశిస్తున్నాడు. అది రాత్రి సమయం కావటంతో బాగా చీకటిగా ఉ ంది. అంతేకాకుండా వర్షంకూడా జోరుగా కురుస్తున్నది. దాంతో అతను రెండు మూడు నిమిషాలలోనే తడిసిముద్దయిపోయి చలితో వణకసాగాడు. అతను అలాగే నిదానంగా నడుస్తూ ముందుకు సాగుతున్నాడు. అతను ఆశించినట్టుగా ఏ వాహనమూ ఆ రోడ్డులో ప్రయాణించలేదు. వర్షం చాలా దట్టంగా పడటంతో తనకి కొద్ది అడుగుల దూరంలో ఉన్న వస్తువుకూడా సరిగా కనిపించని పరిస్థితి ఉన్నది.

ఇంతలో అతని అదృష్టం పండిందా? అన్నట్టుగా ఒక కారు అతనివైపుకు వస్తూ క్రమంగా స్లో అయి అతనిప్రక్కనే ఆగింది. కారు ఆగగానే సురేష్, కారు వెనకడోర్ తెరచి దభీమని వెనకసీటులో కూలబడి డోర్ క్లోజ్‌చేసాడు. ఆ తరువాత ముందుకు వంగి డ్రైవింగ్‌సీటులో ఉన్న వ్యక్తిని పరిశీలించాలని ప్రయత్నంచేసాడు. విచిత్రం! డ్రైవింగ్ సీటులో ఎవరూలేరు. అంతకన్నా విచిత్రంగా ఎలాంటి శబ్దం చెయ్యకుండా ఆ కారు స్టార్ట్ అయి ముందుకు దూకింది. ఇంతలో అతనికి ఆ కొండ రోడ్డుమీద ఒక మలుపు కనిపించింది. డ్రైవర్‌లేని ఆ కారు పొరపాటున ఆ వంపుదగ్గర జారిపోతే దిగువలో ఉన్న లోయలలోకి పడి పోవటం ఖాయం. కారు వేగంగా మలుపువైపు పరుగెత్తింది. ఇక తనపని అయిపోయిందని సురేష్ అనుకుంటున్న సమయంలో ఒక హస్తం కారు విండోలో నుండి లోపలికి ప్రవేశించి కారు స్టీరింగ్‌ని తిప్పింది. ఫలితంగా కొండ మలుపులోంచి కిందపడాల్సినకారు క్షేమంగా ఆ మలుపుదాటి ముందుకు నడిచింది. ఇంతలో ఇంకొక మలుపు కనిపించింది. ఈ సారి సురేష్‌కి భయంతో గుండె గడ్డకట్టుకుపోయింది. ఈ సారి కారు, కొండమీదనుంచి కిందపడటం ఖాయమని సురేష్‌కి అనిపించింది. విచిత్రంగా, అదే హస్తం కారు స్టీరింగ్‌ని తిప్పి కారుని ఆ మలుపు దాటించింది. ఇలా ఆ ఘాట్ రోడ్డులో ఎన్నో మలుపులలో కారును ఆ హస్తం జాగ్రత్తగా నడిపింది.

ఆ ప్రయాణంలో ఎంతసేపు గడిచిందో సురేష్‌కి తెలియటంలేదు. ఇంతలో అతనికి కొంచెం దూరంలో వెలుగుతున్న లైట్లు కనిపించాయి. దాంతో అతను ధైర్యం తెచ్చుకుని కారు డోర్‌ని బలంగా తన్ని డోర్‌ని తెరచి బయటకి దూకాడు. ఆ తరువాత

సురేష్ వేగంగా పరుగెడుతూ లైట్లు కనిపిస్తున్నవైపు వెళ్ళాడు. అది ఒక చిన్నగ్రామం. సురేష్ కొంత దూరం వెళ్ళిన తరువాత అతనికి రోడ్డు ప్రక్కగా ఉన్న ఒక ధాబా కనిపించింది. సురేష్ అక్కడ ఉన్న వాళ్ళ దగ్గర కొద్దిగా బ్రాందీ తీసుకుని తాగాడు. ఆ తరువాత వాళ్ళు ఇచ్చిన సిగరెట్ కాల్చుకున్నాడు. ఆ తరువాత తనకు ఎదురయిన అనుభవం గురించి అక్కడ ఉన్నవాళ్ళకు చెప్పటం ప్రారంభించాడు. అక్కడ ఉన్న వాళ్ళందరూ సురేష్ చెప్పిన మాటలు విని, సురేష్ తాగిన మైకంలో అలా మాట్లాడు తున్నాడేమో అనుకున్నారు. ఒక హస్తం కారుని కొండ మలుపులలో కింద పడిపోకుండా నడిపింది అన్న విషయం అక్కడ ఉన్నవాళ్ళకి నమ్మశక్యంగా అనిపించలేదు. కొన్నిసార్లు నిజం, కల్పన కన్నా విచిత్రంగా ఉండదూ!



# 7. క్షోభించే పఠాన్ ప్రేతాత్మ?

దాదాపు 13 సంవత్సరాలక్రితం ముంబాయి ప్రాంతంలో జరిగిన ఒక యదార్థ సంఘటనే ఇది. ఈ సంఘటనలో ప్రధాన సాక్షిగా ఉన్న వ్యక్తి ఆనాటి తన అనుభవాన్ని ఇలా తెలియజేస్తున్నాడు.........

మహారాష్ట్రలోని ముంబాయి మహానగరానికి దగ్గరలో ఉన్న లోనావాలా అనే హిల్‌స్టేషన్‌లో (వేసవి విడిదిగా ఉపయోగించుకోబడే చల్లని వాతావరణం ఉన్న కొండ ప్రదేశం) పాండే అనేపేరుగల నా మిత్రుడు ఆ సమీప ప్రాంతాలలో ఉన్న అనేక విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలలో పనిచేసే ఉద్యోగులకు ఆహారం సరఫరాచేసే వ్యాపారం (కాటరింగ్) చేస్తూ ఉండేవాడు. లోనావాలా దగ్గర ఒక సరస్సు ఉన్నది. ఆ సరస్సుకి ఆనుకుని ఒక డామ్‌కూడా ఉన్నది. సరస్సుకి దగ్గరలో నిర్మిస్తున్న డామ్ నిర్మాణంలో పనిచేసే కూలీలకు కూడా పాండే, టిఫెన్లు, టీలు మరియు భోజనాలు సప్లై చేస్తూ ఉండేవాడు. ఆ సరస్సుకి దగ్గరలోనే కూలీలు బసచేయటానికి కొన్ని క్వార్టర్స్‌కూడా నిర్మించబడి ఉన్నాయి. ఈ కూలీలు సాయంత్ర సమయంలో తమ పని ముగించుకుని పాండే అక్కడకు దగ్గరలో ఉన్న పాండే కాంటీన్‌కివచ్చి టీ తాగి కాసేపు అక్కడే కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ కాసేపుకాలక్షేపంచేసి ఆ తరువాత వాళ్ళ రాత్రి భోజనాలు కాంటిన్‌లో పాక్‌చేయించుకుని తమ క్వార్టర్స్‌కి తీసుకువెళు తూ ఉండేవారు.

ఒకసారి నేను, పాండేని చూడటానికి లోనావాలా వెళ్ళాను. సెలవుల్ని ఎంజాయ్ చెయ్యటానికి వచ్చిన నేను, పాండేతో కలిసి అతని మెస్ కార్యకలాపాలలో పాలుపంచుకుంటూ లోనావాలాలో ఉన్న సరస్సుని-డామ్‌ని చూస్తూ సరదగా కాలక్షేపం చేస్తూ ఉండేవాడిని అలాంటి సమయంలో ఒక రోజు సాయంకాలం చల్లని పిల్లగాలి తెమ్మెరలు మమ్మల్ని తాకుతూ ఉన్న సమయంలో నేను మరియు పాండే డామ్‌వైపు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నాం. అపుడు సమయం సాయంత్రం 6.30 అయ్యింది. కొంతసేపు అలా నడుస్తూ కాలంగడిపాము. ఇంతలో పాండే తన కాంటీన్‌కి వెళ్ళి కూలీల భోజనాలు సిద్ధంచేయాల్సిన సమయం కావటంతో ఇద్దరం కలిసి మళ్ళీ వెనక్కి కాంటీన్‌వైపు నడిచాం. డామ్ దగ్గరనుంచి కాంటీన్‌కివెళ్ళే రోడ్డు చాలా ఇరుకుగా ఉంటుంది. ఆ రోడ్డుకి ఒకవైపు డామ్‌కూడా ఉంటే ఇంకొకవైపు సరస్సు ఉన్నది. మేము కాంటీన్‌కి వెళుతున్న సమయంలో ఇంకో ఇద్దరు కూలీలుకూడా మా వెనకాలే కాంటీన్‌కి వస్తున్నారు. మేము ఆ ఇరుకు రోడ్డులోంచి అలా నడుస్తూ ఉన్న సమయంలో ఒక ప్రదేశంలోకి రాగానే ఒక్కసారిగా మా శరీరాలను ఐస్‌గడ్డలమధ్య ఉంచినట్టుగా చల్లబడిపోయింది.

మాకు ఆ అనుభవం చాలావిచిత్రంగా అనిపించింది. భయంగాకూడా అనిపించింది. ఎలాగో ఆ స్థితినుంచి తేరుకుని కొన్ని అడుగులు ముందుకు నడిచాం. ఆశ్చర్యం! మళ్ళీ వాతావరణం మామూలుగా అయిపోయినట్టుగా అనిపించింది. ఇందాకటి చల్లదనం ఇపుడు మా శరీరాలమీదలేదు. ఆ తరువాత నేను అనుకోకుండా ఒక్కసారి వెనక్కితిరిగి ఇందాక చల్లగా అనిపించిన ప్రదేశం వైపుచూసాను. అక్కడ ఒక మనిషి ఆకారంలో ఏర్పడిన బూడిదరంగుపొగ కనిపించింది. విచిత్రం ఏమంటే మా వెనకాల వస్తున్న పనివాళ్ళు ఆ పొగ గురించి పట్టించుకోకుండా వాళ్ళ మాటల్లో వాళ్ళు ఉండిపోయారు. వాళ్ళ వాలకంచూస్తే వాళ్ళకి ఆ పొగమంచు గురించి తెలిసేఉంటుందేమో అని నాకు అనిపించింది. ఆ తరువాత నేను, పాండే కాంటీన్‌కి చేరుకుని అక్కడ పనులు పూర్తిచేసుకుని రాత్రి 8.30 ప్రాంతంలో మా బసకు చేరుకున్నాం. ఆ తరువాత మేము అక్కడ మా రాత్రి భోజనాలు పూర్తిచేసుకునే సరికి రాత్రి 10.30 అయ్యింది. మేము ఇద్దరం కుర్చీలువేసుకుని వరండాలో కూర్చుని ఉన్నాం. చల్లటిగాలి మాలో ఏదో తెలియని సంతోషాన్ని కలిగిస్తున్నది. ఇంతలో నలుగురు పనివాళ్ళు మా బసవైపు నడుచుకుంటూ రావటం కనిపించింది. నేను వాళ్ళని పరిశీలనగాచూసాను. ఆ నలుగురిలో ఒకడు సాయంత్రం ఇరుకురోడ్డులో మా వెనకాల వచ్చినవాడు అని గ్రహించాను. వాళ్ళు మా దగ్గరకువచ్చి పాండేవైపుకి చూస్తూ అతన్ని తమతోపాటు తమ క్వార్టర్స్‌కి రమ్మని అభ్యర్థించారు.

వాళ్ళు ఎందుకో విపరీతంగా భయపడుతున్నారని వాళ్ళ ముఖకవళికలుచూస్తే నాకు అనిపించింది. పాండే వాళ్ళతోపాటు బయలుదేరాడు. ఇక్కడ ఒంటరిగా ఉండి నేనుమాత్రం చేసేది ఏముంది అన్న ఉద్దేశ్యంతో నేనుకూడా పాండే వెనకాలే బయలు దేరాను. అక్కడికి వెళ్ళేసరికి ఒక పనివాడు తన గదిలో కూర్చుని ఒకపెద్ద స్టీలు పళ్ళెంలో ఎక్కువ మొత్తంలో అన్నం మరియు రొట్టెలు ఉంచుకుని అబగా తింటున్నాడు. అతన్ని చూడగానే నేను ఉలిక్కిపడ్డాను. కారణం సాయంత్రం మా వెనకాలగా వచ్చిన ఇద్దరు కూలీలలో ఇతను ఒకరు కావటమే. అతను హఠాత్తుగా ఉర్దుభాష మాట్లాడటం ప్రారంభించాడు. అదికూడా ఆఫ్ఘనిస్తాన్‌కి చెందిన పఠాన్‌లు మాట్లాడే భాష కావటం విచిత్రంగా అనిపించింది. అతను పెద్దగా మాట్లాడటమే కాకుండా తనకి తింటానికి మేక మాంసం, గొడ్డుమాంసం కావాలని అక్కడ ఉన్న అందరినీ దబాయించి అడగటం మొదలుపెట్టాడు. ఒక విచిత్రం ఏమంటే అంత తిండి తింటున్న ఆ పనివాడు, సన్నగా 5.2 అంగుళాల ఎత్తు మాత్రమే ఉన్నాడు. అంతేకాదు అతనికి ఆ ప్రాంత స్థానిక భాష అయిన మరాఠి తప్పించి ఇంకొక భాష తెలియదు. ఇంకా విచిత్రం ఏమంటే ఆ వ్యక్తి పుట్టుకతో శాఖాహారి. మమ్మల్ని అక్కడికి తీసుకువచ్చిన కూలీలు నాతో, “అయ్యా! మేము మా నలుగురికోసం తెచ్చుకున్న ఆహారాన్ని ఇతను ఒక్కడే తినెయ్యటంకాకుండా ఇంకా మాంసంకూడా తెమ్మని సతాయిస్తున్నాడు. అందుకే ఆ విషయం మీకు తెలియ జేయాలని మీ బసకు వచ్చాము” అన్నారు.

అతనికి ఏదో మానసికరోగం అప్పటికే ఉండి ఉంటుందని, అది ఆ సమయంలో బయటపడి ఉంటుందని, అందుకనే అతను అలా విచిత్రంగా ప్రవర్తిస్తున్నాడని పాండే నాతో అన్నాడు. అంతేకాకుండా గోలచేస్తున్న ఆ కూలీని దగ్గరలో ఉన్న ఒక హాస్పటల్‌కి తీసుకువెళదామని అందరితో చెప్పాడు. ఆ తరువాత నేను, పాండే మంచి మాటలతో ఆ కూలీ దగ్గరకి మెల్లగా చేరుకుని, ఆపై హఠాత్తుగా అతని పెడరెక్కలు విరిచి తాడుతో కట్టేశాం. బక్కగా కనిపిస్తున్న ఆ కూలీని కట్టేయటం నాకు, పాండేకి చాలా కష్టంగా అనిపించింది. అతని బక్కశరీరంలో ఇంత బలం ఎలా ఉందో? మాకు అర్థం కాలేదు. అలా కట్టివేయబడిన ఆ వ్యక్తి హఠాత్తుగా పాండేని మరియు ఇంకొకకూలీని ఏకకాలంలో తన శరీరంతో నెట్టాడు. ఆ నెట్టుడికి వాళ్ళిద్దరూ దాదాపు చెరొక ఐదు అడుగుల దూరంలో పడ్డారు. నిజానికి పాండే బలహీనుడు ఏమీకాదు. అతను 6.2 అంగుళాల ఎత్తులో, బలిష్టమైన దేహంతో ఉంటాడు. అలాంటివాడిని అంతదూరం వెళ్ళి పడేలా నెట్టగలిగిన ఆ బక్క కూలీ బలం ఏమిటో? ఎవరికీ అర్థంకాలేదు.

ఆ తరువాత అతడిని భుజంపై వేసుకుని బయటకు తీసుకువద్దామని ప్రయత్నించిననాకు అది సాధ్యపడలేదు. కారణం సన్నగా రిపటలాగా కనిపిస్తున్న ఆ కూలీ దాదాపు 150 కిలోల బరువు ఉన్నట్టుగా నాకు అనిపించింది. ఆ వ్యక్తి పెద్దగా అరుస్తూ తన కట్లు విప్పుకోవటానికి శతవిధాల ప్రయత్నిస్తున్నాడు. అతడుగాని కట్లు విప్పుకుంటే మమ్మల్ని అందర్నీ చంపేస్తాడని అనిపించింది. ఇంతలో మరో పదిమంది కూలీలు బయటనుండి అక్కడకు వచ్చారు. మొత్తం కూలీలు ఒకట్టై ఆ బక్క కూలీని బలవంతంగా నేలమీద బోర్లా పడుకోపెట్టారు. అతడు అక్కడకు వచ్చిన వాళ్ళందరినీ ఉర్దూభాషలో పచ్చిబూతులుతిట్టటం ప్రారంభించాడు. ఆ తరువాత ఒక మంత్రగాడిని అక్కడికి తీసుకువచ్చాం. ఆ మంత్రగాడు ఏవేవో పూజలుచేసి ఆ వ్యక్తి ముఖాన కుంకుమబొట్టుపెట్టి ఆ తరువాత అతడిని ఇలా ప్రశ్నించాడు. "ఎవరు నువ్వు? ఎందుకు ఈ వ్యక్తిని ఆవహించావు? మర్యాదగా నిజంచెప్పు?" అపుడు ఆ వ్యక్తి విచిత్రమైన స్వరంతో ఇలా చెప్పటం ప్రారంభించాడు. నాపేరు హిమ్మత్‌ఖాన్ నేను ఆఫ్ఘనిస్తాన్‌లో ఉంటాను. నేను బొంబాయిలోకూడా వ్యాపారం చేస్తూ ఉండేవాడిని. 20వ శతాబ్దం ప్రారంభ భాగంలో నా వ్యాపార భాగస్వాములు డబ్బుకోసం నన్ను రహస్యంగా హత్యచేయించారు. ఆ తరువాత నా శరీరాన్ని ఇక్కడ ఉన్న సరస్సులో పడవేసారు.

నా ఆత్మశాంతికోసం నాకు జరపాల్సిన ప్రక్రియలు జరిపితేనే నేను ఇతన్ని వదలిపెట్టి వెళ్ళిపోతాను. నా మృతదేహాన్ని ఏ సమయంలో అయితే ఆ సరస్సులోకి విసిరేశారో ప్రతిరోజూ అదే సమయంలో నేను డామ్‌కి సరస్సుకి మధ్య ఉన్న ఇరుకురోడ్డులో ఒకచోట కొంతసేపు ఉంటూఉంటాను. నా శరీరం ఇప్పుడు ఎముకల గుట్టగా మారిపోయింది. అంతేకాకుండా ఆ పఠాన్‌ఆత్మ సరస్సులో ఏ ప్రాంతంలో తన ఎముకలు ఉన్నాయో గుర్తులతోసహా చెప్పింది. ఆ తరువాత పాండే తన పలుకుబడిని ఉపయోగించి కొంతమంది అధికారుల సహకారంతో కొందరు గజ ఈతగాళ్ళను రప్పించి ఆ సరస్సులో అడుగున పఠాన్ ఎముకలకోసం బతికించాడు. విచిత్రం ఏమంటే పఠాన్ ఆత్మ చెప్పినచోట ఒక భారీ ఆకారంలో ఉన్న చెదిరిపోయిన అస్తిపంజరం కనిపించింది. దాన్ని ఆ గజ ఈతగాళ్ళు అతి జాగ్రత్తగా ఒడ్డుకుచేర్చారు. ఆ తరువాత కొంతమంది ముస్లిం పండితుల్ని పిలిపించి ఆ అస్తిపంజరానికి వాళ్ళ మత సాంప్రదాయాల ప్రకారం అంత్యక్రియలు జరిపి ఆ తరువాత దాన్ని ఖననంచేసారు. విచిత్రం ఏమంటే ఈ కార్యక్రమం పూర్తి అయ్యిందో లేదో అప్పటిదాకా భయంకరంగా ప్రవర్తిస్తున్న ఆ కూలీ హఠాత్తుగా మామూలుగా మారిపోయాడు.

కొన్నిసార్లు యదార్థాలుకూడా నమ్మశక్యంకానివిధంగా ఉంటాయి. సూర్యుడు ఉంటాడు అన్న విషయం తెల్లవారితేకాని తెలియదు. రాత్రి సమయంలో సూర్యుడు కనపడనంతమాత్రాన సూర్యుడు లేడు అని వాదించటం ఎంత మూర్ఖత్వమో, తెలిసీ తెలియకుండా ఆత్మలు లేవు అనటం అంతే తెలివితక్కువతనం కాదా!.



# 8. లెవిరేట్ మ్యారేజ్ మర్మం ఏమిటి?

లెవిర్ (Levir) అనే లాటిన్ పదం నుండి జన్మించిన లెవిరేట్ (Levirate) అన్న ఆంగ్ల పదానికి అర్థం భర్తయొక్క తమ్ముడు లేదా అన్న అని. లెవిరేట్ మ్యారేజ్ అంటే తన భర్త చనిపోయిన స్త్రీ అతని సోదరుడిని అనగా తన మరిదిని బావగారిని వివాహం చేసుకొనుట అని గ్రహించాలి. ప్రపంచంలోని అనేక దేశాలలో ఈ వివాహం అమలులో ఉన్నది. ముఖ్యంగా బయట జాతులకు చెందిన వారితో వివాహాలు నిషేధించబడ్డ జాతులలో ఈ రకమైన వివాహాలు వాడుకలో ఉన్నాయి. ఈ విధానం వల్ల భర్త చనిపోయిన స్త్రీ క్షేమంగా ఉంటుందని, భర్త సోదరుడినే వివాహం చేసుకుంటుంది కనుక ఆమె ఆస్తి పరాయివాళ్ళకు పోకుండా ఉంటుంది. అయితే ఈ వివాహ విధానంవల్ల స్త్రీలు ఎల్లకాలమూ పురుషులపై ఆధారపడి వారి అదుపు ఆజ్ఞలలో ఉండవలసి ఉంటుందని ఆధునికులు వాదిస్తున్నారు. యూదు మతంలోకూడా ఈ రకమైన వివాహాలు అంగీకరించబడ్డాయి. తన సోదరునియొక్క సంతానంలేని భార్యను ఒక పురుషుడు తప్పనిసరిగా వివాహం చేసుకుని ఆమెను, ఆమె ఆస్తిని సక్రమంగా కాపాడాల్సి ఉంటుందని హీబ్రూ బైబిల్‌లో పేర్కొనబడినది.

ఏ కారణంగా అయినా ఒకవ్యక్తి, చనిపోయిన తన సోదరునియొక్క భార్యను వివాహం చేసుకోవటానికి అంగీకరించనట్లయితే ఆ భార్య (విడో) తన మరిది ముందు నేలమీద ఉమ్మివేసి, ఆపై అతని ఒక కాలికిఉన్న బూటును ఊడదీసి అవతలపారేస్తుంది. అప్పటినుండి ఆవ్యక్తి ఒక్క బూటును మాత్రమే ధరించి నడవ వలసి ఉంటుంది. ఫలితంగా అతన్ని ఆ ప్రాంతంలోని ప్రజలు "ఒక బూటులేనివాడు" అని హేళన చెయ్యటం జరుగుతుంది. ఆ తరువాత కాలంలో యూదు చట్టం ఈరకమైన వివాహాన్ని చాలావరకు నిషేధించటం జరిగింది. షరియత్ (ఇస్లామిక్ చట్టం) వివాహ సంబంధమైన అనేక నియమాలను ముస్లిం మతస్తులకు విధించటం

జరిగింది. ఒక స్త్రీ అనుమతి లేకుండా చనిపోయిన **ఆమెభర్త**యొక్క సోదరుడు ఆమెను వివాహం చేసుకోకూడదని ఖురాన్‌లో చెప్పబడి **ఉన్నది.**

ఒకప్పుడు సోవియట్ రష్యాలో భాగంగా ఉన్న **కిర్గిజిస్థాన్** అనే చిన్నదేశంలోని ముస్లిం మతాన్ని పాటించే గిరిజనులలో ఈవిధమైన వివాహాలు అధికంగా జరుగుతూ ఉంటాయి.

భారతదేశంలోకూడా ఇలాంటి ఆచారం అమలులో ఉన్నది. ముఖ్యంగా పంజాబ్ మరియు హర్యానా ప్రాంతాలలో నివసించే జాట్‌కులానికి చెందిన హిందువులు ఈవిధమైన వివాహ వ్యవస్థను కలిగి ఉన్నారు. ఈ వివాహాన్ని అక్కడ **లాట్టాఓఢ్‌నా** అని పిలుస్తారు. హర్యాన్‌వి భాష (హర్యానా రాష్ట్ర ప్రాంతీయ భాష) లో లాట్టా అంటే మేలిముసుగు అని (స్త్రీలు తమ తలను, ముఖాన్ని కప్పుకునే మేలిముసుగు) ఓఢ్‌నా అంటే కప్పుకోవటం లేదా ధరించటం అని అర్థం. ఇదే వివాహాన్ని ఇతర ఉత్తరభారతదే ప్రాంతాలలో **చదర్‌ఢాక్‌నా** అని పిలుస్తారు. చదర్ అంటే హిందీలో మేలిముసుగు అని, ఢాక్‌నా అంటే ధరించటం అనిఅర్థం. అనేక శతాబ్దాలనుండి పంజాబ్, హర్యానా రాష్ట్రాలలోని వ్యవసాయ కుటుంబాలలో ఈవిధమైన వివాహం అమలులో ఉన్నది. ఈవిధంగా చనిపోయిన భర్తయొక్క సోదరుడుని ఒక స్త్రీ వివాహం చేసుకోవటంవల్ల ఆ కుటుంబంయొక్క జీవన విధానం యధాతథంగా కొనసాగిపోతుంది మరియు ఆ కుటుంబ ఆస్తులు క్షేమంగా ఉంటాయి. అయితే భర్త చనిపోయిన స్త్రీకి పురుష సంతానం లేకపోయినా, భర్త సోదరుని వివాహం చేసుకునే అవకాశం లేకపోయినా ఆ స్త్రీ తనభర్తయొక్క మేనల్లుడిని కాని, సోదరుడి కొడుకునికాని దత్తత తీసుకుని కుమారునిగా పెంచుకోవచ్చు.

కొన్నిసార్లు ఒక భర్తచనిపోయిన స్త్రీ తన భర్తయొక్క తమ్ముడిని వివాహం చేసుకోవటం జరుగుతుంది. ఈ వివాహ నియోగ అని పిలుస్తారు. ఈరకమైన వివాహాలు చాలా నిరాడంబరంగా అతికొద్దిమంది బంధువుల సమక్షంలో జరుగుతాయి. ప్రస్తుతం పంజాబ్, హర్యానా రాష్ట్రాలలోని మారుమూల గ్రామీణ ప్రాంతాలలో మాత్రమే ఈవిధమైన వివాహాలు జరుగుతున్నట్టుగా తెలుస్తున్నది.



# 9. ఆత్మఘోషలతో నిండిన విభిన్న ప్రదేశాల వివరాలు?

భూమిమీద నివసించే వ్యక్తుల భావోద్వేగాలు (ప్రేమ, కోపం, ద్వేషం, కుచ్చితం) వారు నివసించే ప్రదేశంపై తప్పనిసరిగా ప్రభావాన్ని చూపిస్తాయి. ఒక ప్రదేశంలో హింసాకాండలు, కల్లోలాలు ఏళ్ళ తరబడి కొనసాగినట్లయితే ఆ సంఘటన తాలూకు వైబ్రేషన్స్ ఆ ప్రదేశాన్ని ఆవరించి చాలాకాలంపాటు ఉంటాయి. ఇలాంటి వైబ్రేషన్స్ అక్కడికి కొత్తగా వచ్చే వాళ్ళమీదకూడా ఎంతో ప్రభావాన్ని చూపిస్తూ ఉంటాయి. అలాంటి కొన్ని అమానుషమైన ప్రదేశాల గురించి ఈ అధ్యాయంలో మీకు తెలియజేస్తున్నాను. నేను అందిస్తున్న ఈ సమాచారంలో పూర్తిగా నిప్పులాంటి నిజాలే దాగిఉన్నాయి అని పాఠకులు గ్రహించగలరు.

**✍ తలలేని పిశాచి :**

కాన్పూరు విమానాశ్రయానికి 15 కి.మీ. దూరంలో ఉన్న ఒక శ్మశానంలో తలలేని ఒక పిశాచం సంచరిస్తూ ఉంటుందని తెలిసింది. అనేకమందికి రాత్రి సమయాలలో ఆ ప్రేతాత్మ కనిపించిందని ఆ ప్రాంతానికిచెందిన అనేకమంది చెప్పటం జరిగింది. కొన్నిసార్లు ఆ శ్మశానానికి దగ్గరలో ఉన్న ఒక మంచినీటి కుళాయి దగ్గరకి నీళ్ళు తాగటానికి వెళ్ళినవారికి మధ్యాహ్న సమయంలోకూడా ఆ శిరస్సు లేని ప్రేతాత్మ కనిపించినట్టుగా తెలుస్తుంది. రాత్రి సమయాలలో ఎవరైనా ఆ శ్మశానంలోకి ప్రవేశిస్తే అతిభయంకరమైన శబ్దాలు వినిపిస్తాయట. అర్ధరాత్రి సమయాలలో ఆ శ్మశానంలోకి వెళ్ళిన అనేకమంది ప్రాణాలతో తిరిగిరాలేదు.

**✍ నీళ్ళ తొట్టిలో ప్రేతాత్మ :**

సుమారు 4 దశాబ్దాల క్రితం జరిగిన యదార్థ సంఘటన ఇది. బలన్మరణం పొందిన మానవులయొక్క ఆత్మలు దయ్యాలుగా మారతాయని నిరూపించే ఒక సంఘటన గురించి ఒక వ్యక్తియొక్క అనుభవాన్ని అతని మాటల్లోనే తెలుసుకుందాం. అది 1971వ సంవత్సరం. అపుడు నేను చాలా చిన్నవాడిని. మా కుటుంబం మొదట్లో సౌదీ అరేబియాలోని జెడ్డా నగరంలో నివాసం ఉండేది. మా నాన్నకి ట్రాన్స్‌ఫర్ అవటం వల్ల మా కుటుంబం జెడ్డానుండి రియాధ్ నగరానికి వెళ్ళిపోవటం జరిగింది. మాకు ఆ నగరంలో ఒక పాతకాలంనాటి రాజభవనంలాంటి ఇల్లు అద్దెకు లభించింది.

అరేబియా ఆర్మీలో జనరల్‌గా పనిచేస్తున్న ఒకవ్యక్తికి చెందిన ఆ ఇల్లు చాలాకాలంగా నిర్మానుష్యంగా ఉంటున్నది. అప్పటికి నాకు 11 సంవత్సరాలు, నా చెల్లెలికి 9 సంవత్సరాలు, తమ్ముడికి 7 సంవత్సరాలు. ఇంకొక చెల్లెలికి 5 సంవత్సరాల వయస్సు ఉంటుంది. అతి పెద్దదిగా ఉండే ఆ ఇంటిచుట్టూ ఎత్తుగా ఉన్న యూకలిప్టస్ చెట్లు ఆవరించి ఉన్నాయి. మేము వచ్చేవరకు కొన్ని సంవత్సరాలుగా ఆ ఇల్లు ఖాళీగా ఉంటున్నది. ఆ ఇంట్లో అలవాటు పడటానికి మా కుటుంబానికి కొన్ని వారాలు సమయం పట్టింది. ఇంటి లోపలి భాగంలోని గోడలు చక్కటి రంగులతో పెయింట్ వేయబడి ఉన్నాయి. ఆ ఇంటి వాకిటి భాగంలో ఉన్న తోటలో ఒక నీళ్ళ తొట్టి ఉన్నది. గొట్టాలద్వారా వచ్చేనీరు ఆ తొట్టెలోకి చేరుకుంటాయి. ఆ తొట్టెమీద ఒక పెద్దమూతకూడా వెయ్యబడి ఉన్నది. మేము చిన్న పిల్లలం కనుక పొరపాటుగా ఆ తొట్టెలో పడతామేమో అన్న భయంతో ఎప్పుడూకూడా ఆ తొట్టెమీద ఉన్న మూతను తియ్యవద్దని మా అమ్మ నాకు ఎన్నోసార్లు గట్టిగా చెప్పటం జరిగింది.

ఇలా కొద్ది వారాలు గడచిన తరువాత ఒకరోజు అర్ధరాత్రి ఏదోఒక అదృశ్య స్త్రీ స్వరం నన్ను పేరుతోపెట్టి పిలవటం జరిగింది. అయితే ఆ పిలవటంకూడా విచిత్రంగా ఉన్నది. వేగంగా మరియు గుసగుస లాడుతున్నట్టుగా ఆ పిలుపులు ఉండేవి. వెంటవెంటనే ఆ పిలుపులు వినిపిస్తూ ఉండేవి. రషీద్-రషీద్-రషీద్ అన్న ఆ పిలుపులు నన్ను రాత్రి సమయాలలో భయభ్రాంతుల్నిచేస్తూ ఉండేవి. ఒకసారి అందరూ బయటకువెళ్ళగా నేను ఒక్కడినే ఇంట్లో ఉన్న సమయంలో ఈ పిలుపుల్ని నేను తొలిసారి వినటం జరిగింది. మొదట్లో మా అమ్మ ప్రక్క గదిలో ఉండి నన్ను పిలుస్తున్నదేమో అని అనుకున్నాను. కానీ మా అమ్మ అప్పటికే మిగిలిన పిల్లలతో కలిసి బయటకు వెళ్ళి ఉండటంతో నన్ను పిలిచింది ఎవరో అర్థంకాక అయోమయానికి గురి అయ్యాను. ఆ పిలుపులు ఆగకుండా వినపడటంతో నా కాళ్ళు, చేతులు భయంతో వణికిపోయాయి. నేను ఎలాగో ధైర్యం చేసుకుని వాకిట్లోకి వెళ్ళి మా అమ్మవాళ్ళకోసం ఎదురుచూస్తూ నుంచున్నాను. మా చిన్న చెల్లెల్ని చూసుకోవటంకోసం నియమించబడిన ఆయాకికూడా ఒక ప్రేతాత్మ అనేకసార్లు కనిపించినట్టుగా ఆమె మాకు చెప్పింది.

ఒకరోజు అర్ధరాత్రి ఆ ఆయా నా బెడ్‌రూంలోకి వచ్చిందట. అపుడు నేను నా బెడ్‌పై నిద్రపోతూ ఉన్నానని, ఆ సమయంలో నా ప్రక్కన ఒక స్త్రీ ఆకారం పాకుతున్నట్టుగా ఆమెకు కనిపించిందట. ఆ తరువాత కొద్దిరోజులకి నా మంచంమీద నాతోపాటు పడుకుని ఉండే ఒక స్త్రీ ప్రేతాత్మ నాకు కనిపించటం ప్రారంభం అయ్యింది.

నేను గాఢ నిద్రలో ఉన్నపుడు ఆ ప్రేతాత్మ నన్ను తట్టి లేపటం, నేను కళ్ళు తెరచిచూసేసరికి అక్కడ ఏమీ కనపడకపోవటం అనేక రాత్రులపాటు జరిగింది. నాకు ఎవ్వరూ కనపడకపోయినప్పటికీ, ఎవరో నాకు బాగా దగ్గరగా ఉన్న అనుభూతి కలుగుతూ ఉండేది. నా ప్రక్కన ఎవరూలేకపోయినా ఎవరో ఒక అదృశ్యశక్తి నాకు తగిలేటట్టుగా ఊపిరి వదలినట్టుగా నాకు అనిపించేది. ఒక్కొక్కసారి నాకు విపరీతమైన చలిగా అనిపించేది. ఆ చలి ఎంత తీవ్రంగా ఉండేది అంటే నాకు ఊపిరికూడా ఆడేదికాదు. ఎవరో నన్ను ఎల్లప్పుడూ గమనిస్తున్నట్టుగా నాకు అనిపిస్తూ ఉండేది. ఒకరోజు ఉదయం నేను, మా అమ్మ వంటగదిలో కూర్చుని టీ త్రాగుతూ మాట్లాడుకుంటూ ఉన్నాం.

ఇంతలో మాకు, బయటనుంచి ఎవరో భారీవ్యక్తి బూట్లతో నడుస్తూ వంటగదివైపు వస్తున్నట్టుగా అడుగుల శబ్దం వినపడింది. దాంతో మేం మాటలు ఆపి వంటగది బయటకువచ్చి చూడగా అక్కడ ఎవరూ కనపడలేదు. మా నాన్న అప్పుడు తన బెడ్‌రూంలో గాఢ నిద్రలో ఉన్నాడు. అంటే ఆ బూట్ల చప్పుడు మానాన్నవికావు అని నాకు అర్థం అయ్యింది. నేను ఇంట్లో పనులు చేసుకునేటప్పుడు ఎవరో నన్ను వెన్నంటి ఉంటున్నట్టుగా నాకు అనిపిస్తూ ఉండేది. ఒక రోజున నేను వాకిట్లో ఉన్న మా తోటలోకి వెళ్ళి అక్కడ ఉన్న నీళ్ళతొట్టెపై ఉన్న మూతను తీసివేసాను ఒకరోజు మధ్యాహ ఎవరో ఆదేశించినట్టుగా నేను అప్రయత్నంగా ఆ నీళ్ళ తొట్టె దగ్గరకు వెళ్ళి చూసాను ఇంతలో నా వెనకాల ఎవరో నుంచున్నట్టుగా అలికిడి వినిపించింది. గిరుక్కున వెనక్కి తిరిగాను. నా వెనకాల, తలనుండి పాదాలవరకు నల్లని ముసుగు వేసుకున్న ఒక ఆకారం కనపడింది. నేను భయంతో నేలపై వెల్లికిలాపడి మూర్ఛపోయాను. ఆ తరువాత సంవత్సరానికి ఆ ఇంటికి కొత్త పెయింట్ వేయబడింది.

ఆ తరువాత అనేక రాత్రులు ఆ స్త్రీ ప్రేతాత్మ నన్ను వెంటాడుతూనే ఉండేది. ఆ తరువాత మేము అక్కడ నుండి ఇంకొక కొత్త ఇంట్లోకి మారాం. ఒకరోజు రాత్రి మా అమ్మ ఇలా చెప్పటం మొదలుపెట్టింది. "మనం ఉండివచ్చిన పాత ఇంట్లో గతంలో ఒక జంట ఉండేది. ఏ కారణంగానో భర్త తన భార్యను చంపి ఆ ఇంటి లాన్(తోట)లోని నీటి తొట్టెలో శవాన్ని కొంతకాలం దాచిపెట్టాడు. బలన్మరణంపొందిన ఆ భార్య ప్రేతాత్మగామారి ఆ తొట్టెలోనే నివసించటం ప్రారంభించింది. ఈ ఇంటికి వచ్చిన మొదట్లో నాకు ఆ ప్రేతాత్మ ఎన్నోసార్లు కనిపించింది. కానీ ఆ విషయం చిన్న పిల్లలైన మీకు చెబితే మీరు భయపడతారని చెప్పలేదు". నిజానికి నాకుకూడా ఆ ప్రేతాత్మ కనిపించింది. కానీ నేను ఎన్నడూ ఆ విషయం మా అమ్మకి చెప్పలేదు.

## మళ్ళీ బ్రతికిన పసిబిడ్డలు :

నేపాల్‌దేశానికి చెందిన ఒక హైందవ యువకుడు తనకు తెలిసిన ఒక భయానకమైన అనుభవం గురించి మనతో పంచుకుంటున్నాడు..........

అప్పుడు నా వయస్సు దాదాపు 10 సంవత్సరాలు ఉంటుంది. మా నాయనమ్మ కొండలమయమయిన నేపాల్ దేశంలో నివాసం ఉండేది. నేపాల్‌లోని అనేక ప్రాంతాలలో దయ్యాలు సంచరిస్తూ ఉంటాయని అక్కడ ప్రజలు నమ్ముతూ ఉంటారు. ఒకసారి మా నాయనమ్మ ఉండే ప్రాంతంలోని ఐదు కుటుంబాలలో ఒకేసారి ఐదుగురు పిల్లలు పుట్టారు. విచిత్రంగా ఆ పిల్లలు పుట్టిన రాత్రే మరణించారు. ఆ బిడ్డల తల్లిదండ్రులు ఎంతగానో రోదిస్తూ ఆ బిడ్డల శవాల్ని ఐదు గోతులు తవ్వి వరుసగా పూడ్చిపెట్టారు. ఆ మర్నాటి రాత్రి ఒకవ్యక్తి ఈ పిల్లల్ని పాతిపెట్టిన సమాధులు ఉన్న ప్రాంతంలో ప్రయాణిస్తూ ఉండగా అతనికి ఒక భయానకమైన దృశ్యం కనిపించింది. అది ఏమిటంటే ఆ సమాధులు ఉన్న శ్మశానంలో కొన్ని కాగడాల పిడి భాగాలు నేలలోకి దించబడి వెలుగుతున్నాయి. ఆ వెలుగులో అక్కడ కూర్చున్న ఐదుగురు స్త్రీ మంత్ర గత్తెలు గరగరలాడే స్వరంతో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళచుట్టూ ఐదు పసిపిల్లల ప్రేతాత్మలు పరుగెడుతూ ఆడుకుంటున్నాయి. ఆ మంత్రగత్తెలు భూమిలో పాతిపెట్టబడిన పసిపిల్లల శవాలను తలాఒకటి తినాలని నిర్ణయించుకున్నారు. అయితే వారిని చూసిన ఆ వ్యక్తి గొప్ప మంత్రగాడు కావటంతో తనశక్తితో ఆ ఐదు పసిపిల్లల ప్రేతాత్మలను మరల ఆ పసిపిల్లల శవాలలో ప్రవేశపెట్టి మరల ఆ బిడ్డల్ని బ్రతికించి వాళ్ళని వాళ్ళ, వాళ్ళ గృహాలలో ఉన్న ఉయ్యాలలలో ఉంచాడు. మూడు రోజుల క్రితం భూమిలో పాతిపెట్టబడిన తమ పసిబిడ్డలు సజీవంగా మరల ఉయ్యాలలలోకి ఎలా వచ్చారో ఆ బిడ్డల తల్లిదండ్రులకు ఎప్పటికీ అర్థంకాలేదు.

## ప్రేమకు చావులేదు :

మద్రాసుకి చెందిన సౌజన్య అనే ఒక యువతి తనకు ఎదురయిన ఒక యదార్థ సంఘటన గురించి ఇలా తెలియజేస్తున్నది..........

1989 ప్రాంతంలో నేను సైకాలజీలో డిగ్రీ పొందాను. ఆ తరువాత ఒక ప్రభుత్వ కంపెనీలోని పర్సనల్ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగంలో చేరాను. ఆ సమయంలో శేఖర్ అనేవ్యక్తి నా సహ ఉద్యోగిగా ఉండేవాడు. అతడు చాలా అందంగా, బలిష్ఠంగా ఆకర్షణీయంగా ఉండేవాడు. అతను నాకన్నా 11 సంవత్సరాలు పెద్దవాడు.

కాలక్రమంలో అతను నాకు మంచిస్నేహితుడుగా మారిపోయాడు. శేఖర్‌కి ఒక పెద్ద కుటుంబం ఉండేది. ఆ కుటుంబం మొత్తాన్ని పోషించే బాధ్యత శేఖర్‌మీదే ఉండేది. నేను చాలాసార్లు శేఖర్ బైక్‌మీద వాళ్ళఇంటికి వెళ్ళాను. ఆ ఇంట్లో అందరికీ నేను నచ్చాను. 1990లో శేఖర్ నన్ను పెళ్ళి చేసుకుంటానని అన్నాడు. అప్పటికే అతడిని ఎంతగానో ఇష్టపడుతున్న నేను సంతోషంగా అందుకు అంగీకరించాను. 1991 వచ్చింది. మా తల్లిదండ్రులు శేఖర్‌తో పెళ్ళికి ఇష్టపడలేదు. ఉద్యోగం తప్ప ఏ ఆస్తీలేని శేఖర్‌ని పెళ్ళి చేసుకుని ఏమి సుఖం పొందుతావు? వాడిని మర్చిపో! అన్నాడు మా నాన్న. మిలటరీకి వెళ్ళి వచ్చిన మా నాన్న సహజంగా కోపిష్టివాడు. అందువలన ఆయన, శేఖర్‌ని వ్యక్తిగతంగా కలుసుకుని మా అమ్మాయిని మర్చిపో! లేకపోతే ప్రమాదంలో పడతావు అని హెచ్చరించాడు.

ఆ విషయం తెలిసిన నేను బాధతో ఉద్యోగం మానేసి ఇంట్లో ఉండిపోయాను. ఆ తరువాత కొద్ది వారాలపాటు శేఖర్‌కి సంబంధించిన ఏ సమాచారం నాకు తెలియలేదు. మా పెద్దవాళ్ళు శేఖర్‌తో పెళ్ళికి అంగీకరించరని అర్థంచేసుకున్న నేను ఒకవిధమైన వైరాగ్యానికి గురిఅయి ఇంట్లోనుంచి బయటకు వెళ్ళకుండా ఇంట్లోనే స్వచ్ఛందంగా బందీని అయిపోయాను. కాలం భారంగా గడుస్తున్నది. 1994 జూన్ 2వ తేదీ ఉదయం శేఖర్ మేనత్త దగ్గర నుండి నాకు ఒక టెలిగ్రాం వచ్చింది. శేఖర్ జూన్ 1వ తేదీన కారు ప్రమాదంలో చనిపోయాడని ఆ టెలిగ్రాంలో ఉన్నది. ఆ టెలిగ్రాంలో ఉన్న వార్త అబద్ధం అయితే బాగుండును అని ఆశపడ్డ నేను శేఖర్ అత్తకు ఫోన్‌చేసి మాట్లాడాను. అతని మేనత్త చెప్పిన మాటలు విని నేను ఎంతగానో క్రుంగిపోయాను. మా నాన్న తనని హెచ్చరించిన తరువాత శేఖర్ ఉద్యోగం మానేసి తన ఊరు వెళ్ళిపోయి అక్కడ తాగుడు మొదలుపెట్టాడు. కాలక్రమంలో అతని ఆరోగ్యం చెడిపోయింది. అతనికి నిమోనియా రోగం వచ్చింది. అలాంటి పరిస్థితులలో బయటకు వెళ్ళిన అతడిని ఒక కారు గుద్దింది. శేఖర్ దారుణమైన మరణానికి గురి అయ్యాడు. అతను చనిపోయే సమయంలో అనేకసార్లు నీ పేరు తలుచుకున్నాడు అని ఆమె చెప్పింది.

అయితే అతడి పార్థివ దేహాన్ని చూడటానికికూడా నా తల్లిదండ్రులు నన్ను అనుమతించలేదు. నేను ఏడుస్తూ నా గదిలో బెడ్‌మీద పడుకుని ఎప్పటికో నిద్రలోకి జారుకున్నాను. ఆ నిద్రలో నాకోసం తన జీవితాన్ని నాశనం చేసుకున్న శేఖర్ రోదిస్తూ కనిపించాడు. జనవరి 5, 1995 ఆ రోజు నా బర్త్‌డే. ఇంకా కొద్దిసేపటిలో

తెల్లవారుతుంది అనగా శేఖర్ నాకు కలలో కనిపించాడు. "నేను ఎక్కడికీ పోలేదు. నీవెంటే ఎప్పటికీ ఉంటాను" అన్నాడు. నేను కలలోనే ఏడుస్తూ "శేఖర్! మావాళ్ళను ఎదిరించే ధైర్యంలేక నిన్ను దూరంచేసుకున్నాను నన్ను క్షమించు" అన్నాను శేఖర్‌తో. అతడు నన్ను ఓదారుస్తూ బాధపడకు నేను మళ్ళీ వస్తాను అనిచెప్పి అదృశ్యం అయి పోయాడు. ఆ తరువాత నేను ఎప్పుడూ అతనికోసం బాధపడుతున్నా అతడి ఆత్మ నన్ను ఓదారుస్తూనే ఉంటుంది.

చనిపోయినా నన్ను ఇంకా అంటిపెట్టుకుని ఉన్న శేఖర్ ఆత్మమీద ఉన్న ప్రేమను చంపుకోలేని నేను ఇప్పటికీ పెళ్ళిచేసుకోకుండా ఉండిపోయాను.

### ఆ భవనంలో ఏం జరిగింది? :

బొంబాయికి చెందిన ఒక యువకుడు ప్రేతాత్మలకు సంబంధించిన తన అనుభవాన్ని గురించి ఇలా వివరిస్తున్నాడు..........

చాలాకాలంగా నేను దయ్యాలు లేవు అని నమ్ముతూ ఉండేవాడిని. కానీ ఇటీవల కాలంలో నాకు ఎదురయిన ఒక అనుభవం నా నమ్మకాలను సమూలంగా మార్చి వేసింది. అది ఎలాగంటే....

గత సంవత్సరం నేను ముంబాయిలో ఒక కాలేజీలో డిగ్రీ ఫైనల్ ఇయర్ చదువుతూ ఉన్నాయి. నాకు ఒక మిత్ర బృందం ఉన్నది. వారిలో అత్యంత ముఖ్యుడు శివాజీ. అతను తనకు పిత్రార్జితంగా వచ్చిన సొమ్ముతో ముంబాయిలోని ఖండాల ప్రాంతంలో ఒక పెద్ద బంగళా కొనుగోలుచేసాడు. ఫ్రెండ్స్ అందరూ కలిసి ఒక మూడు రోజులపాటు ఆ భవనంలో పిక్‌నిక్ లాంటిది చేసుకుందామని శివాజీ మా మిత్ర బృందంతో అన్నాడు. మేము అందరం ఆనందంగా అందుకు అంగీకరించాం.

ఐదుగురు యువకులు, నలుగురు అమ్మాయిలతో కూడిన మా మిత్రబృందం మినీబస్సులో ఖండాల బయలుదేరాం. రాత్రి 11 గంటల ప్రాంతంలో మా బస్సు శివాజీ కొన్న భవనం దగ్గరకు చేరింది. ఒక తమాషా ఏమంటే ఆ ప్రదేశంలో కేవలము భవనాలు మాత్రమే ఉన్నాయి. అపార్ట్‌మెంట్లు లేవు. ఆ రాత్రి సమయంలో ఆ బంగ్లాకు చేరుకున్న మేము కొంచెం ఆందోళనగా ఫీలయ్యాం. ఆ బంగళా ఉన్న ప్రదేశం దట్టమైన చెట్లమధ్యలో ఉన్నది. అసలు ఖండాల ప్రాంతమే ఒక అడవిలాగా కనిపిస్తుంది. ఆ రాత్రి చీకటిలో ఆ బంగళా చుట్టుప్రక్కల ప్రాంతం దయ్యాలతో నిండి ఉన్నట్టుగా నాకు అనిపించింది. గ్రౌండ్ ఫ్లోర్‌లో రెండు గదులు, ఫస్ట్‌ఫ్లోర్‌లో

నాలుగు గదులు మా మిత్ర బృందానికి కేటాయించబడ్డాయి. ఆ తరువాత మేము ఆ బంగళా వాకిటివైపు ఉన్న గార్డెన్‌లో కుర్చీలు వేసుకుని కూర్చున్నాం. అది రాత్రి సమయం మరియు చలికాలం కావటంతో ఆరుబయట కూర్చున్న మాకు విపరీతమైన చలిగా అనిపించింది. ఒక గంట గడిచిన తరువాత మా మిత్రబృందం బంగళాలోకి వెళ్ళి అక్కడ ఉన్న హాలులో కూర్చుని మళ్ళీ మాట్లాడుకోవటం మొదలుపెట్టాం.

శివాజి అందించిన స్వల్పాహారాన్ని మరియు టీని స్వీకరించి ఆపై ఒకరిపై ఒకరు జోకులు వేసుకుంటూ కాలక్షేపం చేస్తున్నాం. ఇంతలో మా మిత్ర బృందంలోని రాజు అనే ఒక వ్యక్తి హఠాత్తుగా లేచినుంచుని ఉష్! అని శబ్దంచేస్తూ మమ్మల్ని మౌనంగా ఉండమని సౌంజ్ఞచేసాడు. ఒకటి, రెండు నిమిషాలలో మా బృందం అంతా మౌనంగా ఉండిపోయాం. హఠాత్తుగామాకు ఫస్ట్‌ఫోర్లనుండి ఏవో శబ్దాలు వినిపించటం మొదలయ్యింది. పరిశీలనగా వింటే ఎవరో చప్పట్లు కొడుతున్నట్టుగా అనిపించింది. ఆ తరువాత ఎవరో వికటంగా నవ్వుతున్న ధ్వని వినిపించింది. కొద్ది సేపటికి ఏ శబ్దమూ వినిపించలేదు. మేము అందరమూ "ఏమిటిఇది?" అన్నట్టుగా శివాజీవైపు చూశాం. ఎవరైనా ఫస్ట్‌ఫ్లోర్‌లోకివెళ్ళి, అక్కడ ఈ శబ్దాలు ఎవరు చేస్తున్నారో చూసివస్తారా? అని శివాజీ మా మిత్రబృందాన్ని అడిగాడు. మా బృందంలోని వారంతా నావైపు చూశారు. నేను సహజంగా ధైర్యవంతుడిని మరియు మానవాతీత శక్తులు లేవు అని వాదిస్తూ ఉండేవాడిని కావటంతో మా మిత్రులు నన్నే పైకివెళ్ళి అక్కడ ఏమి జరుగుతుందో చూసిరమ్మని వత్తిడిచేసారు. ఇక నాకు వెళ్ళకతప్పని పరిస్థితి ఏర్పండింది. అయితే ఎల్లప్పుడూ నాకు తోడుగా ఉండే రాజుకూడా నా వెంట ఫస్ట్‌ఫ్లోర్‌లోకి రావటానికి సిద్ధపడ్డాడు. మేము ఇలా కుర్చీల్లోంచి లేచామో లేదో ఫస్ట్‌ఫ్లోర్‌లోంచి మళ్ళీ శబ్దాలు వినిపించటం మొదలయ్యింది. ఏమి చెయ్యాలో అర్థంకాక మళ్ళీ ఓ కుర్చీలో కూలబడిపోయాను. మా బృందంలోని ప్రతి ఒక్కరూకూడా పైకివెళ్ళి అక్కడ ఏం జరుగుతుందో తెలుసుకోవాలని వాదించారు. ఇంతలో పైనుంచి వినిపిస్తున్న శబ్దాలు అంతకంతకు అధికంగా కావటం మొదలయ్యింది. మేం అందరం ఏదో తెలియని భయానికి గురి అవుతున్నాం.

ఇక మాతోపాటు వచ్చిన నలుగురు ఆడపిల్లలు భయంతో వణకిపోతూ పెద్దగా ఏడ్వటానికి సిద్ధమవుతున్నారు. పైన ఏం జరుగుతుందో నీకు తెలియదా? అని శివాజీని అడిగాను. నిజంగా నాకు ఏమీ తెలియదు. నేను ఈ బంగళా కొన్నప్పుడు మొదటిసారి ఇక్కడకి వచ్చాను. ఇదిగో మళ్ళీ ఇపుడు రెండవసారి మీతో కలిసి

ఇక్కడకు వచ్చాను. కనుక నాకు ఈ బంగళాలో ఏం జరుగుతుందో తెలియదు అన్నాడు శివాజీ. ఇంతలో మా బృందంలోని ఆడపిల్లలు, నన్ను, రాజును కలిసి ఫస్ట్‌ఫ్లోర్‌లోకివెళ్ళి అక్కడ ఏం జరుగుతుందో తెలుసుకోమని అభ్యర్థించారు. అప్పటిదాకా ధైర్యంగా ఉన్న నేను ఆ శబ్దాలకు భయపడి, రాజు తోడు వచ్చినాసరే పైకి వెళ్ళటానికి సిద్ధపడలేదు. అపుడు ఆ అమ్మాయిలు, అందరం కలిసి ఆ బంగళానుండి బయటకు వెళ్ళిపోదాం అని శివాజీతో అన్నారు. అయితే నేను మరియు శివాజి అందుకు అంగీకరించలేదు. నిజానికి మాకు కూడా అక్కడ ఉండటానికి భయంగా ఉన్నది. ఇంతలో హాలులో గోడమీద ఉన్న గడియారం 3 గంటలు కొట్టింది. అంటే ఇంకో రెండు గంటల్లో తెల్లవారబోతున్నది అన్నమాట. ఆ చలిలో, చీకటిలో ఆ బంగళాలోంచి బయటకు వెళ్ళటం అంత క్షేమంగా నాకు కనపడలేదు. ఈ పరిస్థితికి తోడు అప్పుడప్పు సన్నటి వర్షం ప్రారంభం అయ్యింది. అందువల్ల తెల్లవారేదాకా అక్కడే ఎలాగో కాలక్షేపంచేసి తెల్లవారిన తరువాత అక్కడ నుండి వెళ్ళిపోదామని నిర్ణయించుకున్నాం.

నేను, రాజు మెళుకువగా ఉండి కాపలాకాస్తాం. మిగిలిన అందరూ నిద్రపోండి అని మా మిత్రబృందంతో చెప్పాను. వాళ్ళందరూ ఏదో నామమాత్రంగా కునుకు తియ్యటం ప్రారంభించారు. ఇంతలో గ్రౌండ్‌ఫ్లోర్‌లోంచి వినిపించే శబ్దాలు మరింత అధికమయినాయి. ఈసారి ఎవరో నడుస్తున్నట్టుగా అడుగుల చప్పుడు వినిపించింది. అంతలో ఎవరో ఈలలు వేసినట్టుగా వినిపించింది. పోనీ ఫస్ట్‌ఫ్లోర్‌లోని కిటికీ తలుపులు తెరచిఉంటే అందులోంచి గాలి లోపలికివచ్చి ఈ చప్పుళ్ళు అవుతున్నాయి అనుకుందామన్నా మేం వచ్చేసరికి ఆ భవనంలోని అన్ని కిటికీలు పూర్తిగా మూయబడి ఉన్నాయి. మాలో ఎవరికైనా బాత్రూంకి వెళ్ళాలనిపించినా ఒంటరిగా వెళ్ళటానికి భయంవేసి ఎవరికివారు తమ కార్యక్రమాన్ని వాయిదావేసుకుని అక్కడే కూర్చుండిపోయారు. ఉదయం 6 గంటల ప్రాంతానికి పైనుంచి వినిపిస్తున్న శబ్దాలు పూర్తిగా ఆగిపోయాయి. తెల్లవారిపోయింది కనుక అందరికీ మళ్ళీ ధైర్యం వచ్చింది.

నేను, రాజుని తీసుకుని ఫస్ట్‌ఫ్లోర్‌లోకి వెళ్ళి చూసాను. అక్కడ ఉన్న మొదటి బెడ్‌రూంలోకి తొంగిచూసాను. అందులో ఎవరూ లేరు. ఆ తరువాత రెండోబెడ్‌రూం తలుపుతీసుకుని లోపలికి వెళుతున్నపుడు ఎవరో నా జ ట్టను చేతివేళ్ళతో సవరిస్తున్నట్టు అనిపించింది. రాజుకి తన పాదాన్ని ఎవరో గట్టిగా తొక్కినట్టుగా అనిపిస్తున్నదని నాతో చెప్పాడు. ఈ అనుభవాలతో మా ఇద్దరికీ వళ్ళు జలదరించి శరవేగంతో అక్కడ నుండి గ్రౌండ్‌ఫ్లోర్‌కి వచ్చేసాం. క్రిందకు రాగానే పైన మాకు ఎదురయిన

అనుభవాన్ని మా స్నేహ బృందంతో చెప్పాం. అంతే ఎవరికి వాళ్ళు తమ లగేజి సర్దుకుని అక్కడనుండి వెళ్ళటానికి సిద్ధపడ్డారు. ఆ తరువాత కొద్దినిమిషాలకే ఆ బంగళా తలుపులువేసేసి మా మిత్రబృందం మా మినీ బస్సులో టౌంబాయికి బయలు దేరింది. ఆ తరువాత రెండు నెలలకి శివాజీ ఖండాలాలో ఉన్న తన భవనాన్ని ఎవరికో అమ్మేసి దాని పీడ వదలించుకున్నాడు.

ఆ ఇంట్లో ఒకప్పుడు జీవించిన కొందరు వ్యక్తుల్ని ఎవరో దోపిడీదొంగలు దారుణంగా చంపేశారని అలా చంపబడ్డ వ్యక్తులయొక్క ప్రేతాత్మలు ఆ భవనంలో ఇప్పటికీ సంచరిస్తున్నాయని ఆ తరువాత ఎవరి ద్వారానో మాకు తెలిసింది. కేవలం మనకు అనుభవంలోకి రానంతమాత్రాన దయ్యాలు లేవు అని వాదించటం మూర్ఖత్వం అవుతుంది.

## కిటికీ బయట! :

దాదాపు 12 సంవత్సరాల క్రితం సముద్రతీర ప్రాంతం అయిన మంగుళూరు (కర్నాటక) ప్రాంతంలో జరిగిన యదార్ధ సంఘటన ఇది.......

మా తాత, నాయనమ్మ కుటుంబం మంగుళూరులోని ఒక పెద్ద ఇంట్లో నివాసం ఉంటూ ఉండేది. ఈ భవనం ఉన్న ప్రాంతాన్ని సూరత్‌కల్ అని పిలుస్తారు. మా తాతగారి ఇంటికి నాలుగువైపులా మంచి అందమైన తోట ఉన్నది. పండుగ సమయాలలో మా కుటుంబంలోని వారందరూ ఆ భవనానికి వచ్చి నాలుగు రోజుల పాటు ఉల్లాసంగా కాలం గడుపుతూ ఉండేవారు. అలా వచ్చినవారిలో మా మేనమామలు, పిన్నమ్మలు, పెద్దమ్మలు, బావలు ఉండేవాళ్ళు. ఆ విశాలమైన భవనంలోని మధ్యభాగం డ్రాయింగ్‌రూంలాగా ఉపయోగపడుతూ ఉండేది. ఆ డ్రాయింగ్‌రూంకు ఎదురుగా పశ్చిమదిశలో అతిధులకోసం కేటాయించబడిన చిన్న బెడ్‌రూం ఉండేది. ఆ భవనం మధ్యభాగంలో అతిపెద్దదిగా ఉండే ఒక మాస్టర్‌బెడ్‌రూం కూడా ఉండేది. మాలో ఎక్కువమంది మాస్టర్‌బెడ్‌రూంలోనే పడుకుంటూ ఉండేవాళ్ళం. మా పిన్ని ఒక్కతే గెస్ట్‌లకోసం కేటాయించబడ్డ చిన్నబెడ్‌రూంలో ఒంటరిగా నిద్రపోతూ ఉండేది. ఆ చిన్నబెడ్‌రూంకి ఒక కిటికీ మాత్రమే ఉన్నది. ఆ కిటికీలోంచి చూస్తే కొంచెం దూరంలో పచ్చగా కనిపిస్తున్న వరి పొలాలు ఉండేవి. ఆ పొలాల మధ్యలో చిన్న పాతకాలంనాటి ఒక ఆలయం ఉండేది.

ఆ ప్రాంతంలోని ప్రజలు రాత్రి సమయాలలో ఆ గుడి ప్రాంతానికి ఎట్టి పరిస్థితిలోనూ వచ్చేవారుకాదు. ఆ ప్రాంతంలో రాత్రి సమయాలలో ఏవో

జరుగుతాయని అక్కడవాళ్ళు భావిస్తూ ఉండేవాళ్ళు. కాలం గడుస్తున్నది. ఒక ఉక్క పోసే రాత్రి సమయంలో మా భవనంలోనివారు విపరీతమైన ఉష్ణోగ్రతకు గురి అవుతున్నారు. ఇంతలో చిన్నబెడ్‌రూంలో పడుకుని ఉన్న మా పిన్ని కెవ్వుమని పెద్దగా కేకవేసింది. ఆ కేకకు ఉలిక్కిపడి నిద్రలేచిన మేం అందరం కంగారుగా మా పిన్ని ఉన్న బెడ్‌రూం దగ్గరకు పరుగెత్తాం. ఆ రోజు సాయంత్రం నేను నా సోదరులతో కలిసి ఇటీవలే ఆ ప్రాంతంగుండా వేయబడిన రైలు పట్టాలమీద ఎక్కువసేపు తిరిగిన కారణంగా బాగా అలిసిపోయాను. (ప్రస్తుతం ఆరైలుమార్గం కొంకణ్ రైల్వేప్రాజెక్టులో భాగంగా ఉన్నదని తెలిసింది) ఎంత అలసటగా ఉన్నా మా పిన్ని అరవటంతో నేనుకూడా అందరితో కలిసి అక్కడ ఏం జరిగిందో తెలుసుకుందామని అక్కడికి వెళ్ళాను.

మా పిన్ని ఏమీ చెప్పలేక భయంతో గుడ్లుమిటకరించి మాకేసిచూస్తూ ఉండి పోయింది. మర్నాడు ఉదయం ఆ గదిని పరిశీలించిన నాకు ఆ గదికి ఉన్న కిటికీ కనిపించింది. ఆ కిటికీలోంచి చూస్తే బయట చాలా బహిరంగ ప్రదేశం కనిపించింది. ఆ తరువాత మా పిన్నిని గుచ్చిగుచ్చి అడిగితే నాతో ఇలా చెప్పింది. "అర్ధరాత్రి ఒంటిగంట ప్రాంతంలో ఈ బెడ్‌రూంలో విపరీతమైన ఉక్కపొయ్యటంతో గాలికోసం ఈ కిటికీ తలుపులు తీసాను. ఆ కిటికీ బయట ఒక గ్రామీణ స్త్రీ నుంచుని నాకేసి తీవ్రంగా చూస్తూ కనిపించింది. ఆ దృశ్యంచూసి భయపడ్డనేను పెద్దగా కేకవేసాను. సరిగ్గా ఒక్క నిమిషంలో అక్కడ నుంచున్న స్త్రీ హఠాత్తుగా మాయం అయిపోయింది". ఈ సంఘటన గురించి విన్న మేము ఎంతో భయానికి గురి అయ్యాం. ఆ కిటికీ దగ్గర కనిపించిన స్త్రీకి ఆ ఇంటికి ఏదో సంబంధం ఉన్నదని నాకు అనిపించి ఆ ఇంటి యజమాని అయిన మా అమ్మమ్మని విషయం ఏమిటి? అని అడిగాను. మా అమ్మమ్మ ఆ విషయాన్ని చాలా తేలిగ్గా కొట్టిపారేస్తూ ఏమీలేదు అన్నది. ఆ తరువాత 2008వ సంవత్సరంలో నేను ఆ భవనానికి వెళ్ళినపుడు ఆ చిన్నబెడ్‌రూంలో పడుకోవలసి వచ్చింది.

అయితే నేను పొరపాటునకూడా ఆ కిటికీని తెరవటానికి ప్రయత్నించలేదు. అయితే ఆ కిటికీకి తలుపులు వేసిఉన్నప్పటికీ బెడ్‌మీద వెల్లకిలా పడుకుంటే మూసిఉన్న కిటికీ లోంచికూడా ఏదైనా దయ్యంలాంటిది కనిపిస్తుందేమో అని భయంవేసి బోర్లాపడుకున్నాను. నాకు త్వరగా నిద్ర రావాలని ఎంతసేపు దేవుడిని ప్రార్థించానో నాకే తెలియదు. ఆ తరువాత కొద్ది నెలలకి ఎవరి ద్వారానో నాకు ఒక భయానకమైన

విషయం తెలిసింది. అది ఏమిటంటే ఆ బెడ్‌రూం కిటికీకి అవతలవైపు ఉన్న చిన్న గుడిముందు ఒక మధ్యవయస్సు స్త్రీని ఎవరో బలిఇచ్చి చంపారట. ఆమె ప్రేతాత్మగామారి రాత్రి సమయాలలో ఆ కిటికీ దగ్గరకువచ్చి నుంచుంటుందట. ఈ విషయం మా నాయనమ్మకు తెలిసినప్పటికీ మేము భయపడతామని మాకు అప్పట్లో ఈ విషయం గురించి చెప్పి ఉండదని నాకు ఇప్పుడు అనిపిస్తున్నది.

## ఆ కుక్కకు ఏం కనిపించింది :

మానవులకులేని కొన్ని ప్రత్యేక లక్షణాలు జంతువులకు ఉంటాయి. ఉదాహరణకి పిల్లికి ఉండే ప్రాణం మనిషి ప్రాణంకన్నా బలమైనది అని తాంత్రికశాస్త్రం తెలియజేస్తున్నది. అంటే చంపబడిన పిల్లి అతిశక్తివంతమైన పిశాచిగామారి తనను చంపినవాడిని పీడిస్తుంది అన్నమాట. కనుకనే పిల్లిని చంపటం మహాపాపం అంటారు. మానవుల కళ్ళకి కనపడని అనేక అశక్తులు జంతువులకి కనిపిస్తాయి. ముఖ్యంగా నాగరిక మానవుల ఇళ్ళలో ఉండే పెంపుడు కుక్కలకి అప్పుడప్పుడూ మానవాతీత శక్తులు కనిపిస్తూ ఉంటాయి. అయితే ఆ విషయాన్ని చెప్పగలిగే శక్తి వాటికిలేని కారణంగా అవి హఠాత్తుగా మొరగటంకాని, నాలుకబయటపెట్టి రొప్పటంకాని, ముందు కాళ్ళతో నేలను గీరటంకాని చేస్తూ ఉంటాయి. మన కంటికి ఎవరూ కనిపించకపోయినా మన ప్రక్కన ఉన్న కుక్కలు ఇలాంటి ప్రవర్తనను ప్రదర్శిస్తున్నట్లయితే మనకు దగ్గరలో ఏదోఒక ప్రేతాత్మ లేదా క్షుద్రశక్తి ఉన్నట్టుగా అర్థంచేసుకోవాలి.

చెన్నై నగరంలో ఉద్యోగంచేస్తూ ఒంటరిగా ఉంటున్న సెల్వరాజ్ అనేవ్యక్తి తన పెంపుడుకుక్క బ్రౌనీ కారణంగా ఎదుర్కొన్న ఒక విచిత్ర సంఘటన గురించి తెలుసు కుందాం......

సెల్వరాజ్ తన ఆఫీసు పనిముగించుకుని రాత్రి భోజనానికి కావల్సిన పదార్థాలను పాక్‌చేయించుకుని రాత్రి 10 గంటల ప్రాంతంలో తన ఇంటికి వస్తాడు. ఆ తరువాత తన పెంపుడుకుక్క బ్రౌనీతో కలిసి డిన్నర్ పూర్తిచేసుకుని ఆపై టి.వి.చూస్తూ తెల్లవారు ఝామున 3గంటల వరకు కాలక్షేపంచేసి ఆ తరువాత నిద్రలోకి జారుకుంటాడు. ఇది అతని దినసరి కార్యక్రమం. ఒకరోజురాత్రి సెల్వరాజ్ టి.వి. చూస్తూ సోఫాలో పడుకుని ఉన్నాడు. అతనికి కొంచెందూరంలో నేలమీద కాళ్ళుముడుచుకుని అతని పెంపుడుకుక్క బ్రౌనీ పడుకుని టి.వి.కేసి పరిశీలనగా చూస్తున్నది. కొంతసేపు గడిచిన తరువాత సెల్వరాజ్ యధాలాపంగా బ్రౌనీకేసి చూసాడు. బ్రౌనీ అంటే అతనికి చాలాఇష్టం. ఒక విచిత్రం ఏమంటే మిగిలిన కుక్కల్లాగా కొత్తవాళ్ళను చూస్తే బ్రౌనీ

మొరగదు. రోజులో చాలాసేపు మౌనంగా ఉంటుంది. అది పెద్దగా మొరగటం ఏనాడూ ఎరగదు. తన ఇంట్లో ఎవరాన్న దొంగలు పడినప్పుడయినా అది మొరుగుతుందా? లేదా? అన్న అనుమానం సెల్వరాజ్‌కి అప్పుడప్పుడూవస్తూ ఉంటుంది. ఇంతలో బ్రౌనీ హఠాత్తుగా అక్కడనుండి లేచి ముందు గదిలోకి వెళ్ళిపోయింది.

సెల్వరాజ్ టి.వి. చూస్తూ ఆ బెడ్‌రూంలోనే ఉండిపోయాడు. అపుడు సమయం అర్థరాత్రి 12 గంటలు అవుతున్నది అని సూచిస్తున్నట్టుగా గోడ గడియారం 12 గంటలు కొట్టింది. ఇంతలో గుర్రుమని బ్రౌనీచేసే శబ్దం బెడ్‌రూంలో ఉన్న సెల్వరాజ్‌కి వినిపించింది. బ్రౌనీ ఎప్పుడూ అలా అరవటం వినిఉండని అతడు ఏం జరిగిందో చూద్దామని ముందు గదిలోకి వచ్చాడు. అక్కడ ఎవరూ కనపడలేదు. కాని బ్రౌనీ ఆ గదిలో ఒకవైపు తిరిగి అక్కడ ఎవరో నుంచుని ఉన్నట్లుగా భౌ, భౌ అని అరవటం ప్రారంభించింది. అకారణంగా అది ఎందుకు అలా మొరుగుతుందో సెల్వరాజ్‌కి అర్థంకాలేదు. ఇంతలో బ్రౌనీ సెల్వరాజ్‌వైపు తిరిగి తోక ఆడిస్తూ చూసింది. సెల్వరాజ్ దాన్ని దగ్గరకు తీసుకుని నిమిరాడు. మళ్ళీ బ్రౌనీ ఏదో కనిపించినట్టుగా శూన్యంలోకి చూస్తూ అరవటం ప్రారంభించింది. ఒకవేళ కాంపౌండ్‌వాల్ లోపల ఎవరైనా తిరుగుతున్నారేమో వాళ్ళ అడుగుల శబ్దంవిని బ్రౌనీ మొరుగుతున్నదేమో అని అనుమానించిన సెల్వరాజ్ మెయిన్ డోర్‌తీసి కాంపౌండ్‌లోకి వచ్చాడు. అక్కడ ఎవరూ లేరు. ముందుకు నడిచి మెయిన్‌గేట్ దగ్గరకు చేరుకుని బయటకి తొంగిచూసాడు మెయిన్‌గేట్ ముందుగా వెళుతున్న విశాలమైన తారురోడ్డుమీద అటుకాని, ఇటుకాని కనుచూపుమేరలో మానవ మాత్రుడు అనేవాడు సెల్వరాజ్‌కి కనపడలేదు. సెల్వరాజ్ మళ్ళీ వెనక్కు తిరిగివచ్చి తన ఇంటి పోర్టికోలో నుంచున్నాడు. మళ్ళీ బ్రౌనీ పోర్టికోలో ఒక మూలకు తిరిగి పెద్దగా మొరగటం ప్రారంభించింది.

అది ఎందుకు మొరుగుతుందో సెల్వరాజ్ అర్థంచేసుకోలేక దానిని తన మాటలతో సముదాయించటం ప్రారంభించాడు. అది ఏ దిక్కుకిచూసి మొరుగుతున్నదో ఆ దిక్కుకివెళ్ళి సెల్వరాజ్ నుంచున్నాడు. ఆశ్చర్యంగా బ్రౌనీ మొరగటం మానేసింది. ఇంతలో బ్రౌనీ ఇంకోవైపుతిరిగి అరవటం ప్రారంభించింది. సెల్వరాజ్ అటువైపుకూడా వెళ్ళి నుంచున్నాడు. అక్కడ సెల్వరాజ్‌ని చూడగానే బ్రౌనీ అరవటం మానేసింది. ఆ విధంగా బ్రౌనీ ఆ కాంపౌండ్‌లో పోర్టికోలో అనేక దిక్కులవైపు చూస్తూ అనేకసార్లు మొరిగింది. తన కంటికి కనపడనిదిఏదో బ్రౌనీ కంటికి కనపడుతున్నది అన్న విషయం అర్థమయిన సెల్వరాజ్‌కి ఒక్కసారిగా వెన్నులో వణుకుపుట్టింది. ఏదో ఒక అదృశ్య

శక్తి ఒకచోట నుండి మరొకచోటకి మారుతూ బ్రౌనీకి కనిపిస్తున్నది అతను ఊహించాడు. ఏం కనిపిస్తుందో బ్రౌనీకి మాత్రమే తెలుసు. ఆ విషయాన్ని సెల్వరాజ్‌కి తెలియజేసే శక్తి బ్రౌనీకి లేదు. అందుకే అది తన మొరుగుడు ద్వారా తనకు ఎవరో కనిపిస్తున్నారు అన్న విషయాన్ని సెల్వరాజ్‌కి తెలియజేయాలని అదేపనిగా ప్రయత్నిస్తున్నది.

అలా అరవటంలో కొన్నిసార్లు బ్రౌనీ తనను ఎవరో కర్రతో కొట్టబోతే తప్పుకోవటానికి అన్నట్టుగా గాలిలోకి ఎగిరి దూకటం జరిగింది. ఎవరు అదృశ్య రూపంలో బ్రౌనీని కొట్టబోయారు? అన్న విషయం సెల్వరాజ్‌కి ఈనాటికీ అర్ధంకాలేదు.

### ఉంగరాన్ని ఆవహించిన ఆత్మ :

కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం దయ్యం అంటే చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మ లేదా వారిలో అప్పటిదాకా పోగుపడి ఉన్న ఆత్మశక్తి అని తెలుస్తున్నది. మనిషిలో ఉండే ఈ ఆత్మశక్తి (లైఫ్ ఎనర్జీ) ఆ మనిషి చనిపోయినపుడు అత్యంత హింసాత్మకంగా బయటకు విడుదల అవుతుంది. డా॥కాల్విన్ అనే పరిశోధకుడు ఇటీవలకాలంలో ప్రేతాత్మల ఉనికిని నిరూపించటంకోసం చేసిన పరిశోధనలో ఒక అద్భుతమైన విషయం వెలుగుచూసింది. అది ఏమిటంటే ప్రేతాత్మలుకూడా శబ్దాలను చేయగలవని అయితే అవి మానవులుచేసే శబ్దాలకు భిన్నమైన తరంగ రూపాల (ఫ్రీక్వెన్సీ)ను కలిగి ఉంటాయని తెలిసింది.

సాధారణంగా ప్రేతాత్మలు మానవులపై దాడిచెయ్యటానికి ప్రయత్నించవు. ఎప్పుడైతే మానవులు వాటి నివాసాలలోకి ప్రవేశిస్తారో వారిని పీడించటానికి అవి ప్రయత్నిస్తాయి. దయ్యాలలో మంచివి, చెడ్డవి ఉండవు అనీ, అవి మానవుల లాగానే తమ మానసిక స్థితి(మూడ్స్)నిబట్టి మానవులపై దాడులుచెయ్యటం లేదా మౌనంగా ఉండటం జరుగుతుంది. ఒక ప్రదేశంలో ప్రేతాత్మలు ఉన్నాయా? లేవా? అన్న విషయాన్ని మంత్రగాళ్ళు, సాధువులు మరియు మంత్రసిద్ధిపొందినవారు ఇట్టే తెలుసుకో గలుగుతారు. కొన్ని నివాస గృహాలలో మానవులతోపాటుగా ప్రేతాత్మలుకూడా నివాసం ఉంటూ ఉంటాయి. అయితే అవి తమతోపాటు ఉండే మానవులకి కనపడటంకాని, ఆ మానవుల్ని బాధించటంకాని జరగదు. నర్సరావుపేట ప్రాంతానికి చెందిన ఒక మధ్యవయస్కుడు తనకు ఎదురయిన ఒక విచిత్రమైన అనుభవం గురించి నాకు ఫోన్‌ద్వారా తెలియజేసాడు. అది ఏమిటో మీరుకూడా తెలుసుకోవాలి.....

నేను ఒకరోజున మా ఊళ్ళో ఉన్న ఒక పాతగుడి దగ్గరకి వెళుతున్న సమయంలో నాకు ఒక చిన్న లోహపు ఉంగరం దొరికింది. ఆ తరువాత తెలిసింది. ఆ ఉంగరం

30 సంవత్సరాలక్రితం మా ఊళ్ళో జీవించిన ఒక పిసినారి వ్యక్తికి చెందినది అని. ఆ వ్యక్తి బ్రతికి ఉన్నపుడు ఆ ఉంగరాన్ని ప్రాణప్రదంగా చూసుకునేవాడట. అతను చనిపోయిన తరువాత ఆ ఉంగరం ఎటో దొర్లిపోయింది. ఇన్నాళ్ళ తరువాత రోడ్డుమీద దొరికిన ఆ ఉంగరాన్ని నేను నా వేలికి పెట్టుకున్నాను. అప్పటినుండి నాకు కష్టాలు మొదలయ్యాయి. ఉంగరం పెట్టుకున్న రాత్రి నుండి వరుసగా ఏడురాత్రులపాటు నాకు భయంకరమైన పీడ కలలు వచ్చాయి. ఆ తరువాత బైక్‌మీద గుంటూరు వెళు తున్నపుడు ఒకలారీ నన్ను గుద్దబోయింది అదృష్టవశాత్తు ఆ ప్రమాదం నుండి బయట పడ్డాను. నాకెందుకో ఆ ఉంగరంమీద అనుమానం కలిగి దాన్ని తీసుకుని మా ఊరిలోని ఒక వృద్ధ బంగారుపనివాడికి ఆ ఉంగరాన్ని చూపించాను. ఆ ఉంగరాన్ని చూసి గుర్తుపట్టిన అతడు ఆ ఉంగరం ఎన్నో దశాబ్దాల క్రింద తయారుచేయబడిందని ఆ ఉంగరం ఫలానావ్యక్తికి చెందినదని తెలియజేసాడు. ఆ ఉంగరాన్ని గతంలో ధరించిన వ్యక్తియొక్క ఆత్మ దాన్ని ఆవహించి ఉన్నదని అది ధరించినవారికి ఆ ఆత్మ ఎంతో హానిచేస్తుందని ఒక సిద్ధాంతి నాకు చెప్పటం జరిగింది. దాన్ని ఎలాగైనా వదుల్చుకోమని ఆ సిద్ధాంతి నాకు సలహా ఇచ్చాడు. ఆ తరువాత నేను కనకదుర్గ గుడికివెళ్ళి ఆ ఉంగరాన్ని అమ్మవారి హుండీలో వేసి ఆమెకు ఒక దణ్ణంపెట్టి ఇవతలకు వచ్చేశాను. ఆ తరువాత నాకు ఏవిధమైన పీడ కలలురాలేదు. ఏ ప్రమాదాలు ఎదురుకాలేదు.

## దయ్యంపట్టినచెట్టు-ఒరిస్సా :

కొన్ని సంవత్సరాల క్రితం తూర్పు ఒరిస్సాలోని ఖుర్దా జిల్లాలోని మాంగ్లజోడి అనే కుగ్రామంలో జరిగిన ఒక యదార్ధ సంఘటన వివరాలు తెలుసుకుందాం. ఆ గ్రామంలో ఒక మధ్యాహ్నంపూట 18 సంవత్సరాల ఒక అమ్మాయికి దయ్యంపట్టింది ఆ సమయంలో ఆ అమ్మాయి అతిత్వరలో ఈ గ్రామం మధ్యలో ఉన్న పొగడచెట్టుమీదకి ఒక దయ్యంవచ్చి చేరుతుంది అని చెప్పింది. కొద్ది రోజుల తరువాత ఆ అమ్మాయి జోస్యం చెప్పినట్టుగానే పొగడచెట్టుమీదకి ఒక పిశాచి వచ్చిచేరింది. అది రాత్రి సమయాలలో ఆ గ్రామంలో సంచరిస్తూ ప్రతి ఇంటిముందు ఆగి తలుపుకొడుతూ ఉండేది. ఎవరైనా తలుపుతీస్తే వాళ్ళకి తన వికృత స్వరూపాన్ని చూపించి భయపెట్టేది. ఒక నెల గడిచేసరికి ఆ గ్రామస్తులందరికి పగడచెట్టుమీదకు చేరిన దయ్యం అంటే భయంతో వళ్ళు జలదరించేది ఆ పిశాచాన్ని అక్కడ నుండి ఎలా తరిమివెయ్యాలో ఎవ్వరికీ అర్ధంకాలేదు. ఆ పరిస్థితుల్లో ఒక ధైర్యస్థుడైన ఒక యువకుడు ముందుకువచ్చి

ఒక మంచిరోజు చూసుకుని దయ్యం ఆవహించిన పొగడచెట్టును నరికేసాడు. అంతటితో ఆ దయ్యం సమస్య తీరిపోతుంది ఆ గ్రామస్తులు ఆశించారు. అయితే ఆ సమస్య అంత తేలిగ్గా తెగేదికాదు అని ఆతర్వాత తెలిసిందివాళ్ళకి. తాను ఉండే చెట్టు కొట్టివేయబడటంతో ఆ ప్రేతాత్మ సాయంత్ర సమయాలలోకూడా గ్రామస్తుల ఇళ్ళలోకి వెళ్లటానికి ప్రయత్నంచెయ్యటంతో వాళ్ళు భయపడిపోయి సాయంత్రంకాగానే తలుపులు మూసుకోవటం ప్రారంభించారు.

అంతేకాకుండా ఆ ఊళ్ళో ఎవరూ కూడా అంతకుముందు దయ్యం నివాసం ఉన్న పొగడచెట్టు ఉండేచోటుకి వెళ్ళేసాహసం చెయ్యలేదు. కొందరు తెలిసో తెలియకో ఆ చెట్టు ఉన్న ప్రదేశానికివెళ్ళి గుండె ఆగి చనిపోవటం జరిగింది. ఆ చెట్టును నరికిన భవాని బెహరా అనే 19 సంవత్సరాల యువకుడు ఉన్మాదంవచ్చి ఊరివెంట తిరుగుతూ ఒక అర్ధరాత్రి ఊరుబయట ఉన్న బావిలోపడి ఆత్మహత్యచేసుకున్నాడు. అంతేకాకుండా అతడి అన్నయ్య రక్తం కక్కుకుని చనిపోయాడు. ఆ ఊళ్ళో ఉండే అనసూయ అనే ఒక అమ్మాయి చనిపోతున్నపుడు ఒక తెల్లపిల్లి పొగడచెట్టు ఉన్న ప్రాంతంలో వికృతంగా అరుస్తూ కొంచెంసేపు సంచరించటం ఆ ఊళ్ళో చాలామంది చూసారు. ఫలితంగా ఆ పొడగచెట్టు ఉన్న ప్రదేశంవైపు వెళ్ళాలంటేనే ఆ గ్రామస్తులకు అంతులేని భయం ఏర్పడింది. వాళ్ళు గతంలో దగ్గరలో ఉన్న పట్టణానికి వెళ్ళాలంటే ఆ పొగడచెట్టు ముందు ఉన్న రోడ్డుమీదుగా వెళ్ళేవారు.

దయ్యం భయం వలన ఆ తరువాత వాళ్ళు ఆ రోడ్డును వదలిపెట్టి ఊరికి అటువైపు ఉన్న రోడ్డుద్వారా పట్టణానికి వెళ్ళటం ప్రారంభించారు. సాయంత్రం 6 దాటితే ఆ ఊళ్ళో నరసంచారం ఉండదు. కిరాణా కొట్లుతో సహా అన్ని ఇళ్ళ తలుపులు మూసుకుపోతాయి. ఆ తరువాత ఆఊరి ప్రజలు లక్ష్మీధర్‌బెహరా అనే ఒకవ్యక్తి సహాయంతో పొగడచెట్టు ఉన్నచోట తాంత్రిక పూజలు పెద్దఎత్తున జరిపించారు. ఆ తరువాత ఆ ఊళ్ళో ప్రేతాత్మ కనపడలేదు.

## సైన్స్‌కి అందని క్షుద్రప్రయోగాలు - ఒరిస్సా :

ఒరిస్సాలోని డోలగోబింద్ అనే ఒక గ్రామంలోని హైస్కూల్లో ఇటీవలకాలంలో ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. అది ఏమిటంటే ఆ స్కూల్లో 10వ తరగతి చదివే 12మంది అమ్మాయిలు రెండు వారాలపాటు ఒక విచిత్రమైన రోగానికి గురై మూర్ఛపోతూ ఉండేవారు. మూర్ఛనుండి తేరుకున్న తరువాత వాళ్ళు పిల్లులులాగా

అరవటం, ప్రవర్తించటం జరుగుతూ ఉండేది. ఈ క్లాసులోని అన్ని తరగతులలో ఉన్న ఆడపిల్లలకూ ఇలాంటి పరిస్థితులు ఎదురుకావటంతో ఆ స్కూలు హెడ్‌మాస్టర్ ఒక మంత్రగాడిని ఆ స్కూలుకి పిలిపించి అక్కడ జరుగుతున్న విషయాలు అతనికి చెప్పాడు. ఆ మంత్రగాడు స్కూలుకి వచ్చి మొదట ఏడోక్లాసు చదువుతున్న అమ్మాయిలను పరిశీలించాడు. 8 సంవత్సరాల వయస్సు ఉన్న ఆ అమ్మాయిలు, పిల్లులలాగా అరుస్తూ తమ ముఖాలను తమచేతిగోళ్ళతో గీరుకుంటూ కనిపించారు. ఆ తరువాత అతడు తొమ్మిదవ క్లాసు చదివే 12 సంవత్సరాల లోపు వయస్సు ఉన్న అమ్మాయిలను చూసినపుడు వాళ్ళు ఒకరివెంట ఒకరు మూర్ఛపోవటం గమనించాడు.

ఆ మంత్రగాడు, ఈ విషయం గురించి ఇప్పుడే ఏం చెప్పలేను అని చెప్పి తన ఊరికి వెళ్ళిపోయాడు. ఇలా రోజుకి ఒక క్లాసు ఆడపిల్లలు ఉన్మాదంగా ప్రవర్తించటంతో విసిగిపోయిన ఆ స్కూలు నిర్వాహకురాలైన మంజుబాలాపాండే ఆ స్కూలుని తాత్కాలికంగా మూసివేయించింది. ఆ తరువాత పిల్లులులాగా ప్రవర్తిస్తున్న అమ్మాయిలను ఒరిస్సాలోని ఒక స్వామీజీ ఆశ్రమానికి పంపించి అక్కడ వాళ్ళకు వేద మంత్రాలను వినిపించి మరియు వాళ్ళ క్షేమంకోసం పండితులచేత హెూమాలు జరిపించి వాళ్ళను పీడిస్తున్న క్షుద్రశక్తిని తరిమివెయ్యటం జరిగింది. ఈ పూజలలో ఆ ఆడపిల్లలు పాల్గొన్న తరువాత వాళ్ళు మామూలుగా అయిపోయారు. తాము గతంలో పిల్లులులాగా ప్రవర్తించాము అన్న విషయం ఆ ఆడపిల్లలకు గుర్తులేకపోవటం విశేషం.

ఆ స్కూలు నిర్వాహకురాలు అంటే పడని ఒక స్థానిక ఎమ్.ఎల్.ఏ. ఒక అనుభవజ్ఞుడైన మంత్రగాడిచేత ఆ స్కూలుమీద చేతబడి చేయించాడని తరువాత తెలిసింది.

ఒరిస్సా రాష్ట్రమంతటా సంచలనం సృష్టించిన ఈ అంశం ప్రముఖ ఒరియా వార్తా పత్రికలలో అనేక రోజులపాటు కనపడటం విశేషం.



# 10. ఈ పిశాచ కథలు, కవిత్వాలు విన్నవారు చనిపోతారా?

జపాన్‌దేశం సాంకేతికపరంగా ఎంతో అభివృద్ధిచెందింది కానీ ఆదేశంలో దైవంమీద, దయ్యాలమీద విపరీతమైన నమ్మకాలు ఉన్నాయి. అంతేకాకుండా శాపాల (Curse)మీద జపాన్ దేశస్తులకి విపరీతమైన విశ్వాసం ఉంటుంది. కొన్ని సంఘటనలలో కొందరు వ్యక్తులు దారుణమైన మరణానికి గురికావటం జరుగుతుంది. అలాంటివారియొక్క ఆత్మలు అసంతృప్తితో, ప్రతీకారభావాలతో ఈ భూమిపై సంచరిస్తూ ఉంటాయి. ఎవరైనా మానవులు ఆ వ్యక్తులయొక్క కథ గురించి చదివినా, విన్నా, మాట్లాడినా ఆ ఆత్మలు వాళ్ళని చేరుకుని చంపివేస్తాయి. ఒక కథ చదివితే మనిషి చనిపోవటం సాధ్యమా? అని చాలామంది భావించవచ్చు. కానీ ఒక కథకు ప్రాణం ఉంటుంది అన్న విషయం మర్చిపోకూడదు. విపరీతమైన సమస్యలలో చిక్కుకున్నవారు **సుందరాకాండ** గ్రంధాన్ని పారాయణంచేస్తే అనగా చదివితే సాక్షాత్తు హనుమంతుడు అక్కడకువచ్చి వాళ్ళ సమస్యల్ని పరిష్కరిస్తాడని హైందవులు విశ్వసిస్తారు. అనగా సుందరాకాండ కథకు హనుమంతుడే ఆత్మ. కనుక దానిని చదివినవారిపై ఆయన శుభదృష్టి మరియు ప్రభావము పడతాయని గ్రహించాలి. అలాగే **గరుడపురాణం,** ఎవరైనా మృతి చెందినపుడు మాత్రమే చదవాలి. దానిని పురోహితులు మినహా ఎవ్వరూ గృహంలో పెట్టుకోకూడదు. అలా చెయ్యటం వల్ల ప్రేతబాధ కలిగే అవకాశం ఉంటుంది అని కర్ణాటకకు చెందిన ఒక పండితుడు నాకు తెలియజేసాడు. కానీ వ్యాపారదృష్టిగల కొందరు పుస్తక ప్రచురణకర్తలు**గరుడపురాణాన్ని**ఇంట్లో ఉంచుకున్నా తప్పులేదని ప్రచారంచేసి వేలకొద్ది గరుణపురాణ కాపీలను అమ్ముకున్నారు. అవికొని ఇంట్లో ఉంచుకున్నవారికి ఏదోఒక సమస్య వస్తుందని ఆ పుస్తకాలు కొన్నవారికి తెలియదు. (ఎవరైనా తెలియక గరుడ పురాణం ఇంట్లో ఉంచుకుంటే దానిని తప్పనిసరిగా ఏ ఆలయంలోనో వదిలివేయటం మంచిది)

జపాన్‌దేశంలో జరిగిన కొన్ని యదార్ధ సంఘటనలు కాలక్రమంలో కథలుగా మారి ప్రజలలోకి చొచ్చుకుపోయాయి. వాటిలో కొన్ని కథలపై ఆ కథలోని ప్రధాన పాత్రయొక్క ప్రభావం పడి ఆ కథ ఎవరైనా చదివినా, విన్నా వారిని ఆ ప్రధాన పాత్ర **ఆత్మ** చంపివేస్తుంది అని జపాన్ ప్రజలు విశ్వసిస్తున్నారు. ఈ నమ్మకం నూటికి నూరుశాతం నిజం కాకపోయినా అందులో ఎంతోకొంత వాస్తవం ఉంటుందని

అనుభవజ్ఞులు భావిస్తున్నారు. అలాంటి ఒక విచిత్రమైన కథ మరియు కవితను ఇక్కడ చదువుకుందాం.

**1. గోజు (ఎద్దుతల లేదా ఆవుతల) :** అతి భయంకరమైన ఈ కథను ఎవరైనా చదివినా లేదా విన్నా వారికి త్వరలో మృత్యువు వస్తుందని చెబుతారు. ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాలలో ఈ కథ వేరువేరు పేర్లతో ప్రచారంలో ఉన్నది.

లభిస్తున్న ఆధారాలనుబట్టి ఆవుతల (Cow head) అనే కథ 17వ శతాబ్దంలో జపాన్‌లో బయటపడింది. ఆ కథకు సంబంధించిన యదార్థ సంఘటన ఏమిటో ఈనాటికీ ఎవరికీ అంతు చిక్కటంలేదు. చాలా ఏళ్ళక్రితం ఈ ఆవుతల కథ ప్రచురించ బడిందని అయితే ఆ కథ చదివినవాళ్ళకి ఏదోఒక విధంగా మరణం రావటంతో ఆ కథ ప్రమాదకరమైనది అని, శాపగ్రస్తమయినది అని భావించి ఆ కథను ప్రచురించిన ప్రచురణ కర్తలు ఆ కథ ఉన్న పుస్తకాలను తగలపెట్టటం జరిగింది. అయితే ఒక కాపీ తగలపడకుండా మిగిలిపోయి కనపడింది. అపుడు వాళ్ళు ఆ పుస్తకాన్ని అనేక భాగాలుగా విడదీసి ఒక్కో భాగంలో ఉన్న పేజీలను జపాన్ దేశంలోని ఒక్కొక్క ప్రదేశానికి పంపిణీచేసారు. అందువలన ఆవుతల పూర్తికథ ఎవరికీ తెలియకుండా పోయింది. అయితే కొంతకాలం క్రితం జపాన్‌లోని ఒక ఎలిమెంటరీ స్కూలు టీచర్‌కి విచిత్రంగా ఆ కథతాలీకు పూర్తి పేజీలు లభ్యం అయ్యాయి. ఆమె ఆ పేజీలను జాగ్రత్తగా దాచి ఉంచింది.

ఆ తరువాత ఆమె తన తరగతి విద్యార్థులను ఒక బస్సులో విహార యాత్రకు తీసుకువెళుతూ మార్గమధ్యంలో వాళ్ళకి ఉల్లాసంగా ఉండటంకోసం తన దగ్గర భద్రంగా దాచి ఉంచిన ఆవుతల పూర్తి కథయొక్క పేజీలను చదివి వాళ్ళకు వినిపించటం ప్రారంభించింది. శాపగ్రస్తమైన (Cursed) ఆ కథను ఆ టీచర్ చదివి వినిపిస్తున్నపుడు ఆ విద్యార్థులకు శరీరంలో విపరీతమైన ఒణుకు బయలుదేరింది. ఆ తరువాత వాళ్ళ నోటినుండి చొంగకారటం మొదలయ్యింది. దయచేసి కథ చదవటంఆపండి టీచర్ అని ఆ విద్యార్థులందరూ ముక్తకంఠంతో ఆ టీచర్‌ని కోరారు. అయితే ఆమె అందుకు అంగీకరించక కథ చదవటం కొనసాగించింది. అయితే ఆమె కథ చదవటం కొనసాగిస్తున్న సమయంలో ఆమె కళ్ళు గాజుకళ్ళలా మారిపోవటం ఆ విద్యార్థులు గమనించారు. కథ పూర్తికాగానే టీచర్ కూలిపోయింది. ఆమెకు స్పృహ వచ్చి చూసేసరికి వాళ్ళు ప్రయాణిస్తున్న బస్సు ఒక పెద్ద గుంటలో దిగిపోయింది. ఆ బస్సులోని విద్యార్థులందరూ మూర్ఛపోయి ఉన్నారు. వాళ్ళ నోటి నుండి నురుగు వస్తున్నది. ఆ

బస్సు నడుపుతున్న డ్రైవరు నడుం విరిగిపోయి డ్రైవింగ్ సీట్లోనే బాధ, భయాలతో వణకిపోతూ కూర్చున్నాడు. ఆ తరువాత ఏం జరిగిందో బయట ప్రపంచానికి తెలియలేదు. ఆ తరువాత ఆ టీచర్ ఆ కథ ఎవరికీ చెప్పినట్లుగా సమాచారంలేదు.

కొంతమంది పరిశీలకుల అభిప్రాయం ప్రకారం ప్రముఖ జపాన్ రచయిత అయిన సాక్యోకొమట్స్ వ్రాసిన ఒక పుస్తకంలో భాగంగా ఈ ఆవుతల కథ ఉండేదని ఈ కథ వలన కలిగే ప్రమాదాన్ని గుర్తించిన ఆ రచయిత ఆ కథని ప్రచురించకుండా మిగిలిన పుస్తకాన్ని ముద్రించాడని తెలుస్తున్నది.

ప్రాణాంతకమైన ఈ ఆవుతల కథ ఇలా ఉంటుంది. పూర్వం అక్సానా అనే ఒక అమ్మాయి యుక్రెయిన్ దేశంలోని ఒక పట్టణ శివారులలో ఉన్న ఒక చిన్న ఇంట్లో తన తండ్రి, సవతితల్లి మరియు సవితి సోదరితో కలిసి జీవిస్తూ ఉండేది. ఒక్సానా సవతితల్లి తన సొంత కూతురైన ఒలెనాను ప్రేమగాచూస్తూ, ఒక్సానాను ఇబ్బందులు పెడుతూ ఉంటుంది. సవతి తల్లి, ఒక్సానాచేత ఇంట్లోని పనులన్నీ చేయిసూ ఉంటుంది. ఒలెనా తాను కోరినవి తింటూ సోమరితనంగా కాలం గడుపు ఉంటుంది. తన కూతుర్ని రెండవ భార్య పెడుతున్న బాధలనుచూసి ఒక్సానా త ఎంతో బాధపడతాడు. కానీ పిరికివాడైన అతడు తన రెండవ భార్యను అదుపుచెయ సొంతకూతురుకి కష్టాలు తప్పించలేదు. ఒక్సానాకి సొంతంగా బట్టలుకూ ఉండేవికాదు. ఒలెనా వాడిపారేసిన పాత బట్టలు ఒక్సానా ధరిస్తూ ఉండేది. ఒక్సా అంట్లుతోమి, వంటపనులుచేసి మోటైన చేతుల్ని కలిగి ఉండగా, ఒలినా కులాసా జీవితం గడుపుతూ మెరిసిపోతూ సున్నితంగా ఉండేది.

ఇంతలో శీతాకాలం వచ్చింది. యుక్రెయిన్‌లో శీతాకాలం చాలా భయంకరంగా ఉంటుంది. ఆ సమయంలో కురిసేమంచుయొక్క చల్లదనం మనుషుల చర్మాన్నికోసేలా ఉంటుంది. ఆ సంవత్సరం ఒక్సానా కుటుంబానికి డబ్బుకొరత ఏర్పడింది. ఇద్దరు పిల్లలకి ఈ దరిద్రంలో తిండిపెట్టటం సాధ్యంకాదుకనుక ఒక్సానాని బయటకు గెంటి వేయమని భర్తని అడిగింది ఒక్సానా సవతితల్లి. ఆమె వత్తిడి మరీ పెరిగిపోవటంతో తనకు ఇష్టంలేకపోయినా సొంతకూతురు ఒక్సానాను తీసుకుని ఒక అడవి మధ్యభాగంలోకివెళ్ళి అక్కడ చెట్లమధ్యలో గతంలో నిర్మించబడిన ఒక కాటేజీలో ఆమెను వదిలి ఆమెకు తింటానికి కొంచెం రొట్టెల్ని ఇచ్చి తిరిగి ఇంటికివచ్చేసాడు. అక్కడ ఒంటరిగా అడవిలో వదిలివేయబడిన ఒక్సానాకు విపరీతమైన భయంవేసింది. అడవులలో దయ్యాలు, భూతాలు ఉంటాయని ఆమె అనుకుంటుంది. అందుకే ఆమె

అలా భయపడుతున్నది. అయితే ఒక్సానా తెలివితేటలు గల అమ్మాయి అవటంతో కొంచెం ధైర్యం తెచ్చుకుని తన తండ్రి అడవిలో తనకోసం ఏర్పాటుచేసిన కాటేజి (చిన్న గుడెసె)లోకి ప్రవేశించి అందులో చిన్న చలిమంట వేసుకుంది. ఆ తరువాత ఆమె తన తండ్రి వెళ్ళిపోయేటపుడు తనకు ఇచ్చిన ఒక ఎండిపోయిన బ్రెడ్‌లో కొంచెంతిని ఆపై తన దగ్గర ఉన్న దుప్పటిని చలిమంటకు దగ్గరగా నేలపై వేసుకుని కూర్చున్నది. తన తండ్రి ఇచ్చివెళ్ళిన రొట్టెలు రెండు రోజులకు మించి చాలవని గ్రహించిన ఒక్సానా తెలివిగా ఒక వలను తయారుచేసి దాంట్లో అడవి కుందేళ్ళు చిక్కుకునేలాచేసి ఆ కుందేళ్ళను చంపితిని కడుపు నింపుకోవాలని పథకంవేసింది. అంతేకాకుండా మంచు అడుగున ఉన్న నేలను తవ్వి కొన్ని దుంపలను మరియు అడవిలో ఉన్న బెర్రీ చెట్లనుండి కోసిన బెర్రీ పండ్లను ఆహారంగా వాడుకోవాలని నిశ్చయించింది. తన ప్రణాళిక ప్రకారమే ప్రవర్తిస్తూ తనకు కావల్సిన ఆహారాన్ని సంపాదించుకుని తింటూ రాత్రికాగానే గుడెసెలోకి వెళ్ళి తలుపులువేసుకుని నిద్రపోతూ ఉండేది. ఇలా కొంతకాలం గడిచింది.

ఒక రోజు అర్ధరాత్రి గుడెసె తలుపుమీద ఎవరో దబ, దబ, దబ అని బాదుతున్న చప్పుడు వినిపించింది. ఆ చప్పుడుకి మగత నిద్రలో ఉన్న ఒక్సానాకు హఠాత్తుగా మెళుకువ వచ్చింది. నరమానవుడు తిరగని ఈ అడవిలో తన గుడిసె తలుపులు అర్ధరాత్రి సమయంలో తడుతున్నది ఎవరో? అర్థంకాక ఒక్సానా భయంతో గజగజ లాడిపోయింది. కాసేపు ఆ శబ్దాలు ఆగిపోయాయి. ఒక్సానా తేరుకునే లోగానే మళ్ళీ తలుపులమీద బాదిన శబ్దం వినిపించటం ప్రారంభం అయ్యింది. ఆ తలుపు తడుతున్నది దయ్యాలేమో? అని భయపడిన ఒక్సానా తన దుప్పటిలోదూరి ఆ భూతం అక్కడ నుండి వెళ్ళిపోవాలని దైవ ప్రార్థనలు చెయ్యటం మొదలుపెట్టింది. కాసేపు ఆ శబ్దాలు ఆగాయి. ఒక్సానా ప్రశాంతంగా గాలి పీల్చుకున్నది. మళ్లీ దబ, దబ, దబ అనేశబ్దం వినపడటం మొదలయ్యింది. ఒక్సానా దుప్పటిలోంచి లేచి ఒక కర్రముక్కను చేతిలో పట్టుకుని నిశ్శబ్దంగా నేలమీద పాకుతూ తలుపుదాకా వచ్చింది. ఒక్సానా ధైర్యం తెచ్చుకుని ఒక్కసారిగా తలుపులు తెరిచింది. ఆశ్చర్యం బయట ఎవరూలేరు. ఆమె తేలిగ్గా నిట్టూర్చి వెనక్కితిరిగి చూసేసరికి గుడెసెలో చలిమంట వెలుగుతున్నచోట ఒక ఒక ఆవుతల గాలిలో తేలుతూ కనపడింది. దాన్ని చూసిన ఒక్సానా విపరీతంగా భయపడి పెద్ద కేకవేసింది. ఆమె చేతిలో ఉన్న కర్ర చేతినుండి జారి కిందపడింది. ఒక్సానా కాసేపటికి ధైర్యం తెచ్చుకుని ఎవరు నువ్వు? అని ఆ విచిత్ర పిశాచాన్ని అడిగింది. "నాపేరు ఆవుతల" అని ఆ పిశాచం సమాధానం చెప్పింది. అప్పుడు

ఒక్సానా ఆ పిశాచిని పరిశీలనగా చూసింది. అది గోధుమరంగులో ఉన్న ఒక ఆవుతల వంకరతిరిగిన కొమ్ములతో, క్రూరంగా చూసేకళ్ళతో, కనపడింది. ఇంతలో ఆ ఆవుతల ఒక్సానాతో "అమ్మాయి! నాకు చలిగా ఉంది. ఆకలిగాఉంది. నేను ఈ చలిమంట దగ్గర ఈ రాత్రికి పడుకుంటాను" అన్నది. ఆ ఆవుయొక్క స్వరం ఎలాంటి భావాలు లేకుండా మరియు జీవంలేకుండా ఉండటంతో ఒక్సానా విపరీతంగా భయపడింది. తన భయాన్ని మనసులో దాచుకుని "నీకు ఇక్కడ బాగుంటే ఈ రాత్రికి ఇక్కడే ఉండు" అన్నది ఆవు తలతో. అపుడు ఆ ఆవుతల తనను బల్లమీద పెట్టమని ఒక్సానాను అడిగింది. ఒక్సానా అలానే చేసింది. ఆ తరువాత నన్ను చలిమంట దగ్గరపెట్టు అన్నది ఆ ఆవుతల. ఒక్సానాలో ఉన్న ఆగ్రహానికి మరియు కనికరానికి మధ్య యుద్ధం జరుగుతున్నది. అందులో కనికరమే గెలిచింది. ఫలితంగా ఒక్సానా ఆ ఆవుతలని జాగ్రత్తగా పట్టుకుని మంటల్లో వేయకుండా మంట ప్రక్కన ఉంచింది. ఆ తరువాత ఆవుతల, "నాకు ఆకలిగా ఉన్నది తింటానికి ఏమైనా పెట్టు" అన్నది. తనకే సరిగా తిండిలేక ఇబ్బందిపడుతున ఒక్సానా ఆ ఆవుతలకి ఏమి ఆహారం పెట్టాలో అర్థంకాక తలపట్టుకున్నది. కొద్ది నిమిషాల తరువాత ప్రొద్దు తాను తినగా మిగిలిన కుందేలు మాంసాన్ని తీసుకువచ్చి ఆవు తలముందు పెట్టిం



నిజానికి ఆమాంసాన్ని రేపు ఉదయం ఆమె ఆహారంగా తీసుకోవాల్సి ఉన్న అది తిన్న ఆ ఆవుతల "నేను నిద్రపోవాలి" అన్నది. ఒక్సానా ఎంత సున్నితం ప్రవర్తించినా ఆవుతలమాత్రం ఆమెపట్ల కఠినంగానే ఉంటున్నది. అయినా ఒక్సా అదేమీ పట్టించుకోకుండా తను కప్పుకునే దుప్పటిని ప్రక్కగావేసి దానిమీద ఆ తలనుపెట్టి, దానిపైన తన వస్త్రాలను దుప్పటిలాగా కప్పింది. ఆ తరువాత ఆమె ఆ గుడిసెలో ఒకమూలగా చలికి వణుకుతూ మునగదీసుకుని పడుకున్నది. ఆమెకు ఎప్పుడు నిద్రపట్టిందో ఆమెకే తెలియదు. తెల్లవారేసరికి ఆమెకు మెళుకువ వచ్చి చూడగా ఆ ఆవుతల అక్కడలేదు. అదృశ్యం అయిపోయింది. అంతేకాకుండా రాత్రి ఆ ఆవుతల ఉన్న ప్రదేశంలో ఒకపెద్ద ఇనుపపెట్టె ఉన్నది. ఆ ఇనుపపెట్టెను తెరిచి చూసిన ఒక్సానాకు ఆ పెట్టెలో అందమైన వస్త్రాలు, వాటికింద కుప్పలకొద్ది బంగారము మరియు ఆభరణాలు కనిపించాయి. ఆమెకు ఇదంతా కలలా ఉన్నది. ఇంతలో

ఒక్సానా తండ్రి ఆమె గుడెసెలోకి వచ్చి "బిడ్డా! నేను మీ పిన్నిని బాగా తిట్టివచ్చాను ఆమెకు బుద్ధి వచ్చింది. ఇక నువ్వు నాతోపాటు మన ఇంటికివచ్చేసెయ్" అన్నాడు. తండ్రి వచ్చిన ఆనందంలో ఒక్సానా తన గుడెసెలో కొత్తగా వచ్చి చేరిన పెట్టె గురించి మర్చిపోయింది. ఆ తరువాత ఒక్సానా, తన తండ్రికి రాత్రి జరిగిన సంఘటన గురించి వివరించి అక్కడ ఉన్న పెట్టె గురించి మరియు అందులో ఉన్న సంపదలగురించి చెప్పింది. ఆ తరువాత ఆమె తండ్రి ఒక్సానాను మరియు సంపద ఉన్న పెట్టెను తీసుకుని ఇంటికి వెళ్ళాడు. ఆ పట్టణంలోని వారంతా ఒక్సానాయొక్క దయాగుణం గురించి మరియు ధైర్యం గురించి చెప్పుకుని ఆనందించారు. ఆ తరువాత ఆమె ఒకమంచి యువకుడినిచూసి వివాహం చేసుకున్నది.

తాము ఇంటి నుండి గెంటివేసిన ఒక్సానా హఠాత్తుగా ఇలా గొప్పది అయిపోవటంతో ఆమె సవతిచెల్లెలు ఒలెనాకు విపరీతమైన అసూయ కలిగింది. అక్కకు ఏ విధంగా సంపద లభించిందో వివరంగా తెలుసుకున్న ఒలీనా తానుకూడా అడవిమధ్యలోకి వెళ్ళి అక్కడ ఉన్న కాటేజీలో జీవించటం ప్రారంభించింది. ఒకరోజు అర్ధరాత్రి ఒలీనా గుడెసెలోకి ఆవుతల ప్రవేశించి "నాకు ఆకలిగా ఉన్నది అన్నది". అయితే సహజంగా సోమరిపోతు అయిన ఒలీనా, ఆవుతలకి ఆహారం పెట్టటానికి మనస్సురాక గుర్రుపెట్టి నిద్రపోవటం ప్రారంభించింది. తెల్లవారింది ఆమె ఒంటిమీద ఉన్న మరియు పెట్టెలో ఉన్న వస్త్రాలన్నీ పీలికలుగామారిపోయాయి. మరియు అక్కడ ఊళ్ళో ఆమె తల్లిదాచిన సొమ్మంతా మట్టిగా మారిపోయింది.

సహజంగా మంచి స్వభావంగల ఒక్సానాకు అదృష్టం కలిసి వచ్చింది. ఆమె చనిపోయేవరకు దానధర్మాలుచేస్తూ సుఖంగా జీవితం గడిపింది.

ఒకప్పుడు రష్యాదేశంలో భాగంగా ఉన్న యుక్రేన్ అనే ప్రాంతంలో కొంతకాలం క్రితం ఒక స్త్రీకి ఎండిపోయిన ఆవుతల దొరికిందని ఆమె ఆ తలను ఇంటికి తీసుకువెళ్ళి దానికి ఆహారం నైవేద్యంగాపెట్టి పూజలుచేసిందని ఆ తరువాత ఆమెకు విపరీతంగా డబ్బు వచ్చిపడిందని చెప్పుకుంటారు.

**టామినోస్‌హెల్ (Tomino's Hell) :** జపాన్‌దేశానికి చెందిన ఒక అజ్ఞాత కవి వ్రాసిన పద్యంపేరు టమినో సహేల్. ఈ పద్యాన్ని ఎవరైనా పెద్దగాపైకి చదివితే వాళ్ళు తప్పక చనిపోతారని జపాన్‌లో విశ్వసిస్తారు. ఈ ప్రపంచంలో పెద్దగా పైకి చెప్పకూడని విషయాలు కొన్ని ఉంటాయి. అలాంటి వాటిలో ఈపద్యంకూడా ఒకటి. ఈ పద్యాన్ని పెద్దగా చదవటంవల్ల చదివినవారికి ఏదైనా ప్రమాదం జరగవచ్చు లేదా మరణం ఎదురుకావచ్చు. జపాన్ భాషలో ఉన్న ఆ పద్యాన్ని ఇంగ్లీషులోకి అనువదించినపుడు ఆ పద్యం ఇలా ఉంటుంది. (ఈ పద్యం పూర్తిగా ప్రచురిస్తే దాన్ని

చదివిన పాఠకులు ఏదైనా ప్రమాదానికి గురి అవుతారు అన్న సంశయంతో ఆ పద్యంయొక్క మొదటి మరియు మధ్య లైన్లు మాత్రమే ఇస్తున్నాను – రచయిత)

The older sister vomits blood, the younger sister spits fire.
Cute Tomino spits treasured jewels.
Tomino dies alone and fell into hell.
Hell, darkness, with no flowres.
It it Tomino's older sister that whips?

———

Prepare for the endless journey into hell.
Spring comes and into the woods and valleys.
Seven turns in the dark valley of hell,

———

Cute Tomino travels alone.
To welcome you to hell,
The glimmering spikes of the needled mountain
As a sign to cute Tomino.

———

ఇటీవల ఒకవ్యక్తి జపాన్‌లో ఆన్‌లైన్ రేడియో షోలో పాల్గొంటూ ఈ పూర్తి పద్యాన్ని చదవటం ప్రారంభించాడు. మొదట్లో ఏమీ కాలేదు. సగం పద్యం చదవటం పూర్తి అయ్యేసరికి అతనికి శరీరం బిగుసుకుపోతున్నట్టుగా అనిపించింది. మూడొంతులు పూర్తిచేసేసరికి అతడు మూర్ఛపోతూ ఆ పద్యం వ్రాసి ఉన్న కాగితాన్ని దూరంగా విసిరి వేసాడు. ఆ తరువాత రెండు రోజులకి అతడికి స్పృహ వచ్చి చూసుకుంటే రేడియో స్టేషన్‌లో పడిపోయినపుడు నాకు బాగా దెబ్బలు తగిలాయని, ఏడు కుట్లుకూడా పడ్డాయని తెలుసుకున్నాడు. ఆ తరువాత ఎప్పుడూ ఆ పద్యం చదవటంకాదుకదా. కనీసం దాన్ని గురించి ఆలోచించే ధైర్యంకూడా అతడు ఎన్నడూ చెయ్యలేదు.



# 11. పోల్టర్‌గెస్ట్‌లు (గాలి దయ్యాలు) నిజంగా ఉంటాయా?

కొన్నిసార్లు పోల్టర్‌గెస్ట్‌లు తమ స్వరాలను మానవులకు వినిపించే అవకాశం ఉంటుంది. క్రీ.శ.1668వ సంవత్సరంలో డచ్‌దేశానికి చెందిన కొన్ని రికార్డులలో పోల్టర్‌గెస్ట్ కార్యకలాపాలు జరిగినట్టుగా గుర్తించబడింది. డచ్‌దేశంలోని న్యూకెర్క్ ప్రాంతంలో జీవిస్తున్న ఒక కుటుంబంలోని అమ్మాయిచుట్టూ పోల్టర్‌గెస్ట్‌లు సంచరించి నట్టుగాను అవి అనేక అమానుష చర్యలను అక్కడచేసినట్టుగాను ఈ రికార్డులో నమోదు చెయ్యబడి ఉన్నది. ఆ సంఘటనలో భాగంగా ఒక పగటిరోజున అనేకమంది ఉన్న సమయంలో శూన్యంనుండి ఒక గొంతు అక్కడ ఉన్నవారితో మాట్లాడటం జరిగింది. ఆ తరువాత ఒక క్రైస్తవప్రీస్టు అక్కడకు పిలిపించబడ్డాడు. ఆయన ఆ అదృశ్య స్వరంతో మాట్లాడి ఆ పోల్టర్‌గెస్ట్ ఒక అమ్మాయియొక్క ప్రేతాత్మ అని తెలుసు కున్నాడు. ఆ ప్రేతాత్మ తాలూకు అమ్మాయి జీవించి ఉన్నపుడు దైవభక్తురాలుగా ఉండేది. అయినప్పటికీ ఆ ప్రేతాత్మను క్రైస్తవప్రీస్టు మంత్రసహాయంతో ఆ ఇంట్లో నుండి వెళ్ళగొట్టటం జరిగింది. పోల్టర్‌గెస్ట్ కార్యకలాపాలు జరిగే ఇళ్ళలో ఇంట్లోని వస్తువులు గాలిలో ఎగిరిపోవటం మరియు ఎక్కడనుండో కొత్త కొత్త వస్తువులు ఆ ఇళ్ళలోకి రావటం జరుగుతూ ఉంటుంది. ప్రపంచంలోని అనేక దేశాలలో పోల్టర్ గెస్ట్‌కి సంబంధించిన అనేక సంఘటనలు జరిగినట్టుగా బలమైన ఆధారాలు ఉన్నాయి.

1889వ సంవత్సరంలో కెనడాదేశంలో జరిగిన ఒక పోల్టర్‌గెస్ట్ ఉదంతాన్ని పరిశోధించటంకోసం టైమ్స్ పత్రికకు చెందిన పెర్సీఉడ్‌లక్ అనే జర్నలిస్ట్ అక్కడకు వెళ్ళాడు. ఈ సంఘటనలు జరుగుతున్న గృహంలో జరుగుతున్న ఎన్నో అమానుష సంఘటనలను పెర్సీ తన కళ్ళతో స్వయంగా చూడటమే కాకుండా తనవద్ద ఉన్న కెమెరాతో వాటిని ఫోటోలు తియ్యటం జరిగింది. ఆ గృహ యజమానులు కొద్దికాలం క్రితం ఒక 11 సంవత్సరాల అనాథ బాలికను దత్తతచేసుకుని తమ ఇంటికి తీసుకు వచ్చారు. ఆమె అలా ఆ ఇంటికి వచ్చిందోలేదో ఆ ఇంట్లో పోల్టర్‌గెస్ట్ కార్యకలాపాలు మొదలయ్యాయి. పెర్సీ ఆ అమ్మాయిని అనేక రకాలుగా పరీక్షించాడు. కొన్నిసార్లు ఆ అమ్మాయి ఉన్న చోటు నుండి ఎవరిదో పురుషనికంఠం వినపడుతూ ఉండేది.

ఒకవేళ ఆ అమ్మాయి తన పెదవులు కదల్చకుండా వేరే గొంతును అనుకరిస్తూ మాట్లాడుతున్నదేమో (వెంట్రిలాక్విజం) అన్న అనుమానంవచ్చి పెర్సీ ఆ అమ్మాయి నోటినిండా నీటినిపోసి ఆపై ఆమెను నోరుమూసుకోమన్నాడు. అపుడు ఆ అమ్మాయికి వెంట్రిలాక్విజం విధానంలోకూడా మాట్లాడే అవకాశం ఉండదని పెర్సీ భావించాడు. కానీ ఆ సమయంలోకూడా ఏదోఒక అదృశ్య స్వరం పెర్సీని పలకరించింది. పెర్సీ గాలిలోకిచూస్తూ "మీరు అక్కడ ఉన్నారా"? అన్నాడు.



మేడమెట్లమీదగా కిందకు వస్తున్న పోల్టర్‌గెస్ట్

అపుడు ఒక గరగరలాడే మధ్యవయస్కుడి స్వరం "ఆ! ఉన్నాను" అని వినిపించింది. ఆ తరువాత ఆ స్వరం కొద్ది నిమిషాలపాటు అనేక అసభ్యమైన మాటలను మాట్లాడటం జరిగింది. పెర్సీ ఈ ప్రయోగం చేస్తున్న సమయంలో దాదాపు 20మంది ఇరుగు పొరుగువారు అక్కడ గుమిగూడి ఉన్నారు. వారందరికీ అదృశ్యపురుషుడి స్వరం వినిపించిందని తెలిసింది.

2010 జూన్ నెలలో విడుదలయిన "జర్నల్ ఆఫ్ ద సొసైటీ ఫర్ సైకికల్ రీసర్చ్" అన్న పత్రికలో ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు మరియు పారాసైకాలజిస్టు అయిన డా.బారీకాల్విన్ పోల్టర్‌గెస్ట్ కార్యక్రమాలు జరిగేచోట వినిపించే విచిత్ర శబ్దాలకు సంబంధించిన అనేక అంశాలను ప్రచురించటం జరిగింది. ఒక విచిత్రం ఏమంటే కాల్విన్ మొదట్లో మరణానంతర జీవితం ఉంటుందని, దయ్యాలు ఉంటాయని నమ్మేవాడు కాదు. అయితే మానవ సహజమైన ఆసక్తి వలన కాల్విన్ అతీంద్రియ

శక్తుమీద ఎన్నో పరిశోధనలు జరిపి అవన్నీ యదార్థమే అని గుర్తించాడు. ముఖ్యంగా పోల్టర్‌గెస్ట్ కార్యకలాపాలు జరిగేచోట వినిపించే అదృశ్య స్వరాల గురించి, శబ్దాల గురించి ఐదేళ్ళకుపైగా పరిశోధనలుచేసి అనేక బలమైన సాక్ష్యాలను కాల్విన్ సంపాదించాడు. అనేకమంది హేతువాదులుకూడా కాల్విన్ చూపిన సాక్ష్యాలను పరిశీలించి పోల్టర్‌గెస్ట్‌లు నిజంగా ఉన్నాయని అంగీకరింపటం విశేషం. ప్రేతాత్మలు సృష్టించే శబ్దాలకు సంబంధించిన తరంగాలు, భౌతిక ప్రపంచంలో ఉండే మానవులు, జంతువులు మరియు వస్తువులు చేసే శబ్దాల వలన ఏర్పడే తరంగాలకు పూర్తిగా భిన్నంగా ఉంటాయని కాల్విన్ అభిప్రాయ పడుతున్నాడు. ఆ కారణంగానే పోల్టర్‌గెస్ట్‌లు మరియు ప్రేతాత్మల మాటలు మరియు అవి చేసే శబ్దాలు మానవులకు భిన్నంగా ఉంటాయని గుర్తించాలి.

క్రీ.శ.50వ శతాబ్దానికి చెందిన ప్లినీ ది యంగర్ అనే తత్త్వవేత్త గ్రీసుదేశంలోని ఎథెన్స్ నగరంలో ఉన్న ఒక గృహంలో తరచుగా పోల్టర్‌గెస్ట్ కార్యకలాపాలు జరుగుతున్నాయని, అందుకు కారణం ఆ ఇంటి పునాదులలో ఒకవ్యక్తిని సజీవంగా గొలుసులతో బంధించి సమాధిచేసారని, ఆ సమాధిలో దారుణ నరకాన్ని అనుభవిస్తూ మరణించిన ఆ వ్యక్తి ప్రేతాత్మగామారి ఆ ఇంట్లో సంచరిస్తున్నాడని ప్లినీ చెప్పాడు. ఆ తరువాత కొంతకాలానికి ప్లినీ మాటల ఆధారంగా ఆ ఇంటి నేలభాగాన్ని త్రవ్వినపుడు శవపేటికలో గొలుసులతో కట్టివేయబడి ఉన్న ఒక అస్థిపంజరం కనపడింది. ఆ తరువాత ఆ అస్థి పంజరాన్ని బయటకుతీసి దానికి శాస్త్రోక్తంగా ఖననం చెయ్యటం జరిగింది. ఆపై ఆ ఇంట్లో పోల్టర్‌గెస్ట్ కార్యకలాపాలు ఆగిపోయినాయి. ఇక్కడ ప్లినీ ద యంగర్‌యొక్క చిత్రాన్ని మనం చూడవచ్చు.


ప్లినీ ద యంగర్

క్రీ.పూ.827–783 ప్రాంతంలో చైనాను పరిపాలించిన జువాన్‌జౌ అనే రాజు ఒకసారి నిష్కారణంగా తన మంత్రి 'తుపోని తప్పుడు ఆరోపణలతో దోషిగా నిర్ణయించి ఉరి తీయించాడు. ఆ మంత్రి తాను చనిపోయిన తరువాత పిశాచిగామారి ఆ రాజును చంపి తన ప్రతీకారాన్ని తీర్చుకుంటానని చావబోయేముందు శపథంచేసాడు.

మూడు సంవత్సరాలు గడిచాయి ఒకరోజున చైనా రాజు తన సామంత రాజులతో కలిసి సభ జరుపుతున్న సమయంలో తుపో యొక్క ప్రేతాత్మ అక్కడకు వచ్చి ధనస్సును ఎక్కుపెట్టి బాణాలు ప్రయోగించి ఆ రాజును సంహరించింది. ఆ సమయంలో దాదాపు 200 మంది అక్కడ ఉన్నారు. ఈ సంఘటన చైనా చరిత్రలో లిఖించబడింది. ఆ తరువాత చాలాకాలానికి మోజు అనే ఒక చైనా వేదాంతి ఈ సంఘటన గురించి ఇలా వ్యాఖ్యానించాడు.

"ప్రాచీన కాలం నుండి ఈనాటి వరకు ఎంతోమంది మానవులు తాము ప్రేతాత్మలను చూసామని వాటి గొంతు విన్నామని చెబుతూనే ఉన్నారు. అలాంటప్పుడు ప్రేతాత్మలు నిజంగా లేవని మనం ఎలా చెప్పగలము? ఒకవేళ ఎవరూ తాము ప్రేతాత్మలను చూసామనికాని వాటి మాటలను విన్నామనికాని చెప్పనట్లయితే అవి ఉన్నాయని మనం ఎలా వాదించగలం? అయితే ప్రేతాత్మలు నిజంగా ఉన్నాయా? లేవా? అన్న సందేహంలో ఉన్న కొందరు, ప్రేతాత్మలు ఉన్నాయి అన్నవారి మాటలు నమ్మాలా? లేవు అన్నవారి మాటలు నమ్మాలా? ఎవరి మాటల్ని సరైన సాక్ష్యంగా అంగీకరించాలి అని వాదిస్తారు. కనుక మనం ఇతరులతో కలిసి చూసిన మరియు విన్న అంశాలను మాత్రమే నిజం అని అంగీకరించాలి. ఇక ప్రేతాత్మగావచ్చి రాజును సంహరించిన టుపోని అనేకమంది ప్రత్యక్షంగా తమ కళ్ళతో చూసామని అంగీకరించారు. ఆ విషయం ఆనాటి గ్రంథాలలో లిఖించబడింది. కనుక ప్రేతాత్మలు లేవు అని వాదించటంలో అర్థంలేదు.



## 12. జపాన్ పిశాచ బాలిక హానకో-సాన్ వివరాలు ఏమిటి?

సాంకేతికంగా ఎంతో అభివృద్ధిచెందిన జపాన్‌దేశంలో మానవాతీతశక్తులపట్ల విపరీతమైన నమ్మకాలు ఉండటం విచిత్రం. ఇతర దేశాలవలెకాక జపాన్‌లో ఆ దేశానికి మాత్రమే ప్రత్యేకమైన కొన్ని ప్రేతాత్మలు ఉండటం విశేషం. అలాంటి వాటిలో ఒకటి హానకో-సాన్ అనే చిన్న అమ్మాయి ప్రేతాత్మ. ఆ వివరాలు తెలుసుకుందాం. జపాన్‌దేశంలోని స్కూళ్ళలో ఉండే బాత్రూమ్‌లలో హానకో-సాన్ అనే బాలికయొక్క

ప్రేతాత్మ అప్పుడప్పుడూ ఆ బాత్రూమ్‌లోకి వెళ్ళే ఆడపిల్లలకి కనిపిస్తుంది అని చెప్పబడుచున్నది. ఒక ప్రాంతానికే పరిమితంకాకుండా మొత్తం జపాన్ దేశం అంతటాకూడా హానకో-సాన్ ప్రేతాత్మ కనపడటం ఆశ్చర్యంగా ఉంటుంది. ఈ ప్రేతాత్మ సాధారణంగా పాఠశాలలు నడుపబడే భవనాలలోని మూడవ అంతస్తులో ఉండే బాత్రూమ్‌లలో కనిపిస్తుందట. ఈ ప్రేతాత్మ ఒక ఎర్ర స్కర్టుని ధరించి బాబ్డ్‌హెయిర్‌తో ఉంటుందట.

సాధారణంగా ఈ బాలిక ప్రేతాత్మ ఏదోఒక బాత్రూమ్‌లో దాక్కుని ఉన్నపుడు ఎవరైనా సాహసంగల విద్యార్థి ఆ బాత్రూమ్ తలుపును మూడుసార్లుతట్టి "లోపల "ఉన్నది నువ్వేనా హానకో-సాన్?" అని ప్రశ్నించాలి. ఆ గదిలో హానకో-సాన్ ఉండి ఉన్నట్లయితే ఆ గదిలో నుండి ఒక నీరసమైన స్వరం "అవును! నేనే ఈ బాత్రూమ్ గదిలో ఉన్నాను" అని పలుకుతుంది. ఆ తరువాత హానకో-సాన్ ప్రేతాత్మ అక్కడ నుండి అదృశ్యం అయిపోతుంది.



హానకో-సాన్ ఊహాచిత్రం

ఇంకొక కథనం ప్రకారం ఎవరైనా ధైర్యంగల విద్యార్థి మూయబడి ఉన్న బాత్రూమ్ తలుపును ధైర్యంగా తెరచి లోపలికి వెళితే లోపల ఎర్రటి స్కర్టు ధరించిన చిన్న అమ్మాయి హాయ్! అని నవ్వుతూ పలకరిస్తుంది.

హానకో-సాన్ ప్రేతాత్మ ఎలా ఏర్పడింది అన్న విషయం గురించి అనేక విభిన్నమైన కథనాలు జపాన్‌లో వినిపిస్తున్నాయి. ముఖ్యంగా 1980వ సంవత్సరంలో జపాన్‌లోని స్కూళ్ళ అన్నింటిలోను ఉన్న బాత్రూమ్‌లలో హానకో-సాన్ ప్రేతాత్మ అనేకసార్లు కనిపించినట్టుగా వార్తలు వచ్చాయి. కొంతమంది విమర్శకుల అభిప్రాయం ప్రకారం ఆమె 1980 ప్రాంతంలో జీవించి ఉంటుందని భావిస్తున్నారు. మరికొంతమంది అభిప్రాయం ప్రకారం రెండవ ప్రపంచయుద్ధం జరుగుతున్నపుడు అమెరికా, జపాన్‌పై

విమానాలద్వారా బాంబులు కురిపించింది. ఆ సమయంలో హానకో-సాన్ తనతోటి పిల్లలతో దాగుడుమూతలు ఆడుతూ ఒక బాత్రూమ్‌లో దాక్కున్నదని ఆ సమయంలో ఆకాశం నుండి కిందపడిన బాంబు పేలుడు వలన బాత్రూమ్‌లో దాక్కుని ఉన్న హానకో-సాన్ చనిపోయిందని తాను చనిపోయిన విషయం ఇప్పటికీ గుర్తించని హానకో-సాన్ ప్రేతాత్మ ఇప్పటికీ తాను చిన్నపిల్లనే అని భావిస్తూ బాత్రూమ్‌లో దాక్కుంటూ విద్యార్థుల్ని ఆట పట్టిస్తూ ఉంటుంది. ఇంకొక కథనం ప్రకారం చూస్తే ఒకసారి ఒక స్కూలు లైబ్రరీలో పుస్తకాలు చదువుకోవటానికి వెళ్ళిన హానకో-సాన్ అనే బాలిక ప్రమాదవశాత్తు మేడపైన ఉన్న లైబ్రరీ కిటికీలోంచి క్రిందపడి దారుణంగా మృతిచెంది పిశాచిగా మారిందని తెలుస్తున్నది.

"హానకో-సాన్ ఫంగస్" అనే చర్మవ్యాధి హానకో-సాన్ ప్రేతాత్మ వలన వస్తుందని కొందరు నమ్ముతున్నారు. అది ఎలాగంటే స్కూళ్ళలోని ప్లే గ్రౌండ్స్‌లో ఆడుకునే పిల్లలు తమ మోకాళ్ళపై గోక్కున్నట్లయితే వెంటనే ఆ ప్రదేశంలో హానకో-సాన్ ఫంగస్‌యొక్క ప్రభావంపడి ఆ ప్రదేశంలో చిన్నచిన్న కుక్క గొడుగులు పుడతాయని చెబుతూ ఉంటారు.

కొంతమంది పరిశీలకుల అభిప్రాయం ప్రకారం హానకో-సాన్ అనే చిన్నపిల్ల ఇంకా ఇంకా చదవమని పీడించే టీచర్ల బాధను తట్టుకోలేక క్లాస్‌రూమ్ కిటికీలోంచి కిందకి దూకి చనిపోయిందని, బలన్మరణం కారణంగా ఆమె ప్రేతాత్మగా మారిందని తెలుస్తుంది. ఇంతవరకు హానకో-సాన్ ప్రేతాత్మ కారణంగా ఎవరికీ హాని జరిగినట్టు నమోదు కాలేదు.



# 13. నరకలోక శునకాలు మానవులకు ఎందుకు కనిపిస్తాయి?

"హెల్‌హౌండ్" (Hell hound) అనేపేరుగల ఒక అమానుషమైన (సూపర్ నాచురల్) కుక్క పాశ్చాత్యజానపద గాథలలో తరచుగా కనపడుతూ ఉంటుంది. నిజానికి ప్రపంచంలో ఏదోఒకపేరుతో హెల్‌హౌండ్ అనగా నరకలోకశునకం కనపడుతూ ఉంటుంది. ఇవి మెరిసే ఎర్రటి లేదా పసుపుపచ్చరంగు కళ్ళను మరియు

నల్లటి బొచ్చుతోకూడిన బలిష్టమైన దేహాన్ని కలిగి ఉంటాయని చెబుతారు. ఇవి విపరీతమైన వేగంతో గాలిలో దూసుకుపోతాయి. ఒకరకంగా చెప్పాలంటే ఇవి పిశాచాల వర్గానికే చెందుతాయి. ఇవి ఉన్నచోట విపరీతమైన దుర్వాసన వస్తుంది. ఈ శునకాలు కొన్నిసార్లు మాట్లాడే శక్తినికూడా ప్రదర్శించినట్టు తెలుస్తున్నది.

జానపద గాథలు ఇచ్చిన సమాచారం ప్రకారం ఎవరైనా మానవుడు మూడుసార్లు ఈ నరకలోక శునకం కళ్ళలోకి సూటిగా చూసినట్లయితే ఖచ్చితంగా చనిపోతాడని తెలుస్తున్నది. ఇవి నరకలోక ప్రధాన ద్వారాలకు అనగా శ్మశానాలకు కాపలాదారులుగా రాత్రి సమయంలో సంచరిస్తూ ఉంటాయని అనుభవజ్ఞులు చెబుతున్నారు. ఇవి చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలు ఎటన్నా తప్పించుకుపోతే వాటిని పట్టుకుని బలవంతంగా నరకానికి తిరిగి తీసుకు వెళతాయి. కొన్నిసార్లు ఇవి గుప్తనిధులకు కాపలాగా కూడా ఉంటాయి. యిరోపా పురాణాల ప్రకారం ఏవ్యక్తి అయినా హెల్‌హౌండ్‌ని చూసినా, దాని వూళ(అరుపు) విన్నా దానిని ఆవ్యక్తికి రాబోయే మృత్యువుకు సూచనగా భావించాలి. ఏది ఏమైనా, ఎవరికైనా ఈ నరకలోక శునకం కలలోగాని, నిజంగాకాని కనిపిస్తే వారికి త్వరలో చావు రాబోతున్నదని గుర్తించాలి. ఒక విశేషం ఏమంటే ఒకే ప్రదేశంలో పదిమంది ఉన్నా వారిలో ఎవరికి మృత్యువు ఆసన్నం కాబోతున్నదో వారికి మాత్రమే ఈ శునకాలు కనిపిస్తాయి. దక్షిణ మెక్సికో మరియు మధ్య అమెరికా ప్రాంతాలకు చెందిన జానపద గాథలలో కడెజో అనేపేరుగల నల్లటి పిశాచ శునకం అర్ధరాత్రి సమయాలలో గ్రామ ప్రాంతాలలో సంచరిస్తూ ఒంటరిగా దొరికిన ప్రయాణీకులను చంపివేస్తాయి అని తెలుస్తున్నది. ఇక ఇంగ్లాండులో కూడా బార్గెస్ట్ అనేపేరుగల ఒక నల్లటి పిశాచ కుక్క నిశిరాత్రులలో సంచరిస్తూ మానవుల్ని సంహరిస్తుందని తెలుస్తున్నది.


హెల్‌హౌండ్

అనేక శతాబ్దాలుగా ఇంగ్లాండు ప్రాంతంలోని గ్రామీణులు పిశాచ శునకాన్ని తాము చూసినట్టుగా చెబుతూ ఉంటారు.



# 14. నిషిద్ధ ప్రేమకథ - మలేషియా?

మలేషియాలో దాదాపు అర్ధశతాబ్దం క్రితం జరిగిన యదార్ధగాథ ఇది. ఈ సంఘటన ఒక స్కూలులో జరగటం విశేషం. 1970వ సంవత్సరంలో మలేషియాలోని ఒక గ్రామీణ ప్రాంతంలో ఒక ప్రభుత్వ స్కూలు ఉన్నది. దానికి అనుబంధంగా హాస్టల్‌కూడా ఉన్నది. ఆ రోజుల్లో బాగా పెరిగి పెద్దయిన మగ మరియు ఆడపిల్లలు ఈ స్కూళ్ళల్లో పెద్ద తరగతులు చదువుతూ ఉండేవాళ్ళు. (అదే ఈ రోజుల్లో 14 ఏళ్ళు నిండకముందే స్కూలుఫైనల్ చదువు అయిపోతుంది) ఆ రోజుల్లో ఒక హైస్కూలు విద్యార్థిని తన క్లాసు టీచర్‌తో ప్రేమలో పడింది. మధ్యవయస్కుడైన ఆ టీచరు, 18 ఏళ్ళ ఆ అమ్మాయి ప్రేమను అంగీకరించి ఆమెతో చనువుగా మెసలుతూ ఉండేవాడు. స్కూలు అయిపోయిన తరువాత విద్యార్థులు మరియు ఉపాధ్యాయులు ఇళ్ళకు వెళ్ళిపోయిన తరువాత వాళ్ళిద్దరూ ఏదోఒక క్లాసు రూంలో బల్లలమీద రాసక్రీడలు జరుపుతూ ఉండేవాళ్ళు. కొంతకాలం గడిచింది. పిల్లలకి వారాంతం సెలవులు ఇచ్చారు. చాలామంది పిల్లలు వేరే ప్రాంతాలలో ఉన్న తమ ఇళ్ళకు వెళ్ళిపోయినప్పటికీ కొందరు స్కూలు ఉండిపోయారు. ఆ విద్యార్థినికూడా అక్కడే ఉండిపోయి తన టీచర్‌తో ప్రేమాయణాన్ని కొనసాగించింది. కాలం గడిచింది. ఎండాకాలం సెలవులు వచ్చాయి. అతను పశ్చిమ మలేషియా ప్రాంతానికి చెందినవాడు కావటంతో సెలవులకు ఇంటికివెళ్ళి ఆ తరువాత స్కూలుకి తిరిగివచ్చి ఆమెను వివాహం చేసుకుంటానని ఆ అమ్మాయితోచెప్పి వెళ్ళిపోయాడు.

ఆ అమ్మాయి ఎప్పుడెప్పుడు ఎండాకాలం సెలవులు ముగుస్తాయా? అతను వచ్చి తనను వివాహం ఆడతాడా? అని తన టీచర్‌కోసం ఎదురుచూస్తూ కాలం గడప సాగింది. సెలవులు ముగిసాయికాని అతడు రాలేదు. తనను అతడు మోసంచేసాడు అని అర్థంచేసుకున్న ఆ అమ్మాయి స్కూలు టాయ్‌లెట్ వెనకున్న ఒక చెట్టుకొమ్మకి ఉరివేసుకుని చనిపోయింది. ఆమె చనిపోయిన మూడు రోజుల తరువాత ఆమె శవాన్ని ఆ స్కూలు విద్యార్థులు మరియు టీచర్లు చూసారు. చెట్టుకొమ్మనుండి వేలాడు తున్న ఉరితాడుకు బిగుసుకుపోయిన ఆమె శరీరం గాలికి అటు ఇటు ఊగుతున్నది.

ఆమెకళ్ళు మరియు నాలుక బయటకు పొడుచుకుని వచ్చాయి. ఆమె నాలుక అతిభయంకరంగా ఊదారంగులోకి మారిపోయి ఉన్నది. ఎవరైనా ఆ ముఖాన్నిచూస్తే కొన్ని రోజులపాటు ఆహారాన్ని తీసుకోలేదు. అంత భయానకంగా ఉంది ఆమె మృతదేహం. ఆ తరువాత చాలా పౌర్ణమి రాత్రులలో హృదయ విదారకంగా రోదించే

ఒక చంటిబిడ్డ స్వరం ఆ స్కూలు హాస్టల్‌లో ఉన్న విద్యార్థులకు వినిపిస్తూ ఉండేది. కొన్నిసార్లు ఆ ఏడుపు ఒక స్త్రీ ఏడ్చినట్టుగా వినిపించేది. స్కూలు వెనక ఉన్న టాయ్‌లెట్‌లో మొదలయిన ఈ ఏడుపు అర్ధరాత్రి దాటేవరకు స్కూలు చుట్టూతుగా కూడా వినిపించేది. అంటే ఎవరో అదృశ్య వ్యక్తి టాయ్‌లెట్‌నుండి ఏడుస్తూ బయటకువచ్చి స్కూలు చుట్టూ తిరిగినట్టుగా భావించాలి అన్నమాట. ఈ ఏడుపులు విన్న ఆ స్కూలు హాస్టల్ విద్యార్థులకు రాత్రి సమయాలలో నిద్రపట్టేదికాదు. ఇంతకీ ఈ సంఘటనలోని ట్విస్ట్ ఏమిటంటే పౌర్ణమి రాత్రులలో రోదించేది ఒక ఆత్మకాదు. రెండు ఆత్మలు. అది ఎలా అంటే టీచర్‌ని నమ్మి తన సర్వస్వాన్ని అతడికి సమర్పించిన ఆ అమ్మాయి గర్భవతి అయ్యింది. టీచర్ తనని మోసంచేసాడు అని అర్థంచేసుకున్న తరువాత ఆ అమ్మాయి కడుపులో పెరుగుతున్న బిడ్డగురించి పట్టించుకోకుండా టీచర్‌మీద ఏర్పడిన ఉక్రోషంతో ఆత్మహత్యచేసుకుని చనిపోయింది.

బలన్మరణం పొందిన ఆమె ప్రేతాత్మగా మారింది. ఆమె చనిపోయే సమయానికి ఆమె కడుపులో మూడు నెలల పిండంగా ఉన్న ఆమె బిడ్డకూడా ఆమెతోపాటు చనిపోయి పిశాచిగా మారింది. వాళ్ళిద్దరూ ఆ స్కూలు ప్రాంతంలో సంచరిస్తూ ఉండేవాళ్ళు. ఒకోసారి బిడ్డ ప్రేతాత్మ ఏడిస్తే, ఇంకొకసారి ఆ అమ్మాయి అనగా తల్లిప్రేతాత్మ ఏడుస్తుంది. అందువల్లనే రెండురకాల ఏడుపులు ఆస్కూలు విద్యార్థులకు వినిపించటం జరిగింది. ఆ తరువాత ఆ గ్రామ ప్రజలు ఆ అమ్మాయి ఉరివేసుకుని చనిపోయిన చెట్టుని పనివాళ్ళనిపెట్టి నరికించి అవతలపారేసారు. అప్పటినుండి ఆ స్కూలు ప్రాంతంలో పౌర్ణమిరాత్రులలో తల్లిబిడ్డల ఏడుపులు వినిపించటం మానేశాయి. అయితే ఆ చెట్టు నరికిన కూలీ మాత్రం మతిచెడిపోయి పిచ్చివాడిలాగా రోడ్లవెంట తిరగటం మొదలు పెట్టాడు. తన నివాసంగా ఉన్న చెట్టును నరికిన ఆ కూలీని ఆ అమ్మాయి ఆత్మ శపించిన కారణంగానే ఆ కూలీ పిచ్చాడుగా మారిపోయాడని ఆ ప్రాంత ప్రజలు చెప్పుకోవటం ప్రారంభించారు.



# 15. అతీంద్రియ శక్తులు ఉన్నాయి అని నిరూపించే యదార్థ సంఘటనలు?

### మర్కటపంజా (Monkey paw)

భారతదేశంలో అనేకమంది సాధువులు, అఘోరాలు అద్భుతమైన మహిమల్ని కలిగి ఉంటారని ప్రపంచవ్యాప్తంగా ఉన్న అనేకమంది పారాసైకాలజిస్టులు బలంగా

విశ్వసిస్తున్నారు. ముఖ్యంగా కొందరు సాధువులు కొన్ని వస్తువులను తమ తాంత్రిక ఆరాధనా విధానాలలో ఆరాధించి వాటికి కొన్ని అమానుషశక్తులువచ్చేలా చెయ్యటం జరుగుతుంది. అలాంటి మానవాతీతశక్తులను కలిగి ఉండే వస్తువులు అప్పుడప్పుడూ బయటపడటం జరుగుతుంది. వాటిని దగ్గర ఉంచుకున్న మనుషులకు కొన్ని ప్రయోజనాలు, కొన్ని నష్టాలు జరగటం సంభవిస్తుంది. అలాంటి ఒక మహాత్తుగల ఒక కోతియొక్క హస్తం(పంజా) ఎంతమందికి ఎన్నిరకాలుగా హానికలిగించిందో తెలుసుకుందాం. దాదాపు 150 సంవత్సరాలక్రితం అమెరికాలో జరిగిన ఈ యదార్థ సంఘటన ఆధారంగా పాశ్చాత్యదేశాలలో సినిమాలు, పుస్తకాలు, రేడియో మరియు టీ.వి. నాటకాలు తయారయ్యాయి. ఆ సంఘటన ఎలా జరిగిందో క్లుప్తంగా తెలియజేస్తాను. దాదాపు 150 సంవత్సరాలక్రితం అమెరికాలో వైట్ అనే సామాన్య కుటుంబీకుడు ఉండేవాడు. అతనికి భార్య మరియు హెర్బర్ట్ అనే కొడుకు ఉండే వాళ్ళు. వాళ్ళు ఆర్థికంగా చాలా దీనస్థితిలో ఉండేవాళ్ళు. హెర్బర్ట్ అక్కడకు దగ్గరలో ఉండే ఉన్న ఒక కర్మాగారంలో పనిచేస్తూ ఉండేవాడు. ఒక వర్షపురోజు రాత్రి వైట్ తన భార్య మరియు కొడుకుతో కలిసి డైనింగ్ టేబుల్‌దగ్గరకూర్చుని మద్యం సేవిస్తున్నారు. (పాశ్చాత్య దేశాలలో కుటుంబంతో కలిసి మద్యపానం చెయ్యటం చాలా సాధారణమైన విషయం. ఆదేశాలలో చలి చాలాఅధికంగా ఉంటుంది కనుక వెచ్చదనంకోసం ఇంట్లో ఉండే పెద్దలందరూ బ్రాందీ లేదా విస్కీని సేవించటం జరుగుతుంది.)

ఇంతలో వాళ్ళ ఇంటి తలుపు ఎవరో తట్టారు. వైట్ వెళ్ళి తలుపుతీసాడు ఎదురుగా వైట్‌యొక్క బాల్యస్నేహితుడు అయిన సార్జెంట్–మేజరు మోరిస్ కనిపించాడు వైట్ తన మిత్రుడిని ఇంట్లోకి ఆహ్వానించాడు. మోరిస్ లోపలికివచ్చివైట్‌కిషేక్‌హేండ్ఇచ్చి ప్రక్కనే ఉన్న ఒక కుర్చీలో కూర్చున్నాడు. వైట్ తన భార్యను, కొడుకును పిలిచి తన మిత్రుడైన మోరిస్‌ని వారికి పరిచయంచేసాడు. ఆ తరువాత వైట్, మోరిస్‌కి కూడా ఒక గ్లాసులో బ్రాందీపోసి ఇచ్చాడు. మోరిస్ సహజంగా గంభీరస్వభావుడు అయినప్పటి ప్రస్తుతం కులాసాగా మాట్లాడుతున్నాడు. మోరిస్ గ్లాసుమీద గ్లాసుమద్యం తాగుతున్నాడు. ఇంతలో మోరిస్ ఒక కొత్తవిషయం గురించి అక్కడ ఉన్నవాళ్ళకి చెప్పటం ప్రారంభించాడు. నేను సైన్యంలో పనిచేసాను అన్నవిషయం ఇప్పటికే మీకందరికి తెలిసి ఉంటుంది. నేను ఒకసారి ఇండియాకి వెళ్ళిన ఆర్మీబెటాలియన్‌తో ఇండియాకి వెళ్ళాను. అక్కడ నాకు విశ్రాంతి దొరికిన సమయాలలో నేను ఉండే పట్టణాలలోని వివిధ ప్రదేశాలను సందర్శిస్తూ ఉండేవాడిని.

ఒకరోజు నేను బెనారస్‌లో తిరుగుతున్నపుడు అక్కడ ఒక హిందూ బైరాగి నాకు కనిపించాడు. అతని ఆకారం చాలావిచిత్రంగా కూడా ఉన్నది. నడుముకి ఏదో

వస్త్రాన్ని ఆచ్ఛాదనగా కట్టుకున్నాడు. అతని ఒళ్ళంతా విభూతి నిండి ఉన్నది. అతని శిరస్సుపై జడలుకట్టిన జుట్టు ముడిపెట్టబడి ఉన్నది. అతని నుదిటిమీద పెద్దకుంకుమ బొట్టు ఉన్నది. అతని మాటతీరునచ్చిన నేను, ఉద్యోగరీత్యా బెనారస్‌లో ఉన్నన్ని రోజులు వీలున్నప్పుడల్లా అతడిని కలుస్తూ ఉండేవాడిని. నేను తిరిగి అమెరిక రావటానికిముందు ఆ బైరాగిని కలిసి అతనికి కొంచెం గంజాయి కానుకగా ఇచ్చి "వెళ్ళిపోతున్నాను" అని అతనికి చెప్పాను. అతడు చిరునవ్వునవ్వి తన భుజానికి వేలాడు తున్న జోలెనుండి ఒక వస్తువుతీసి నా చేతిలోపెట్టాడు. మొదట్లో అది ఏమిటో నాకు అర్థంకాలేదు. పరిశీలనగాచూస్తే అర్థమయ్యింది. అది ఒక కోతియొక్క ఎండిపోయిన చెయ్యి అని. ఈ ఎండిపోయిన ఎముకచెయ్యి నాకెందుకు? అన్నాను నిరాసక్తంగా. అపుడా బైరాగి పెద్దగా నవ్వుతూ ఈ మర్కటపంజా (Monkey paw) సామాన్యమైనది అని అనుకుంటున్నావా? ఇది ఎంత మహత్యం కలదో నీకు తెలుసా? ఇది ఎవరి దగ్గర ఉంటే వాళ్ళుకోరే మూడు కోర్కెలను తీరుస్తుంది అన్నాడు.

మనిషి జీవితంలో ఏం జరగాలో ముందుగానే విధి నిర్ణయిస్తుంది. ఆ నిర్ణయానికి విరుద్ధంగా మనిషిచేసే పనుల వల్ల ఎంత ప్రమాదము సంభవిస్తుందో తెలియజేయటం కోసమే ఈ మర్కటపంజాను నీకు ఇస్తున్నాను అన్నాడు.

హిందూదేశంలోని ఋషులకు, స్వాములకు, బైరాగులకు మహిమలు ఉంటాయని పాశ్చాత్యులు తరచుగా చెప్పుకుంటూ ఉంటే విన్నాను. ప్రత్యక్షంగా ఇపుడు చూస్తున్నాను అన్నాను ఆ బైరాగితో. ఆ బైరాగి ఆ మర్కటపంజాను నాచేతిలో ఉంచి జాగ్రత్త!. ఈ మర్కట పంజాను తెలివిగా ఉపయోగించుకో ఎట్టిపరిస్థితులలో రెండవకోర్కెను కోరవద్దు. నువ్వు రెండవ కోర్కెను కోరితే అది తీరుతుంది. కానీ ఆ తరువాత నీ మరణాన్ని నీ అంతటనీవే నీ మూడో కోరికగా కోరే పరిస్థితిని ఈ పంజా కల్పిస్తుంది అన్నాడు. నేను ఆ తరువాత ఆ మర్కటపంజాను నా కోటు జేబులో పెట్టుకుని నా కాంప్ దగ్గరకి వచ్చేసాను.



నేను ఆ పంజాను ఉపయోగించి ఒక్క కోర్కెను మాత్రమే కోరుకున్నా. ఎట్టి పరిస్థితిలోను రెండవ కోర్కెను కోరుకోలేదు. నా మొదటి కోరిక విచిత్రంగా తీరిపోయింది. ఆ కోరిక ఏమిటో మీకు ఇప్పుడు

చెప్పకూడదు. ఆ తరువాత ఈ పంజాని నాకు తెలిసిన ముగ్గురు వ్యక్తులకి ఇచ్చాను. ఆ పంజా ఎవరికైనా మూడు కోర్కెలు తీరుస్తుందని, ఒక్క కోర్కెను మాత్రమే కోరుకుంటే మంచి జరుగుతుందని ముందుగానే హెచ్చరించా. కానీ దురాశపరులైన ఆ ముగ్గురూ ఒక్కొక్కళ్ళు రెండు కోర్కెలు కోరుకుని ఆ మర్కటపంజా తాంత్రిక ప్రభావంవల్ల తమ మరణాలను మూడవ వరంగా కోరుకుని అకాల మృత్యువు పాలయ్యారు.

మోరీస్ చెప్పిన మాటలను వైట్ కుటుంబం విస్మయంతో విన్నది. ఆ తరువాత మోరీస్ తన చేతిలో ఉన్న మర్కటపంజాను అక్కడ ఉన్న అందరికీ ఒకసారిచూపించి "శాపగ్రస్తమైన ఈ పంజా ఇకపై ఉండకూడదు. దీని వలన ఇకపై ఎవరికీ హాని కలగ కూడదు" అనిచెప్పి ఆ మర్కటపంజాను ఎదురుగా ఉన్న చలి మంటలోకి విసిరివేయ బోయాడు. కానీ వైట్ కంగారుగా మోరీస్ దగ్గరకువెళ్ళి "నీకు అక్కరలేకపోతే దాన్ని నాకు ఇవ్వు నేను దాన్ని ఉపయోగించుకుంటాను" అన్నాడు. మోరీస్ విచిత్రంగా వైట్‌కేసి చూస్తూ "ఇదినీకు కావాలా? దీనివల్ల ఎన్ని ప్రమాదాలు వస్తాయో నీకు తెలుసా? అన్నాడు. నా తిప్పలు నేను పడతాను. నీకు అక్కరలేని ఆ పంజా దయచేసి నాకు ఇవ్వు" అన్నాడు వైట్. మోరీస్ ఇంకేమీ మాట్లాడకుండా ఆ పంజాను మౌనంగా వైట్ చేతిలో పెట్టాడు. ఇంతలో వైట్ భార్య అందరినీ భోజనాలకి రమ్మనటంతో సంభాషణలు అంతటితో ఆగిపోయాయి. మర్నాడు ఉదయం మోరీస్ వెళ్ళిపోయా

హెర్బర్ట్ ప్రక్క ఊరిలో తాను ఉద్యోగంచేస్తున్న ఫ్యాక్టరీకి వెళ్ళిపోయాడు. వైట్ మరియు అతని భార్య మాత్రమే ఇంట్లో ఉన్నారు. వైట్ లోపల పెట్టెలో దా మర్కట పంజాను తీసుకువచ్చి భార్యముందు పెట్టి "మనం కోరే కోర్కెలు తీర్చ ఈ పంజాను కోరదాం" అన్నాడు. అతని భార్య తమాషాగా నవ్వుతూ "నువ్వు ఎం మూర్ఖుడివి! ఎండిపోయిన, ప్రాణంలేని ఈకోతి చెయ్యి మన కోర్కెలు తీర్చే మహత్యా కలిగి ఉంటుందా?. ఆ మోరీస్ తాగిన మైకంలో ఏవో పిచ్చి కథలు చెప్పాడు అవనీ నమ్ముతావా?" అన్నది భర్తతో. అపుడు వైట్, "సరే! ఈ పంజాని ఒక కోర్కె కోరతా అది తీరితేసరి. లేకపోయినా మనకేమీ నష్టంలేదు. మనం దీన్ని ఊరికినే తీసుకున్నాం మనం ఒక్క పెన్నీకూడా దీనిమీద పెట్టుబడి పెట్టలేదు అన్నాడు. "సరే నీ ఇష్టం!" అన్నది అతని భార్య. అపుడు వైట్ లేచి నుంచుని తన కుడిచేత్తో ఆ మర్కటపంజాని గాలిలోకి ఎత్తిపట్టుకుని పెద్ద గొంతుతో ఇలా అన్నాడు. "నాకు రెండువందల పౌండ్ల డబ్బుకావాలి". బయట జోరుగా వర్షం కురుస్తున్నది అప్పుడప్పుడూ ఉరుములు ఉరుముతున్నాయి. పిడుగులు రాలుతున్నాయి. వైట్ ఒంట్లో ఏదో తెలియని వణుకు మొదలయ్యింది. అతని భార్య కూడా ఏదో తెలియని భయానికి గురి అవుతున్నది. ఇంతలో ఎవరో తలుపుతట్టినట్టుగా చప్పుడు వినిపించింది. వైట్ వేగంగా నడుస్తూ

తలుపు దగ్గరకువెళ్ళి తలుపు తీసాడు. ఎదురుగా రైన్‌కోటు, టోపీ ధరించిన ఒక అపరిచిత వ్యక్తి కనిపించాడు.

అతడు ఎవరో వైట్‌కి అర్ధంకాలేదు. అతడిని లోపలికి రమ్మని ఆహ్వానించాడు. అతను అందుకు సున్నితంగా తిరస్కరించి గుమ్మందగ్గరే నిలబడి తన రైన్‌కోటు క్రింద ఉన్న కోటు జేబులోంచి ఒక ఎన్‌వలప్ కవరునితీసి వైట్ చేతిలోపెట్టి, “మీ అబ్బాయి ఇవాళ మధ్యాహ్నం ఫ్యాక్టరీలో జరిగిన ఒక ప్రమాదంలో మిషనులో చిక్కుకుని నలిగిపోయి చనిపోయాడు. అతను పోవటంవల్ల మీకు కలిగే నష్టాన్ని మా కంపెనీ పూడ్చలేదు అన్నవిషయం మాకు తెలుసు. అయినా మా కంపెనీ 200 పౌండ్లని నష్టపరిహారంగా మీకు ఇస్తున్నది” అన్నాడు నిర్వికారంగా. వైట్‌కి తన కాళ్ళకింద ఉన్న భూమి గిర్రున తిరుగుతున్నట్టుగా అనిపించింది. అతనికి కొంచెం దూరంలో నుంచుని ఉన్న అతనిభార్య తన కొడుకు మరణవార్త విని మాటామంతి లేకుండా బిగుసుకుపోయింది. కవరు ఇచ్చిన ఆ కొత్తవ్యక్తి అవేవీ పట్టించుకోకుండా గబగబా నడుస్తూ అక్కడనుండి రోడ్డుమీదకు వెళ్ళిపోయాడు.

కొంతసేపటికి వైట్ దంపతులు కొడుకు చనిపోయాడు అన్న వార్త ఇచ్చిన షాక్ నుండి తేరుకుని ఒక్కసారిగా గొల్లుమని ఏడ్చాడు. మాకు డబ్బు కావాలి అని ఆ పాపిష్టి పంజానికోరితే అది తమ కొడుకుని చంపి తద్వారా వచ్చిన డబ్బుని తమకు అందేలాచేసింది అనుకున్నారు ఆ దంపతులు. రెండు రోజులు గడిచాయి వైట్, కొడుకు పోయిన దుఃఖం నుండి కొంత కోలుకున్నాడుకానీ అతని భార్యమాత్రం పాతిక సంవత్సరాలు అల్లారుముద్దుగా పెంచిన తన కొడుకుని మర్చిపోలేక మళ్ళీమళ్ళీ అతడిని తలచుకుని రోదిస్తూ ఉన్నది. సరిగ్గా అర్ధరాత్రి కావొస్తున్నది వైట్, ఇంట్లో ఒక మూలగా ఉన్న చలిమంటదగ్గర కూర్చుని మద్యం సేవిస్తున్నాడు. అతని భార్య హఠాత్తుగా బెడ్‌రూంలోంచి బయటకువచ్చి “నీ దగ్గర ఉన్న ఆ పంజాని రెండో కోరిక కోరు, నా కొడుకుమళ్ళీ బ్రతికిరావాలనికోరు” అన్నది వణుకుతున్న స్వరంతో. ఆ మాట విన్న వైట్ అదిరిపడ్డాడు. “నీకేమైనా మతిపోయిందా చూడటానికికూడా భయంపుట్టించే విధంగా చితికిపోయిన నీ కొడుకు ఇప్పుడు బతికితే ఎంత భయానకంగా ఉంటాడో నీకు తెలుసా? సమాధిచేయబడ్డ నీ కొడుకు మృతదేహానికి ప్రాణంవస్తే అతడు పిశాచిగా మారతాడని తెలుసా?” అన్నాడు కఠినస్వరంతో. కానీ అతనిభార్య ఆ మాటల్ని పట్టించుకోలేదు. నాకు అది అంతా అనవసరం. నా కొడుకు నాకు తిరిగి కావాలి అన్నది మొండిగా. ఇక చేసేదిలేక వైట్, పెట్టెలో భద్రంగా దాచిన మర్కటపంజాను తీసుకుని బయటకువచ్చి కుడిచేతిలో దానినిపట్టుకుని “చనిపోయిన నా కొడుకు మళ్ళీ తిరిగిరావాలి!” అన్నాడు పెద్ద స్వరంతో”. ఎక్కడో పెద్దపిడుగుపడ్డ

శబ్దం వినిపించింది. కుంభవృష్టితో వర్షం ప్రారంభమయ్యింది. వైట్ వెన్నులో వణుకు మొదలయ్యింది. అతని భార్యకూడా ఏదో తెలియని భయంతో భర్తకేసి చూస్తున్నది.

ఇంటి బయటనుండి ఏవో వికృత జంతువులు అరిచిన అరుపులు ఆ దంపతులను మరింత భీతావహుల్ని చేస్తున్నాయి. ఇంతలో వాకిటి తలుపు ఎవరో తడుతున్నట్టుగా చప్పుడు వినిపించింది. "అదిగో! నా కొడుకు వచ్చేశాడు వెళ్ళి తలుపు తియ్యి" అన్నది ఆమె భర్తతో. వైట్‌కి చాలా భయంగా ఉన్నది. ఒకవేళ తన కొడుకే తిరిగివచ్చి ఉంటే అతడు తప్పకుండా పిశాచిగానే వచ్చి ఉంటాడు అని అతడు అనుకుంటున్నాడు. భార్య వత్తిడిని తట్టుకోలేక వైట్ ధైర్యంతెచ్చుకుని వాకిటి తలుపు తెరిచాడు. అక్కడ ఎవరూలేరు. మళ్ళీ లోపలకువచ్చి తలుపువేసి బెడ్‌రూంలోకి వెళ్ళాడు. ఇంట్లో వెలుగుతున్న దీపాలు హఠాత్తుగా ఆరిపోయాయి. ఎవరో పెద్ద గొంతుతో మూలుగుతున్నట్టుగా శబ్దాలు వినిపిస్తున్నాయి. వైట్‌భార్య ఆ శబ్దాలకు భయపడి భర్త ఉన్న బెడ్‌రూంలోకి పరుగెత్తింది. ఆ దంపతులలో భయం. వైట్‌కి అర్థమయిపోయింది. రెండు కోర్కెలు తను ఆ మర్కటపంజాను కోరటంతో తాను కోరకపోయినా మూడవ కోరికగా మరణాన్ని తమకి ఆ పంజా ప్రసాదిస్తున్నది అని. (చనిపోయిన కొడుకుని బ్రతికించమని వైట్ కోరటంవల్ల పంజా అతడిని బ్రతికించింది. విధివ్రాత ప్రకారం అతడు చనిపోవాలి అని వ్రాసి ఉన్నది. కానీ వైట్ ఆ పంజా సహకారంతో విధివ్రాతను ధిక్కరించి తన కొడుకు తిరిగిరావాలని కోరుకున్నాడు. ఫలితంగా అతని కొడుకు ప్రేతాత్మగా తిరిగివచ్చాడు. తన తల్లి మరియు తండ్రి మరణాలకు కారకుడయ్యాడు).

### ఆ పిలుపు ఎవరిది?

చావు మనిషి శరీరానికి మాత్రమే ఉంటుంది. అతడి ఆత్మకికాదు. ఆత్మశాశ్వతం. కొన్నిసార్లు అకాలమృత్యువుపాలు అయినవాళ్ళు తాము భౌతికంగా చనిపోయాము అని గుర్తించలేక తమ ఇంట్లోనో, తమకు బాగా ఇష్టమైన ప్రదేశంలోనో సంచరించటం జరుగుతుంది. ఆరు సంవత్సరాల క్రితం చెన్నై మహానగరంలో జరిగిన ఒక సంఘటన ఆత్మలు నిజంగా ఉన్నాయి అని బలపరుస్తున్నది. ఈ యదార్థ సంఘటనకు సాక్షిగా ఉన్న పరిమళ అనే ఒక అమ్మాయి మాటల్లోనే ఆ వివరాలు తెలుసుకుందాం.

నేను తరచుగా మద్రాసు నగర పొలిమేరల్లో ఉంటున్న నా స్నేహితురాలి ఇంటికి వెళుతూ ఉండేదాన్ని. ఆమె భర్త చెన్నైలో ఒక ప్రభుత్వ ఆఫీసులో పనిచేస్తూ ఉండేవాడు. ఆమెకు మూడు సంవత్సరాల కూతురు ఉండేది. నా స్నేహితురాలు ఉండే వీధిలోనే నా స్నేహితురాలి ఇంటికి నాలుగు ఇళ్ళ అవతల ఒక ఇంట్లో ఉంటున్న ఒక కుటుంబంలో పదకొండు సంవత్సరాల పిల్లవాడు ఉండేవాడు. వాడు రోజూ సాయంత్రం స్కూలు నుండి రాగానే నా స్నేహితురాలు ఇంటికివచ్చి ఆమె

మూడు సంవత్సరాల కూతురుతో ఆడుకునేవాడు. వాడు నా స్నేహితురాలిని తరచుగా అక్కా అక్కా అని పిలుస్తూ ఆమెను అభిమానిస్తూ ఉండేవాడు. నేనుకూడా రెండుమూడుసార్లు అక్కడికి వెళ్ళినపుడు ఆ అబ్బాయితో మాట్లాడాను. ఒకసారి నేను నా మిత్రురాలి ఇంటికి వెళ్ళాను. ఆ సమయంలో ఆమెభర్త ఇంట్లో లేడు. వాళ్ళ అమ్మాయి ఉయ్యాలలో నిద్రపోతూ ఉన్నది. నా స్నేహితురాలు ఏదో దుఃఖంతో తల్లడిల్లిపోతున్నట్టుగా విచారంగా కనపడింది. నేను ఆమెను దగ్గరగా తీసుకుని ఏమయ్యింది? ఎందుకు అలా బాధపడుతున్నావు? అని అడిగాను. ఆమె గద్గదస్వరంతో మా ఇంటికి రోజూ వచ్చే ఆ పిల్లవాడు నీకు తెలుసుకదా? అన్నది. అవును అన్నట్టుగా తల ఊపి, అయితే ఏమిటి? అన్నాను. ఒక నెలక్రితం ఆ పిల్లవాడి తాలూకు కుటుంబం ఈ వీధికి కొంచెందూరంగా నాలుగు వీధుల అవతల ఉన్న ఇంట్లోకి మారిపోయారు. 14 రోజులక్రితం వాళ్ళ ఇంట్లో గాస్ సిలెండర్‌పేలి ఆ పిల్లవాడు చనిపోయాడు. వాడు నన్ను ఎప్పుడూ "అక్కా" అని పిలుస్తూ నా వెంట తిరుగుతూ ఉండేవాడు. వాడు పోయాడు అంటే తట్టుకోలేకపోతున్నాను అన్నది గద్గదస్వరంతో. అరె! అంతపని జరిగిందా? పాపం ఆ పిల్లాడు అన్యాయంగా చనిపోయాడు అన్నాను భారంగా.

నేను, ఆమెను నాకు తెలిసినవిధంగా ఓదారుస్తూ ఉన్నాను. ఇంతలో సాయంత్రం 6.30 అయ్యింది. వీధి దీపాలు వెలిగాయి. నా స్నేహితురాలుకూడా ఇంట్లో లైట్లు ఆన్‌చేసింది. రెండు కప్పులు టీ తీసుకువచ్చి నాకు ఒకటిఇచ్చి తను ఒకటి తీసుకుంది. ఇద్దరం టీ తాగుతున్నాం. బెడ్‌రూంలో వాళ్ళపిల్ల నిద్రపోతున్నది. మేమిద్దరం హాలులో కూర్చుని ఏవేవో విషయాలు మాట్లాడుకుంటున్నాం. ఇంతలో ఎవరో ఒక పిల్లవాడు అక్కా! అని పిలిచినట్టుగా మా ఇద్దరికి వినపడింది. ఆ పిలిచింది ఎవరా? అని నేను వాకిట్లోకి తొంగిచూసాను. అక్కడ ఎవరూలేరు. అదంతా నాభ్రమ అనిపించి మరల హాలులోకి వచ్చి కూర్చున్నాను. మళ్ళీ ఇంకొకసారి అక్కా! అన్న పిలుపు పెద్దగా వినపడింది. ఈ పిలుపు దాదాపు నాలుగైదుసార్లు వినపడటంతో నేను, నా స్నేహితురాలు విపరీతమైన ఆశ్చర్యానికి గురి అయ్యాం. కారణం అక్కడ ఎవరూ లేకుండానే ఆ పిలుపు వినపడుతున్నది. ఆ తరువాత నా స్నేహితురాలి భర్త ఇంటికి ఫోన్‌చేసి "నేను రాత్రివచ్చేసరికి బాగా పొద్దుపోతుంది నువ్వుభోజనంచేసి పడుకో" అని చెప్పాడు. సరే! నాకు ఎలాగూ ఇంట్లో పని ఏమీ లేదు కాబట్టి రాత్రి 10గంటల వరకు ఇక్కడే ఉండి నా స్నేహితురాలికి కంపెనీ ఇద్దామని నిర్ణయించుకున్నాను.

మేము అలా మాటల్లో ఉండగానే సమయం రాత్రి 8గంటలు అయ్యింది. ఇంతలో వాకిట్లో నుండి అక్కా! అక్కా! అనే పిలుపు 15 నిమిషాల వ్యవధిలో దాదాపు 15 సార్లు వినపడింది. నాకు ఆ పిలుపు ఎవరిదో అర్థం కావటంలేదు. నా

స్నేహితురాలికేసి చూసాను. ఆమె ముఖం అంతా చెమలు పట్టిపోయి ఉన్నది. ఆమె శరీరం భయంతో వణకిపోతున్నది. నేను ఆమె భుజంపై చెయ్యివేసి "ఏయ్! ఏం జరిగింది అలా వణకిపోతున్నావు?" అన్నాను కంగారుగా. ఆ పిలుపు ఎవరిదో నీకు తెలుసా? అన్నది ఆమె. ఎవరిది ఆ పిలుపు? అన్నాను విపరీతమైన ఆత్రంతో. రెండువారాల క్రితం అగ్ని ప్రమాదంలో చనిపోయిన ఆ పిల్లవాడిదే ఆ పిలుపు. వాడు చనిపోయి ప్రేతాత్మగా మారి ఇక్కడికి వచ్చాడు అన్నది వణుకుతున్న స్వరంతో. నాకు ఏం చెయ్యాలో అర్థం కావటంలేదు ఇంతలో నా స్నేహితురాలు ధైర్యం చిక్కబట్టుకుని గబగబా పూజా మందిరంలోకివెళ్ళి అక్కడ దేవుడిముందు దీపారాధనచేసి, ఒక కర్పూరం ముద్దను తీసుకుని వాకిటి గుమ్మం అవతల ఆ ముద్దనుపెట్టి దాన్ని వెలిగించి, గాలిలోకి చూస్తూ చేతులు జోడించి "తమ్ముడూ! దయచేసి ఇక్కడనుండి వెళ్ళిపో! నువ్వు ఇక్కడికి రావొద్దు! అన్నది వణికిపోతున్న స్వరంతో. అయితే ఆమె అలా అంటూ ఉంటే వద్దు! వద్దు! కర్పూరం వెలిగించవద్దు! అన్న ఒక పిల్లవాడి అదృశ్యస్వరం మా ఇద్దరికి స్పష్టంగా వినపడటంతో భయంతో మా వెన్నుముకలు చల్లబడిపోయాయి. ఆ తరువాత మేం ఇద్దరం మా ఇష్ట దైవాలను తలచుకుంటూ లోపలికి వెళ్ళి కూర్చున్నాం. రాత్రి 10 గంటల తరువాత నా స్నేహితురాలి భర్త ఇంటికి తిరిగివచ్చాడు.

నేను, నా స్నేహితురాలి దగ్గర సెలవు తీసుకుని నా కారులో ఎక్కబోతున్నపుడు నా స్నేహితురాలు నా దగ్గరగా వచ్చి "మనల్ని ఇందాక భయపెట్టిన ఆ పిల్లవాడు చనిపోయి ఇప్పటి 14 రోజులు అయ్యింది. వాళ్ళ ఇంట్లో ఆ పిల్లవాడికి శ్రార్ధకర్మలు చేయిస్తున్నారు. ఇవాళ ఉదయం ఆ పిల్లవాడికి చేస్తున్న కర్మలు పూర్తి అయ్యాయి గత 14 రోజులుగా ప్రతి సాయంత్రమూ నాకు రెండు మూడుసార్లు 'అక్కా! అన్న పిలుపు వినపడినప్పటికీ అది నా భ్రమ ఏమో అనుకున్నా'. కానీ అది భ్రమ కాదని ఆ పిల్లవాడు ఆత్మగామారి ఇక్కడకు వచ్చాడని ఇప్పటికి అర్థమయ్యింది అన్నది బాధగా ఏది ఏమైనా ఈ రోజుతో ఆ పిల్లవాడి ఆత్మశాంతికోసం చేసే శ్రార్ధకర్మలు పూర్తిఅయిపోయాయి కనుక ఇకపై అతడి ఆత్మ మనకు కనపడదని ఆశిద్దాం అన్నాను ఆమె నుండి సెలవు తీసుకుని నా కారుని స్టార్ట్‌చేస్తూ.

★ నగేష్, హైదరాబాద్‌లో ఉన్న ఒక ప్రైవేటు పరిశ్రమలో ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు. అతడికి ఈ మధ్యే ఒక పిల్లవాడు పుట్టాడు. నగేష్ తన భార్యబిడ్డలతో ఆనందంగా కాలం గడుపుతున్నాడు. అయితే అతని ఆనందం ఎక్కువకాలం నిలవలేదు. కారణం అతని కుటుంబంలో కొద్దిరోజులుగా ఎదురవుతున్న సమస్యలే. నగేష్ భార్య మరియు మూడు నెలల బిడ్డ, బెడ్‌రూంలో ఉన్న డబల్‌కాట్‌బెడ్‌మీద పడుకునేవారు.

ఆ గదిలోనే ఇంకోమంచం వేసుకుని నగేష్ పడుకునేవాడు. అయితే కొద్దిరోజులుగా ఆ బెడ్‌రూంలో ఏదో అదృశ్యశక్తి ప్రవేశించిందా? అన్నట్టుగా అక్కడ కొన్ని విచిత్రాలు జరగటం మొదలయ్యింది. అది ఏమిటంటే తెల్లవారుఝామున 3గంటల ప్రాంతంలో నగేష్ కొడుకు నిద్రలేచి ఇంటికప్పు ఎగిరిపోయేట్టు భయంకరంగా గుక్కపెట్టి ఏడుస్తూ ఉండేవాడు. అదే సమయంలో అతని భార్యకు చేతులమీద, కాళ్ళమీద సన్నటి పొక్కుల్లాంటివి ఏర్పడి అవి విపరీతమైన దురదను కలిగిస్తూ ఉండేవి. ఆ సమయంలో ఆమె కనీసం నుంచోటానికికూడా శక్తిలేకుండా ఉండేది. విచిత్రం ఏమంటే సూర్యోదయం కాగానే ఆమె ఒంటిమీద ఉన్న ఆ పొక్కులు మాయమయిపోయేవి. పసిబిడ్డ ఏడుపుమానేసి గాఢనిద్రలోకి జారుకునేవాడు. ఇలా దాదాపు 40 రోజులపాటు వరుసగా జరిగింది. విచిత్రం ఏమంటే ప్రతిసారి తెల్లవారుఝామున 3గంటలకే ఈ సమస్య ప్రారంభం అవుతూ ఉండేది. అయితే తన భార్యకు మరియు బిడ్డకు వస్తున్న సమస్యకు కారణం మానవాతీతశక్తులు అన్నవిషయం నగేష్‌కి మొదట అర్థంకాలేదు.

పరిస్థితిమాత్రం రోజురోజుకీ విషమిస్తున్నది. ఇపుడు తెల్లవారు ఝామున 3గంటల ప్రాంతంలో పసిబిడ్డ విపరీతంగా ఏడుస్తూ ఉంటాడు. అతని భార్య నిద్రలో వికృతంగా కేకలు పెడుతున్నది. నగేష్‌కి ఏం చెయ్యాలో అర్థంకావటంలేదు. అతను దాదాపుగా నాలుగేళ్ళనుండి ఆ ఇంట్లో ఉంటున్నాడు. మూడేళ్ళక్రితం అతనికి పెళ్ళి అయ్యింది. మూడు నెలల క్రితం అతనికి మగబిడ్డపుట్టాడు. అంతాబాగానే ఉంది కానీ ఈ సమస్య ఎందువల్ల ఏర్పడింది? అన్నవిషయం నగేష్‌కి ఒక పజిల్‌లా తయారయ్యింది. ఇంతే కాకుండా ఇంకొక కొత్తసమస్య నగేష్‌మీదకి వచ్చిపడింది. అది ఏమిటంటే నగేష్ ఇంటి మీద రాత్రి సమయాలలో ఎవరో విసిరినట్టుగా కంకరరాళ్ళు వచ్చిపడుతున్నాయి. కొన్నిసార్లు ఇంటిమీదపడ్డ ఆ రాళ్ళు కిందకి దొర్లి గోడకి ఉన్న కిటికీలోంచి లోపలికి పడేది. ఫలితంగా ఇంట్లో అలమరలో ఉన్న గాజు సామాను పగిలిపోతూ ఉండేవి. కొన్నిసార్లు ఆ రాళ్ళు వంటింట్లో పడి డైనింగ్ టేబుల్‌మీద ఉన్న ఆహార పదార్థాలు కిందపడి పోతూ ఉండేవి.



ఒకసారి నగేష్ ఇంటికి అతని అన్నయ్యలు వచ్చారు. నగేష్ వాళ్ళతో కలిసి డైనింగ్ టేబుల్‌మీద భోజనం చేస్తున్నాడు. ఇంతలో వాళ్ళ మధ్యలో రెండు కంకర

రాళ్ళు పడ్డాయి. సరిగ్గా పైనుంచి పడ్డాయి కనుక అవి ఇంటి కప్పులోంచి పడి ఉండాలి. కానీ అత్యంత బలంగా నిర్మించబడిన ఆ రూఫ్‌లోంచి కంకరరాళ్ళు ఎలా లోపలికి రాగలిగాయి అన్నవిషయం అర్థంకాని నగేష్ తన అన్నతో కలిసి వెంటనే మేడమీదకి వెళ్ళిచూసాడు. అక్కడ ఎవరూలేరు. రాళ్ళు నేరుగా ఇంటిలోపలికి పడవెయ్యటానికి రూఫ్‌కి కంతలూ లేవు. ఈ పరిస్థితులు నగేష్‌కి విపరీతమైన మానసిక వేదనను కలిగించటం మొదలయ్యింది. ఒకసారి అనుకోకుండా నగేష్ రామ్‌నగర్‌లో ఉన్న తన మిత్రుడి ఇంటికి వెళ్ళినపుడు అక్కడ ఒక సిద్ధాంతిగారిని కలిసాడు. "ఆయనపేరు గోవిందన్ నంబూద్రి అని, ఆయన తిరుచ్చి ప్రాంతంలో నివసిస్తూ ఉంటాడని మరియు క్షుద్రశక్తులవల్ల, గ్రహపీడలవల్ల గతంలోచేసిన పాపకర్మలవల్ల అనేక రకాల సమస్యలు ఎదుర్కొంటున్న వారికి వారి సమస్యల నివారణకోసం అనేకరకాల హెూమాలు, జపాలు, తాంత్రిక ప్రక్రియలు నిర్వహిస్తూ ఉంటాడని" ఆ మిత్రుడు, నగేష్‌కి తెలియజేసాడు. కేవలము కేరళ రాష్ట్రంలో మాత్రమే కాక చెన్నై, బెంగుళూరు, బళ్ళారి ప్రాంతాలలోకూడా గోవిందన్ నంబూద్రికి మంచి పేరు ఉన్నదని నగేష్‌తో ఆ మిత్రుడు చెప్పాడు.

తానుకూడా ఆ నంబూద్రిని సంప్రదించి తన ఇంట్లో ఎదురవుతున్న సమస్యలను పరిష్కరించుకోవాలని నిర్ణయించుకున్న నగేష్ ఆ తరువాత రెండు రోజులకు ట్రైన్‌లో చెన్నై చేరుకుని ఆపై అక్కడ నుండి ఒక ప్రైవేటు వాహనంలో త్రిచిలో ఉన్న గోవిందన్ నంబూద్రి గృహానికి చేరుకున్నాడు. ఆ తరువాత ఆ నంబూద్రిని కలిసి తన సమస్యన వివరించాడు. ఆ నంబూద్రి, నగేష్ చెప్పిన మాటలు విని ఆలోచనలో పడ్డారు. నేన మీ ఇంటిని స్వయంగా చూస్తేగాని ఏమీ చెప్పలేను అన్నారు. "అయితే దయచేసి మీరు మా ఇంటికి రండి. మీకే అన్ని విషయాలు అర్థమవుతాయి" అన్నాడు నగేష్. నంబూద్రి అందుకు అంగీకరించారు. మూడు రోజుల తరువాత నంబూద్రి హైదరాబాద్‌లోని నగేష్ ఇంటికి చేరుకున్నారు. ఆయన నగేష్ ఇంటిలోని డ్రాయింగ్‌రూంలో ఒక ప్రత్యేక పూజను నిర్వహించి ఆపై ఆయన నగేష్‌తో ఇలా అన్నారు. "ఈ ఇంట్లో అమానుష శక్తులు ప్రవేశించాయి. వీటివల్లే మీకు సమస్యలు కలుగుతున్నాయి" అనిచెప్పి ఆపై పూజలో పెట్టిన కొన్ని నిమ్మకాయలను నగేష్‌కి ఇచ్చి వాటిని బెడ్‌రూం ద్వారబంధంపైన, మెయిన్‌డోర్ ద్వారబంధంపైన కట్టమని చెప్పారు. పూజ పూర్తి అయ్యింది. నగేష్ దంపతులు నంబూద్రిని తమ ఇంట్లో భోజనం చెయ్యమని అడిగారు. అప్పుడు నంబూద్రి వాళ్ళతో "దయచేసి అన్యథా భావించవద్దు. ప్రస్తుతం మీ ఇంట్లో దుష్టశక్తులు సంచరిస్తున్నాయి నేను ఇప్పుడే పూజచేసి వాటిని కొంతవరకు నియంత్రించాను నేను ప్రస్తుతం మీ ఇంట్లో మంచి నీళ్ళుకూడా తీసుకోకూడదు. ఈ సమస్య పరిష్కారంకోసం ఇంకా నేను చేయవలసింది

ఉన్నది. మీరు త్రిచిలో ఉన్న మా పీఠానికి వచ్చినట్లయితే అక్కడ చేయవలసిన పూజలు చేసి క్షుద్రశక్తుల నిర్మూలనకు అవసరమైన యంత్రాన్నికూడా ఇస్తాను" అన్నారు. ఆ తరువాత ఆయన త్రిచి వెళ్ళిపోయారు. నంబూద్రి ప్రత్యేక తాంత్రిక పూజ చేసిన తరువాత నగేష్ ఇంట్లో రాత్రి సమయంలో రాళ్ళుపడటం ఆగిపోయింది. అయితే అతనిభార్య మరియు బిడ్డయొక్క సమస్య తీరలేదు నంబూద్రి ముందుగానే చెప్పినట్టుగా ఇతర పూజలనుకూడా ఆయన పీఠంలో చేయిస్తేనే పూర్తిగా మంచి జరుగుతుందని అర్థంచేసుకున్న నగేష్, భార్యాబిడ్డల్ని హైదరాబాద్‌లో వదిలేసి అతను ఒక్కడే త్రిచి పట్టణంలో ఉన్న భద్రకాళి పీఠానికి చేరుకుని నంబూద్రిని కలిసాడు. ఆయన తన పీఠంలో గండభేరుంధనారసింహ పూజలు జరిపించి ఒక యంత్రాన్ని నగేష్‌కిచ్చి "దానిని ఇంటి ప్రధానద్వారంపైన అమర్చమని" చెప్పారు. అంతేకాకుండా ఒక సీసాలో దైవ తీర్థాన్ని ఇచ్చి దాన్ని ఇంట్లో దేవుడి దగ్గర ఉంచి అవసరమైనపుడు ఆ తీర్థాన్ని, పిశాచ బాధితుల నోట్లో పోయమని చెప్పారు. ఆ తరువాత నగేష్ హైదరాబాద్ తిరిగివచ్చేసాడు.

ఆ తరువాత అతను ఆ యంత్రాన్ని తన ఇంటి ప్రధానద్వారంపైన గోడమీద అమర్చాడు. తీర్థాన్ని దేవుడిదగ్గర భద్రంగా ఉంచాడు. యధాప్రకారం ఆరోజు తెల్లవారుఝామున 3 గంటలకి పసిబిడ్డలేచి గుక్కపట్టి ఏడుస్తున్నాడు. అతనిభార్యకూడా నిద్రలేచి పెద్దగా అరుస్తూ క్షణక్షణానికి రంగుమారిపోతున్న తన చేతుల్ని భయంతో చూసుకుంటున్నది. ఆ గొడవకి నగేష్‌కి మెలుకువ వచ్చింది. అతను వెంటనే బాత్‌రూంలోకివెళ్ళి కాళ్ళుచేతులు కడుక్కుని, ఆ తరువాత దేవుడి గదిలోకివెళ్ళి దేవుడికి నమస్కరించి నంబూద్రి ఇచ్చిన తీర్థం బాటిల్‌ని తీసుకుని బెడ్‌రూంలోకి వచ్చాడు. ఆ తరువాత కొన్ని తీర్థపు చుక్కలు, గుక్కపట్టి ఏడుస్తున్న కొడుకునోట్లో వేసాడు. ఆశ్చర్యంగా, ఆ బిడ్డ ఏడుపుమానేసి కేరింతలు కొట్టటం ప్రారంభించింది. వెంటనే నగేష్ కొంత తీర్థాన్ని భార్య వంటిపై, తలపై చిలకరించి, కొంత తీర్థం ఆమెనోట్లో పోసాడు. తీర్థం నోట్లో పడగానే ఆమె ఒక్కసారిగా కేకవేసి మంచంమీద విరుచుకుని పడిపోయింది. ఆమెనే పరిశీలనగా చూస్తున్న నగేష్‌కి ఆశ్చర్యం కలిగించే ఒక సంఘటన జరిగింది. అది ఏమిటంటే ఆమె శరీరంలో నుండి మనిషి ఆకారంలో ఉన్న బూడిద రంగు పొగ బయటకు వచ్చి బెడ్‌రూం రూఫ్‌గుండా పైకి వెళ్ళిపోయింది. అదే సమయంలో ఆమె చేతులమీద శరీరంమీద ఉన్న ఎరుపురంగు దద్దుర్లు కన్నుమూసి తెరచేలోగా మాయమయిపోయాయి.

ఆ తరువాత ఆ ఇంట్లో ఎలాంటి సమస్యలు రాలేదు. నగేష్ తన సమస్యను పరిష్కరించిన నంబూద్రి వద్దకువెళ్ళి కృతజ్ఞతలు తెలిపాడు. "మనకు కనపడనంత మాత్రాన క్షుద్రశక్తులు లేవు అనిఅనుకోకూడదు. చీకటి ఉన్నపుడు వెలుగు ఉంటుంది.

అలాగే దేవుడు ఉన్నపుడు దయ్యమూ ఉంటుంది అది సృష్టి నియమం. కొన్నిసార్లు మన కాలం ఖర్మం కలిసిరానపుడు మన ఇళ్ళలోకే క్షుద్రశక్తులు ప్రవేశిస్తాయి. అది గ్రహించి దైవ సహాయంతో, మంత్రసహాయంతో ఆ సమస్యను నివారించుకోవాలి. అదే బుద్ధిమంతుల లక్షణం" అన్నారు సంబూద్రి చిరునవ్వుతో. (దురదృష్టవశాత్తు ఆయన ఈ సంవత్సరం జనవరి నెలలో స్వర్గస్తులయ్యారు. నాకు తంత్రశాస్త్రపరంగా ఆయనకూడా ఒక గురువని చెప్పక తప్పదు.)

(గత సంవత్సరం డిసెంబర్ నెలలో ఈ సంబూద్రిగారిని నేను వ్యక్తిగతంగా కలిసి ఆయన నుండి తంత్రశాస్త్ర సంబంధమైన అనేక రహస్యాలను తెలుసుకున్నాను. ఒకవ్యక్తియొక్క జాతకచక్రాన్ని పరిశీలించి ప్రస్తుతం ఆ వ్యక్తికి క్షుద్రపీడ ఉన్నదా? లేదా? అన్న విషయాన్ని తెలుసుకోవచ్చు. క్షుద్రపీడలతో బాధపడేవారికి శబర తంత్ర శాస్త్రంలో చెప్పబడిన "కాష్టవిగ్రహబలి" అనే పరిహారాన్ని చేయవలసి ఉంటుంది. అంతేకాకుండా ఇంటి ప్రధానద్వారంపైన "గండభేరుండ నారసింహ యంత్రాన్ని" అమర్చుకోవలసి ఉంటుంది. ఇలాంటి సమస్యలతో బాధపడుతున్నవారు తంత్రశాస్త్ర సంబంధమైన పరిష్కారాలను పొందటంకోసం శ్రీధరన్‌కాండూరిని ఈ సెల్ నెంబర్లపై సంప్రదించవచ్చు. సెల్ : **9550983755, 9603056555.**

**వెంటాడే శిశువు – చైనా :**

2008వ సంవత్సరంలో చైనాలో జరిగిన యదార్ధ సంఘటన ఇది. భీతిని కలిగించే ఈ ప్రేతాత్మ సంబంధ ఉదంతం గురించి క్లుప్తంగా తెలుసుకుందాం. చైనాలో ఉద్యోగస్తురాలుగా ఉంటున్న ఒక స్త్రీ కొన్ని అత్యవసర పరిస్థితులలో అబార్షన్ చేయించుకున్నది. బహుశా ఆ బిడ్డపుడితే తాను పోషించలేదేమో అన్న అనుమానంతోనే ఆమె తన గర్భాన్ని తొలగించుకున్నది అని కొందరు అనుకున్నారు. ఆమె భర్తకూడా ఆమె అభిప్రాయానికి తలొగ్గి అబార్షన్‌కి అంగీకరించాడు. కొన్ని సంవత్సరాలు గడిచాయి వాళ్ళ ఆర్థిక పరిస్థితి బాగుపడింది. ఇక ధైర్యంగా పిల్లల్ని కనవచ్చు అన్న అభిప్రాయానికి వారు వచ్చారు. ఫలితంగా ఆమె మళ్ళీ గర్భం ధరించింది. అయితే ఆ గర్భం మూడవ నెలలోనే పోయింది. చైనీయుల మత విశ్వాసాల ప్రకారం ఒక స్త్రీ తన గర్భాన్ని తొలగించుకోవటానికి ముందు గర్భస్థ శిశువు ఆత్మశాంతికి కొన్ని పూజలుచేసి ఆపై అబార్షన్ ద్వారా ఆ శిశువును చంపి బయటకు తియ్యాల్సి ఉంటుంది. అయితే ఆమెకాని, ఆమె భర్తకాని ఈ విషయాన్ని పట్టించుకోకుండా అబార్షన్ కార్యక్రమాన్ని పూర్తిచేసారు.

ఒకరోజు మధ్యాహ్నం ఆమె ఒక చిన్న హెూటల్‌లో టీ తాగుతూ స్నేహితుల కోసం ఎదురుచూస్తున్నది. ఆ సమయంలో ఆమె పాదాలమీద ఎవరో గీరుతున్నట్టుగా అనిపించి ఉలిక్కిపడి కిందకుచూసింది. అక్కడ ఎవరూ కనపడలేదు. మళ్ళీ ఆమె కాలిమీద ఏదో అదృశ్యహస్తం రుద్దినట్టుగా అనిపించింది. మళ్ళీ కంగారుపడి ఆమె టేబుల్‌కింద చూసింది. హఠాత్తుగా ఒక అనుమానం ఆమె మనసులో అంకురించింది.

ఒకవేళ నేను కొన్ని ఏళ్ళక్రితం అబార్షన్ చేయించుకోవటం వల్ల మరణించిన ఆ గర్భస్థ శిశువు ప్రేతాత్మగామారి నన్ను వెంటాడుతున్నదేమో?' అని భయపడింది. వెంటనే ఆమె కళ్ళు మూసుకుని ఏకాగ్రతతో ఇలా అన్నది. "ఇందాక నా కాళ్ళమీద గీరింది చనిపోయిన నా గర్భస్థ శిశువు అయినమాట నిజమే అయితే ఆ శిశువు నా కాలును మళ్ళీ గీరాలి". విచిత్రంగా ఆమె కాలిమీద మళ్ళీ ఎవరో గీరినట్లయ్యింది. ఆమెకు విషయం చాలావరకు అర్ధమయ్యింది. ఈసారి ఆమె తన మనసులో ఇలా అనుకున్నది. "నువ్వు నిజంగా నాబిడ్డవే అయితే నాకళ్లకు కనిపించు".

ఆ తరువాత ఆమె పాదాలను ఎవరో పట్టుకున్నట్టు అనిపించటంతో టేబుల్ కింద చూసింది. ఆ టేబుల్ కింద ఒక అందమైన శిశువు ఆమె పాదాలపై తలను ఉంచి పడుకుని కనిపించింది. వెంటనే ఆమె ఆ పిల్లను చేతిలోకి తీసుకుని ముద్దు చెయ్యటం ప్రారంభించింది. అంతేకాకుండా ఆ దయ్యం బిడ్డను తీసుకుని ఒక షాపుకి ఆ బిడ్డకోసం కొన్ని ఆటబొమ్మలనుకూడా కొన్నది. ఆ తరువాత ఆ బిడ్డను ఇంటికి తీసుకువచ్చింది. ఆ రోజు నుండి ఆమె ప్రవర్తన విచిత్రంగా మారిపోవటంతో ఆమె భర్తకు ఆశ్చర్యంవేసింది. ఆమె వీలున్నప్పుడల్లా నేలమీద కొన్ని బొమ్మల్నిపెట్టి అక్కడ ఎవరో పసిబిడ్డ ఉన్నట్టుగా గాలిలోకి చూసి మాట్లాడుతూ ఆ బొమ్మలతో ఆడుకోవటం ప్రారంభించింది. బహుశా పిల్లలు లేకపోవటంతో మానసికంగా దెబ్బతిని ఆమె అలా ప్రవర్తిస్తున్నదేమో అని ఆమె భర్త సమాధాన పడ్డాడు. ఒకసారి ఆ భర్త ఒక బౌద్ధ ఆలయానికి వెళ్ళినపుడు అక్కడ ఉన్న ఒక బౌద్ధ భిక్షువు ఆమె భర్తతో ఇలా అన్నాడు. "మీ ఇంట్లో ఏనాడో చనిపోయిన మీ ఆడపిల్ల ఆత్మ సంచరిస్తున్నది. ఆ ప్రేతాత్మతో నీభార్య ఆడుకుంటున్నది. జాగ్రత్తపడు లేకపోతే నీకు, నీ భార్యకు ప్రాణహాని ఉన్నది". ఆ తరువాత ఆమెభర్త ఆ బౌద్ధ భిక్షువుని వెంట పెట్టుకుని తన ఇంటికి తీసుకువచ్చాడు. అలా ఇంటికి వచ్చిన ఆ బౌద్ధభిక్షువుకి ఆమె వెనకాల దాక్కుని తొంగిచూస్తున్న దయ్యపుపిల్ల కనిపించింది. ఆపిల్ల కేవలం తన తల్లికి మరియు మంత్రశక్తిగల ఆ బౌద్ధ భిక్షువుకి మాత్రమే కనిపిస్తున్నది.

ఆ ఇంట్లో ప్రేతాత్మ సంచరిస్తున్నది అన్న విషయం ఆ బౌద్ధభిక్షువుకి అర్ధమయిపోయి ఆ విషయాన్ని ఆమె భర్తకు చెప్పాడు. కానీ ఆమె భర్త ఆ బౌద్ధభిక్షువు చెప్పిన మాటలను పూర్తిగా నమ్మలేదు. ఆ మర్నాడు అర్ధరాత్రి మంచి నిద్రలో ఉన్న ఆమె భర్తకు హఠాత్తుగా మెలుకువ వచ్చి చూసేసరికి ప్రక్కన భార్యలేదు. ఆమె ఏమయ్యిందో అర్ధంకాక ఇల్లంతా వెతికిన ఆమె భర్తకు బాత్‌రూమ్‌లో టబ్‌దగ్గర కూర్చుని టబ్ నీళ్ళలో చేతులు పెడుతూ టబ్‌లో ఎవరో ఉన్నట్టుగా గాలిలోకి చూస్తూ మాట్లాడుతున్న ఆమె కనిపించింది. అంతటితో ఆమె భర్తకు తన ఇంట్లో తన బిడ్డ

ప్రేతాత్మ తిరుగు తున్నది అని అర్థమయిపోయి మర్నాడు ఉదయమే ఆ బౌద్ధభిక్షువుని కలిసి సహాయం చెయ్యమని కోరాడు. ఆ తరువాత ఆ బౌద్ధభిక్షువు వాళ్ళ ఇంటికివెళ్ళి ఆమెను తన బిడ్డతో సహా బౌద్ధఆలయానికి రమ్మని గట్టిగా చెప్పాడు. ఆమె అంగీకరించింది. ఆమె భర్త ఆమెతో కలిసి బౌద్ధఆలయానికి బయలుదేరాడు. వాళ్ళ వెంట బౌద్ధ భిక్షువుకూడా ఉన్నాడు. ఆమె వీపుమీద కూర్చుని ఉన్న పిశాచబిడ్డ బౌద్ధభిక్షువుకి స్పష్టంగా కనిపిస్తున్నది. వెంటనే ఆ బౌద్ధభిక్షువు "ఓ చిన్నబిడ్డా! నీవు మీ అమ్మను ఎందుకు అలా వీపుమీద ఎక్కి వేధిస్తున్నావు?" అని మనసులో అనుకున్నాడు. తల్లి వీపుమీద బోర్లాపడుకుని ఉన్న ఆ పిల్ల వెంటనే తన శరీరాన్ని అలాగే ఉంచి తలను మాత్రం పూర్తిగా వెనక్కి తిప్పి ఆ బౌద్ధభిక్షువుకేసి చూస్తూ "నా యిష్టంవచ్చినట్టు నేనుచేస్తా!" అన్నది క్రూరంగా. వెంటనే ఆ బౌద్ధభిక్షువు మనసులో ఆ బిడ్డకు క్షమాపణ చెప్పుకున్నాడు.



ఆ తరువాత ఆ స్త్రీ తన బిడ్డ మరియు భర్తతో సహా బౌద్ధ ఆలయంలోకి ప్రవేశించింది. అపుడు ఒక విచిత్రం జరిగింది. ఎపుడైతే ఆ స్త్రీ బౌద్ధ ఆలయ ప్రధాన ద్వారం లోపల కాలుపెట్టిందో ఆ క్షణమే ఆమె వీపుమీద కూర్చుని ఉన్న ఆమె బిడ్డ అదృశ్యం అయిపోయింది. ఆ తరువాత ఆమె మరియు ఆమె భర్త, బౌద్ధ ఆలయంలోని ప్రధానపూజారివద్దకు వెళ్ళారు. ఆయన, ఆమెకు మరియు ఆమె భర్తకు వాళ్ళ ఇంట్లో ఉంటున్న వాళ్ళ దయ్యపు బిడ్డగురించి వివరించాడు. ఇంతలో ఆమెకు గుడి బయట నుంచుని గుక్కపట్టి ఏడుస్తున్న తన దయ్యపుబిడ్డ కనిపించింది. తనకు హాని చెయ్యటానికి (అనగా ప్రేతాత్మ అయిన తనని నిర్మూలించటానికి) ప్రధానపూజారి ప్రయత్నిస్తున్నాడు అని ఆ దయ్యపుబిడ్డ తన ఏడుపుద్వారా తన తల్లికి తెలియజేసింది. విషయం అర్థమయిన ఆ తల్లి ఒక్కసారి పిచ్చిదానిలా అరుస్తూ "నా బిడ్డకు ఎవరు హానిచేసినా ఊరుకోను" అంటూ శరవేగంతో గుడి బయటకు పారిపోయింది.

ఆ తరువాత ఆ బౌద్ధభిక్షువుకి ఆ దంపతులు ఎన్నడూ కనపడలేదు. ఆమెకు పిచ్చెక్కిపోయిందని, ఆమె భర్త చనిపోయాడని కొన్ని రోజుల తరువాత ఎవరి ద్వారానో ఆ బౌద్ధభిక్షువుకి తెలిసి బాధతో ఒక నిట్టూర్పు విడిచాడు.



# 16. భారతదేశంలో ప్రేతాత్మలకు సంబంధించిన విశ్వాసాలు ఎలా ఉంటాయి?

బెంగాల్ భూతాలు :

భారతదేశం పశ్చిమ ప్రాంతంలో ఉన్న బెంగాల్ రాష్ట్రంలో హేతువాదాన్ని ప్రబోధించే మార్క్సిస్టులు కొన్ని దశాబ్దాలపాటు అధికారాన్ని చెలాయించినప్పటికీ ఆ రాష్ట్రంలో "నాస్తికత్వాన్ని" సంపూర్తిగా వ్యాపింపచేయలేకపోయారు. ఆ రాష్ట్రంలో పుట్టిన విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ గొప్ప ఆస్తికుడు. ఆయన దేవుడు మరియు దయ్యం రెండూ ఉన్నాయని అంగీకరించాడు. ఈ పశ్చిమబెంగాల్ రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలలో సంచరిస్తాయి అనిచెప్పబడుతున్న అని చెప్పబడుతున్న కొన్ని రకాల పిశాచాల గురించి ఇక్కడ క్లుప్తంగా తెలియజేస్తాను.

**1. శంఖ్‌చున్ని :** శంఖచూర్ణి అనే సంస్కృత పదంనుండి శంఖచున్ని అన్నపదం ఏర్పడింది. వివాహం అయిన స్త్రీలు చనిపోతే శంఖ్‌చున్ని పిశాచాలుగా మారతారు. ఈ స్త్రీ పిశాచాలు సాధారణంగా ఒకరకం ప్రత్యేకమైన గాజులను తమ చేతులనిండా ధరిస్తారు. బెంగాల్ రాష్ట్రంలోని వివాహిత స్త్రీలు ధరించే గాజులను ఈ ప్రేతాత్మలు ధరించి కనిపిస్తాయని తెలుస్తున్నది. సాధారణంగా ఈ పిశాచాలు ధనవంతులయొక్క భార్యలను ఆవహించి తద్వారా శారీరక సుఖాన్ని, డబ్బువల్లవచ్చే వైభోగాలను అనుభవించటం జరుగుతుంది. ఈ పిశాచాలు మామిడిచెట్లలో నివసిస్తూ ఉంటాయని బెంగాల్ ప్రజలు విశ్వసిస్తారు.

**2. పెట్నీ :** సాధారణంగా పెట్నీ అనే ఆడపిశాచాలు, పెళ్ళికాకుండానే అకాల మృత్యువు పాలయిన అమ్మాయిలయొక్క ప్రేతాత్మలు అయి ఉంటాయి. కొంతమంది అమ్మాయిలు తమ తల్లిదండ్రులకళ్ళుకప్పి తమకు నచ్చిన యువకులతో కోర్కెలు తీర్చుకుని తప్పుడుమార్గంలో ప్రయాణిస్తారు. ఇలాంటి యువతులు కొన్నికారణాల వల్ల ఆత్మహత్యలుచేసుకుని మరణించటం జరుగుతుంది. అనైతికంగా ప్రవర్తించి అకాలమృత్యువుపాలయిన ఇలాంటి యువతుల ప్రేతాత్మలు నిత్య అశాంతితో భూమిపై సంచరిస్తూ ఉంటాయి. ఇలాంటి ప్రేతాత్మలు సాధారణంగా రాత్రి సమయాలలో అమ్మాయిలరూపం ధరించి ఒంటరిగా ఎదురయ్యే పురుషులను ఆకర్షించి వారితో సంభోగంజరిపి తృప్తి పడతాయి. సంభోగ సమయంలో ఈ పిశాచాలు తమ అసలు స్వరూపాన్ని ధరిస్తాయి. ఈ పిశాచాలకు పాదాలు వెనక్కి తిరిగి ఉంటాయని కొందరు అనుభవజ్ఞులు తెలియజేస్తున్నారు.

**3.** నిషి : బెంగాల్ రాష్ట్రంలోని ప్రేతాత్మలలో అతి క్రూరమైనది నిషి అనే ప్రేతాత్మ. దీని ప్రత్యేకత ఏమంటే ఈ ప్రేతాత్మ, యువకులను వారికి ఇష్టమైన అమ్మాయిల గొంతుతో దూరం నుంచి పిలుస్తుంది. తాము ఇష్టపడ్డ అమ్మాయిలు పిలుస్తున్నారని భావిస్తున్న అబ్బాయిలు ఆ పిలుపువస్తున్నవైపు నడుస్తారు. వాళ్ళు ఎంతదూరం నడిచినా ఆ పిలుపు ఇంకొంచెందూరం నుండి వినిపిస్తూ ఉంటుంది. ఆ యువకులుపూర్తిగా నిర్మానుష్యమైన ప్రదేశానికి చేరుకున్నపుడు ఈ నిషి పిశాచం వాళ్ళదగ్గరకువస్తుంది. ఆ తరువాత ఆయువకులు మళ్ళీ ఎవరికీ కనిపించరు. ఇంతవరకు అనేకమంది యువకులు ఈ నిషి అనేపిశాచానికి బలైపోయినట్టుగా తెలుస్తున్నది. ఈ పిశాచం యువకుల్ని ఏం చేస్తుంది? అన్న విషయం ఇంతవరకు తెలియలేదు. కొంతమంది అనుభజ్ఞులైన భూతవైద్యులు, యువకులకి ఇలా సలహా ఇస్తున్నారు. "నిషి అన్న పిశాచం రెండుసార్లు కన్నా అధికంగా ఎవర్నీ పిలవలేదు. కనుక ఏ స్త్రీ అయినా ఒక యువకుడిపేరును మూడుసార్లు పిలిచినపుడు మాత్రమే ఆ పిలుపు నిషి రావటంలేదని నిజమైన మానవ స్త్రీయే అలా పిలుస్తున్నదని గుర్తించి బయటకురావచ్చు".



# 17. ప్రేమకోసం తన కుటుంబాన్నే బలిచేసిన సీలోరోజ్ వివరాలు?

1896వ సంవత్సరంలో సీలీరోజ్ అనే అమ్మాయి ఎలుకలమందు ఉపయోగించి తన సొంత కుటుంబాన్ని నిర్మూలించింది. ఆ తరువాత కాలంలో ఆమె తనని వెంటాడి ప్రేమించమని వేధిస్తున్న ఒక కుర్రాడిని తన వద్ద ఉన్న .32 వించెస్టర్‌తో షూట్‌చేసింది. ఆ తరువాత ఆమెకూడా చనిపోయి తన ఇంట్లో ప్రేతాత్మగా సంచరించటం ప్రారంభించింది. ప్రముఖ పాశ్చాత్య రచయిత మరియు పులిట్జర్‌ప్రైజ్ విజేత అయిన లూయిస్ బ్రాంగ్‌ఫీల్డ్, మలబార్ ప్రాంతంలో ఒక ఫాంహౌస్ (పంట పొలం లేదా తోటల మధ్యలో నివాసానికి నిర్మించబడ్డ గృహం) నిర్మించాడు. పులిట్జర్ అవార్డు గ్రహీత అయిన రచయిత లూయిస్ బ్రాంఫీల్డ్‌కి సీలీరోజ్ దూరపు బంధుత్వంలో సోదరి అవుతుంది.

అమెరికాలోని ఓహియో రాష్ట్రంలో ఉన్న రిచ్‌లాండ్ కౌంటీలో మలబార్‌ఫాం ఉన్నది. ఈ బ్రాంగ్‌ఫీల్డ్ ఒకప్పుడు భారతదేశంలోని మలబార్ తీరప్రాంతంలో సంచరించాడు. ఆ ప్రాంత వాతావరణం ఆయనకు బాగా నచ్చింది. ఫలితంగా అమెరికాలోని తన కొత్త వ్యవసాయ క్షేత్రానికి మలబార్ పేరుమీదగా మలబార్‌ఫాం అన్నపేరుపెట్టాడు. ప్లజెంట్‌వాలీ కొండల మధ్య ఒదిగి ఉన్న మలబార్‌ఫాంని 1939లో లూయిస్ బ్రాంఫీల్డ్ నిర్మించాడు. ఉపయోగంలేకుండాపోయిన అనేక చిన్న, చిన్న వ్యవసాయ క్షేత్రాలను కలిపి మలబార్‌ఫాం అనే పెద్ద క్షేత్రంగా మార్చాడు. ఈనాడు ఆ ప్రాంతాన్ని సందర్శించే అనేకమంది యాత్రికులు ఆ ఫాంహౌస్‌లోని అద్భుత దృశ్యాలను ఒక బస్సులో ప్రయాణిస్తూ చూడటం జరుగుతుంది. ప్లజెంట్‌వాలీ సిమెట్రీ (శ్మశానము) మరియు దానికి దగ్గరగా ఉన్న మలబార్‌ఫాం (వ్యవసాయక్షేత్రం)లను సీలీరోజ్ అనే ఒక అమ్మాయియొక్క ప్రేతాత్మకు నివాసంగా ఆ ప్రాంత ప్రజలు గుర్తించటం జరిగింది. లూయిస్ ఆ ప్రాంతంలో ఫాంహౌస్‌లు నిర్మించటానికిపూర్వం అనగా 1896వ సంవత్సరంలో ఆ ప్రాంతంలో కొందరు పాశ్చాత్యుల కుటుంబం నివసిస్తూ ఉండేది. ఆ కుటుంబంలోని సీలీరోజ్ అనే అమ్మాయి తమ మతానికి చెందని ఒక యువకుడిని ప్రేమించి పెళ్ళిచేసుకోవాలి అనుకున్నది. ఆ యువకుడి పేరు గైబెర్రీ. తమాషా ఏమంటే ఆ యువకుడికి, రోజ్‌మీద ఏవిధమైన ప్రేమాలేవు.

కానీ రోజ్ మాత్రం తాను అతిత్వరలో బెర్రీని పెళ్ళిచేసుకోబోతున్నానని కనిపించిన ప్రతివారితో చెబుతూ ఉండేది. "నీవంటే నాకు ఇష్టంలేదు. నిన్ను పెళ్ళిచేసుకోవటం సాధ్యంకాదు" అని సున్నిత మనస్కురాలైన రోజ్‌తో చెప్పటానికి బెర్రీకి మనస్సురాలేదు. ఎలాగైనా రోజ్ మనస్సు మార్చాలని నిర్ణయించుకున్న బెర్రీ, "మీవాళ్ళకి నేనంటే ఇష్టం లేదు. కనుక నన్నుమర్చిపో" అని రోజ్‌కి చెప్పాడు. తన ప్రేమే ప్రాణంగా భావించుకున్న రోజ్ బెర్రీ చెప్పిన మాటలునమ్మి తన కుటుంబ సభ్యులే తన పెళ్ళికి అడ్డుపడుతున్నారని అపార్థంచేసుకుని తన కుటుంబ సభ్యుల్ని హతమార్చాలని నిర్ణయించుకున్నది. అందుకోసం ఆమె ఆర్సెనిక్ విషయం కొద్దికొద్ది మోతాదులలో మీగడలో కలిపి తన ఇంట్లోనివారికి వడ్డించటం ప్రారంభించింది. ఆ విష ప్రభావం వల్ల మూడు నెలలలో రోజ్ కుటుంబ సభ్యులందరూ చనిపోయారు. ఆమె తల్లి, తండ్రి మరియు సోదరుడు చనిపోయినవారిలో ముఖ్యులు. ఆ తరువాత మూడు నెలలలో రోజ్ ప్రేమకోసం తన ఇంట్లో వాళ్ళని విషంపెట్టి చంపిందని బయటపడింది. కొన్నిసార్లు రోజ్, ఇరుగు పొరుగువారితో అప్పుడప్పుడూ తానే తన ఇంట్లోవాళ్ళని చంపేశానని చెప్పటం జరిగింది. ఆ తరువాత కొందరు ఆమెను తీసుకువెళ్ళి పిచ్చివాళ్ళ హాస్పటల్‌లో చేర్పించారు.

దాదాపు 41 సంవత్సరాలపాటు రోజ్ అసుక్షణం తానుచేసిన నేరాన్ని తలచుకుని కుమిలి కుమిలి ఏడుస్తూ ఆ పిచ్చి ఆసుపత్రిలో కాలంవెళ్ళదీసింది. 42వ సంవత్సరంలో గుండె ఆగి చనిపోయింది.

సీలీరోజ్ ఆత్మ మలబార్‌ఫాం ప్రాంతంలో సంచరిస్తూ అనేకమందికి కనిపించింది. రోజ్ కుటుంబ సభ్యులు బ్రతికి ఉన్న రోజుల్లో మలబార్‌ఫాంలో ఒక ధాన్యాన్ని నిల్వచేసే ధాన్యాగారం కట్టబడింది. అనేక బలమైన దూలాలతో ఆ ధాన్యాగారం నిర్మించబడింది. ఆ ధాన్యాగారం ప్రక్కన ఒక పిండి మిల్లుకూడా ఏర్పాటు చేయబడింది. ఆ మిల్లుని రోజ్ తండ్రి నడుపుతూ ఉండేవాడు. 1990 ప్రాంతంలో ఒకరోజున అకస్మాత్తుగా జరిగిన ఒక అగ్నిప్రమాదంలో పాతకాలంనాటి ఆ ధాన్యాగారం చాలావరకు కాలిపోయింది. అక్కడ ఉన్న కొందరు, మండుతున్న ఆ ధాన్యాగారంలోకి వెళ్ళి కొన్ని దూలాలను మంటల్లో కాలకుండా బయటకుతెచ్చి భద్రపరచారు.



ప్రస్తుతం ఆ మలబార్‌ఫాంకి అధిపతిగా ఉన్న మార్క్‌జోర్డన్ సీలీరోజ్ ఆధారంగా ఒక నాటకం తయారుచేసి దాన్ని మొదటిసారి 2003 అక్టోబర్‌ మలబార్‌ఫాంలోని ధాన్యాగారం ఉన్న ప్రదేశంలో రిహార్సల్స్ చేస్తున్నపుడు అతని ఎన్నో అమానుష సంఘటనలు ఎదురయ్యాయి. కొందరితో కలిసి ఆ నాటకం రిహార్సల్ చేస్తూ ఉన్నపుడు ఒక రాత్రి సమయంలో అతడికి ఆ ఫాంహౌస్ ప్రాంతంలో గాలిలో వెలుగుతూ ఆరుతున్న ఒక బల్బులాంటి ఆకారం కనిపించింది. ఎక్కడైతే రోజ్ తన తల్లికి విషం కలిపిన ఆహార పదార్థం పెట్టిందో సరిగ్గా అక్కడే ఈ బల్బులాంటి వెలుగు కనిపించినట్టుగా మార్క్ తెలియజేస్తున్నాడు. మార్క్ తాను అనుకున్న ప్రకారమే ఆ ధాన్యాగారం ఉన్న ప్రదేశంలో ఒక నాటకాన్ని ఒక రాత్రి సమయంలో ప్రదర్శించాలని నిర్ణయించుకున్నాడు. ధాన్యాగారం ప్రాంతంలో ఏర్పరచిన స్టేజీపై ఉండే లైట్లని నాటకం ప్రారంభ సమయంలో ఆర్పివేయాలని, అప్పుడు ప్రేక్షకులు అందరూ చీకటిలో ఉంటారని మార్క్ నిర్ణయించాడు. అయితే మార్క్ ప్రణాళికకు భిన్నంగా రిహార్సల్స్ సమయంలో ఎవరి ప్రమేయం లేకుండా ఆర్పివేయబడిన లైట్లన్నీ

ఒకేసారి వెలగటమేకాకుండా హత్య అంతుపట్టని చావులు అన్న అరుపులు స్టేజీమీద వినపడ్డాయి.

ఆ తరువాత ఇంకొకసారి మార్క్ ధాన్యాగారంలో నాటకాన్ని ప్రదర్శించాలి అనుకున్నపుడు లైట్లు బాగానే ఉన్నాయికానీ, సౌండ్‌కి సంబంధించిన పరికరాలు, మైకులు, స్పీకర్లు పనిచెయ్యకుండా పోయినాయి. మార్క్ వెంటనే సౌండ్ డైరెక్టర్‌ని పిలిపించి పరికరాలను సరిచెయ్యమని కోరాడు. అనుభవజ్ఞుడైన ఆ సౌండ్ డైరెక్టర్ ఎన్నిరకాల ప్రయత్నాలు చేసినా మైకులు పనిచెయ్యలేదు. ఇది ఇలా ఉండగా మార్క్ ఆ ధాన్యాగారానికి అటువైపుగావెళ్ళి రహస్యంగా గుసగుసలాడుతున్నట్టుగా గాలిలోకి చూస్తూ "ప్లీజ్!రోజ్ నీ సహకారం లేకుండా నీ కథని నాటకం ద్వారా ప్రజలకి చూపించటం నాకు వీలుకాదు. దయచేసి మాకు సహకరించు" అన్నాడు. విచిత్రంగా అప్పటివరకు మొరాయిస్తున్న సౌండ్‌సిస్టం హఠాత్తుగా చక్కగా పనిచెయ్యటం ప్రారంభించింది. ఆ తరువాత 2003వ సంవత్సరం డిసెంబరునెలలో మార్క్ ఆనాటకాన్ని ప్రదర్శించినపుడు ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. అది ఏమిటంటే నాటకంలో సీలీరోజ్ వేషాన్ని ధరించిన ఒక అమ్మాయియొక్క స్నేహితుడు నాటకం ముగిసిన తరువాత ఆ అమ్మాయితో, ఈ నాటకం జరుగుతున్న సమయంలో రోజ్ ఇంటి కిటికీ గుండా రోజ్ వేషంలో ఉన్న ఒక అమ్మాయి ఈ నాటకం చూస్తున్నట్టుగా మీరు ఒక అమ్మాయిని ఆ ఇంట్లో ఏర్పాటుచేసారు. ఇది చాలా బాగుంది అన్నాడు. నిజానికి ఆ నాటకాన్ని కిటికీలోంచి చూసింది ఎవరో ఏర్పాటుచేసిన వ్యక్తికాదని సాక్షాత్తు సీలీరోజ్ ఆత్మే అని ఆ తరువాత అందరికీ తెలిసింది. మార్క్ ఒకసారి ఓహియోకివెళ్ళి అక్కడ ఉన్న సీలీ సమాధిని చూసివద్దామని బయలుదేరాడు. ఒక మబ్బుపట్టిన సాయంత్రం పాత లిమామెంటల్ హాస్పటల్ పరిసరాలలో ఉన్న శ్మశానంలోని సీలీరోజ్ సమాధి దగ్గరకి రోజ్ తన మిత్రుడితోపాటు వెళ్ళాడు. మార్క్ తన దగ్గర ఉన్న కెమెరాతో ఆమె సమాధిని ఫోటో తీస్తున్నపుడు ఆకాశంలో దట్టంగా ఉన్న మేఘాలు కొద్దిగాచీలి ఒక కాంతికిరణం రోజ్ సమాధిమీద పడింది. మలబార్ ఫాంహౌస్‌లో ఒకప్పుడు సీలీరోజ్ కుటుంబం నివసించిన బ్రాంఫీల్డ్‌హౌస్ ఫోటో ఇక్కడ చూడవచ్చు.

బ్రాంఫీల్డ్‌హౌస్‌లో ప్రస్తుతం నివసిస్తున్న కుటుంబంలోని ఒక ఆరు సంవత్సరాల పిల్లవాడికి రోజ్ ఆత్మ అనేకసార్లు కనిపించినట్లుగా తెలిసింది. ఆ ఇంట్లోని ఒక బాత్‌రూంలో విచిత్రమైన వాతావరణ పరిస్థితులు ఉంటాయి. ఆ బాత్‌రూంలోకి

వెళ్ళినవారికి 5 నిమిషాలపాటు విపరీతమైన వేడిగా అనిపిస్తుంది. ఆ తరువాత 5 నిమిషాలపాటు ఎముకల్ని గడ్డకట్టించేంత చలిగా అనిపిస్తుంది. ఆ బాత్‌రూంని ఒకప్పుడు రోజ్ ఆత్మ వాడేదని, ఇప్పటికీ ఆ బాత్‌రూంలోకి రోజ్ ఆత్మ వస్తూ ఉంటుందని ఆ గృహ యజమానులు చెప్పటం జరుగుతున్నది.



ఫొటో బ్రాంఫీల్డ్‌హౌస్

మలబార్‌ఫాంలో ఉన్న బ్రాంఫీల్డ్‌హౌస్‌ని ఫోటో తియ్యాలని ఒక పరిశోధకుడ ప్రయత్నించినపుడు అతడి కెమెరా పనిచెయ్యకుండా పోయింది. ఆ తరువాత అతను ఆ ఇంటిని దాటి చాలాదూరం వచ్చిన తరువాత ఆ కెమెరా పనిచెయ్యటం మొదలయ్యింది.

మార్చి 2006వ సంవత్సరంలో మలబార్‌ఫాంలో ఉన్న సీలీరోజ్ గృహాన్ని సందర్శించటానికి ఒక పరిశోధకుడు వెళ్లాడు. అతడు ఆ ప్రాంతానికి కొత్త కనుక సీలీరోజ్ ఇల్లు ఎక్కడో చూపించమని అడిగాడు. అయితే ఎవ్వరూ అతనికి సరైన సమాధానం చెప్పలేదు. అయితే అతడే వెతుక్కుంటూ సీలీరోజ్ ఇల్లు వెతుక్కుంటూ ఆ ఇంట్లోకి వెళ్ళాడు. ఇంతలో అతని సెల్‌ఫోన్ రింగ్ అయ్యింది. అందులో అతడు ఎన్నడూ వినని మాటలతోకూడిన ఒక రింగ్‌టోన్ వినపడింది. "నన్ను క్షమించండి మీ గురించి తెలుసుకోవాలని ఉన్నది". అన్న ఇంగ్లీషు పదాలతో కూడిన రింగ్‌టోన్ అతను రోజ్ హౌస్‌లో ఉన్నంతసేపు వినిపించటం జరిగింది. రూపంలేని రోజ్ ఆత్మ ఆ వ్యక్తిని రింగ్‌టోన్‌ద్వారా పలకరించిందని ఆ తరువాత ఆ పరిశోధకుడికి అర్థ మయ్యింది.



# శ్రీ చక్రేశ్వరి పీఠము

(విశాఖపట్టణము/తెనాలి)

సంఖ్యాశాస్త్రము, జాతకచక్రముల ద్వారా మీ భవిష్యత్తును తెలుసుకుని ప్రస్తుతం మీరు ఎందుర్కొంటున్న వివిధ సమస్యలకుగల కారణాలను తెలుసుకుని, మీకు ఎదురవుతున్న సమస్యల పరిష్కారానికి అవసరమైన పరిహారాలను, మీ జాతకానికి తగిన జాతిరత్నాన్ని తెలుసుకోవటంకోసం ప్రముఖ రచయిత శ్రీధరన్‌కాండూరిని ఈ సెల్ నెంబర్‌పై శుక్ర, శని, ఆది వారాలలో సంప్రదించగలరు. **సెల్ : 9550983755.**

ఇతర వివరాలకు **శ్రీధరన్ కాండూరి** సంపాదకత్వంలో విడుదల అవుతున్న **"గరుడరేఖ"** మాసపత్రికను చదువగలరు.

◆ **పశుపతి** (The Beast Master) : ఇంతవరకు తెలుగులో ఏ గ్రంథములో రాని శివునికి సంబంధించిన నిగూఢ విషయాలను అందిస్తున్న పరిశోధనాత్మక గ్రంథం.

◆ **భైరవి :** తాంత్రిక ప్రపంచంలో భైరవిసాధన ప్రత్యేకత ఏమిటి? తంత్రవిద్యసాధనలో స్త్రీల ప్రాముఖ్యత ఎంత? రామకృష్ణపరమహంస భైరవి సాధన ఎలా చేసాడు? ఇలాంటి అనేక నిగూఢమైన తాంత్రిక లోక రహస్యాలను తెలియజేసే సంచలనాత్మక గ్రంథం.

# చీకటిలో[illegible]

చనిపోయిన తరువాత మనిషి ఆత్మ ఎక్కడికి వెళ[illegible]ంది? [illegible]క నరకానికా? ప్రపంచవ్యాప్తంగా ఉన్న అనేక ప్రధాన మతాలలో మరణానం[illegible] ఉంటుందని చెప్పబడుతున్నది. దాదాపు ప్రపంచంలోని కోట్లాదిమంది ప్రజల[illegible] మరియు నరకం నిజంగా ఉన్నాయని నమ్ముతున్నారు. ఈనాడు ప్రపంచవ్యాప్తంగా [illegible]భివృద్ధిచెందుతున్న దేశాలలో ఆత్మల ఉనికిమీద విస్తారంగా పరిశోధనలు జరుగు[illegible] చాలా దేశాలలో ఆత్మలు నిజంగా ఉన్నాయి అని నిరూపించటం జరిగింది. అత్యంత [illegible]కమైన ఖండంగా భావించబడుతున్న ఆఫ్రికాలోని కొన్ని ఆటవిక తెగలవారు వుడూ [illegible]గల తాంత్రికవిద్య సహాయంతో చనిపోయిన వ్యక్తులయెక్క ఆత్మల్ని పిలిపించటం జరుగు[illegible]. ఇంకా మలేషియా, సింగపూర్, ఇండోనేషియా, థాయ్‌లాండ్, చైనా మరియు జ[illegible] లాంటి దేశాలలో మానవాతీతశక్తుల ఉనికిని ఋజువుచేసే ఎన్నో సంఘటనలు జరుగుతున్నాయి. విదేశాలలో అతీంద్రియ శక్తుల గురించి ప్రేతాత్మల గురించి విశేషంగా గ్రంథాలు వెలువడుతున్నాయి. కానీ ఇండియాలో ముఖ్యంగా ఆంధ్రదేశంలో అలాంటి రచనలు రావటంలేదు. హేతావాదుల మరియు నాస్తికుల ప్రభావానికి భయపడి ఇలాంటి అమానుష అంశాలగురించి వ్రాసే సాహసం ఎవరూ చేయలేకపోతున్నారు. కానీ తాను నమ్మిన మరియు యదార్ధమైన అంశాలను లోకానికి ప్రకటించటానికి ఏమాత్రం వెనకడుగువెయ్యని మా రచయిత **శ్రీధరన్‌కాండూరి** ఆంధ్రదేశంలో ఒక కొత్త ట్రెండ్‌ను సృష్టిస్తూ పారాసైకాలజీ అంశాలపై అనేక గ్రంథాలను రచిస్తున్నారు. అలాంటి గ్రంథాలలో ఈ **చీకటిలోకం** కూడా ఒకటి. సంచలనాత్మకమైన గ్రంథాన్ని చదివి ఎన్నో అద్భుత విషయాలను తెలుసుకుంటారని ఆశిస్తున్నాము.

